స్వస్తి శ్రీ ప్రమాదినామ సం॥ ఆశ్వయుజమాసః శాలివాహనశకః ౧౮౬౧ కల్యాది ౫౦౪౦ ఫాస్లీ ౧౩౪౯ హిజిరి 1939

అక్టోబరు 1939 — తులామాసం — రంజాన్ ౧౩౫౮

| తేదీ | | | |
|---|---|---|---|
| 13 | ౨౭ | ౭ | ప్రతి॥శు౪౫-౫౩చి౩౯-౩౬పై౨౮-౪౯కిం౧౮-౧౬ది౧-౩౯త్యా౩-౫౧యోగః శరన్నవరాత్రారంభః కలశస్థాపనం దౌహిత్రకృతమహాలయః స్తనవృద్ధిగౌరీవ్రతం రా. క్రాం. భో౦-౪౮చ౨౯ |
| 14 | ౨౮ | ౮ | ద్వి॥శ౪౧-౫౮స్వా౩౭-౨౧వి౨౨-౩౮బా౧౩-౫౫రా౨౧-౫౦అహ౨౯-౧౨చి౨రవిః౧౮-౫ చంద్రోదయః ఉత్తరశృంగః ఉమాశివాగ్నిపూజా భో౦-౩౮చ౩౦ |
| 15 | ౨౯ | ౯ | తృ॥అ౩౯-౦౨౩౬-౨క్రీ౧౬-౫౯తై౧౦-౨౯రా౧౬-౫౦త్యా౩-౫౯శుక్రమౌఢ్యనివృత్తిః భో౦-౨౮ చ౧ రంజాన్ |
| 16 | ౩౦ | ౧౦ | చ॥సో౩౭-౮అనూ౩౫-౪౬ఆయు౧౨-౧౬వ౮-౪రా౨౦-౫౦త్యా౪-౪భో౦-౧౭ [విషు. కాలః ఉపాం. ప్ర. భో౦-౭ |
| 17 | ౧ | ౧౧ | పం॥మం౩౬-౨౭జ్యే౩౬-౩౯సౌ౮-౨౬బ౬-౪౮త్యాభా అహః౨౯-౬చి౩ తులాయాం రవి౩౯-౧౪ఉద౨౪-౧౪ ప్రభృతి |
| 18 | ౨ | ౧౨ | ష॥బు౩౭-౫మూ౩౮-౪౯శో౫-౩౬కౌ౬-౪౬రా౫-౩౬త్యా౪-౯ సరస్వతీపూజా యమఘంటః భో౫-౨౩చ౪ |
| 19 | ౩ | ౧౩ | స॥గు౩౮-౫౮పూషా౪౨-౧౨అతి౩-౪౬గ౮-౧౭౪-౯త్యా౪-౧౪భో౫-౧౨ [౫౯-౫౮దుర్గామి కాళీపూ భో౫-౧ |
| 20 | ౪ | ౧౪ | అ॥శు౪౨-౨ఉషా౪౬-౪౨సుక౨-౫౫ధ౧౦-౩౦ది౩-౪౨త్యా౪-౧౮రా౨౮-౩౮త్యా౪-౨౨అహ౨౯-౦ చి౪రవిః |
| 21 | ౫ | ౧౫ | న॥శ౪౬-౧౧శ్ర౫౨-౧౬ధృ౨-౫౫బా౧౪-౬కౌ౨-౦పున.త్యా మహానవమీ దుర్గాహోమః బలిదానం స్వారోచిషమన్వాదిః సరస్వత్యుద్వాసనం భో౪-౫౦చ౭ [పదం బుద్ధజయంతీ దేవ్యుద్వాసనం అపరాజితాపూజా భో౪-౩౯చ౮ |
| 22 | ౬ | ౧౬ | ద॥ఆ౫౧-౬ధ౫౮-౨౭శూ౩-౩౯తై౮-౩౯ది౩-౧౮త్యా౪-౨౫విజయదశమి శమీపూజా రాజ్ఞాంపట్టాభిషేకః సోప |
| 23 | ౭ | ౧౭ | ఏ॥సో౫౬-౨౫శత౬౦-౧౦గ౦౪-౫౧వ౨౩-౪౫౭౧౮-౨౪త్యా౪-౨౬గోపద్మవ్రతారంభః స్మార్తానాం మంజులైకాదశీ ఉపవాసద్వయం భో౪-౨౮చ౯ [సం ౩౧-౩౫ మధ్వవైష్ణవ ౧౧భో౪-౧౮చ౧౦ |
| 24 | ౮ | ౧౮ | ద్వా॥ మం౬౦-౧౦శత౫-౫పూ౬-౧౬బ౯-౨౧౨-౪౯త్యా౪-౨౫అహ౨౮-౫౦స్వా౧౪విః౨౦-౨౦ వృశ్చికాయ |
| 25 | ౯ | ౧౯ | ద్వా॥బు౧-౩౯పూభా౧౧-౩౯ధ్రు౭-౩౬బా౧-౩౯రా౯-౨త్యా౪-౨౩ ప్రదోషః రా. వే. భో౪-౭చ౧౧ |
| 26 | ౧౦ | ౨౦ | త్ర॥గు౬-౨౪ఉ౧౭-౨౨వ్యా౮-౩౧తై౬-౨౪రా౨౧-౭త్యా౪-౨౦అనధ్యయ్న౪భో౩-౫౬చ౧౨ [వ్రతం భో౩-౪౫ |
| 27 | ౧౧ | ౨౧ | చతు॥శు౧౦-౧౮రే౨౨-౨౫హ౮-౪౯వ౧౦-౧౮త్యాభా అహ౨౮-౪౪స్వా౨౪వి౪౦-౨౦ కౌముదీ అక్షక్రీడా కోజాగరీ |
| 28 | ౧౨ | ౨౨ | పూ॥శ౧౩-౮అశ్వని౨౬-౨౪వజ్ర౮-౧౮బ౧౩-౯ది౧౮-౪౫రా౨౨-౫౦త్యా౪-౧౧ సద్యస్కాలయోగః వ్రీహ్యాగ్రయణం శ. క్రాం. కే. క్రాం. భో౩-౩౪ [దగ్ధః భో౩-౨౪చ౧౫ |
| 29 | ౧౩ | ౨౩ | కృప్ర॥ఆ౧౪-౪౫భ౨౯-౧౩సి౬-౫౧కౌ౧౪-౪౫రా౩౧-౧౮ త్యా... తిథి అశూన్యశయనవ్రతం మృత్యుః |
| 30 | ౧౪ | ౨౪ | ద్వి॥సో౧౫-౩కృ౩౦-౪౩వ్య౪-౨౨గ౧౫-౩శే౪-౪అహ... తృతీయతిథి చంద్రోదయోమా |
| 31 | ౧౫ | ౨౫ | తృ॥మం౧౪-౬రో౩౧-౧వరీ౦-౫౭వ౫౫-౪౯శ౧౪-౬వి౧౦-౫౫రా౧౬-౧౩ కరక చతుర్థీ భో౩-౨ [వ్రతం భో౩-౧౩ |
| 1 | ౧౬ | ౨౬ | చ॥బు౧౨-౨మృ౩౦-౧౩శి౫౧-౨౭బా౧౨-౨౮రా౨౧-౫౭త్యా౩-౫౨భో౨-౫౧చ౧౮ |
| 2 | ౧౭ | ౨౭ | పం॥గు౮-౪౧ఆర్ద్ర౨౮-౧౭సి౪౫-౧౬తై౮-౪౧రా౨౮-౨౭త్యా౩-౪౯భో౨-౪౦చ౧౯ |
| 3 | ౧౮ | ౨౮ | ష॥శు౪-౩౮పునర్వసు౨౫-౨౩పు౨౫-౪౦సా౩౮-౩౪౪-౩౮శే౦-౪౮రా౧౬-౩త్యా౩-౪౭అహ౨౮-౩౦ స్వాతి రవిః ౧౯-౧౫ ప్రదోషః క్రకచః భో౨-౨౯చ౨౦ |
| 4 | ౧౯ | ౨౯ | అ॥శ౫౪-౨౭పుష్య౨౨-౧౮శు౩౧-౧౮బా౨౭-౧౪రా౨౩-౪౭త్యా౩-౪౫భో౨-౧౮చ౨౧ |
| 5 | ౨౦ | ౩౦ | న॥ఆ౪౮-౩౬ఆశ్లే౧౮-౨౬శుక్ల౨౩-౪౩తై౨౧-౩౧రా౧౭-౫౮త్యా౩-౪౪పుష్యభో౨-౭చ౨౨ |
| 6 | ౨౧ | ౧ | ద॥సో౪౨-౩మఘ౧౪-౨౦బ్ర౧౫-౫౩వ౧౫-౩౪రా౪-౩౨త్యా౩-౪౩అహ౨౮-౨౪విశాఖ రవిః భో౧-౫౬ |
| 7 | ౨౨ | ౨ | ఏ॥మం౩౬-౩౪పూఫ౧౦-౮ఐం-౨౪౯-౩౩ది౨౬-౫౫త్యా౩-౪౪సర్వేషాం ౧౧శి శవే రేవే మృత్యుః భో౧-౪౫ |
| 8 | ౨౩ | ౩ | ద్వా॥బు౩౦-౫౨ఉఫ౬-౪వై౦-౧౪వి౫౨-౨౭కౌ౩-౪౩ది౨౫-౪౭త్యా౩-౪౫ ద్వా॥త్రి॥ ప్రదోషః భో౧-౩౪చ౨౫ |
| 9 | ౨౪ | ౪ | త్ర॥గు౨౪-౪౮హ౨-౨౧చి౫౬-౪౦ప్రీ౪౫-౩౮వ౨౪-౪౮ది౨౧-౧౪త్యా౩-౪౭ అహ౨౮-౧౮ విశాఖ రవిః ౫౭-౧ త్ర.తిథిః స్వాత్యర్ధ్యంగః శివ. నరకచతుర్దశీ చం కాలేక త్రవ్యం యమతర్పణం అనధ్య.౪ రా.క్రాం భో౧-౨౩ |
| 10 | ౨౫ | ౫ | చతు॥శు౨౧-౦స్వా౫౬-౩౩ఆయు౩౯-౮శకు౨౧-౦ది౧౨-౨౫త్యా౩-౫౦ తిథిద్వయం దీపావళీ భో౧-౧౨చ౨౭ |
| 11 | ౨౬ | ౬ | అమా॥శ౧౭-౧౦విశా౫౫-౦సౌ౩౩-౧౮నా౧౭-౧౦ది౧౦-౧౨త్యా౩-౫౪ ప్రతిపత్తిథిః అన్వాధానం పిండపితృయజ్ఞః ఘూర్జరవత్సరాదిః గోక్రీడనం కార్తికదీపారంభః నక్తారంభః కవే భో౧-౧చ౨౮ |

నవంబరు 1939 — శాబాన్ ౧౩౫౮

| కుజచారః | | | |
|---|---|---|---|
| శు౪సో-శ్ర౩శు౭-౨౦ | ౫మం-స్వా౪బు౩౯-౭ | ౧౪శు-జ్యే౧బు౮-౧౭ | ౧౨బు-విశా౧శు౬-౪౭ |
| ౧౦అ-శ్ర౪శు౬-౪౯ | ౭గు-విశా౧బు౫౨-౩౦ | గురుచారః | ౧౪శు-వి౨శు౫-౪౮ |
| ౧౫శ-ధ౧శు౨౦-౦ | ౧౦అ-వి౨బు౧౧-౪ | ౭౮శ-ఉభా౧వక్రీ౬-౧౪ | బ౨సో-వి౩శు౨౫-౩౨ |
| బ౭శు-ధ౨శు౨-౧౭ | ౧౨మం-వి౩బు౩౫-౪౬ | శుక్రచారః | ౫గు-వి౪వృశ్చి౪-౨౯ |
| ౧౨బు-ధ౩ కుంభే౩౭-౪౨ | ౧౩గు-వి౪వృశ్చి౫౭-౯ | శు౨శ-స్వా౧శు౨౭-౨౨ | ౮శ-అనూ౧శు౪౩-౩౬ |
| బుధచారః | బ౧అ-అనూ౧బు౨౦-౧౭ | ౩అ-పశ్చాదుదితః | ౧౧మం-అను౨శు౨౨-౧౯ |
| శు౧శు-స్వా౨బు౧౫-౪ | ౪బు-అనూ౨బు౦-౪౭ | ౫మం-స్వా౨శు౭-౮ | ౧౪శు-అనూ౩శు౧-౭ |
| ౩అ-స్వా౩బు౨౭-౦ | ౭శ-అనూ౩బు౪౮-౧౨ | ౭గు-స్వా౩శు౪౬-౫౬ | శనిచారః |
| | ౧౦సో-అనూ౪బు౪౦-౧౨ | ౧౦అ-స్వా౪శు౨౬-౪౧ | బ౯అ-అశ్వ౧వక్రీ శనిః ౫-౫ |

| | | |
|---|---|---|
| గు | శ కే | |
| | శు౫మ.తు.రవిః బ౧౨బు.శు.శుః | |
| శు | శు౧౩గు.వృ.బు బ౫గు.వృ.శుక్ర | |
| | శు రా బు | ౪ |

నవంబరు 1939

| | | | |
|---|---|---|---|
| 12 | ౨౭ | ౭ | శు॥ప్ర॥ఆ౧౪-౧౯అనూ౫౪-౨౭శో౨౮-౧౬బ౧౪-౧౯ది౪-౫౫ త్యా౩-౫౮యోగః కార్తికస్నానారంభః యమద్వితీయా భగినీహస్తభోజనం॥చంద్రోదయః॥ఉత్తరశృంగః మృత్యుః భోం-౫౦చ౨౯ [భోం-౩౯చ౧౩వ వ్యాల్ |
| 13 | ౨౮ | ౮ | ద్వి॥సో౧౨-౩౪జ్యే౫౫-౩అతి౨౪-౭కౌ౧౨-౩౪ది౮-౩౫త్యా౪-౨ అహః౨౮-౧౨ విశా౩రవిః౧౪-౪౨ మృత్యుః |
| 14 | ౨౯ | ౯ | తృ॥మం౧౨-౪మూ౫౬-౫౪సుక౨౦-౫౬గ౧౨-౪రా౨౪-౩౭త్యా౪-౭ త్రిలోచనగౌరీవ్రతం ప్రదోషః భోం-౨౮ |
| 15 | ౩౦ | ౧౦ | చ॥బు౧౨-౪౮పూషా౫౯-౫౯వృ౧౮-౪౪భ౧౨-౪౯ది౨౨-౮త్యా౪-౧౨ నాగచతుర్థీ భోం-౧౭చ౩ |
| 16 | ౧ | ౧౧ | పం॥గు౧౪-౫౧ఉషా౬౦-౧౦శూ౧౭-౩౨బా౧౪-౫౧ది౨౧-౨౫త్యా౪-౧౭అహః౨౮-౬విశా౪వృశ్చి॥రవిః౩౨-౩౨ షష్ఠీతిథిః ఉద౧౬-౩౨ ప్రభృతివిష్ణుపదపుణ్యకాలః ధాతవస్త్రధారణం త్రేతాయుగాంతః భోం-౬చ౪ |
| 17 | ౨ | ౧౨ | ష॥శు౧౮-౭ఉషా౪-౨౮గం౧౭-౧౨తై౧౮-౭ది౧౫-౨౩త్యా౪-౨౨ శూన్యతిథిః షష్ఠి ప్రదోషః భో౫-౨౮ |
| 18 | ౩ | ౧౩ | స॥శ౨౨-౨౩శ్ర౯-౫౭వృ౧౭-౩౯వ౨౨-౨౩ది౨౦-౫౮త్యా౪-౨౪ సప్తమీతిథిః భో౫-౧౭చ౬ |
| 19 | ౪ | ౧౪ | అ॥ఆ౨౭-౨౪ధ౧౬-౧ధ్రు౧౮-౪౦బ౨౭-౨౪రా౭-౫౮త్యా౪-౨౬ అహః౨౮-౦ అనూ౧రవిః౫౦-౨ అష్టమీతిథిః గోష్టాష్టమీ శుక్రాం రవే భో౫-౬చ౭ [శుక్రాంభో౪-౫౪చ౮ |
| 20 | ౫ | ౧౫ | న॥సో౩౨-౪౬శత౨౨-౩౦ వ్యా౯-౫౯ కౌ౩౨-౪౬ రా౧౨-౧౬ త్యా౪-౨౬ కృతయుగాదిః విష్ణుత్రిరాత్రవ్రతం |
| 21 | ౬ | ౧౬ | ద॥మం౩౮-౫పూభా౨౯-౦హ౨౧-౧౯తై౫-౨౫రా౨౭-౦త్యా౪-౨౪రావే క్రకచః భో౪-౪౩చ౯ |
| 22 | ౭ | ౧౭ | ఏ॥బు౪౨-౫౪ఉభా౩౫-౫వజ్ర౨౨-౨౧వ౧౦-౩౦ త్యా॥భా॥ సర్వేషాంబోధనైకాదశీ తులసీపద్మవ్రతం భీష్మపంచకవ్రతం భో౪-౩౨చ౧౦ |
| 23 | ౮ | ౧౮ | ద్వా॥గు౪౬-౫౩రే౪౦-౨౭సి౨౨-౪౭బ౧౪-౫౩ది౭-౪౩త్యా౪-౨౧అహః౨౭-౫౪అనూ౨రవిః౭-౨౭ ధనురయనం ౧౮-౩౧ స్వాయంభువమన్వాదిః క్షీరాబ్ధిద్వాదశీ భో౪-౨౦చ౧౧ |
| 24 | ౯ | ౧౯ | త్ర॥శు౪౯-౪౮అశ్వ౪౪-౩౯వ్య౨౨-౨౯కౌ౧౮-౨౦రా౬-౪త్యా౪-౧౭ శక్రాం కేక్రాం భో౪-౯చ౧౨ |
| 25 | ౧౦ | ౨౦ | చతు॥శ౫౧-౨౫భ౪౭-౪౫వరీ౨౧-౧౬గ౨౦-౩౭ది౯-౫౩త్యా౪-౧౨వైకుంఠ౧౪శీఅనధ్యయ్న ౩రవే భో౩-౫౮చ౧౩ |
| 26 | ౧౧ | ౨౧ | ○పూ॥ఆ౫౧-౪౩కృ౪౯-౩౪ప౧౯-౪భ౨౧-౩౪ది౧౮-౪౦త్యా౪-౭ అహః౨౭-౫౨ అనూ౩రవిః౨౪-౨౮ అన్వాధానం సింధుస్నానం వ్యాసపూజా జ్వాలాతోరణం అరుణాచలక్షేత్రే కృత్తికాదీపోత్సవః దక్షసావర్ణికమన్వాదిః భో౩-౪౭చ౧౪ |
| 27 | ౧౨ | ౨౨ | కృ॥ప్ర॥సో౫౦-౪౬రో౫౦-౧౧శి౧౫-౫౩బా౨౧-౧౫రా౨౯-త్యా౪-౨యోగః భో౩-౩౬చ౧౫ |
| 28 | ౧౩ | ౨౩ | ద్వి॥మం౪౮-౩౯మృ౪౯-౪౦సి౧౧-౪౪తై౧౯-౪౩ది౪-౧౮త్యా౩-౫౮అశూన్యశయనవ్రతం భో౩-౨౪ [భో౩-౧౩ |
| 29 | ౧౪ | ౨౪ | తృ॥బు ౪౫-౨౧ఆర్ద్ర౪౭-౫౮సా౬-౪౨వ౧౭-౦ది౧౦-౫త్యా౩-౫౩ అహః౨౭-౪౮అనూ౪రవిః౪౧-౩౪ మృత్యుః |
| 30 | ౧౫ | ౨౫ | చ॥గు౪౧-౧౧పున౪౫-౨౬శు౦-౫౧శుక్ల౫౩-౩౭బ౧౩-౧౬ది౧౬-౪౨త్యా౩-౫౦మృత్యుః భో౩-౨చ౧౮ |
| 1 | ౧౬ | ౨౬ | పం॥శు౩౬-౧౬పుష్య౪౨-౧౦బ్రహ్మ౭-౧౬కౌ౮-౪౪ది౪-౨౧త్యా౩-౪౭భో౨-౫౧చ౧౯ [చః భో౨-౪౦చ౨౦ |
| 2 | ౧౭ | ౨౭ | ష॥శ౩౦-౫౨అశ్లే౩౮-౨౫ఐం౩౯-౪౩క౩-౩౪ది౧౨-౧౦త్యా౩-౪౫అహః౨౭-౪౬జ్యే౧రవిః౫౭-౫౩ షష్ఠీతిథిః క్రక |
| 3 | ౧౮ | ౨౮ | స॥ఆ౨౫-౬మ౩౪-౨౦వై౩౧-౫౩బ౨౫-౬ది౬-౨౩త్యా౩-౪౪రా౨౫-౧౦త్యా౩-౪౩ ౭తిథిః యమఘం. భో౨-౨౮ |
| 4 | ౧౯ | ౨౯ | అ॥పో౧౯-౯పూఫ౩౦-౭వి౨౪-౦కౌ౧౯-౯రా౧౯-౭త్యా౩-౪౪తిథిద్వయం ఇంద్రసావర్ణికమ.శ. వే. కే. వేభో౨-౧౭ |
| 5 | ౨౦ | ౧ | న॥మం౧౩-౧౭ఉఫ౨౬-౦ప్రీ౧౬-౯గ౧౩-౧౭రా౧౭-౫౫త్యా౩-౪౫దశమీతిథిః భో౨-౬చ౨౩ [ఏకా. భో౧-౫౪ |
| 6 | ౨౧ | ౨ | ద॥బు౭-౪౦హ౨౨-౧౨ఆయు౮-౩౧భ౭-౪౦రా౧౩-౨౨త్యా౩-౪౭అహః౨౭-౪౪జ్యే౨రవిః౧౪-౨సార్వత్రగృహస్థ |
| 7 | ౨౨ | ౩ | ఏ॥గు౨-౨౯విష్కం౫౫-౧౪చి౧౮-౫౩సౌ౧౪శో౫౩-౫బా౨-౨౯రా౪-౩౩త్యా౩-౫౦అవమప్రదోషఃవిధవయతి మధ్వ.వైష్ణవఏ.భో౧-౪౩ |
| 8 | ౨౩ | ౪ | త్ర॥శు౫౪-౨స్వా౧౬-౧౭అతి౪౮-౧౫గ౨౫-౫౩రా౨-౦త్యా౩-౫౩శు.వే.భో౧-౩౧చ౨౬ |
| 9 | ౨౪ | ౫ | చతు॥శ౫౧-౨౦విశా౧౪-౩౦సుక౪౨-౫౭భ౨౨-౪౧ది౨౪-౨౩త్యా౩-౫౭అహః ౨౭-౪౨జ్యే౩రవిః ౩౦-౧౪మాసశివరాత్రిః భో౧-౨౦చ౨౭ |
| 10 | ౨౫ | ౬ | ●అమా॥ఆ౪౯-౪౪అనూ౧౩-౪౫ధృ౩౮-౨౭చతు౨౦-౩౨రాం-౧౦త్యా౪-౨అన్వాధా. పిండపితృయజ్ఞః భో౧-౯ |

డిసంబరు 1939

కుజచారః
కు౩మం-ధ౪కు౩-౪౭
౮ఆ-శత౧కు౯-౫౨
౧౩శు-శ౨కు౩౪-౨౦
౨౩బు-శ౩కు౪౨-౨౩
౮సో-శ౪కు౪౫-౨౮
౧౪శ-పూభా౧కు౫౦-౦

బుధచారః
శు౪బు-జ్యే౨బుధ౧౨-౪౬ ౧౩శు-వక్రత్యాగః
౭శ-వక్రారంభః
౧౦మం-జ్యే౧వక్రీ౩౧-౪౭
౧౧బు-పశ్చాదస్తమితః
౧౪శ-అనూ౪వక్రీ౯-౨
౨౨మం-అనూ౩బు౫-౪
౪గు-అనూ౨బు౬-౩౭
౭ఆ-అనూ౧వక్రీ౫౪-౩౦
౮సో-ప్రాగుదితః

గురుచారః
౨౧సో-వక్రత్యాగః

శుక్రచారః
శు౧ఆ-అనూ౪శు౩౯-౨౧
౪బు-జ్యే౧శు౧౭-౨౭
౬శు-జ్యే౨శు౫౫-౪౫
౯సో-జ్యే౩శు౩౪-౧౩
౧౨గు-జ్యే౪శు౧౨-౪౪
౧౪శ-మూ౧శు౫౦-౫౫
౨౨మం-మూ౨శు౪౨-౩౮
౫శు-మూ౩శు౨౦-౦
౩ఆ-మూ౪శు౪౬-౧౮
౧౦బు-పూషా౧శు౨౪-౩౭
౧౩శు-పూషా౨శు౫౦-౦

| | | |
|---|---|---|
| గు | శ కే | |
| శు | శు౫గు వృశ్చి రవి శు౧౪ ధనుశుక్ర | |
| | బు శు | ర రా |

# స్వస్తిశ్రీ ప్రమాదిన॥ మార్గశిరమాసః శాలివాహనశకః ౧౮౬౧ కల్యాది ౫౦౪౦ ఫార్సీ ౧౩౪౯ హయాణ 1939

డిసెంబరు 1939

| | | | |
|---|---|---|---|
| 11 | ౨౬ | ౭ | శుక్ల ప్ర॥ సో౪౯-౨౦ జ్యే౧౪-౭శూ౩౪-౫౫కిం౧౯-౩౨ త్యా. భావః భో౦-౫౭చ౨౯ |
| 12 | ౨౭ | ౮ | ద్వి॥మం౫౦-౧౫మూ౧౫-౪౫గ౦౩౨-౨౨బా౧౯-౪౮ది౧౧-౩౮త్యా౪-౭రా౧౩-౧౫ త్యా౪-౧౧అహః ౨౭-౩౮ జ్యే౪రవిః ౪౬-౧౬ చంద్రోదయః ఉత్తర శృంగః భో౦-౪౬చ౩౦ |
| 13 | ౨౮ | ౯ | తృ॥బు౫౨-౨౫పూషా౧౮-౩౫వృ౩౦-౪౮తై౨౧-౨౦రా౧౨-౧౯త్యా౪-౧౬మృత్యుః భో౦-౩౫ చ౧౭జిలకాజ్ |
| 14 | ౨౯ | ౧౦ | చ॥గు౫౫-౫౦ఉషా౨౨-౩౭ధ్రు౩౦-౧౧వ౨౪-౭రా౫-౫౨త్యా౪-౨౦కపర్ది గణపతివ్రతం మృత్యుః భో౦-౨౪చ౨ |
| 15 | ౩౦ | ౧౧ | పం॥శు౬౦-౧౦శ్ర౨౭-౪౪వ్యా౩౦-౨౨బ౨౮-౧౦రా౧౧-౮త్యా౪-౨౪నాగపంచమీ త్రిద్యుస్పృక్ భో౦-౧౨చ౩ |
| 16 | ౧ | ౧౨ | పం॥శ౦-౩౭ధని౩౩-౪౧హ౩౧-౧౧బా౦-౩౧రా౨౬-౨త్యా౪-౨౬అహ౨౭-౩౬మూ౧ధనుషి రవిః౧-౪౮ ప్రవేశాది ౧౬ ఘ.పర్యంతం షడశీతిపుణ్యకాలః ధనుర్మాసారంభః భో౦-౧చ౪ |
| 17 | ౨ | ౧౩ | ష॥ఆ౫-౩౯శత౪౦-౬వ౩౨-౨౪తై౫-౩౯రా౩౦-౧౭త్యా౪-౨౬ భానువారశతతారాయోగప్రాబల్యేన సుబ్రహ్మణ్య షష్ఠీ చంపా౬ ప్రదోషః మృత్యుః భో౫-౬చ౫ [క. క్రాం. రా. వే. భో౪-౫౫చ౬ |
| 18 | ౩ | ౧౪ | స॥ సో౧౧-౫పూభా౪౬-౪౦ సి౩౩-౪౬వ ౧౧-౫శేషః౨-౧౬పునస్త్యాజ్యాభావః అష్టమీతిథిః ఉభయానధ్యాయః |
| 19 | ౪ | ౧౫ | అ॥మం౧౬-౨౪ఉభా౫౨-౫౩వ్య౩౪-౫౨బ౧౬-౨౪ది౧౩-౯త్యా౪-౨౫అహ౨౭-౩౪మూ౨రవిః౧౭-౨నవమితిథి భో౪-౪౪ |
| 20 | ౫ | ౧౬ | న॥బు౨౧-౧౦రే౫౮-౩౦వరీ౩౫-౩౩కౌ౨౧-౧౦ది౨౫-౪౧త్యా౪-౨౨ శూన్యతిథిః ఉదయకల్పః క్రకచః భో౪-౩౩ |
| 21 | ౬ | ౧౭ | ద॥గు౨౫-౪అశ్వ౬౦-౧౦ప౩౫-౩౦గ౨౫-౪రా౨౪-౩౫త్యా౪-౧౭దశమీతిథిః కే. క్రాం శ. క్రాం. భో౪-౨౨చ౯ |
| 22 | ౭ | ౧౮ | ఏ॥శు౨౭-౫౩అశ్వ౨-౫౦శి౩౪-౩౫ధ౨౭-౫౩రా౦-౪౦త్యా౪-౧౩అహః౨౭-౩౨మూ౩రవిః౩౩-౪౦మకరాయనం ౪౪-౧సర్వేషాం వైకుంఠైకాదశీ శ్రీరంగక్షేత్రేద్వారదర్శనం భో౪-౧౧చ౧౦ |
| 23 | ౮ | ౧౯ | ద్వా॥శ౨౯-౨౭భ౬-౧౦సి౩౨-౪౨బా౨౯-౨౭రా౯-౪౨త్యా౪-౮కుక్మాంగదద్వాదశీ ప్రదోషః భో౪-౦చ౧౧ |
| 24 | ౯ | ౨౦ | త్ర॥ఆ౨౯-౩౯కృ౮-౧౪సా౨౯-౪౬తై౨౯-౩౯రా౨౧-౧౯త్యా౪-౩హనుమద్వ్రతం భో౩-౪౯చ౧౨ [భో౩-౩౮ |
| 25 | ౧౦ | ౨౧ | చతు॥సో౨౮-౩౭రో౯-౫౯౨౫-౫౩వ౨౮-౩౭ది౨౩-౦త్యా౩-౫౯అహః౨౭-౩౦మూ౪రవిః౪౮-౩౦ దత్తజయంతీ |
| 26 | ౧౧ | ౨౨ | ○పూ॥మం౨౬-౨౪మృ౮-౪౬శుక్ల౨౧-౫బ౨౬-౨౪రా౧-౪౮త్యా౩-౫౫పూర్ణిమాతిథిః అన్వాధానం భో౩-౨౭ |
| 27 | ౧౨ | ౨౩ | కృష్ణ-ప్ర॥బు౨౩-౯ఆర్ద్ర౭-౨౫బ్ర౧౫-౨౯కౌ౨౩-౯రా౮-౪౬త్యా౩-౫౧ప్రతిపత్తిఃయోగః క్రకచ భో౩-౧౬చ౧౫ |
| 28 | ౧౩ | ౨౪ | ద్వి॥గు౧౯-౦పున౫-౭వి౯-౮గ౧౯-౦ది౨౪-౬త్యా౩-౪౮తిథిద్వయం ర. వే. భో౩-౫చ౧౬ |
| 29 | ౧౪ | ౨౫ | తృ॥శు౧౪-౮పుష్య౨-౫ఆశ్రే౫౬-౩౬వై౨-౧౩వి౫౨-౪౫భ౧౪-౮రా౪-౪౩త్యా౩-౪౬అహః౨౭-౩౪పూషా౧ రవిః ౪-౦చతుర్థీ తిథిః ప్రదోషః భో౨-౫౪చ౧౭ |
| 30 | ౧౫ | ౨౬ | చ॥శ౮-౪౬మ౫౪-౩౪ప్రీ౪౭-౧౧బా౮-౪౬ది౨౬-౩౮త్యా౩-౪౪భో౨-౪౩చ౧౮ [భో౨-౩౨చ౧౯ |
| 31 | ౧౬ | ౨౭ | పం॥ఆ౨-౫౪పూఫ౫౦-౧౨ఆయు౩౯-౮తై౨-౫౪ది౧౩-౭త్యా౩-౪౩ అవమ శచే కేవే మృత్యుః |

జనవరి 1940

| | | | |
|---|---|---|---|
| 1 | ౧౭ | ౨౮ | స॥సో౫౧-౧౩ఉఫ౪౬-౧౦సౌ౩౧-౨౧భ౪౪-౫ది౭-౦అహః౨౭-౩౮పూషా౨ రవిః౧౯-౨౦ త్రిస్పృక్ భో౨-౨౧ |
| 2 | ౧౮ | ౨౯ | అ॥మం౪౫-౩౮హ౪౨-౧౬శో౨౩-౩౮బా౧౮-౨౬ది౫-౪౮త్యా౩-౪౪ శవే భో౨-౧౧చ౨౧ |
| 3 | ౧౯ | ౩౦ | న॥బు౪౦-౩౩చి౩౮-౫౦అతి౧౬-౧౩తై౧౩-౫ది౧-౭త్యా౩-౪౬రా౨౪-౩౧త్యా౩-౪౯ క్రకచః రా. క్రాం భో౨-౦ |
| 4 | ౨౦ | ౧ | ద॥గు౩౬-౯స్వా౩౬-౩సుక౯-౧౬వ౮-౨౧రా౨౧-౫౩త్యా౩-౫౨అహః౨౭-౪౨పూషా౩ రవిః౩౪-౪౦భో౧-౫౦ |
| 5 | ౨౧ | ౨ | ఏ॥శు౩౨-౩౫వి౩౪-౫ధృ౨-౫౫శూ౫౪-౧౦బ౪-౨౨రా౧౬-౧౧త్యా౩-౫౬ సర్వేషాం౧౧కి భో౧-౪౦చ౨౪ |
| 6 | ౨౨ | ౩ | ద్వా॥శ౨౯-౫౮అనూ౩౩-౫౧౦౫౨-౧౭కౌ౧-౧౭రా౧౯-౨౧త్యా౪-౦ప్రదోషః భో౧-౨౯చ౨౫ [భో౧-౧౮చ౨౬ |
| 7 | ౨౩ | ౪ | త్ర॥ఆ౨౮-౩౦జ్యే౩౩-౧౨వృ౪౮-౨౬వ౨౮-౩౦త్యాజ్యాభావః అహః౨౭-౪౬పూషా౪ రవిః౫౦-౫ మాసశివరాత్రిః |
| 8 | ౨౪ | ౫ | చతు॥సో౨౮-౧౬మూ౩౪-౩౦ధ్రు౪౫-౩౧శకు౨౮-౧౬రా౨-౩౯త్యా౪-౫౮౩౧ ౪౬త్యా౪-౧౦భో౧-౭చ౨౭ |
| 9 | ౨౫ | ౬ | ●అమా॥మం౨౯-౨౨పూషా౩౭-౬వ్యా౪౩-౪౨నా౨౯-౨౨శే౩-౪౨రా౩౦-౩౬త్యా౪-౧౫ అన్వాధానం పిండ పితృయజ్ఞః భో౦-౫౭చ౨౮ |

| కుజచారః | ౯బు-అనూ౪బు౧౮-౪౩ | శు౪గు-ఉభా౨బు. గు ౪౩-౪౮ | ౪శ-శ్ర౨శు౧౭-౪౮ |
|---|---|---|---|
| శు౪గు-పూభా౨కు౫౦-౩౯ | ౧౨శ-జ్యే౧బు౦-౫౦ | శుక్రచారః | ౭సో-శ్ర౩శు౫౭-౨౨ |
| ౯బు-పూభా౩కు౨౭-౨౮ | ౧౪సో-జ్యే౨బు౩౧-౧౪ | శు౧సో-పుషా౩శు౪౨-౪౩ | ౧౦గు-శ్ర౪శు౩౭-౫౦ |
| ౧౩ఆ-పూ౪మీనే౪౯-౧౪ | బ౧బు-జ్యే౩బు౫౮-౫౦ | ౪గు-పూషా౪శు౨౧-౫౦ | ౧౩ఆ-ధని౧శు౧౭-౩౭ |
| బ౩శు-ఉభా౧కు౩౯-౩౮ | ౪శ-జ్యే౪బు౨౨-౧౬ | ౬ఆ-ఉషా౧శు౦-౪౮ | ౩౦మం-ధని౨శు౫౭-౪౮ |
| ౯బు-ఉభా౨కు౩౪-౦ | ౭సో-మూ౧ధను౩౬-౪౮ | ౮మం-ఉ౨శు౪౩౮-౩౫ | శనిచారః |
| ౧౪సో-ఉభా౨కు౨౭-౨౯ | ౯బు-మూ౨బు౫౫-౦ | ౧౧శు-ఉషా౩శు ౧౮-౫౧ | బ౨గు-వక్రత్యాగః |
| బుధచారః | ౧౨శ-మూ౩బు౧౦-౬ | ౧౩ఆ-ఉషా౪శు౫౭-౩౮ | రాహుకేతుచారౌ |
| శు౩బు-అనూ౨బు౨౪-౩౬ | ౧౪సో-మూ౪బు౨౪-౧౬ | బ౧బు-శ్ర౧శు౩౭-౮ | శు౨మం-చి౩రా |
| ౬ఆ-అనూ౩బు౨౦-౧౮ | గురుచారః | | అశ్వ౧కేతు ౩౭-౩౪ |

| గు | శ కే | |
|---|---|---|
| కు | కు౫శ.ధ.రవిః<br>కు౧౩ఆ.మీ.కు<br>బ౭సో.ధనుబు.<br>కు౮మం.మ.కు. | |
| శు | ర బు | శా |

| | | | |
|---|---|---|---|
| 9 | ౨౭ | ౭ | శు-ప్ర॥శు౧౮-౪౯ధని౯-౫౬పు౫౭-౧౭బ౧౮-౪౯౦ ౧-౧౭త్యా౪-౨౫అహః౨౮-౩౨ధని౨౪వి౩౦-౪౬సూన్యతిథిః యోగః మాఘస్నానారంభః చంద్రోదయః సమశృంగః భో౦-౩౫చ౨౯ |
| 10 | ౨౮ | ౮ | ద్వి॥శ౨౪-౨౩౬౧౬-౧౨౫౮-౩౯కా౨౪-౨౦౫-౨౨త్యా౪-౨౬ద్వితీయాతిథిః భో౦-౨౬చ౧మొహరం |
| 11 | ౨౯ | ౯ | తృ॥అ౨౯-౨౦పూభా౨౨-౪౬౩౬౦-౦౯౨౯-౨౮రా౨౦-౪౪త్యా౪-౨౬రావే ప్రదోషః భో౦-౧౬చ౨ |
| 12 | ౩౦ | ౧౦ | చ॥సో౩౪-౪౩ఉభా౨౯-౧౨సా౬౦-౧౦వ౨-౬త్యాజ్యాభా॥అహః౨౮-౩౦ధని౩కుంభేరవిః౪౭-౫౦కలియుగాంతః భో౦-౭ |
| 13 | ౧ | ౧౧ | పం॥మం౩౯-౨౩రే౩౫-౫సా౧-౮బ౭-౩౭౨-౯త్యా౪-౨౪ఉద౩-౫౦పర్యంతం విష్ణుపదపుణ్యకాలః భో౪-౬చ౪ |
| 14 | ౨ | ౧౨ | ష॥బు౪౩-౨౪అశ్వ౪౦-౨౭శు౧-౫౬కౌ౧౧-౨౪౦ ౦-౫౦త్యా౪-౨౧కు క్రాం శ క్రాం. కే క్రాం. భో౩-౫౭చ౫ |
| 16 | ౩ | ౧౩ | స॥గు౪౫-౫౬భ౪౪-౨౦శుక్ల౧-౩౬౧౪-౪౦౫-౫౯వైవస్వత మన్వాదిః రథసప్తమీ సూర్యచంద్రవ్రతం సోపపదం అగిరిపల్లి శోభనాచలస్వామి కళ్యాణోత్సవః భో౩-౪౯౬౬ [భో౩-౪౧చ౭ |
| 16 | ౪ | ౧౪ | అ॥శు౪౭-౧కృ౪౬-౫౮బం-౧౪౫౮-౬భ౧౬-౨౮౫-౩౫త్యా౪-౧౧అహః౨౮-౪౮ధ౪౪వి౫-౩౦భీష్మాష్టమి |
| 17 | ౫ | ౧౫ | న॥శ౪౭-౦రో౪౮-౨౧వై౫౫-౧౪బా౧౭-౦౨౭-౫౨త్యా౪-౬భో౩-౩౨చ౮ |
| 18 | ౬ | ౧౬ | ద॥ఆ౪౫-౪౦మృ౪౮-౩౪౫౧-౩తై౧౬-౨౦౨-౨౪త్యా౪-౧సుదశావ్రతం భో౩-౨౪చ౯ |
| 19 | ౭ | ౧౭ | ఏ॥సో౪౩-౧౫ఆర్ద్ర౪౭-౪౦ప్రీ౪౫-౫౮వ౧౪-౨౮౯-౧౫అహః౨౮-౫౬౪౬౧౪వి౨౩-౨౦ మీనాయనం ౩౪-౨౬ భీష్మైకాదశీ తిలపద్మవ్రతం క్రకచః భో౩-౧౬చ౧౦ |
| 20 | ౮ | ౧౮ | ద్వా॥మం౩౯-౪౪పు౪౫-౪౬ఆయు౪౦-౯౭౧౧-౩౦౧౬-౪౩త్యా౩-౫౨ప్రదోషః భో౩-౭చ౧౧ |
| 21 | ౯ | ౧౯ | త్ర॥బు౩౫-౨౧పుష్య౪౩-౦సౌ౩౩-౩౦కౌ౭-౩౨౪-౫౧త్యా౩-౪౯మృత్యుః భో౨-౫౯చ౧౨ |
| 22 | ౧౦ | ౨౦ | చతు॥గు౩౦-౧౮ఆ౩౯-౩౭శో౨౬-౩౧౪౨-౫౦౧౩-౧౨అహః౨౯-౨౪వి౨౧-౩౪అనధ్యయనం భో౨-౫౧ |
| 23 | ౧౧ | ౨౧ | ○పూ॥శు౨౪-౪౭మ౩౫-౪౫అతి౧౯-౩బ౨౪-౪౭౭-౪౧త్యా౩-౪౫రా౨౫-౧౮త్యా౩-౪౪పూర్ణిమాతిథిః అన్వాధానం హంసద్వీప శ్రీవేణుగోపాల కళ్యాణోత్సవః సింహస్నానం భో౨-౪౨చ౧౪ |
| 24 | ౧౨ | ౨౨ | కృ-ప్ర॥శ౧౮-౫౬పూఫ౩౧-౩౮సుక౧౧-౨౦కౌ౧౮-౫౬రా౧౯-౧౭త్యా౩-౪౩తిథిద్వయం యోగస. వే.శ.వే.కే.వే. భో౨-౩౪చ౧౫ |
| 25 | ౧౩ | ౨౩ | ద్వి॥ఆ౧౨-౫౮ఉఫ౨౭-౨౭ధృ౩-౩౦శూ౫౨-౧౦గ౧౨-౫౮రా౧౭-౫౫త్యా౩-౪౪తృతీయాతిథిః భో౨-౨౬చ౧౬ |
| 26 | ౧౪ | ౨౪ | తృ॥సో౭-౬హ౨౩-౨౬గం౪౮-౮భ౭-౬రా౧౩-౧త్యా౩-౪౫అహః౨౯-౧౨శ౩౩వి౦-౧౭ ప్రదోషః భో౨-౧౭ |
| 27 | ౧౫ | ౨౫ | చ॥మం౧-౩౩ చిత్ర౫౪-౪౫వృ౧౯-౪౭వృ౪౦-౫౨బా౧-౩౩రా౩-౫౦త్యా౩-౪౮అవమ రా క్రాం. భో౨-౯ |
| 28 | ౧౬ | ౨౬ | ష॥బు౫౨-౦స్వా౧౬-౪౩ధ్రు౩౪-౧౬గ౨౪-౯రా౦-౫౨త్యా౩-౫౧౪.వే.భో౨-౧చ౧౯ |
| 29 | ౧౭ | ౨౭ | స॥గు౪౮-౨౭వి౧౪-౨౨వ్యా౨౮-౧౩భ౨౦-౧౪ది౨౪-౮అహః౨౯-౧౮శ౪౪వి౧౯-౦భో౧-౫౨చ౨౦ |
| 1 | ౧౮ | ౨౮ | అ॥శు౪౫-౫౭అనూ౧౨-౫౫హ౨౨-౫౭బా౧౭-౧౨ది౨౬-౫౦త్యా౩-౫౮సీతాష్టమీ కవే భో౧-౪౪చ౨౧ |
| 2 | ౧౯ | ౨౯ | న॥శ౪౪-౩౬జ్యే౧౨-౩౨వజ్ర౧౮-౩౨తై౧౫-౧౭త్యాజ్యాభావః భో౧-౩౬చ౨౨ |
| 3 | ౨౦ | ౩౦ | ద॥త౪౪-౩౧మూ౧౩-౨౧సి౧౫-౬వ౧౪-౩౪ది౯-౧౮త్యా౪-౩రా౮-౪౩ త్యా౪-౮ అహః౨౯-౨౬ పూభా౧రవిః ౩౮-౨౦ భో౧-౨౭చ౨౩ |
| 4 | ౨౧ | ౩౧ | ఏ॥సో౪౫-౪౨పూషా౧౫-౨౦వ్య౧౨-౩౮బ౧౫-౬రా౬-౫౭త్యా౪-౧౩సర్వేషాం౧౧శి క్రకచః భో౧-౧౯చ౨౪ |
| 5 | ౨౨ | ౧ | ద్వా॥మం౪౮-౫ఉషా౧౮-౩౫వ౧౧-౧౦కౌ౧౬-౫౪ది౨౯-౧౯త్యా౪-౧౮దగ్ధః భో౧-౧౧చ౨౫ |
| 6 | ౨౩ | ౨ | త్ర॥బు౫౧-౪౩శ్ర౨౩-౧పఠ౧౦-౩౯గ౧౯-౫౪రా౪-౨౩అహః౨౯-౩౨పూభా౨రవిః౫౭-౪౬ సావిత్రికల్పః భో౧-౨ |
| 7 | ౨౪ | ౩ | చతు॥సు౫౬-౧౬ధ౨౮-౨౭శి౧౦-౫౬భ౨౪-౦రా౧౮-౪౪త్యా౪-౨౫మహాశివరాత్రిః అనధ్యయనం ౪భో౦-౫౪చ౨౭ |
| 8 | ౨౫ | ౪ | ●అమా॥శు౬౦-౧౦శత౩౪-౩౭సి౧౧-౫౫చ౨౮-౫౪రా౨౨-౫౩ త్యా౪-౨౬ ద్వాపరయుగాదిః అన్వాధానం |
| 9 | ౨౬ | ౫ | ●అమా॥శ౧-౩౨పూభా౪౧-౮సా౧౩-౧౫నా౧-౩౨ త్యా॥భా॥ యోగః రావే భో౦-౩౭చ౨౯ [భో౦-౪౬చ౨౮ |

| | | | |
|---|---|---|---|
| కుజచారః | ౫మం-శత౨బు౧౮-౫ | ౧౧సో-పశ్చాదస్తమితః | బ౨ఆ-రే౩శు౩౧-౧౦ |
| శు౩ఆ-అశ్వ౨కు౩౮-౨౦ | ౭గు-శత౩బు౧౧-౪౦ | గురుచారః | ౬బు-రే౪శు౨౪-౧౬ |
| ౮శు-అశ్వ౩కు౩౯-౭ | ౯శ-శత౪బు౪-౧౭ | శు౧౧సో-రే౧గురు౪౬-౨౮ | ౯శ-అశ్వ౧మే౧౨-౩౬ |
| ౧౩బు-అశ్వ౪కు౨౮-౪౮ | పశ్చాదుదితః | బ౧౨మం-రే౨గు౫౪-౫౪ | ౧౨మం-అశ్వ౨కు౩-౪౦ |
| బ౩సో-భ౧కు౨౪-౫౫ | ౧౦ఆ-పూభా౧బు౫౫-౦ | శుక్రచారః | ౧౪గు-అశ్వ౩కు౫౮-౫౭ |
| ౯శ-భ౨కు౪౧-౩ | ౧౨మం-పూ౨బు౫౬-౭ | శు౩ఆ-ఉభా౨శు౩౪-౧౭ | శనిచారః |
| ౧౪గు-భ౩కుజ౧౭-౪౮ | ౧౫శు-పూభా౩బు౦-౫౦ | ౬బు-ఉభా౩శు౨౦-౫౦ | శు౮శు-అశ్వ౨బు౪౯-౫౦ |
| బుధచారః | బ౨ఆ-పూ౪మీనే౨౭-౦ | ౯శ-ఉభా౪శు౫-౧౪ | రాహుకేతుచారౌ |
| శు౧శు-ధని౪బు౩౯-౦ | ౬బు-ఉభా౧బు౧౬-౪౭ | ౧౧సో-రే౧శు౫౫-౫౫ | శు౫మం-చి౨క రా |
| ౩ఆ-శత౧బు౨౮-౫౭ | ౯శ-వక్రారంభః | ౧౪గు-రే౨శు౪౧-౧౭ | రే౪మీనే-కేకు ౩౩-౫ |

| | | | |
|---|---|---|---|
| గు | శ కు | | |
| శు | కే | | |
| బు | శు౪సో. కుం ఫే రవిః | | |
| ౪ | బ౨ఆ మీ. బుధః బ౯శ. మే. శుక్రః | | |
| | | రా | |

| | | | |
|---|---|---|---|
| 10 | ౨౭ | ౬ | శుక్ల-ప్ర॥అ౬-౫౪ఉభా౪౭-౪౧శ౧౪-౪౨బ౬-౫౪ది౭-౪౫త్యా౪-౨౬అహః౨౯-౪౨పూభా౩రవిః౧౭ ౪౦ చం. |
| 11 | ౨౮ | ౭ | ద్వి॥సో౧౨-౧౭౫౩-౪౫శుక్ల౧౫-౫౬కా౧౨-౧ది౨౦-౪౩త్యా౪-౨౪మృత్యుః భో౦-౨౧చ౧సఫర్ [దశీ భో౦-౨౯ |
| 12 | ౨౯ | ౮ | తృ॥మం౧౬-౩౦అశ్వ౫౯-౩౨బ౧౬-౪౨గ౧౬-౩౦రా౧౮-౨౨త్యా౪-౨౧చతుర్థీతిథిః ప్రదోషః శ.క్రాం.భో౦-౧౨ |
| 13 | ౧ | ౯ | చ॥బు౨౦-౪భ౬౦-౧౦ఐ౧౬-౪౬భ౨౦-౪ది౨౪-౩౯అహః౨౯-౫౦పూభా౪మీనేరవిః౩౮-౦శూన్యతిథిః ఉ౨౨-౦ ప్రభృ. షడశీతిపుణ్యకాలః భో౦-౫చ౩ |
| 14 | ౨ | ౧౦ | పం॥గు౨౨-౨౭భ౩-౭వై౧౫-౫౮బా౨౨-౨౭రా౪-౪౫త్యా౪-౧౨పంచమీతిథిః భో౩-౫౯చ౪ |
| 15 | ౩ | ౧౧ | ష॥శు౨౩-౩౬కృ౬-౬వి౧౪-౧౨తై౨౩-౩౬రా౧౭-౨౨త్యా౪-౭షష్ఠీతిథిః ప్రదోషః యమఘంటః భో౩-౫౧చ౫ |
| 16 | ౪ | ౧౨ | స॥శ౨౩-౨౭రో౭-౫౧ప్రీ౧౧-౨౭వ౨౩-౨౭ది౨౧-౫౮త్యా౪-౨అహః ౨౯-౫౬ఉభా౧రవిః౫౮-౩౭ సప్తమీతిథిః ఉభయానధ్యాయః భో౩-౪౩చ౬ |
| 17 | ౫ | ౧౩ | అ॥ఆ౨౨-౩మృ౮-౨౨ఆయు౭-౪౨బ౨౨-౨ది౨౯-౮త్యా౩-౫౭తిథిద్వయం దుర్గావ్రతం భో౩-౩౫చ౭ |
| 18 | ౬ | ౧౪ | న॥సో౧౯-౨౯ఆర్ద్రా౭-౪౪సౌ౩-౩శో౫౪-౪౦కౌ౧౯-౨౯రా౬-౫౪త్యా౩-౫౩దశమీతిథిః భో౩-౨౭చ౮ |
| 19 | ౭ | ౧౫ | ఏ॥మం౧౫-౫౫పున౬-౪అతి౫౧-౨౩గ౧౫-౫౫ది౨౫-౧౪త్యా౩-౫౦ ఏకాదశీతిథిః క్రకచః భో౩-౧౯చ౯ |
| 20 | ౮ | ౧౬ | ఏ॥బు౧౧-౩౧పుష్య౩-౩౪సుకర్మ౪౪-౨౯భ౧౧-౩౧రా౩-౪౬త్యా౩-౪౭అహః౩౦-౪ఉభా౨రవిః౧౯-౪౦మేషాయనం ౩౧-౨సర్వేషాం ౧౧భో౩-౧౧చ౧౦ |
| 21 | ౯ | ౧౭ | ద్వా॥ గ౬-౨౫ఆశ్లే౦-౧౯మ౫౬-౨౦ధృ౩౭-౧౦బా౬-౨౫ది౨౮-౨౯త్యా ౩-౪౫ నృసింహద్వాదశీ ప్రదోషః భో౩-౩చ౧౧ |
| 22 | ౧౦ | ౧౮ | త్ర॥శు౦-౪౮ఏమ్యా౫౪-౮పూఫ౫౨-౩౩శూ౨౯-౩౩తై౦-౪౮ది౧౫-౧౮త్యా౩-౪౪కామదహన.శ.వే.కే.వే. అనధ్యయ్న ౩భో౨-౫౫చ౧౨ [నం హోళికోత్సవః దారుబ్రహ్మోత్సవపుణ్యకాలః బ్రహ్మసావర్ణికమన్వాదిః భో౨-౪౭ |
| 23 | ౧౧ | ౧౯ | ౦పూ॥శ౪౮-౫౦ఉఫ౪౮-౧౮గం౨౧-౪౫భ౨౧-౫ది౯-౧౫త్యా౩-౪౩అహః౩౦-౧౦ఉభా౩రవిః౪౧-౫ అన్వాధా |
| 24 | ౧౨ | ౨౦ | కృ-ప్ర॥ఆ౪౨-౫౨హ౪౪-౧౫వృ౧౪-౧బా౧౫-౫౧ది౭-౫౩త్యా౩-౪౪యాగః ర.వే.మృత్యుః భో౨-౩౯చ౧౪ |
| 25 | ౧౩ | ౨౧ | ద్వి॥సో౩౭-౧౮చి౪౦-౨౯ధ్రు౬-౨౫వ్యా౫౨-౩౮తై౧౦-౫౭ది౩-౦త్యా౩-౪౫రా౨౩-౩౦త్యా ౩-౪౬రా. క్రాం. మృత్యుః దగ్ధః భో౨-౩౧చ౧౫ |
| ● 26 | ౧౪ | ౨౨ | తృ॥మం౩౨-౧౩స్వా౩౭-౧౬హ౫౨-౧౬వ౪-౪౫రా౨౦-౨౫త్యా౩-౫౦బ్రహ్మకల్పః ప్రదోషః భో౨-౨౩చ౧౬ |
| 27 | ౧౫ | ౨౩ | చ॥ బు౨౭-౪౮వి౩౪-౪౩వజ్ర౪౬-౫౮బా౨౭-౪౮రా౧౪-౮త్యా౩-౫౩అహః ౩౦-౧౮ఉభా౪రవిః౩-౧౯ క. వే. భో౨-౧౫చ౧౭ |
| 28 | ౧౬ | ౨౪ | పం॥గు౨౪-౧౬అనూ౩౩-౨సి౪౦-౩౮తై౨౪-౧౬రా౧౬-౩౪త్యా౩-౫౭ పంచమీతిథిః గురుమౌఢ్యారంభః భో౨-౭ |
| 29 | ౧౭ | ౨౫ | ష॥శు౨౧-౪౪జ్యే౩౨-౨౪వ్య౩౬-౫వ౨౧-౪౪త్యాజ్యాభావః తిథిద్వయం ప్రదోషః దగ్ధః భో౧-౫౯చ౧౯ |
| 30 | ౧౮ | ౨౬ | స॥శ౨౦-౧౯మూ౩౨-౫౨వరీ౩౨-౨౨బ౨౦-౧౯ది౨౮-౫౦త్యా ౪-౨రా౨౩-౫త్యా౪-౭ అహః౩౦-౨౪ శే౧రవిః ౨౫-౫౨అష్టమీతిథిః ఉభయానధ్యాయః విమః భో౧-౫౧చ౨౦ [శుభకర్మ వర్జ్యం భో౧-౪౩చ౨౧ |
| 31 | ౧౯ | ౨౭ | అ॥ఆ౨౦-౧౧పూషా౩౪-౩౬పరి౨౯-౪౩కౌ౨౦-౧౧రా౨౫-౧౨త్యా౪-౧౨ నవమీతిథిః త్రిస్పృష్టకాః అబ్దసంధిః |
| 1 | ౨౦ | ౨౮ | న॥సో౨౧-౧౮ఉషా౩౭-౩౫వి౨౮-౩గ౨౧-౧౮రా౧౭-౫౧త్యా౪-౧౭ శూన్యతిథిః భో౧-౩౫చ౨౨ |
| 2 | ౨౧ | ౨౯ | ద॥మం౨౩-౪౨శ్ర౪౧-౪౪సి౭-౨౧భ౨౩-౪౨రా౨౨-౧౦త్యా౪-౨౧అహః౩౦-౩౦శే౨రవిః౪౮-౪౮ దశమీతిథిః |
| 3 | ౨౨ | ౩౦ | ఏ॥బు౨౭-౧౨ధ౪౬-౫౬సా౨౭-౩౧బా౨౭-౧౨త్యా॥భా॥ సర్వేషాం౧౧శీ దగ్ధః భో౧-౧౯చ౨౪ [భో౧-౨౭చ౨౩ |
| 4 | ౨౩ | ౩౧ | ద్వా॥గు౩౧-౩౮శత౫౨-౫౭శు౨౮-౨౨తై౩౧-౩౮ది౬-౪౪త్యా౪-౨౪షడశీతిముఖః౫౦-౩౦ ప్రదోషః భో౧-౧౧ |
| 5 | ౨౪ | ౧ | త్ర॥శు౩౬-౪౪పూభా౫౯-౩౩శుక్ల౨౯-౪౪గ౪-౧౫౦-౪౨త్యా౪-౨౬రావే భో౧-౩చ౨౬ |
| 6 | ౨౫ | ౨ | చతు॥శ౪౨-౦ఉభా౬౦-౧౦బ్ర౩౧-౧౭భ౯-౨౨ది౨౬-౫త్యా౪-౨౫అహః౩౦-౪౨శే౩విరః౧౨-౦ మాసశివరాత్రిః భో౦-౫౫చ౨౭ [భో౦-౪౭చ౨౮ |
| 7 | ౨౬ | ౩ | ● అమా॥ఆ౪౬-౫౦ఉభా౫-౫౬ఐ౩౨-౩౩ చతు౧౪-౨౫ రా౮-౩౮ త్యా౪-౨౪ అన్వాధానం పిండపితృయజ్ఞః |
| 8 | ౨౭ | ౪ | స్వస్తిశ్రీ విక్రమ సం॥ర చైత్ర శు ప్రతి॥సో౫౧-౩౦రే౧౨-౧౯వై౩౩-౪౨కిం౧౯-౧౦యాగః భో౦-౩౯చ౨౯ |

మార్చి 1940 — ఏప్రిల్ 1940

| కుజచారః | శు౪బు-పూ౪వక్రీ౪౧-౪ | ౫గు-పశ్చాదస్తమితః | ౨సో-కృ౧శు౪౯-౨౦ | గు బు / కే | శు శు / శ |
|---|---|---|---|---|---|
| శు౩మం-భ౪శు౧౬-౦ | ౮ఆ-పూభా౩వక్రీ౩౩-౪౦ | ౪౧౧బు-శే౪గురుః౧౪-౧౪ | ౫గు-కృ౨వృషే౫౧-౦ | ర | శు౪బు. మీ.ర. |
| ౮ఆ-కృ౧శు౧౮-౪ | ౧౨గు-పూ౨వక్రీ౩౮-౧౮ | శుక్రచారః | ౮ఆ-కృ౩శు౫౩-౪౦ | | శు౧౩శు.వృ. శు |
| ౧౩శుకృ౨వృషే౧౪-౫ | ౧౫శ-ప్రాగుదితః | శు౧ఆ-అశ్వి౪శు౫౩-౧౦ | ౧౨గు-కృ౪శు౨-౨ | | బు౫గు.వృ.శు. |
| ౪౪బు-కృ౩శు౧౫-౭ | ౪౩మం-వక్రత్యాగః | ౪బు-భ౧శు౪౭-౧౬ | ౩౦ఆ-రో౧శు౯-౧౭ | | రా |
| ౯సో-కృ౪శు౧౭-౨ | ౧౪శ-పూ౩బు౧౪-౫౬ | ౭-శ-భ౨శు౪౨-౧౭ | | | |
| ౧౪శ-రో౧శు౨౧-౩౭ | గురుచారః | ౧౦మం-భ౩శు౪౫-౪౬ | శనిచారః | | |
| బుధచారః | శు౧౧బు-శే౩గురుః౪-౫ | ౧౩శు-భ౪శు౪౭-౧౧ | శు౧౧బు-అశ్వి౩శనిః౫-౮ | | |

# ప్రస్తావన

ఆంధ్రపత్రిక ప్రథమ సంవత్సరాదిసంచిక ౧౯౧౦-వ సంవత్సరమున ప్రచురింపబడినది. ఈ సంచికాప్రకటన మున ఇరువదితొమ్మిదియేండ్లు పూర్తి అయినవి. కడచిన ౨౯ సంవత్సరముల కాలమును ఉగాదిసంచిక శ్రీ విశ్వదాత పర్యవేక్షణక్రింద ప్రవర్తిల్లినది.

కడచిన సంవత్సరము శ్రీ నాగేశ్వరరావు పంతులవారు అనారోగ్యవంతులై మంచముపట్టి యుండియు సంచికమీదగల విశేషాభిమానమువలన వచ్చిన వ్యాసముల నన్నిటిని చదివి వినిపించుకొని, ప్రకటనమునకు స్వయముగ వారే వాటినుండి ఏరి నిర్ణయించిరి. ఆ సంచికకు వ్రాసిన 'ప్రస్తావన'యే దేశోద్ధారకుడు తన జీవితమున వ్రాసిన కడపటి వ్యాసము. ఆ సంచిక ప్రకటితమయిన పదునొకండు దినములకే ఆయన పరమపదించిరి. ఈ సంవత్సరము వారి సాంవత్సరికమునకు సరిగా పదునొకండు దినములకు ముందు ఈ ప్రమాది ఉగాదిసంచిక వెలువడుచున్నది.

శ్రీ పంతులవారు స్వర్గస్థులైనను మా పత్రికా సంస్థలు నిరంతరాయముగ సాగుచున్నవి. ఇందులకు శ్రీ పంతులవారి ఆశీర్వాదబలమును, ఆంధ్రమహాజనుల అనూన ఆదరాభిమానములునే కారణము. శ్రీ పంతులవారి అడుగుజాడలలో నడచి, వారు స్థాపించిన పత్రికాసంస్థలను మా శక్తికి దగినయట్లు నడపగల మనియు, ఈ కార్యనిర్వహణమున ఆంధ్రమహాజనుల ప్రోత్సాహాభిమానములు ఇదివరకు వలెనే ఇక ముందుకూడ మాకు ఊతగా నుండగల వనియు ఆశించుచున్నాము.

ప్రపంచపరిస్థితులు ఆనాటి కానాడు విషమించుచున్నవి. యుద్ధము అగ్నిపర్వతమువలె ఎప్పుడకస్మికముగ బ్రద్దలు కానున్నదో చెప్పుటకు వీలుకాకయున్నది. ఎప్పటి కప్పుడే ఏదో యొకమహాగండము మానవజాతి నెదుర్కొనుచునే యున్నది. ఒకటి గడచినదని సంతోషించిన మరియొకటి ఎదురగుచున్నది.

యూరపుఖండము పెద్ద కమ్మరకొలిమివలెనున్నది. ఎప్పుడు ఏతట్టునుండి నిప్పురవలు లేచి ఎక్కడ పడి అంటుకొని మహాగ్నిజ్వాల నాల్గుమూలల నలముకొనునో తెలియవచ్చుటలేదు. యుద్ధము నేడు వచ్చునని చెప్పుట ఎంత కష్టమో రాదని చెప్పుటయు అంత కష్టముగనే యున్నది. స్పెయినులోను, చీనాదేశములోను యుద్ధ మిప్పుడు జరుగుచున్నను అది స్థానికముగనే యున్నది. బ్రిటను, ఫ్రాన్సుదేశములును, జర్మనీ రష్యాలును యుద్ధరంగమునకు దిగినచో ఇక ప్రపంచ మల్లకల్లోలము కాకతప్పదు.

ప్రస్తుతము ప్రపంచమున బాహ్య సంఘర్షణము వలెనే మానసిక సంఘర్షణ కూడ ఎక్కుడగుచున్నది. ప్రపంచమున నేడు ప్రజాప్రభుత్వము నామోదించువారని, నియంతృప్రభుత్వము నామోదించువారని జనులు రెండు తెగలుగ విడిపోయినారు.

కార్యసిద్ధికి శీఘ్రనిర్ణయ మవసర మనియు, ప్రజాప్రభుత్వపద్ధతి యందుకు వ్యతిరేకముగ నుండు ననియు, అందువలన నియంతృత్వ పద్ధతియే ప్రస్తుత పరిస్థితులలో అనుకూలమయిన దనియు, అవసరమయిన దనియు నియంతృత్వ ఆమోదకులు వాదింతురు.

ఏ పద్ధతిప్రభుత్వ మయినను దేనికి తగ్గ లోపములు దాని కుండును. కొన్నివిధముల నొకటి మంచిదయినచో మరికొన్ని విధముల నింకొకటి వాంఛనీయమయిన దగును. కాని ప్రతిప్రభుత్వపు ధర్మమునుగూడ తన ప్రజలకు శాంతిని సమకూర్చుటయే ప్రధానాశయమై యుండవలెను; ప్రజల అభ్యుదయమునకు తోడ్పడుటయే ప్రధాన లక్ష్యముగా నుండవలెను.

వెనుక నొకప్పుడు జాన్ స్టూఅర్టు మిల్ గారిని ఏ ప్రభుత్వ ముత్తమమయినదో సూచింపవలసినదని కోరగా ప్రజాభివృద్ధికి పాటుపడునదే ఉత్తమ మయినదని వారు ప్రత్యుత్తర మిచ్చిరట.

ప్రజా ప్రభుత్వమైనను, నియంతృ ప్రభుత్వమైనను దృష్టియందుంచుకొనవలసిన ముఖ్యవిషయములు రెండు: (౧) శాంతి; (౨) వ్యక్తి స్వాతంత్ర్యము. ఈ రెంటిని ప్రభుత్వము కంటిని రెప్పవలె కాపాడవలసి యుండును. కాని ఆధునిక రాజ్యము లనేకములలో ఈ రెండే లోపించుచున్నవి. నియంతృ పరిపాలిత దేశములలో నిరంకుశాధికారము మితిమీరిపోయి ప్రజల శాంతి

భద్రతలకు భంగము కలుగుచున్నది. వ్యక్తి స్వాతంత్ర్య మసలే యడుగంటినది. అధికారమునం దున్నవారి యభిప్రాయములతో ఏకీభవించనివారికి కారాగృహ దండనము తప్పనిసరి యగుచున్నది. స్వతంత్ర స్వేచ్ఛాభిప్రాయ ప్రకటనమునకును, విమర్శనమునకును అవకాశములేని దేశము స్వాతంత్ర్యోపాసకులకు నిజముగా కారాగారమే.

ప్రపంచమున నాగరికతా, విజ్ఞానము లభివృద్ధి యగుచున్న కొలది ప్రజల ప్రాథమిక స్వత్వములకే యపాయము వాటిల్లుచున్నది. రాజ్యములలో రాజ్యములకు, ప్రజలలో ప్రజలకు. ప్రజలకు రాజ్యములకు పరస్పరము అవిశ్వాసమును, అనుమానమును హెచ్చి ప్రపంచ జీవనము హేయభాజన మగుచున్నది. నిరంకుశాధికార నియంతృత్వ ప్రభుత్వములకు ప్రజలస్వేచ్ఛాభిప్రాయ ప్రకటన మన్నను, విమర్శన మన్నను గుండెబెదురుగ నున్నది. ఏ ప్రభుత్వముగాని ప్రజల యీ ప్రాథమిక స్వత్వములను మన్నించినపుడే పురోభివృద్ధి యుండును. అపుడే యది ప్రజాప్రభుత్వ మనిపించుకొనగలదు. నేడు ప్రపంచమును గలవరపరుచుచున్న సమస్య ఇదియే — ప్రభుత్వాధికారమునకు, వ్యక్తిస్వాతంత్ర్యమునకు ఏది హద్దు? వ్యక్తులకోసము ప్రభుత్వమా? ప్రభుత్వముకోసము వ్యక్తులా? ఈ సమస్యా పరిష్కారముమీదనే మానవజాతి అభ్యుదయ మోక్షములు ఆధారపడి యున్నవి. కాని వ్యక్తులకైనను ప్రభుత్వములకైనను ఇదియే అవలంబనీయమయిన స్వర్ణసూత్రము: వ్యక్తికాని, ప్రభుత్వముకాని తన హక్కులను, తన యభిప్రాయములను ఎంత గౌరవముగ, న్యాయ్యముగ పరిగణింపబడవలెనని కోరునో ఇతరులవికూడ అంత గౌరవప్రదముగను, న్యాయ్యముగను పరిగణించుట ధర్మము.

ప్రస్తుతకాలమున భారతదేశ ఇతిహాసముకూడ విచిత్రమయిన వికాసము నొందుచున్నది. దేశీయ మహాసభ భారతస్వాతంత్ర్యసిద్ధికి పట్టుదలతో, ధైర్యముతో పోరాడుచున్నది. మహాత్ముని నాయకత్వముక్రింద అహింసా, సత్యములను ఆధారముచేసికొని, తదాశయసాఫల్యమునకై మార్గ మేర్పరుచుకొనుచున్నది. కార్యానుకూల్యమునకు దౌర్జన్యపద్ధతులనే శరణమొందు పాశ్చాత్యరాజ్యములు భారతీయస్వాతంత్ర్య సమరమును జూచి విభ్రాంతి నొందుచున్నవి. శ్రీ సుభాషచంద్రబోసు ఎన్నిక మహాత్ముని నాయకత్వమునకు వ్యతిరేకసూచకమని తాత్కాలికముగ వ్యాఖ్యానింపబడినను త్రిపురియందది వట్టి భ్రాంతియని నిరూపితమయినది. మహాత్ముడు ప్రాయోపవేశదీక్షను పూని రాజకోట్ప్రజల కోరికల నీడేర్చుటకే కాక, పాలకునియందుగూడ ఆత్మశుద్ధిని, హృదయపరివర్తనమును కలిగించుటకు ప్రయత్నించెను. మహాత్ముని మార్గదర్శకతవలన భారతీయులు తమ గమ్యస్థానమును సురక్షితముగ చేరగలరనుటకు సందియములేదు. నియంతలవలన బాధపడుచున్న పాశ్చాత్యులు భారతదేశమునుండి దౌర్జన్యరాహిత్య పారము నేర్చుకొని సఫలీకృతమనోరథు లగుదురుగాక !

ఆంధ్రరాష్ట్ర సంపాదనమువిషయమున దేశమున మరల ఆందోళనము సన్నగిల్లినది. శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు ఆంధ్రమహాసభానంతరము తమ ఉద్యోగవిషయకమగు కార్యములందు నిమగ్నులై యున్నారు. వారి అధ్యక్షోపన్యాసమున జెప్పిన Council of action ఏమయినదో తెలియదు. కాంగ్రెసువారు ఇతర కార్యములయందు నిమగ్నులై యున్నారు కావున ఆంధ్రరాష్ట్ర సంపాదన ప్రయత్నమున ఆంధ్రమహాసభవారియొక్క, ఆంధ్రమహాజనులయొక్క బాధ్యతే అధికమని మా నమ్మకము. ఇక ముందైనను వారు ఈ విషయమున నెక్కువ శ్రద్ధ వహించి, తత్సంబంధములగు కార్యములను చురుకుగా సాగించెదరని నమ్మెదము.

ఎప్పటివలెనే మా కోర్కెను మన్నించి, ఈసంచికకు తమ యమూల్యములయిన గద్య పద్య వ్యాసములను బంపి మాకు తోడ్పడిన ఆంధ్రభాషాసేవకుల కందరకు మా వందనములు. ఇక ముందు కూడ నిట్టి ప్రయత్నముల నిట్లే తోడ్పడుచుండగలరని విశ్వసించుచున్నాము.

కార్యస్వభావమువలనను స్థలాభావముచేతను వ్యాసప్రకటనమున కింతకన్న నవకాశము కలుగనందుకు చింతించుచున్నాము. వ్యాసవిలేఖకులు మన్నింప ప్రార్థన.

# 'వాయంగ్' ఆటలు

## జావాద్వీపవాసుల వినోదములు

**మల్లంపల్లి సోమశేఖరశర్మ**



మలయాద్వీపకల్పమునకు దక్షిణమున సుమత్ర, జావా, బాలి మొదలయినద్వీపము లెన్నో యున్నవి. ఈ ద్వీపములలోను, బర్మా, ఆనాం, కంబోడియా, సయాం మొదలైన దేశములలోను క్రీస్తుశకము మొదటి శతాబ్దులలోనే హిందూనాగరికత వ్యాపించివిస్తరించినది. హిందూదేశమునకును ఆ దేశములు ద్వీపములకును వర్తకవ్యాపారము అతిపురాతనకాలమునుంచి విరివిగా సాగుచుండెడిది. బౌద్ధభిక్షువులు, హిందువులు ఎందరో ఆ ప్రదేశములకు తమ మతమును వ్యాపింప జేసికొనుటకు వెళ్లినారు. ఈవిధముగా ఆ ద్వీపములందు హిందువులవలసలు ఏర్పడినవి. వారచట గుళ్లు గోపురములు కట్టినారు. బౌద్ధము, శైవము, వైష్ణవము అక్కడకూడ వ్యాపించినవి. ఆ ద్వీపములలో శివాలయములను, విష్ణ్వాలయములను, స్తూపములను కూడ చూడవచ్చును. అచ్చటివన్నియు మన దేవతామూర్తులే, మన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులే, మనబుద్ధుడు, బోధిసత్త్వులే. అంతా మనశిల్పమే; భారతీయకళే. అక్కడ వ్యాప్తిలోనికి వచ్చినకథలన్నీ మన పౌరాణికకథలే. మన ధర్మశాస్త్రము లక్కడికి వెళ్లినవి; మనరామాయణ, మహాభారతాది ఉద్గ్రంథము లక్కడికి వెళ్లినవి. మన దేవత లక్కడికి వెళ్లినారు. తుదకు మన రాక్షసులు కూడ ఆద్వీపవాసులను విడవలేదు. అక్కడకూడ అయోధ్య వెలసినది. ఇంద్రప్రస్థ మున్నది; సరయువు ప్రవహించుచున్నది. మాల్యవంతము మొదలయిన పర్వతములుగూడ అక్కడ నున్నవి. మరల ఆద్వీపములు రెండవ హిందూదేశ మయినవి. అంతయు భారతీయనాగరికతే; అంతయు హిందూసంస్కృతే. అచ్చటి రాజులు రాజ్యాలు స్థాపింపకపూర్వము మన రామచంద్రుడు ఆభీకరాటవులలో సంచరించినాడు; మన రావణుడు అచ్చటి తపోవనములను విధ్వంసము చేసినాడు. తుదకు పాండవులుకూడ ఆ భయంకర కాంతారములలో దాగి, అజ్ఞాతవాసము చేసినారు. ఈవిధముగా మనపౌరాణిక వీరులందరు ఆద్వీపవాసులకు కూడ జాతీయవీరు లయినారు. తరువాతికాలములో ఆద్వీపములలో రాజ్యాలు స్థాపించిన భూపతు లందరుకూడ చంద్రవంశమునకు సంబంధించినవారును యదువంశమునకు సంబంధించినవారును - హిందువులే వా రందరును. జావా, బాలిద్వీపములు హిందూదేశపు పెంపుడుబిడ్డలవలె అల్లారుముద్దుగా పెరిగినవి.

రామాయణ, మహాభారతాదులు జావాద్వీపవాసుల ప్రాచీన 'కవి' భాషలోనికి అనువాదము లైనవి. 'కవి'భాష అనగా కావ్యభాష. ఈ 'కవి' భాషలోని ప్రతిపదిమాటలకు తొమ్మిదిమాటలు సంస్కృతపదములే. హిందూరాజులు ఆద్వీపమును పరిపాలించిన కాలములో ఈ 'కవి' భాష గొప్ప ఉచ్చదశలో ఉండెడిది. జావాద్వీపవాసుల ప్రాచీన హిందూ ఉద్గ్రంథము లన్నియు ఈ 'కవి' భాషలోనే ఉన్నవి. హిందూరాజుల పరిపాలనమున రామాయణ, మహాభారత గాథలను ఆద్వీపములలో పదములుగా పాడేవారు; ఆటలుగా

ఆడేవారు; పద్యములుగా, గద్యములుగా చదివేవారు. ఈకారణముచేత జావా, బాలిద్వీపములలో రామాయణ వీరులను గురించికాని, భారతవీరులను గురించికాని తెలియని పసిపిల్లవాడుకూడ లేడని చెప్పవచ్చును. రామాయణాదులు ఆద్వీపవాసుల హృదయముల నంతగా ఆకర్షించినవి; అవి వారికి ఒకవిధమయిన ఆనందమును, శాంతిని ఇచ్చినవి.

హిందూరాజుల పరిపాలనము ఆ ద్వీపములలో పదునైదవ శతాబ్ది వరకు సాగినది. పదునైదవశతాబ్దిలో ఆద్వీపములు మహమ్మదీయ ప్రభుత్వమునకు లోబడిపోయినవి; అంతేకాదు; ఆద్వీపములలోని ప్రజలందరును మహమ్మదీయమతావలంబకులే యైనారు. ఆద్వీపములు ఇప్పటికి అయిదువందల సంవత్సరముల నుండి మహమ్మదీయులకు పట్టుగొమ్మలైనవి. అచ్చట మహమ్మదీయ సంస్కృతి స్థిరముగాపాదుకొనిపోయినది. అయినప్పటికి, నేటికికూడ హిందూసంస్కృతి అచ్చట దిగవిడిచిన ముద్రలను మనము విస్పష్టముగ చూడవచ్చును. పురాతన హిందూదేవాలయములు, పురాతన హిందూకళలు మన కింకను అచట గానవచ్చును. జావాద్వీపమునందు కంటెనుగూడ హిందూమత, సంస్కృతిచ్ఛాయలు బాలిద్వీపమున ఎక్కువగ నిలిచిపోయినవి. బాలిద్వీపమునను, జావాద్వీపమునను నేటికిని ప్రాచీన హిందూ సంప్రదాయములను, ప్రాచీన హిందూ పౌరాణిక గాథలను పోషించి పరిరక్షించుచు వచ్చుచున్నవి ఆద్వీపవాసుల 'వాయంగ్' వినోదములు.

జావా, బాలిద్వీపవాసుల వినోదములలో ప్రధానముగా చెప్పవలసినది 'వాయంగ్' వినోదము 'వాయంగ్' అనగా బొమ్మలాట. ప్రజలలో దీనికున్న ఆదరము మరి ఏవినోదమునకును లేదు. 'వాయంగ్'లో చాలరకము లున్నవి. అందులో ప్రధానమయిన వేవన :

(౧)'వాయంగ్ వోంగ్'(Wayang Wong) ఈ ప్రదర్శనము మన దేశములోని వీధినాటకమువంటిది. ఇందు పాల్గొనుపాత్ర లందరును జీవించియున్న నటులే. వీరు మన వీధిభాగవతులవంటివారు. దేశమందంతట, పల్లెపల్లెకు, పట్టణపట్టణమునకు పోయి, వీరు వీధినాటకములను ప్రదర్శించుచుందురు. వీ రాడున వన్నియు రామాయణనాటకములును, మహాభారతనాటకములును. చిత్రవిచిత్రము లయిన అందములగు దుస్తులను ధరించి, 'కవి' భాషలోని రామాయణ, మహాభారతగాథలను చదువుచు, పాడుచు అభినయింతురు. విచిత్ర మేమన, జావాద్వీపమునందలి సుల్తానులు (స్వదేశసంస్థానాధిపతులు) ఇట్టి వీధిభాగవతులను దమ యాస్థానముల నుంచి, పోషించుచు, పండుగ సమయములయందును, పర్వసమయములయందును, తమ సంస్థానమునకుగాని, కుటుంబమునకుగాని సంబంధించిన యుత్సవావసరముల యందును, జావాద్వీప విశేషములను జూడ వచ్చిన విదేశీయులైన యాత్రికులు తమ యాస్థానములకు వచ్చినప్పుడును ఈ ప్రదర్శనముల నేర్పాటు చేయుచుందురు. కాని ఇటీవల ఈ వీధినాటకములమీద మోజు తగ్గిపోవుచున్నది.

(౨) 'వాయంగ్ టోపెంగ్' (Wayang Topeng). ఇది 'చేతమొగము'లను ధరించి చేయునృత్యము. దేవ, దానవముఖములను ధరించి పురాణగాథల నభినయింతురు. బాలీద్వీపపు హిందూ దేవాలయములలో దేవతోత్సవముల సందర్భమున పూర్వ ముపయోగింపబడుచువచ్చిన 'చేతమొగము'ల (Masks) నిప్పటికిని చూడవచ్చును. వీనికికూడ వెనుకటి ప్రజాదరణము తగ్గిపోవుచున్నది.

(3) మరొకవిధమయిన వినోదప్రదర్శనము జావానీయుల బొమ్మలాట. ఇది కొయ్యబొమ్మలాటయని, తోలుబొమ్మలాట యని రెండు విధములు.

కొయ్యబొమ్మలాటకు 'వాయంగ్ క్లిటిక్' (Wayang Klıtık) అని పేరు. ఈ కొయ్యబొమ్మ లొక్కొక్కటి పదంగుళముల నెత్తుండును. వీటికి తెర యక్కరలేదు. ఈ బొమ్మలకు పాత్రస్వభావమున కనువయినయట్లుగా చక్కని రంగులు వేసి, వెలగల ఆభరణములు, రంగురంగులదుస్తులు తొడిగి వాటిని చక్కగ అలంకరింతురు. మన దేశములో 'పెళ్లాడే బొమ్మా, పెళ్లాడే బీబీనాంచారి' అని పాడుచు, కొందరు బిచ్చగాండ్రు పట్టుకొని వచ్చి యాడించుబొమ్మను చూచినవో, వీటిని ఒకవిధముగా మనము ఊహించుకోవచ్చును. ఈ నాటకప్రదర్శ

సములలోని ఇతివృత్తము చరిత్రాత్మకమయినది. జావాద్వీపమునందలి హిందూసామ్రాజ్య వినాశనమునకు పూర్వపుచరిత్రలోని శౌర్య, సాహసగాథలకు సంబంధించిన నాటకములను ఈవిధముగ ప్రదర్శించుచుందురు. జావాయందంతట ఇట్టి ప్రదర్శనములులేని పల్లెయే లేదనవచ్చును. ఈప్రదర్శనములు మధ్య జావాద్వీపపు తూర్పు మండలములలో ఎక్కువగా జరగుచుండును. ఇవి దేశీయులకు ప్రాచీన చారిత్రక గాథలను స్మరణకు దెచ్చి, వారి హృదయము నుత్తేజపరుచుచుండును.

ఇక రెండవదయిన తోలుబొమ్మలాట అచ్చముగా మన దేశమునందున్నదానివంటిదే. ఈ బొమ్మలాట-వినిపించే కథను బట్టి,- 'వాయంగ్ పూర్వ' (Wayang Purva) అని, 'వాయంగ్ గెదక్'(Wayang Gedok) అని రెండు విధములు. 'వాయంగ్ పూర్వ' అను తోలుబొమ్మలాటలో ఎత్తుకొను కథ లన్నియు పౌరాణికమయినవి; రామాయణ, మహాభారతములకు సంబంధించిన గాథలు. 'వాయంగ్ గెదక్' అను ఆటలో ఎత్తుకొనేవన్నియు చరిత్రాత్మక గాథలే.



జావా ద్వీపవాసుల తోలుబొమ్మలాట (మహాభారతములోని ఒకరంగము)

మొత్తముమీద ఈ రెండు రకాలయిన ఆటలలోను ఉపయోగించెడివి తోలుబొమ్మలే. వీటిని సాధారణముగా బర్రెతోలుతో చేయుదురు. వీటిని తయారుచేయుట ఒక ప్రత్యేకవృత్తియే అయినది. తోలును చక్కగా కోసి చదును చేసి పదును పరిచి ఆయాపాత్రల స్వభావము చూచుటతోనే తట్టునట్లు స్వభావానుగుణమయిన రంగులు పూసి ఆభరణములు దుస్తులు మొదలైనవి చిత్రించి బంగారుమలాము చేసెదరు. ఈ బొమ్మలవి అనేక విచిత్రమయిన రూపములు. కానైతే అవి మానవ, దేవప్రతిమలయినను పక్షిముక్కులవలె పొడుగాటి ముక్కులతోను, మరీ దీర్ఘము లయిన చేతులతోను అవి చాల వింతగాను, విచిత్రముగాను, వికృతముగాను ఉండును; కాని యారంగులతోను, దుస్తులతోను, ఆభరణములతోను అతి విస్తరముగ నలంకృతము లయిన వాటిని చూచినప్పుడు మనకు ఆ వికృతత్వము కాక మనస్సుకు చిత్రమయిన యానందమును గలిగించు భావ మేదో తట్టుచుండును.

ఈ తోలుబొమ్మలు ఇంత వికృతమయిన ఆకృతులతో నుండుటకు కారణముగ చెప్పు ఒక గాథకూడ

కలదు. మహమ్మదీయులు జావా ద్వీపమును పదునైదవశతాబ్దిలో వశపరుచుకొనుటయేకాక అచ్చటి ప్రజలనుగూడ మహమ్మదీయమత మిచ్చినారు. మహమ్మదీయమతధర్మము ప్రకారము మనుష్యప్రతిమలను చిత్రించుటకాని, చెక్కుటకాని నింద్యము; నిషేధము. కాని వారా దేశమున ప్రవేశించుసరికి ఈ తోలుబొమ్మల ప్రదర్శనములు చాల జనరంజకములుగా నున్నవి. క్రొత్తగా మహమ్మదీయమతము నవలంబించిన దేశీయుల యీ వినోదమును నశింపజేయగూడదు; అవి మహమ్మదీయ మతసిద్ధాంతములకు భిన్నముగను నుండగూడదు. ఈ యుద్దేశముతో జావాద్వీపమునందలి మొదటి మహమ్మదీయ మతప్రవర్తకులలో నొకడగు "సుసూనన్ మోరియా" అదివరకు మనోహరముగ నుండు నీ బొమ్మలలో ఇప్పుడు కనబడు మార్పులు — పొడుగాటి ముక్కులు, సుదీర్ఘములయిన బాహువులు మొదలైనవి — చేసినాడట. ఇట్టి మార్పులవలన వాటిని కేవలము మనుష్యప్రతిమల క్రింద జమకట్టుకొన వీలు లేదు కావున మహమ్మదీయమతసిద్ధాంతమున కవి భిన్నమయినవి కావు. జావాద్వీపవాసులు — ప్రతిమలు వికృతముగా నున్నప్పటికి — వాటిని చూచి, ఆయాబొమ్మలు స్ఫురింపజేయుపాత్రలను స్మరణకు దెచ్చుకొని తమ ప్రాచీనపురాణగాథలను విని రహస్యముగ ఆనందించుటకును అవకాశము గలదు గాన ఇది వారి కొకవిధమైన సంతృప్తి.

ఇది గాథ; కాని ఇది అంత నమ్మదగినదిగ తోచదు; ఏమన జావాద్వీపపు ప్రాచీన నాణకముల మీదకూడ కొంచె మించుమించుగ ఇట్టి విచిత్రాకృతులు కానబడును. కావున మహమ్మదీయ మతము జావాలో ప్రవేశించుటకు పూర్వమునుండియు ఇవి ఇట్టిరూపములతోనే ఉండియుండు ననుట కవకాశము కలదు. మరీ అంత అందవికారమయినవి కాకపోయినను కొంచె మించుగ నిటువంటివే ప్రాచీన శిల్పచిత్రములు కొన్ని బాలీద్వీపమునందున్నవి. దీనినిబట్టి చూడగ ఈ బొమ్మలాట హిందూదేశమునుండి యచటికి వెళ్లినను ఈవిధమైన చర్మపుత్రికారచన ఆ ద్వీపవాసుల మనఃప్రవృత్తులనుబట్టి, కళాసంప్రదాయములనుబట్టి, చిత్రరచనా సమయములనుబట్టి అచట స్వతంత్రముగా వికసించినదే యనియు, మన రామాయణవీరులును, భారతవీరులును ఆ దూరస్థ ద్వీపములకు వలసపోయి నూతన రూపములను ధరించినా రనియు చెప్పవలసియుండును.

ఈ తోలుబొమ్మలాటలోని ప్రధానాంగము లివి: (౧) తెర; (౨) దీపము; (3) 'దలాంగ్'; (౪) 'గమేలన్'.

తెరమీదనే ఈ తోలుబొమ్మల ఛాయలు పడుచుండుటవలన దీనికి 'ఛాయాక్రీడ' (Shadow play) అని పేరు వచ్చినది. ఈ తెరకు 'కేలిర్' (Kelir — చేలము?) అని పేరు. ఇది ఆరడుగుల వెడల్పును, పదునైదడుగులపొడుగును ఉండి, ఒకకొయ్యచట్రమున బంధితమై యుండును. కొన్నికొన్ని చోట్లలో తెర ఇంతకంటె కొంచెము చిన్నదిగా నుండుట కూడ గలదు.

బొమ్మలను ఆడించుటకు, కథ పాడుటకు ప్రధానముగా ఒకడుండును. ఇతడే నాయకుడు. 'ఇతనిని దలాంగ్' (Dalang) అందురు. ఆట బాగుగా జరగుట రక్తికట్టుట మొదలైనవి ఇతని నేర్పరితనమునుబట్టే యుండును. బొమ్మలను ఎంతో చాకచక్యముతో ఆడించుచు, నడుమ నడుమ తన ప్రజ్ఞకూడ చూపి, ఆయాపాత్రల సంవాదమును నడపుచు, ప్రేక్షకుల హృదయ భావములను గనిపెట్టి వారికి విసుగుకలుగకుండ మధ్యమధ్య హాస్యము చెప్పుచు 'దలాంగ్' బొమ్మలాట కంతకును ప్రాధాన్యము వహించును. ఎంతో కాలము గురువుదగ్గర శుశ్రూష చేసి, చక్కగా కావ్యములు వల్లించి, బొమ్మల నాడించుటలో క్రమశిక్షణ పొందినమీదకాని ఎవ్వడును 'దలాంగ్' కానేరడు.

తెరవెనుక కూర్చుని బొమ్మల నాడించు 'దలాంగ్'కు సరిగా నెత్తిమీదనే 'దమర్' (Damar) అను పేరబరగు (ప్రమిద?) దీపము పెద్దది వ్రేలాడుచుండును. ఇది తెరమధ్యభాగమును ఎక్కువగ ప్రకాశవంతము కావించును. తెరమీది ఈ ప్రకాశమానమయినభాగమున నే తోలుబొమ్మలు వచ్చి, తమ పాత్రముల నభినయించి కుడివైపునకో, ఎడమవైపునకో నీడలలోనికి జారిపోవును.

తెర వెనుక ప్రక్క క్రింది భాగమున అరటిబోదెల నుంచెదరు. ప్రతి బొమ్మకు రెండు చేతులకు రెండును, శరీరమున కొకటియు చొప్పున **మొత్తము మూడేసి** వెదురు ఊచలు బొమ్మలకు కాళ్లు చేతులు మొదలైనవి కదల్చుటకు వీలగునట్లు దారములతో కట్టియుండును.

ఒక్కొక్కవిధమయిన 'వాయంగ్' వినోదమునకు ఒకొక్కవిధమయిన జంత్రవాద్యమేళము ఉండును. ఈ మేళమును 'గమేలన్' **(Gamelan)** అనెదరు. ఆయా ఘట్టముల రసమున కనుగుణముగా కలా, మంద్ర, తారస్వనములతో, వివిధ గతులగు లయ, తాళములతో 'గమేలన్ 'మేళము సాగుచుచుండును. ఈ జంత్రవాద్యకులు 'దలాంగ్' చేరువ నుందురు.

ఊరిలో తోలుబొమ్మలాట అని వేరే చాటింప నక్కరలేదు. ప్రదర్శన సమయమునకు ఎక్కడి నుండి వచ్చి పడుదురో 'దలాంగ్' రాక పూర్వమే జనము తండోపతండములుగా వచ్చెదరు. మన దేశములోలాగే అక్కడకూడ తోలుబొమ్మలాట రాత్రి తొమ్మిది గంటలకారంభమయి, సూర్యోదయము వరకును సాగుచుండును.

తెర యివతలినుండి, తెర అవతలి నుండికూడ ప్రేక్షకులు ఈయాటను తిలకింతురు. 'దలాంగ్' వైపుననుండి చూచువారికి బొమ్మల రంగులు మొదలైనవి పరిస్ఫుటముగ గాన్పించును.

ఆట ప్రారంభమున 'దలాంగ్' 'కవి' భాషనుండి కొన్నిపద్యములు చదివి వాటికి ప్రస్తుతజావాభాషలో వ్యాఖ్యానము చేయును. పిదప వట పత్రమువంటి ఆకారముగల ఒకబొమ్మ తెరయెక్కును. దానిలో చెట్టుమాను, కొమ్మలు మొదలయినవి మనము గుర్తింపవచ్చును. దీనిని 'కాయన్' **(Kayon)** అనెదరు. ఇది పర్వతము, వృక్షము, అడవి, భవనము మొదలైన వాటిని సూచించునందురు. ఇది జీవనవృక్షమునకు సూచనయని విశేషార్థమును చెప్పుదురు. అటు తరువాత కథాసందర్భము ననుసరించి ఒక్కొక బొమ్మే తెర యెక్కి తెర దిగుచుండును. అప్పటి కథా ఘట్టమున కుపయోగించని బొమ్మలను 'దలాంగ్' కుడి, యెడమ వైపుల తెర చివరి భాగముల నుంచును. సాధారణముగా 'దలాంగ్' రాక్షసులను, భూతములను, దుష్ట పాత్రములను ఎడమవైపునను, దేవతలను, మహారాజులను, సత్పాత్రలను కుడివైపునను ఉంచుచుండును.

క్రొత్త ఘట్టము, క్రొత్త రంగము ఆరంభమైనపుడెల్ల 'దలాంగ్'గంట మ్రోగుచుండును.

ఈ తోలుబొమ్మల ఆటలలో సామాన్యముగా వచ్చు ౫౦, ౬౦ మంది వీరులనుగురించి జావాద్వీపము నందలి ప్రతి పిల్లవానికిని, ప్రతి పెద్దవానికినిగూడ దెలియును. శ్రీ రామ వనవాసము, జటాయువధ, సీతాపహరణము, సీతాన్వేషణము, లంకాదహనము, రామరావణ యుద్ధము మొదలైన హిందూ పౌరాణిక గాథలన్నియు 'కవి'భాష తెలియకపోయినను, తమ మతముకూడ ఇప్పుడు హిందూమతము కాకపోయినను జావా ద్వీపవాసులకు 'హృత్కవిలె'. ఇట్లే భారత గాథలుకూడ, జావానీయ హృదయమును ఆకర్షించి రంజింపజేసినవి. 1



1. ఈ సంచికయందు ముద్రితములైన 'జావాద్వీపపు తోలుబొమ్మలు' మిత్రులు శ్రీ రంగారావ్ నిప్పాణిగారి యనువతిని.

# ఎల్లోరా కైలాస గుహాలయములు

ఎల్లోరా అనునది నిజామురాజ్యమున ఔరంగాబాదుజిల్లా ఔరంగాబాదుపట్టణమునకు వాయవ్యదిశగ పదునైదుమైళ్లదూరమున నున్న గ్రామము. ఇచ్చట పెద్దకొండ లున్నవి. ఈ కొండలలో గుహాలు, ఆలయములు దాదాపు ఉత్తర, దక్షిణములుగా ఒక మైలుంబాతిక పొడువున దొలచబడినవి. వీనిలో జైనులకు సంబంధించిన గుహాలయములును, హిందువులకు సంబంధించిన గుహాలయములును గూడ నున్నవి. జైనులకు సంబంధించిన వానిలో 'ఇంద్రసభ'యను జైన గుహాలయప్రతతియు, హిందువులకు సంబంధించినవానిలో కైలాసనాధ గుహాలయమును ప్రధానముగ పేర్కొనదగిన, చూడవలసిన దృశ్యములు. ఈ గుహాలయములవలన సాధువుగాని, సన్యాసిగాని హిందూదేశమున యాత్రచేసి దర్శించవలసిన పండ్రెండు మహాతీర్థములలో ఎల్లోరా ఒకటి యైనది.

ఈ గుహాలయనిర్మాణము క్రీస్తుశకము అయిదవశతాబ్ది మొదలు పదవశతాబ్దివరకు సాగుచువచ్చెనని యూహించుట కాధారములు కలవు.

ఎల్లోరాగుహాలయము లన్నిటిలోను అత్యంత రమణీయమైనది కైలాసనాధగుహాలయము. భారతీయదేవహార్మ్యవాస్తుకళకు చెప్పదగిన శ్రేష్ఠమైన యుదాహరణములలో నిది యొకటి, గుహాలయనిర్మాణపద్ధతి ఈ కైలాసనాధాలయమున పరిపూర్ణత చెందినట్లు చెప్పుదురు.

ఈ కైలాసనాధాలయము క్రీస్తుశకము ఎనిమిదవశతాబ్ది ఉత్తరార్ధమున (క్రీ. శ. ౭౭౦ ప్రాంతము) రాష్ట్రకూటవంశజుడయిన మొదటి కృష్ణభూపతిచేత నిర్మితమయినది.

క్రీ. శ. ౭౫౮ ప్రాంతమున రాష్ట్రకూటు లనుతెగవారిలో ప్రముఖుడయిన దంతిదుర్గుడను భూపతి వాతాపి (ఇప్పటిబదామి) రాజధానిగ పాలించిన చాళుక్యవంశజుడు రెండవ పులకేశిసంతతివాడయిన రెండవ కీర్తివర్మను ఓడించి చాళుక్యరాజ్యమును వశపరుచుకొనెను. ఆతని యనంతరము అతని పినతండ్రి అకాలవర్షు డను బిరుదనామముగల మొదటి కృష్ణభూపతి రాజ్యమునకు వచ్చెను. ఇతడు పెక్కు విజయముల నందె. తన రాజ్యమును విస్తరింప జేసి, విజయసూచకముగ ఈ కైలాసనాధగుహాలయమును కట్టించెను.

కృష్ణభూపతి గొప్ప శివభక్తుడు. ఈ కైలాసనాధాలయమునుగాక ఇతడు మరికొన్ని శివాలయములను గూడ కట్టించెను.

విమాన, అంతరాళ, మండపములతో గూడిన ఈ ప్రధానాలయము ౯౭ అడుగుల యెత్తుగల ప్రతిష్ఠానముమీద లేచినది. ఈ ప్రతిష్ఠానమును, కైలాసనాధాలయమును దమమూపున మోయుచున్నట్లు చూపబడిన ఏనుగుసమూహము చిత్రములతో మలచబడి నేత్రపర్వ మొనరించుచుండును. ఈ కైలాసనాధాలయమున విఘ్నేశ్వరుడు, భైరవుడు, పార్వతి, చండిక, సప్తమాతృకలు మొదలయినవారికి ప్రత్యేక దేవమందిరము లున్నవి.

ఈ సంచికయందు ఈ కైలాసనాధాలయమునకు సంబంధించిన కొన్నిదృశ్యములు చూపబడినవి.

—శర్మ.

# జావా ద్వీపపు తోలుబొమ్మలు



కౌసల్య



సుమిత్ర



కైకేయి



సీత



రావణుడు



శ్రీరాముడు

# ఉగాది

రాయప్రోలు సుబ్బారావు

౧

పాదు లగల్చ మల్లియలు ప్రాయపు రాపిడి, కొమ్మలెల్ల రా
గోదయలాలసమ్ములయి యుల్లసిలన్, సుభగేక్షుకాండము
న్మాదరసాభిషేచన మొనర్పగ వచ్చెడి ఈయుగాదిమ
త్తైదువ నామతింపుడు సమస్త సుఖోత్సవదోహదాప్తికై.

౨

ఋతుముఖరంగమం దభినయించు వసంతుడు స్నేహపాత్రుడై,
శ్రుతి సవరించు కోవెల, తరుల్ తలపూ లసియాడ గుల్కఁగా, నీ
ప్రతిపదుపస్సులన్ సుఖపిపాసలలో నలపోక మానవుల్
మతి చెడి పచ్చిపిందెలను మావులఁ గోయరె? చేదు మ్రింగరే?

౩

ముదిసిన బ్రహ్మచారివలె మోడయి నిల్చిన మట్టిగూడ, నూ
గొదవఁ బ్రకాండమెల్ల తళుకొత్తుమొగ మ్మెటులెత్తి, పుల్కలన్
బాదలెడి, పొంచి పొంచి పికముల్ చిగురాకుతురాయి చెంగులన్
వదలక లాగ, నీప్రకృతివాటి, రిరంసలసంతసాగెనో!

౪

గౌతమి పూర్ణకుంభములు గట్టుల నింపగ, గోపయోఘృత
వ్రాతము కృష్ణ గూర్పగ, సువారము లెత్తగ పెన్న, ఉన్నమత్
గీతము తుంగభద్ర విలిఖింపగ, నేడు సమస్తవైభవో
పేతముగా భజింత్రు నిను వేడుక నాంధ్రు లుగాదిబాంధవీ!

౫

పడుచుల్ వృద్ధులు రాజులున్ రయితు లాబాలంబు, రాష్ట్రార్జనా
తృడుపాస్తిన్ బడినార లాంధ్రులు, జగద్వ్యాప్తావకాశమ్మునన్
గడచెన్ దీర్ఘదివానిశాయనము; లీ నట్టేటిలో పుట్టి ము
న్గెడుగుండంబుల నప్రమాదివయి జాగింపంగదే నేర్పరీ!

---

# తెలుఁగు పలుకు

### గుఱ్ఱప్పడియం ఆంజనేయులు

తపియించినది. కొన్నితరము లేకాకియై, దండకారణ్యమధ్యంబునందు;
గడియించినది, వేల్పునుడికారపుం జెల్మి, శబ్దశాసను సమక్షంబునందు;
విహరించినది, భూరివిబుధానుమతి నొంది, వివిధభావాంబరవీథులందు;
క్రీడించినది, భక్తితోడఁ గ్రొంజెలువంది, సరసమందాకినీఝురమునందు;
ఆనినది నవ్యదివ్యకావ్యామృతంబు
ముదముతోఁ గృష్ణదేవుసమ్ముఖమునందు;
చెన్నుఁ గన్నది వాఙ్మయశ్రేణియందు;
అమరవిభవైకమంజూష ఆంధ్రభాష.

పాలబుగ్గల పిన్నపాయమందునఁ దల్లి పుటుకదేనియ నుగ్గు వోసెనేమొ?
కలికిపల్కులు నేర్చుకాలమందున ధాత్రి కోదమకోయిలజోడు గూర్చెనేమొ?
మనసారఁ జెలులాడుకొనువేళ నెచ్చెలుల్ గమ్మపుప్పొడి మేనఁ గ్రుమ్మిరేమొ?
ఎలమేనిసోయగం బలర జేటికలెల్లఁ జిన్నిజాజులఁ బాన్పు సేసిరేమొ?
తనగుణంబుల, మధురమోహనమనోజ్ఞ
సురభిళాత్యంతమార్దవస్ఫురణ మెఱసి,
సాహితీ జీవములకు నిశ్చలతఁ గూర్చు;
దేశభాషలరాణి, మా తెలుఁగువాణి.

గోదావరీనదీకూలసైకతవేది బాస లేడింటితో బంతులాడి;
దాక్షవాటీనటీతారుణ్యపేటికా కస్తూరిసురభితోఁ గయ్యమాడి;
కర్ణాటకావనీకాంతు లోనగిరిలో మోహనాంగులతోడ ముద్దులాడి;
మంచి గందపుఁదావి మలయు తియ్యనిపీట సన్నముత్యాలతో సరసమాడి;
నాల్గుచెఱఁగుల రసికమానసములందు
గరువపుంబోకడల నెల్లఁ గమిచి యాడి;
భరతసౌభాగ్యముల నగ్రభాగ యయ్యె,
కలికిపన్నిటిసోన; మా తెలుఁగుచాన.

పాటఁ బాడిన దొక్క పిటఁ గోయిలపిండు, వల్లకీరుతులు విశ్వమున మ్రోయ
నాట్య మాడిన దొక్క నాటఁ గేకులచాలు, కమనీయరుచులు దిక్తతుల బర్వ;
సురభి గుల్కిన దొక్క తోటఁ జంపకరాజి, గమగమ లఖిలలోకముల నిగుడ;
పదము లెత్తిన దొక్క బాట గువ్వలబారు మింటిరాయంచ క్రేగంటఁ జూడ;

ఆంధ్రలక్ష్మి జయోల్లాస మతిశయిల్లి
కవులముంగిటఁ గామధేనువులు వెలసి;
తోడిబాసలు పువ్వులు దోయిలించి
తెలుఁగుతల్లికి జోహారు సలుపునాఁడు.

మనుమార్గుఁడైన తోడునిపల్కు జవరాలి కొమరుపుట్టువుతోడఁ గొనలుసాగి,
సుధఁ జిల్కు నుడిగన్న సోమనాథులకళావస్తువైభవముచే వన్నెకెక్కి,
బుద్ధభూపతిగానమునఁ దారకబ్రహ్మభూతసర్వాంగమై మొగ్గ దొడిగి,
శ్రీకాకుళేశ్వరు సిగకు సింగారంబు దళుకొత్తఁ గ్రొత్తపూబంతు లొసగి,

కుసుమగంధుల నాణెంపు రసన లెనసి
ధరణి మందారనవమరందములఁ గురిసి,
కమ్మపూఁదీవె దేశీయకవిత గొలువఁ
దెలుఁగు వెలుఁగొందినది జగత్తిలక యగుచు.

చలువల ప్రోవులై, యమృతసారములై మనకృష్ణవేణితోఁ
గలసి త్రిలింగభూములకుఁ గైవసమైనవి తుంగభద్రలో
జలములు గావు; రాచసిరిజాణతనంబు గడించికొన్న క్రొం
దెలుఁగుపిసాళిపల్కుల జనించుమరందపువాహినుల్ సుమీ!

కండచక్కెరకన్న దుగ్ధములకన్న
తియ్యమామిడికన్నను తేనెకన్న
మధురమధురానుభవమును మదికిఁ దార్చు
మంత్రదేవత మము గన్న మాతృభాష.

చంపకోత్పలసారసౌరభంబు నొకనాఁడు రారాజుగద్దెపై రాజ్యమేలె;
తేటకందపుఁ గమ్మ తేనియ లొకనాఁడు నెల్లూరువీధుల వెల్లివాఱె,
సీసముల్ ముత్తెంపురాసులై యొకనాఁడు పట్టాభిషేకసౌభాగ్య మెనసె;
స్వాదుమోహనగానసస్యంబు లొకనాడు త్యాగభూముల విఱ్ఱవీగి పండె;

కరుణ దొలుకాడఁ దనయుల నరయుజాడ
నేఁగి యందందు నీవు కాలిడినవేళ;
నీప్రభావంబు మాకు వర్ణింపఁ దరమె?
కన్నతల్లి! నిజాశ్రితకల్పవల్లి!

కూలిపోయినకోటగోడలోఁ గనిపించు తెలుఁగుసోయగపుముత్తెములచాలు
విఱిగినకొలువుచావడిలోన వినిపించు తెలుగులేకన్నె తంత్రీస్వనంబు,
దిబ్బవాఱినరాచదేవిడీలో మించు తెలుఁగురాజులభాగ్యవిలసనంబు,
గడ్డివట్టిన పాటిగడ్డలోఁ దులకించు తెలుఁగుజోదుల భుజాబలదవాగ్ని,

ఆంధ్రభాషాంబికాదివ్యహస్తజలజ
సుప్రసాదంబు లమృతభాసురము లగుచు
వెలయు నెందాఁక, నందాక విడిచిపోవు
తెనుఁగుబిడ్డల రక్తవాహినులనుండి.

సముదారద్విపకేసరీంద్రులగు రాజన్యుల్ గృతారంభులై
ప్రముదం బీయ, మదీయవాగ్జనని "ఆబంగాళ శృంగాచలాం
తమహీరాజ్యరమానుషంగ" యగుచున్ దా మన్ననల్ గన్న కా
లము నాలో దిలకించుకొంచుఁ ద్రటికాలం బాత్మ నుప్పొంగెదన్.

మురువగు గండపెండరపు మ్రోఁతలతో మధుమాధురీరుచుల్
బరువులువెట్ట రాజసభల న్నటియించిన దా యుగాన; -త
చ్చరితలు ప్రావడెన్, ప్రభత సాలదు తల్లికి మాటమైన మా
తరమున; నెన్నినాళ్లిటుల దాఁతుము మో మరవాటు సిగ్గునన్?

జాలిందూలిన తెల్గుభారతికి నిచ్చ న్నవ్యభవోదయ
శ్రీలాభం బొడఁగూర్ప నిష్పుడమిఁ గాశీనాథుఁ డావిర్భవం
బై లక్షించి, యొసంగె నూత్నకళ; నాహా! యట్టిధర్మప్రభున్
గాలాభీలనిశాటి మ్రింగినది, మా కర్మంబు లిట్లుండునే?

ఆదరించెడు జేనికై మోముచాచెడు కవులవేదనకుఁ బెన్నాఁక నంది;
పేటికాకారలోఁ బృథుకావ్యములు మాయు గోరాన కింతకన్నీరు కాఱ;
స్వప్రభుత్వాంగణాసభ్యమైన తెనుంగు నిర్భాగ్యతకు బిట్టు నిశ్వసింప,
తనతల్లి బాసపెత్తనము నొల్లని విశ్వవిద్యాలయాధికి వ్రీడ నొంది,

స్వీయధనధాన్యభూములఁ "జప్తు" మనుచుఁ
బంచఁ జేరిన ప్రజ కెల్లఁ బంచిపెట్టి;
అక్కటక్కట! యీనాఁటి యాంధ్రజాతి
గ్రుక్కిళుల మ్రింగుచున్నది, దిక్కుమాలి॥

కల రుద్దండులు సత్కవుల్; కలవు లోకస్తుత్యముల్ పత్రికల్,
కల రుత్సాహులు బోధకోత్తములు, సద్గ్రంథాలయాంకూరముల్


ఆంధ్రసినిమారంగానికి
అమూల్యాభరణం
మాడరన్ సినిటోనువారి ప్రథమపూజోపహారము
ఉష
సాటిలేనిశృంగారంతో—సమ్మోహనమైన గానంతో
ఊరూరా ఉషఃకాంతులను వెదజల్లడానికి
త్వరలోవస్తుంది.
పద్మా సాలిగ్రాం—ఉష
రాజకుమారి—చిత్రలేఖ
★
కవి :—టి. వీరరాఘవస్వామి
డైరెక్టరు:-జి. వి. రావు


Delicious
మీ భోజనానికి
అత్యంత మధురమైన
క్రొత్త తినుభండారములు. అవి అప్పుడు
తయారైనవి; ఎంతో బాగుంటవి.
స్వాన్ మార్కు మామిడిముక్కలు:-పండినపండ్లుకోసి డబ్బాలో నిలువయుంచబడినవి-అత్యంత రుచికరమైన పండ్లముక్కలు-మరియు స్వాన్ మార్కు మామిడిపండ్ల రసము -- మేలిరకమైన తీయని మామిడి పండ్లనుండి తయారైనది. ఇందులో 'కండచక్కెర' అనిపించుకొను, డిక్స్ట్రోజు చేరియున్నది.—చల్లని పానీయముకంటె మేలైనది—బలవర్ధక పానీయము! దాహము ఉపశమింపచేయుటను ఎంత చక్కనిది! ఇతరస్వాన్ మార్కు వస్తువులలో నారంజపానకము, ఊరినరొయ్యలు, రొయ్యలకూర, నారింగ్ క్రష్, రొయ్యల టమాటో రసం, మామిడిజామ్, బనానాజామ్, టమాటో సూపు, చికన్ సూపు, నిమ్మరసం, నారింజరసం, మున్నగునవి కలవు.
SWAN
MANGO SQUASH
MANGO SLICES

హైదరాబాదు సంస్థానము:

# ఎల్లోరా కైలాస గుహాలయ చిత్రములు



౧-వ చిత్రము : కైలాసనాథాలయము
ప్రధానాలయమును మోయుచున్న గజసమూహము



౨-వ చిత్రము : కైలాసనాథాలయము
గర్భగృహము : దీపస్తంభము (నైరృతి దిశనుంచి)



3-వ చిత్రము : కైలాసనాథాలయము
గర్భగృహము : దీపస్తంభము (నైరృతి దిశనుంచి)



४-వ చిత్రము : కైలాసనాథాలయము
గర్భగృహము : దీపస్తంభము : గజప్రతిమ
(వాయవ్యదిశనుంచి)

గల వైనఁ గలవైన దాదృతి, యసుగ్రామంబు లాలోకనం
బులఁ గీలించి, నిజాంబఁ గొల్తు రిపు డీపుణ్యుల్ జనాగణ్యులై॥

ఏనాఁడు తనసాహితీనిధానము నూపు, విత్తేశనిభులైన విభులచూపు;
ఏనాఁడు తనవ్రాల కెత్తు రాచరికంబు, సదసద్వివేచకసచివగణము;
ఏనాఁడు తనవాణి కిడు నగ్రపీఠంబు, నాంధ్రీయవిశ్వవిద్యాలయంబు;
ఏనాఁడు తనయశోగానంబు వినఁజాలుఁ బరఖండపత్రికా పరభృతములు;
ఎపుడు తనసీమ నన్యోఽన్య మినుమడించి,
యాత్మరాష్ట్రాధిపత్యభాగ్యము లభించు;
నెలమి నవ్వేళ నాంధ్రి; కాఁగలదు మరలఁ
బ్రథితవిశ్వసారస్వతపట్టభద్ర.

వేల్పువెజ్జుల కీర్తి విలసిల్ల నవనిపైఁ గాలూది, మెల్లనఁ గన్నువిప్పి,
కర్ణచారిణి తోడుగా గౌతమీపుణ్యతీరాన నునుబల్కుతీరు నేర్చి,
బ్రహ్మ మన్నింప, యౌవనమహోదయవేళ హరిహరస్వామితో నైక్యమొంది,
ముత్యాలచౌకుల, మెర్గువుబంగరుసీటఁ గవులపేదఱికంబుఁ గడిగివైచి,
ఒక్కతేలిన మన్నీళ్లు మొక్కలంది,
పారిజాతోపవనులఁ బచారుసలిపి
విశ్వచైతన్యదాత్రిపై వెలయుచున్న
ఆంధ్రభాషామతల్లి! జోహారు! తల్లి!

స్వీయరాజ్యవిపుల సింహాసనంబున
దేశమాత కొలువు దీర్చియుండ;
నమృతమూర్తి యగుచు నఖిలేశ యగుఁగాత!
తేనె లొలుకు తేట తెలుఁగుపలుకు.



# వధూసర

వావిలాల సోమయాజులు

౧

[భృగ్వాశ్రమము — ప్రాతః కాలము]

భృగుడు

అభిషేచనార్థమ్ము అరుగుచున్నా నిదే
గర్భవతివౌ నీవు కదలరా దెచ్చటికి.

పులోమ

ఇది యేమి నానాధ! ఈవింత వచనమ్ము
చిన్నదానికివోలె చెప్పిపోతున్నారు!

భృగుడు

మనసులో నేదియో మథనగా నున్నయది
కారణముమాత్రంబు కనుపించ దిప్పటికి!

పులోమ

పతి మీరు లేకున్న పడతినౌ నాకేల
ఇలు వీడి వెడలుటకు ఇచ్ఛ కలుగును నాథ!

భృగుడు

నా మనసులోనున్న నలత నంటినిగాని
నీమీద అనుమాన మేమి యుండియు కాదు.

పులోమ

ఎంత వింతగ తలచి ఎంత వింతగ నంటి
కెంతగా మీమనము చింత పెటితిని నాథ!

భృగుడు

చింత పెట్టుట కీవు చేసినది యేమిటే?
పూజ్యవౌ నీ కేను బుద్ధి గరపుట లేల!

పులోమ

క్షణములో నిది యేమి క్షమియింప వేడదను
వక్రవాక్కు-లటంచు భయము జనియించెడిని.

జవ్వన మదంబులో జపతపంబుల కేను
తప్పు లేమైనాను తలపెట్టితినె నాథ!

సంవాహ వృత్తిలో సరసతను వీడి నే
నొప్పించితిన నాథ! నొసల పాదంబులను.

భృగుడు

నీమనసు నేవిధిని నొప్పించితినె దేవి
కారణము లేనట్టి కలత కల్పించిపుడు.

వక్రవాక్కు-లెపుడు వచియించితినె దేవి!
అప్రయత్నంబుగా నటుల పలికితిగాని.

పులోమ

స్వామి నాపై మీకు స్వాంతమునగల యూహ
తెలియ జెప్పితిరేని తిరముగా చరియింతు.

భృగుడు

దేవి! నీవలననే తేజరిల్లెడు నగ్ని
పరమ పూతుండయ్యె పతియైన భృగుమౌని

పులోమ

మీపాదదాసి నన్ మీరింత పొగడుటల్
కనికరముచేగాని కలదె నాలో ప్రజ్ఞ

భృగుడు

అభిషేచనమ్మునకు నాలస్య మయ్యెడిని
పోయి వచ్చెద నిదే పొలతి! నిముషములోన.

పు లో మ

తడవు నిలిపిన నన్ను దయతోడ మీ రిపుడు
మన్నింపవేడెదను మహిత ప్రభావాఢ్య !

భృ గు డు

[వేదిమీదఉన్న తామ్రకమండలను చూపిస్తూ]

దయయుంచి నా కిమ్ము తామ్రపాత్రను చేతి
అరిగి వచ్చెదను నే నగ్నులను విహరింపు.

[భాగీరథీనదికి స్నానానికి పోతాడు.]

౨

పు లో ము డు

[చైత్రయాత్రామార్గమధ్యంలో ఉన్న భృగ్వాశ్రమానికి వచ్చి]

అతిథినై వచ్చితిని ఆశ్రమంబున కేను
కనుపించ రెవ్వరును కారణం బేమియో !

పు లో మ

[లోపలినుంచి వచ్చి]

అతిథులై తా మిపుడు ఆరుదెంచితిరయేని
వేవేగ లోపలకు విచ్చేయ రండయ్యా.

పు లో ము డు

భృగ్వాశ్రమముగాదె పూతచరితా ! ఇద్ది
ఆ మహాఋషికేమి అగుదువమ్మా నీవు ?

పు లో మ

అ మహామహుడు నా కౌనిటుల యం చేమి
అన్నియు న్నతడెగా అనుసరించెద నతని.

[వేదికను చూపించి]

విశ్రమింపుడు మీరు వేదిపై కాసేపు

[లోపలికి పోతుంది.]

పు లో ము డు

ఎంత చక్కని నాతి ! ఎంత చక్కని చుక్క !
ఈ సుందరాంగి నే నిదివరకె చూచితిన !
చూచినట్లే నాకు తోచుచున్నది యెడద
అట్టి సుఖసమయంబు అరిగినది యేనాడొ !
ఎప్పు డరిగిననేమి ? ఇపుడు కాంచితి మరల
నీ సుందరీ రమణి నీ యిందిరాదేవి
అతని కే కూడువని అడిగినంతనె తన్వి
అన్ని అతడే యంచు నరిగె యర్థం బేమొ !
వింతగా నా మనసు వెలితిపాలైపోవు
ఈ భామ విడిచితిన ఇలలోన మృతి యేను.

[ఇంతలో చుళికంలోని అగ్నిజ్వాల పైకెగసి మళ్లీ క్రుంగిపోతుంది. కలిగిన క్రీనీడ అంతరిస్తుంది. అది చూచి]

అక్కడెవ రోయుండి నక్కినట్లున్నారు
అరిగి యడిగెదగాక నాతన్వి చరితంబు.

[లేచి అగ్ని ఉన్న గదిలోపలికి పోబోతాడు.]

అ గ్ని

రాక్షసాధము డితడు రానె వచ్చెను విధీ !

పు లో ము డు

[మానవమూర్తి కనుపించదు.–చుళుకంలోని అగ్నిని చూచి]

ఓ హవ్యవాహనా ! ఒడలు బలిసినదేమి ?
పలుకకున్నావేల పాపాత్మ నీ విపుడు ?

అ గ్ని

[రూపం ధరించి]

జయ జయ దితిసుతా ! జయ సురపతినుతా !
ఎపుడు వేంచేశారు ఎటనుండి వచ్చారు?

పు లో ము డు

మా రాకతో నిపుడు మా పోకతో నిపుడు
కాలమ్ము వ్యర్థముగ గడపజూడకు మోయి
ఈ యాశ్రమములోని ఇంతి ఎవ్వరో నాకు
తెలియ జెప్పితివేని దిక్కు లేలెదవోయి.

అగ్ని

[నెమ్మదిగా]

భృగుపత్ని యంటినా భృగుడు శాపం బిచ్చు
కాదన్నపక్షాన కలుగు నన్నృతపు దోష
మెట్టులైన నామెడకె ఏవిధిని తప్పదిది
మునిశాప మంటేను మోదమే కాని
అన్నృతదోషఫలంబు అనుభవింపగలేను.

పులోముడు

ఇంత తడవేలోయి ?

అగ్ని

ఇంతి భృగు పత్నియే.

[రూపం సంహరించుకొంటాడు.]

పులోముడు

ఏను వలచిన కన్య నీమునిప్రవరుండు
పరిణయంబాడి తా పడయు సుఖముల నిపుడు
కాంత నెత్తుకొ పోయి కామించి పరిణయము
చేసుకొని సుఖముగా జీవింతు నిపుడైన.

[తిరిగి వచ్చి కొంతసేపు వేదిమీద కూర్చుంటాడు.]

3

పులోముడు

[లోపలికి పోయి కుశాస్తరణంమీద గర్భభారంతో బాధ పడుతూఉన్న పులోమను చూచి.]

గర్భభారము దాల్చి కడు బాధ పడుచున్న
కరణి నున్నది కాంత ; కాన నేవిధిని నే
నీమె నిటనుం డిపుడు ఎత్తుకొనిపోగలను
భ్రూణహత్యాదోషమునకు పాలౌదునో !
తడవుచేసితినేని తపసి వచ్చేయునో !
వచ్చేసి శాపమే ఇచ్చునో క్రోధాన !

[పులోమను చేతులలోకి తీసుకుంటాడు.]

పులోమ

[బాధలో కళ్లు మూసుకున్నామె కళ్లు తెరచి.]

అతిథివై వచ్చేసి అపమార్గమును త్రొక్కి
ఆచరింపగనౌనె అనుచితం బీసరణి.

పులోముడు

[మందస్మితము చేసి]

కాంత నీపై ప్రేమ నింతగా తలపెడితి
నన్ను చేపట్టితే నెన్నో సుఖా లబ్బు.

పులోమ

అతిథివని యంటేను అడుగుపెట్టగ నిస్తి
ఇటువంటి దుర్మార్గ మీవు తలపెట్టితివ
పతికంటె నాకెందు పరమాత్మ లేడురా
పతిప్రేమలనే నేను బ్రతికియుంటానురా
అన్యపురుషుడ వీవు అడుగగా తగునయ్య
సౌఖ్యముల మునిసతులు సంతసించెడువారె ?

పులోముడు

ఏమి కాంక్షించినను ఇత్తునే నీకిపుడు
సుందరీ నన్నింక సుఖములన్ తేల్చినన్
పతివి కమ్మందువా పరిణయం బయ్యెదను.

పులోమ

చాలు నాపుమురా వాచాలతను నీవు నా
పతి వచ్చువేళయ్యె ప్రాణములు పోవురా.

పులోముడు

తపసి చేసెడిదేమి తల దీసివేయునా ?
భయపెట్టజూచెదవు భర్త గొప్పల జెప్పి.

పులోమ

దయగలాడవటంచు తలపోసితిని ముందు.

పులోముడు

ఇపుడు కాకుంటినా ?

# ఈస్ట్ ఇండియ ఫిలిం కంపెనివారి

## తెలుగు సాంఘిక చిత్రము

కవితాకళానిధి బలిజేపల్లి లక్ష్మీకాంతకవి నటించిన చిత్రము




ముఖ్యనటులు:

దైతా గోపాలం, కె. సత్యనారాయణ, శ్రీరంజని, దాసరి కోటిరత్నము, పుష్పవల్లి, భానుమతి.

## Chamria Talkie Distributors,

**20, Vepery High Road - - - P. T., MADRAS.**

పు లో మ

ఐన పాతివ్రత్య
మపహరింపకుమయ్య అదయుండ వీవౌచు.

పు లో ము డు

పతిని నేనై నీకు సతివి నీవైనపుడు
రక్షింతు నేను నీ రమణి పాతివ్రత్య
మంత దాకను నీదు నాశయము నెరవేర్ప

[చేతులలో ఉన్న పులోమతో పర్వతోపల ప్రాంతానికి పరుగెత్తుతాడు.]

## ౪

[శిలాతలాల్లో పులోముడు పరుగెత్తుతుంటాడు. పులోమ గర్భంలో ఉన్న]

అ జా త శి శు వు

మహాత్మయా సాధ్వి మానంబు జెరుపగా
తలచి పారెదవేర దానవాధమ నీవు ?

పు లో ము డు

[వెరగుపడి నాల్గు దిక్కులూ చూచి]

కనుచూపు మేరలో కానుపించ డెవండు
కర్ణగోచరమైన కంఠ మెవ్వానిదో !

[ఆలోచించి]

వెనుదిరుగ నను జూచి వెరగుపడి నక్కెనా
పాషాణమయమైన ప్రాంతమం దెచటైన !

అ జా త శి శు వు

వెరగుపడి వెడలుటకు వెలితివాడను గాను
ఈ పాటి బలమునకె ఇంత గర్వం బేల ?

పు లో ము డు

ఎందుండి నీ విట్లు ఎరుగకే నా బలిమి
పలుకుచున్నవురా పాపాత్మ చాటుగా.

అ జా త శి శు వు

కనుల ముందరయున్న గర్భగోళమునుండి.

పు లో ము డు

ఆకాశవాణియా !

అ జా త శి శు వు

ఆమె కాదుర నేను.

పు లో ము డు

[పులోమగర్భంవైపు చూచి]

ఇందుండి ఎవడైన నిటు పలుకుచున్నాడ !

అ జా త శి శు వు

కొంచె మాగుర గర్భకుహరంబు వెలివడెద.

పు లో ము డు

వింతగా నున్న దిది వేగిరమ ఇటనుండి
చేరుకొనియెదగాక జీవితేశ్వరితోడ
సర్వభద్రంబైన సదనమ్మునకు వేగ.

[త్వరగా భయంతో పరుగెత్తుతాడు. పులోమకు గర్భచ్యుతమై శిశూదయం అవుతుంది. పులోమ మైకంలో ఉంటుంది- శిశువు మృతి జెందాడని. క్రిందపడ్డ శిశువు లేచిపోతూవున్న పులోముడితో]

జా త శి శు వు

చాలురా నిలు రాక్షసాధమ సాధనము
నీచేతకా దెటుల నిలిచి పోరాడేవు?

పు లో ము డు

[వెనుదిరిగి చూచి]

ఎవ్వడవురా నీవు ఎటనుండి వచ్చావు ?

జా త శి శు వు

ఇపుడె ఈలోకమున నెత్తినాడను జన్మ
నిన్ను రణమున జంప నిలచియున్నా నిదే.

పు లో ము డు

తడవేల యన్లైన తాకి చంపెదగాక !

జా త శి శు వు

తేలు నిపుడే నీదు తేజంబు శౌర్యంబు.

పులోముడు

అడుగు ముందుకు రమ్ము అడుగు ముందుకు వత్తు
అపుడు పోరాడితే అంద మగుపించురా.

జాతశిశువు

ఇదుగో వేసితి నడుగు ఏమి చేయుదువురా?

పులోముడు

అడుగు ముందుకు వేయ నాదిత్య తేజుడై
దహియించుచున్నాడు దానవునె న న్నిట్లు

జాతశిశువు

ఒక అడుగు నే వేయ నొక యడుగు వెనుకకే
వేయుచున్నావేల వెలితిపడి దానవా!

పులోముడు

[మాటాడడు.]

జాతశిశువు

విడువగాదగదు నిన్ విగతజీవుడవైన
ఇదుగో వచ్చానురా ఇంక నడుగులు నాల్గు.

పులోముడు

శిశువె యయ్యును వీడు శీర్ష మొగ్గించురా!
బ్రతుకుపై నాకిపుడు పాలుపోవుట లేదు.

[వెనక్కు నడుస్తుంటాడు.]

జాతశిశువు

పర్వతాగ్రమ్మునకు పరుగిడెద వేలరా
ప్రస్థమ్ము పైనుండి ప్రత్యంతములమీద
పడిపోయి వడిలోన ప్రాణముల విడిచెదను.

పులోముడు

దుర్బుద్ధి నానాకు దురితముల బాపుకొన
నింతకంటె వేరు నిరవు కనబడదురా
ఆ ఋషికి నే జేయు నపచారమున కిపుడె
తగిన శాస్తియె నాకు దయచేసె దైవంబు
అర్భకుని చేతిలో హతమగుటకంటెను
ఆత్మహత్యను నేను ఆచరించెద నిపుడు

[శైలాగ్రంనుంచీ క్రింద పడిపోతాడు. శిరస్సు భిన్నమౌతుంది. జాతశిశువు తల్లిదగ్గిరకు పోయి]

జాతశిశువు

ఏను మృతి నొందుదని ఏడ్చినట్ల కన్నీరు
కాల్వగా నిటుమారి కలసినది నదిలోన
భాగీరథీనదికి పాయగా ప్రవహించి.

[తల్లి దగ్గరకు వచ్చి]

అంతకుని గృహమునకు అంపియున్నా నతని
అమ్మ లే లేవమ్మ ఆశ్రమంబున కేగ.

పులోమ

కుక్షిచ్యుతుండవై రాక్షసుని సమయించి
వరహాలనాబిడ్డ వచ్చితివ నాతండ్రి!

[అని ఎత్తుకొని ముద్దాడి]

అభిషేచనార్థమ్ము అరిగియుండిన నాన్న
ఆశ్రమప్రాంతమున కరుగో వస్తున్నారు.

[బిడ్డ నెత్తుకొని ఆశ్రమానికి పోయింది.]

[ఆశ్రమోపాంతము — భృగుడు, పులోమ.]

భృగుడు

[కంటి కన్నీటి కాల్వను చూచి]

ఈ ప్రవాహ మ్మిచటి కెటనుండి వచ్చినది?
బాలార్కుబోని ఈ బాలు డెవడే తన్వి?

పులోమ

కాలకోవిదులు మీ కేల నే వచియింప?
దోషజ్ఞ! న న్నిపుడు త్రోసివేయకుడయ్యా.

భృగుడు

[నిమీలిత లోచనుడై సర్వం గ్రహించి, చుబుకంలోని అగ్నిని చూచి]

సర్వభక్షకుడవై జగతి చరియింపు మీక

అ గ్ని

[ప్రత్యక్షమై]

తా నెరింగినయర్థ మే నెఱగనని చెప్ప
పాపపంకమునందు పడుట నిక్కంబౌట
అసత్య దోషంబు అనుభూత మౌనంచు
వెరచి నే చెప్పితిని వెలది నీ తన్వియని.
బ్రాహ్మణుడ వీవౌట ప్రతిశాప ముడిగితిని
అమరులకు నర్పించు హవ్యకవ్యంబులున్
నాముఖంబునగదా నాకలోకము జేరు
న్యాయమా శపియింప నన్ను భట్టారకున్ ?

భృ గు డు

[పశ్చాత్తప్తుడై]

అగ్ని భట్టారకా ! ఆచరించిన కార్య
మపసవ్య మొనరింప తపము నోచగలేదు
విధికృత మ్మిదిగాన వేడెదను నే నిదే
కనికరము నామీద కలిగియుండుము దేవ !

బ్ర హ్మ

[సాక్షాత్కరించి]

విశ్వంబులో నెవరు వెనుద్రిప్పగా లేరు
ముని శాప మొంతయు నమోఘంబు గావునన్
ముల్లోకముల కిపుడు ముప్పు వాటిల్లినది.

[అగ్నితో]

శుచులలో నత్యంత శుచివి నీవై అగ్ని
సర్వభక్షుండవై చరియింపు భువనముల.

[భృగునితో - పులోమను చూపిస్తూ]

ఈ మహాదేవితో నెనయైన పతివ్రతల్
దృష్టిగోచరమైరె సృష్టిలో నెపుడైన !
కంటి కన్నీ రిట్లు కాల్వగా మారినది
నామకరణము జేతునా ? వధూసరయంచు.

భృ గు డు

[నమస్కరించి - జాత శిశువును చూపిస్తూ]

చిరుతవానికి కూడ చెప్పిపోవలె పేరు.

బ్ర హ్మ

చ్యవనుండు. నీకులము పావనంబయ్యె ఋషి !

భృ గు డు, పు లో మ

[నమస్కరిస్తారు.]

బ్ర హ్మ

[అంతర్హితు డౌతాడు.]

భృ గు డు

అగ్ని కార్యమ్మునకు ఆలస్యమైనయది
అందుకై మన మిపుడు ఆయత్తపడవలయు.

పు లో మ

సామి ! మీ యాజ్ఞానుసారముగ వర్తింతు.

[లోపలికి పోతారు.]





# సంస్మృతి

తుమ్మల సీతారామమూర్తిచౌదరి

౧

తల్లి విపత్తు గాంచి పరితాపమునం బడి రాష్ట్రబీజముల్
చల్లిన జొన్నవిత్తులకులప్రభవున్ గురునాథు నెంచఁ డీ
చల్లనివేళ; నాతని కొసంగినపిండముఁ గాకి ముట్టఁగా
నొల్లదు పేరుఁ జెందినసహోదరు లిట్టికొఱంత లుంతురే ?

౨

మన్నించెనా ? యొక్కమాతేని పానుగల్ విభుఁడు రంభ యొసంగు వీడియమ్ము
గురుఁ డెంతగా వేఁడుకొన్నను గోష్ఠికై తలనూపెనొక్కొ ? వేదముబుధుండు
విసముగాదా ? సుధారసధార మోచర్ల రామచంద్రున కాంధ్రరాష్ట్రరతికి
కారింపదా ? నందనారామ సుమబంధు వనిలంబు నెమిలి పట్టాభిరాము

గాంగవాఃకణ మంగారకణము గాఁగఁ
జీకునం బడఁడో ? నారసింహశర్మ
తల్లి సంకెలలోఁ దల్లడిల్లుచుండ
నాకమైనను నరకంబు గాకయున్నె ?

౩

ఎవ్వం డాతఁడు మింట నిల్చి మనపై నీ నందనోద్యానపుం
బువ్వుల్ చల్లెడి ? నాంధ్రరత్నము సుఁడీ ! పుణ్యాత్మ ! నీ వప్పుడే
దవ్వై పోయితివా ? త్రిలింగజననీదాస్యంబు దూలింపఁగా
నువ్విళ్లూరెడి మా కొసంగవె జయవ్యూఢంబు లాశీస్సులన్ .

("రాష్ట్రగానము" నుండి)

---



# చౌ చౌ

లేక నాలుగు గీతికలు

కవికొండల వేంకటరావు

## ౧

పూచింది మల్లియ!
కాసింది మామిడి!
వీచింది తెమ్మెర!
ఊచింది లతకూన!
ఏచాయ సుగమో యిదీ?
చూచాయగా తొంగి
చూచేనురా సఖుడ!
క్రొంగ్రొత్త యేడాది.—
కుశల మాతన్ నీకు!
కోర్కె లీడేరుతన్!

## ౨

రాయలరాజ్యం
మాయము కాగా
కుడిచెయి విరిగిన చొప్పయ్యావు.
వారంగల్ నైజామున కలవ
దాపలచెయ్యే దండగపడ్డావ్.
తంజావూరున అరవం గ్రమ్మ
నో రడిపోయి మూగై పోయావ్.
ఉరియాకు గంజామును గూర్ప
శిరమే త్రుంచుకు పోయిం దిసీ!
మొండెతుండెములలా గున్నాయి
దత్తమండలం - ఉత్తరసర్కార్!
తెనుగుతల్లి! ని న్నేమని కొలుతు?
తెనుగుతల్లి! ని న్నేమని పిలుతు?
గరుడునిలాగు అమృతం దెచ్చి
మరల నిన్ను బ్రదికించే దెవరో!

## ౩

మేఘశకలంబేని అడ్డని
లాఘవపు సూర్యాస్తమానము.
ఎఱ్ఱబింబము కఱ్ఱచీకటి
అంతె! — సాంధ్య విశీర్ణ శోభల
మధ్యవర్తిత్వంబు లేదెటు —
చల్లనగు తెమ్మెరలు గాత్రమి
యుల్లమున మేల్కొల్పె కేరడములు
దరిని గల సాంద్రపుఁ గనుపపు
లరయ, దీర్ఘ శిరోజములు, నొక
యింతి యభ్యంగనంబై, వె
న్నారబోసికొ, గోళ్ల దువ్వుచు
లీల మెడ గప్పికొని యాచెడు
అందమున గనుపట్టఁదొడగెను —
తొందఱగ మా నావ పోతూ,
డెందమున కానంద మిచ్చెను.

## ౪

ఎండినపువ్వు కొండకు విసరితె
కొండగాలి కది కుహారం జొచ్చె:
కుహారంముందు కూరుచున్నవి
పహారా గాయుచు పదివ్యాఘ్రాలు
పదారుపండ్ల పడుచుపిల్ల తా
ఎండినపువ్వే కోరుకొన్నది
కుహారంలోపల కుమిలెడు పువ్వే
పహారాకాశ నిదాన మన్నది.
వేదాంతార్థము వెసగుల కంటది
వేదాంతము తా మాటలాడదది.

# వి ప్ల వ ము

దొడ్లేటి వెంకటకృష్ణయ్య

కలకలలాడుమోము వెటకారము పాలయిపోయె దాస్యశృం
ఖల యొకటే మొగమ్మున వికారము గ్రక్కుచు నవ్వుచుండె నీ
తలపుల మాసిపోని యువతారము దాస్యముసేవ జేయుచున్
కలగి కృశింతువోయి కలకాలము స్వప్నపు స్వేచ్ఛమూర్తులన్.

కండరముల్ కిరాతవిశిఖంబుల పోటులలోన మ్రగ్గి నీ
రెండకషాయదీధితి స్ఫురించిన రక్తములోన లీనమై
భండన భీమునే లయప్రభంజనునే విలయాగ్నిరుద్ర మా
ర్తాండులనే కడంగి తలదన్నిన శౌర్యము జూపె వీరుడా !

నెత్తురు బొట్టులోపల జనించిన శౌర్యరసానుభూతి మి
న్నెత్తున పొంగిపోయి అట నిల్చినదోయి ! రణంబులోన నా
కత్తికటారులన్ దెగిన కంఠములన్ దిలకింప నీవు క
న్నెత్తుటకైన చాలవట ! ఏమి విచిత్రము పూర్వశౌర్యముల్.

కటిక దరిద్రదేవతముఖాన నదించిన కాళరాత్రి చీ
కటిరోద తాండవించెడు నొకానొక దుర్భరకాలమందు శే
షటి సడిలేక ఈ రసపిపాసువు ఇట్లై నశించిపోవు ; వి
స్ఫుటదరుణాంశురాగపరిశోభిత మంగళమున్ స్మరించుచున్

క్షీరసాగరమథనగంభీరదృశ్య
మిక ముగిసెనోయి దేవత లేగినారు
కాలగర్భగుహాంత రాగాధములను
వెళ్లగించి బయల్పడె భీకరాగ్ని
జ్వాలమాలాకులంబు విశాలజగము
గళమునందున బంధించు ఘనుడు లేడు.

లేచి రమ్ము హాలాహాలవీచి నొకటి
కంఠమున నిల్పు విశ్వరక్షణముకొరకు
నీలగళమూర్తివౌదు. ఘూర్ణికృతోగ్ర
వికటమాయాప్రపంచాంబునికరసీమ
నొదిగి నేడు జ్వలించు సుప్తోత్థితాగ్ని
నొరసికొని చిమ్ము విషము నీ వొకడవే కు
దించుకొన ఫాలలోచను డేమిలెక్క ?

# తెలుఁగునాటితల్లి



కేసరి ఆదినారాయణశర్మ

భవ్యగోదావరీ - ప్రముఖ జీవనదీ త, రంగ డోలావిహా - రముల నెసఁగి,
శ్రీమత్కుటుంబినీ - ప్రేమోల్లస ద్రాప్తి, విజయా ప్తిగేయముల్ - వినుచు నలరి
లలితధారాశుద్ధిఁ - జెలువారు కవులయా, శీస్సులందుకొనుచు - లెస్స మెఱసి,
సాంద్రాన్ధ్రపౌరుష - చాకచక్యార్జిత, కీర్త్యున్నతికి నమ - స్కృతు లొనర్చి
మంజు మంజీరశింజిత - మహితగతుల
హైందవాభ్యుదయవనీవి - హారములను
స్వేచ్ఛ తళ్కొత్తఁ బొనరించుచతుర వీవు,
నంద్యగుణవల్లి! యో తెల్గు - నాటితల్లి !!

2

ఆంధ్రమహాసభా - ధ్యక్షుని సమయోచి, తోక్తుల కెన లేని - యుబ్బుఁ గనుచు
రాయలసీమా ప - రాఙ్ముఖతకు మదిఁ, గలఁగుచు నిస్పృహా - కులిత వగుచు
అతివృష్టిపరిపీడి - తానాథజనసాధ్వ, సము నుడుపఁగఁ గార్య - సరణిఁ గనుచు
దారుణక్షామని వారణసన్నాహ, ముల విరివియొనర్చు - పొలుపుఁ గనుచుఁ
జెలిమి మంచితనమ్మును - గలిమి బలిమి
నైకమత్యమ్ము ధైర్య మ్మ-యాన్ధ్ర సూనృ
తాదరమ్మును మాతృదే - శాభిమాన
మాంధ్రహృత్సీమలను నిల్పు - మమ్మ! తల్లి !!

3

పస మించు పోరువల్ - బాగుగఁ గట్టిన, గరితలు ముడిగుడ్డఁ - గట్టినారు
లలి 'నసూర్యంపశ్య' - లెలమిని స్వాతంత్ర్య సమరభూమిని బోరు - సలిపినారు
మృదుల వీణాతంత్రి - మీట నేర్చిన పురం, ధ్రులు రాట్నములఁ ద్రిప్పఁ -కలిగినారు
సౌధాంతరముల వా - సముఁ జేయుసాధ్వులు, దేశోద్ధరణకునై - తెరలినారు
కష్టముల కోర్చి, సౌజన్య - గరిమఁ గాంచి
సహజభీరుత్వ మెడలించి - జడిమ దులిపి
దేశహితకార్యసాధన - దీక్షఁ బూని
నారు ; నీ పుత్రికలు తెల్గు - నాటితల్లి !!

౪

శ్రీవిశాఖపురిం బ్ర - సిద్ధవిద్వజ్జనా, మోఘవాక్యములకు - మోద మంది
సప్తగోదావర - స్నానమ్ముఁ బచరించి, భీమేశు నర్చలఁ - బ్రీతుఁ జేసి
కృష్ణవేణమ్మకుఁ - గరగినభక్తినిఁ, బూజానమస్సులఁ - బొసఁగ నెఱపి
'దేశభక్తు'ని యింటఁ - దృప్తిగ భుజయించి, యాంధ్రభీష్ముని సం - హేల నంది
పంటకాఁపుపడంతు లు - పాయనములు,
గానొసంగెడు ఖద్దరుల్ - గట్టి సింహ
పురిని స్వేచ్ఛగ విహరింపఁ - బొమ్ము వేగ
వంద్యగుణవల్లి! యో తెల్గు - నాటితల్లి!!

౫

తుంగభద్రా దివ్య - తోయమ్ములను దెచ్చి, పశ్చి మాంధ్రులకుఁ బి - పాస దీర్చి
విద్యానగర పూర్వ - విభవమ్ము స్మరియించి, కృష్ణరాయని కళా - తృష్ణ కెఱఁగి
గ్రామీణజీవన - ప్రాముఖ్యము నెఱింగి, సారస్వతవికాస - సరణి నెమకి
'శ్రీబాగు ప్యాక్టు' సం - చితముగ వివరించి, యాశయప్రాతికూ - ల్యముల దులిపి
తమిఁ గుటీరపరిశ్రమో - ద్ధరణమునకు
వలయునవకాశముల గూర్పఁ - దలపుమమ్మ
పారతన్త్ర్యమ్ము వోవు నిం - డారు సోకము
వంద్యగుణవల్లి! యో తెల్గు - నాటిదల్లి!!

౬

ఆంధ్రరాష్ట్రముఁ గోర - నద నిదియే యని, పలుపురు పెద్దలుఁ - బల్కినారు
ఆంధ్రాభ్యుదయమున - కడ్డంకు లెవ్వియు, నుండరా దనియెను - యువకసమితి
ఆంధ్రత్వసిద్ధి క - భ్యంతర మెందును, సహియింపమని రాంధ్ర - మహిళ లెలమి
ఆంధ్రభారతిని స - ర్వాంగీణ లావణ్యఁ, జేయుదు మనిరి, ప్ర - సిద్ధకవులు
ఉరుతరావేశకలితు లై - యొప్పినారు
తెలుఁగుమండలములవారు - కలఁత జెందఁ
బోకు మచిరమ్ముననె, నీక - పూర్వవిభవ
భవ్యరాజ్యాధిపత్య సం - ప్రాప్తి గలుగు
వంద్యగుణవల్లి! యో తెల్గు - నాటితల్లి!!

౭

అరిదుర్భేద్యము లైన దుర్గము లనం - తాహార్యపఙ్క్తు ల్మహో
త్తరనౌకాశ్రయరాజియున్, భయదస - త్త్వారణ్యవారమ్ము దు
స్తరకూలంకషలు న్మహార్ణవము, రత్నస్థానముల్ సర్వదా
పరమౌన్నత్యముఁ గూర్చు నీకు గనుమా భవ్యాంధ్రరాష్ట్రాంబికా!



# ఆవేశం

రుక్మిణీనాథశాస్త్రి

పత్తిని వొదులుకు
కత్తిని పట్టుతా!

కలం పట్టుకు
కిలం పట్టిన
పాతమాటల
కోత లన్నీ
కూల్చివేస్తాను!

కుంచెపట్టుకు మనోవీధిని
సంచరించే 'భావి-సౌఖ్యం'
పత్రపత్రంలోన ఫస్టు గ
చిత్రముల్ రాస్తాన్!

గడ్డిగం వేసేటి పెద్దల
మడ్డిమాటలు మాయపాటలు
కల్లబొల్లి, కాలవాహిని
కలిపివేస్తాను!

తెగువ తెచ్చుకు
చేగ తెచ్చుకు
తిరుగుతూ దేశాంతరమ్ములు
వ్యక్తికీ వ్యక్తికీ మధ్యా
వెలుగు నిచ్చేస్తాన్.

ఆర్తులను కాపాడతానూ
కార్తవీర్యార్జునుణ్ణౌతా
చచ్చు సిద్ధాంతములు కాల్చుకు
స్వర్గధామము కట్టుతా!





ఆంధ్ర విద్యార్థి సంఘము, కలకత్తా.



శ్రీ మండా బుచ్చిరామారావుగారు



శ్రీమతి టి. అన్నపూర్ణగారు



శ్రీమతి జి. కే. సీతాలక్ష్మిగారు

మరొక శ్రోత్రపేయమగు గానము

శ్రీమతి కె. అశ్వత్థమ్మ

నటించిన

# శాంత సక్కుబాయి

ప్రదర్శనకు సిద్ధముగ నున్నది

థియేటర్లవారికిని, వీక్షించుప్రజలకును తృప్తిని కలిగించునట్టివి

రాయల్‌టాకీస్‌వారి తమిళ చిత్రములే !!!



చింతామణి } (హిందూదేశమున దీనివలె లెక్కలేనన్ని వారములు ఒకేఊరిలో ప్రదర్శింపబడిన చిత్రము మరేదియు లేదు.)

కోవలన్

లలితాంగి

కృష్ణార్జున

భామాపరిణయము

తూక్కుతూకి—

వీనిని చూచియున్నారా ?

రాయల్‌టాకీడిస్ట్రిబ్యూటర్స్,

120 సౌతుమాశివీధి, : : మధుర,

బ్రాంచి : బాలకృష్ణ ఐన్, బెజవాడ.

# ౫౨-వ దేశీయ మహాసభ, (విష్ణుదత్తనగరము) త్రిపురి.



విష్ణుదత్తనగరము, జెండాచౌకం.



కాంగ్రెసు ప్రదర్శనము: కళామందిర ద్వారము



గుంటూరు హిందూనాటక సమాజము (ఫస్టు కంపెనీ) వారి హరిశ్చంద్రలోని ఒకదృశ్యము.

శ్రీ హరి ప్రసాదరావుగారు (హరిశ్చంద్రుడు) శ్రీ కోపల్లె హనుమంతరావుగారు (చంద్రమతి)



పై నాటకసమాజమువారి శాకుంతలములోని ఒకదృశ్యము.

శ్రీ హరి ప్రసాదరావుగారు (దుష్యంతుడు) శ్రీ కోపల్లె హనుమంతరావుగారు (శకుంతల)

# కొరవంజి



చింతా దీక్షితులు

కొరవంజి అనగా ఎరుకలసాని అని అర్థము.

కొరవంజి పదమునకు కురవంజి అనే రూపాంతరంకూడా గ్రంథములలో కనిపిస్తోంది.

ఈ ఎరుకలసాని పూర్వకాలంలో ఎక్కువ పలుకుబడి సంఘములో సంపాదించుకొంది. రాజులున్నూ రాణీలున్నూ ఆవిడకు సులభముగా దర్శనమిచ్చి ఎరుక చెప్పించుకొని ఉచితవిధంగా బహుమతు లిచ్చేవారు.

కదరీపతి వ్రాసిన శుకసప్తతిలో ఒకకొరవంజి రాజుగారి దర్శనానికి వస్తుంది. ఆవిడను కవి యీవిధంగా వర్ణించాడు :

"ఇఱుకువలిసుబ్బచన్నుల
యెఱుకుంజవరా లొకర్తె యెఱుకో యవ్వా
యెఱుకో యని తనచందం
బెఱుకపడంగా హజార మెలమిం గదిసెన్.

అప్పు డప్పడంతుక తెఱం గమ్మహీం ద్రుండు పరిచారికాజనంబులవలన విని నవధరించి సమ్ముఖమ్మునకు రావించిన —

సవరనిపనివన్నె అవిక పిక్కటిలంగఁ
గలుకుపాలుబ్బుగుబ్బలు చెలంగ
ముంజేతులను ముఖాంబుజమున నొకవింత
పొలుపు దెల్పెడు పచ్చబొట్టు లెసఁగఁ
గుఱుమాపుపయ్యెంట చెఱఁగులో నిడుకొన్న
ముద్దుఁబల్కుల చిన్ని బుడుతఁ డమరఁ
దరతరంబులనుండి తనయింట వెలయు పు
త్తడిపైఁడిబుట్ట మస్తమున వెలుఁగ
బొనులసందున నామంబు, భూతిపూఁత
నెన్నొసటఁ, బుక్కిటవిడెంబు, కన్నుఁగొనలఁ
గాటుక, రహింప వచ్చి యాక్ష్మాతలేంద్రు
చరణముల కోరగా మ్రొక్కి చక్క నిల్చి;

ఇది దారికట్టు, మొనక
ట్టిది, కాంతావశ్యకరణ మిది నీమది కిం
పొదవించు నోనరేశ్వర!
పదిలంబని తెల్పి కొన్ని బదనిక లొసఁగెన్.

తలఁపున నిది గారడ మని
తలఁపకుమా, సింగఁ డల్ల తటిగొండదరిన్
దల మోచి తెచ్చినవి యివి
తల నుంచుము పసిఁడితొయెతలనుంచి నృపా!

అని విన్నవించిన యమ్మత్తకాశినీకరాంబురుహదత్తం బగు నయ్యుత్తమదివ్యౌషధత్రయంబు రయంబునన్ గ్రహించి కరుణావలోకనపరుండై ప్రియ వినయ గంభీరభాషణంబుల నిట్టు లనియె—

ఏయేభూములఁ జూచినావె కొరవం
జీ! రూపలావణ్యరే
ఖాయుక్తిందగు కొమ్మ లెందుఁ గల రీ
క్ష్మామండలిన్ హాసభా
వాయత్తైకవిలాసనై ఖరుల మే
లం దెవ్వరిం జెందు న
య్యాయావార్తలు తెల్పవే మది కమం
దానందముం జెందఁగన్."

ఉత్తమదివ్యౌషధాలు అమ్మడమే కాకుండా కొరవంజి చేతులు చూచి భవిష్యత్తుకూడా చెప్పుతుంది. తన వేషమహిమవల్ల నైతేనేమి, తన మాటల చమత్కారమువల్ల నైతే నేమి, వర్తమాన భూత భవిష్యత్తులు కరతలామలకం చేసుకొన్న తన ప్రజ్ఞవల్లనైతేనేమి — ఈకొరవంజి తెలుగువాఙ్మయంలోనే కాకుండా కన్నడ ద్రావిడ వాఙ్మయాలలో కూడా శాశ్వతస్థానం సంపాదించుకొంది.

తెలుగు ప్రబంధాలలో అక్కడక్కడ కొరవంజివర్ణనలు కనిపించినా అవి అంత చెప్పుకోదగ్గవి కావు. కాని పాత తెలుగు నాటకాల్లో సాధారణంగా ఈ కొరవంజి ప్రధానస్థానం ఆక్రమించుకొన్నది.

ఈపాత తెలుగు నాటకాలకి యక్షగానా లని పేరు.

తెలుగు ప్రజాసారస్వతములో బాలవాఙ్మయం, స్త్రీల సారస్వతం యక్షగానాలూ దివ్యమైన శాఖలని యిదివరలో నిరూపించాను. యక్షగానాలు పండితులూ పండితకవులూ వ్రాశా రనిన్నీ, మహారాజులూ, దేవుళ్లూ వాటిని ఆదరించా రనిన్నీ

అవి రసవత్ప్రబంధము లనిన్నీ యిది వరలో మనవి చేసికొన్నాను.

కొన్ని యక్షగానాలలో — మరీ ప్రాచీనమైనవాటిలో — కొరవంజి పాత్ర లేదు. రుద్రయ్య సుగ్రీవవిజయములో కొరవంజి రాదు.

కొన్ని యక్షగానాలలో కొరవంజి పాత్ర ఉంటుంది. అట్టి యక్షగానాలకు కొరవంజులని పేరు.

"కొరవంజి పాత్రప్రవేశముగల యక్షగాన రచనమునకు కొరవంజియని పేరు"- ఆంధ్ర వాఙ్మయ సూచిక.)

వట్టివినోదం కల్పించడానికి మాత్రమే కాకుండా ఈ కొరవంజి కథానిర్వహణానికికూడా ఎంతో తోడ్పడుతుంది. సంస్కృత నాటకాల్లో విదూషకుడివంటిదే తెలుగు యక్షగానాల్లో కొరవంజి. తెలుగు కృష్ణలీలలనే నాటకాల్లో (యక్షగానాల్లో—) చల్లమ్మిామ్మ గొల్లది ఈకొరవంజివంటిదే. వినోదంతో జోడించి కథానిర్వహణం జరగాలంటే ఈకొరవంజి ఉండితీరాలి — ప్రతాపరుద్రీయంలో పేరిగాడులాగ.

వినోదమూ, కథానిర్వహణానికి సహాయమూ కాకుండా ప్రేక్షకులలో విజ్ఞానబీజాలు చల్లుతుంది ఈ కొరవంజి.

"భామకలాపం"లో ఏవిధంగా గొల్లది వేదాంతోపన్యాసం చేసి ప్రేక్షకులకు విజ్ఞాన మందిస్తుందో ఆవిధంగానే కొన్ని యక్షగానాల్లో కొరవంజి పూర్తిగా వేదాంతబోధే చేస్తుంది.

ఇంతకీ యక్షగానాల్లో వేషం వేసుకువచ్చే కొరవంజి మామూలు ఎఱుకలసాని కాదు.

పార్వతీ పరమేశ్వరులు విలాసార్థము కిరాతవేషం ధరించిన విధంగా, భారతీదేవో, పార్వతీదేవో కొరవంజివేషం ధరించి యక్షగానాల్లో వినోదం కల్పిస్తున్నది, విజ్ఞానం వెదచల్లుతున్నది, కథను నిర్వహిస్తున్నది.

మన తెలుగులో ఉన్న కొన్ని కొరవంజి నాటకాలు :— జ్ఞానకొరవంజి, జీవకొరవంజి, భిన్నకవులు వ్రాసిన ఎఱుకల కొరవంజులు, రాజమోహన కొరవంజి, సత్యభామ కొరవంజి, జానకీసుఖోల్లాసకొరవంజి, వగైరా.

కన్నడంలోకూడా ఇట్టి యక్షగానా లున్నవి. "కన్నడసంస్కృతి" అనేగ్రంథంలో ఉదాహరించబడ్డ కొన్ని యక్షగానాలు : — పార్వతీ కొరవంజి, అర్జున కొరవంజి, కృష్ణ కొరవంజి, రామాయణ భారత భాగవతములు. — ఇంతే కాకుండా మైసూరు ఓరియంటల్ లైబ్రరీలో అముద్రిత పుస్తకములపట్టి చూస్తే యీయక్షగాన సాహిత్య మెటువంటిదో తెలుస్తుందంటున్నాడు గ్రంథకర్త నరసింహశాస్త్రి దేవుడు యం. యే.

మన తెలుగుకొరవంజి నాటకాల్లో వర్ణించబడ్డ యెరుకసాని ఎట్టిదో, దాని చాకచక్య మెట్టిదో, దానిమాటలనేర్పు ఎట్టిదో యీాక్రింది ఉదాహరణములవల్ల గ్రహించవచ్చు.

(౧) గోకులపాటి కూర్మనాథకవి వ్రాసిన మృత్యుంజయ విలాసము—

పార్వతి శివునిగూర్చి తపస్సు చేస్తుంది. శివుడు సమాధిలో ఉంటాడు. మన్మథుడు తపోభంగంచేసి దగ్ధమైపోతాడు. పార్వతిని హిమవంతుడు తీసుకుపోతాడు. అప్పుడు శివుడు విరహవేదన పాలై పార్వతిని చూడవలె నని తహతహ లాడతాడు. తాను కొరవంజివేషం వేసుకొంటాడు. పార్వతిదగ్గిరికి వెళ్లి ఎరుక చెప్పతాడు. ఎట్లంటే —

"శివుఁడప్పు డాత్మీయ విహ్నాసులో మాని
నవతనూధవళిమ నగవుఁ బూని
కరవరంగాకృతి కడగంట నిలిపి
తరుణేందుకళ ఫాలతటిఁ గీలుకొలిపి

* * *

పృథివిమహత్త్వంబు పిఱుఁదులయందు
పృథుతరసరసత హృదయంబునందు
బంధుర తేజంబు వాతెరయందు
గంధవహత్వంబు కాయంబునందు

* * *

కలికిబంగరుపూల గాజులు దొడిగి

* * *

ముక్కునఁ బలుకెంపు ముక్కర చెలఁగ
పెక్కు రత్నముపూసపేర్లు చెన్నొంద
శిరమున రత్నభాసితపాత్రఁ బూని
యెరుకతయై వచ్చె హిమశైలమునకు."

* * *

ఆటతాళము

"ఎరుకసాని వచ్చె ఎరు కనుచు ॥అను॥ ఎరుకలసాని వచ్చె నెరుకో యెరుకో యెరుకో యనుచు ॥ఎరు॥

మరి పెంపునడలతోడ ముంగురు లల్లాడ — సరసంపుమాటల — చతురతతో .— శిరమున నవరత్నఖచితమైన బుట్ట పెట్టి — మెఱుపువలెను మేను మెఱయఁగను."

* * *

వచ్చి ఈవిధంగా తనగొప్ప చెప్పుకొంటోంది. —

ఆటతాళము.

* * *

సరసిజభవురాణి పరిణయమాట మా — యెరుకను కాదటవె — సురపతి పౌలోమి శోభనకృతి మా — యెరుకను కాదటవె యోదేవి — తరుణిమదికి నేఁ దార్కాణగాఁ జెప్పి — తనుకోర్కె లందెదనె — యో దేవి॥ యెరుకగలవారు గల రెందరైన మా— పరివత్తురె రమణి॥

ద్విపద

అంగన యామాట లాలించి వేడ్క
బంగారుచేటలోపలి ముత్తియములు
ముమ్మాఱు తన కరాంబుజమునఁ బట్టి
సమ్మతి ఫాలదేశంబున నిలిపి
మ్రొక్కియిట్లనె జిత్తమునఁ దలపోసి
మిక్కిలికంటిసామికిని నామీఁద
నెన్నఁడు దయవచ్చు నెపుడు పెండ్లాడు
నెన్నఁడు నాకోర్కె లీడేరు ననుచు
చేతముత్తియములు చేటలోఁ బోసి
నాతి యందిచ్చెను ననుమోసుతోడ
నాయెరుకలసాని యాత్మదైవముల
బాయని భక్తితో ప్రస్తుతిచేసె॥

ద్విపద

* * *

ఓభారతిదేవి యోపలుకుమాత
పరఁగంగ నాజిమ్మఁ బాయకయుండి
ఘనగొందకుండఁగ వృత్తముల్ నుడువు
ఇగనాలు తొలఁగించె డిగినేశపరుడ
సగినాలు లెస్సగ సాగంగజేయ
నల్లంబులో నిల్వఁ డోజేజేలార!
కొల్లాపురీదేవి! గోరెద నిన్ను

* * *

యీకాంతమనసు నాయెడ వచ్చునట్లు
వాకీయరే నాదు వాక్కున నిలిచి.

అని యిప్పుడు యొంటి వాల్గంటి నంటితి నని కేలు గీలించి యేమని యెరుక చెప్పు చున్నది—

అవోదేవి భాగ్యంగల చెయ్యి, పతివ్రతగల చెయ్యి, సంతానముగల చెయ్యి, చల్లని చెయ్యి,

అవోదేవి యొక్కతలంపు జేసినావు, యొక్కకోరిక కోరినావు, యొకదొడ్డమే లడిగినావు,

అది కాయో పండో, కల్లో నిజమో, అవునో కాదో, చేకూడునో చేకూడదో యని వెనకముందు తొక్కులాడుతున్నావు,

అది కాయ కాదు పండు, కల్లగాదు నిజము, శీఘ్రంబే యింతలోనె చేకూడు తున్నది.

అది యేకోపుకార్యమంటె యిదుగో యీ కోపు, ఆడవారివంక తలంపా మొగవారివంక తలంపా అంటే యిదుగో మొగవారంటే గడ్డంబు ఆడవారంటే లక్కాకు —

యిదుగో నీయెదలో తలంపు యెన్నాళ్లకంటె వకటే రెండే మూఁడే వకటంటే వక యేఁడు గాదు, రెండంటే రెండేండ్లు కావు, మూఁడంటే మూఁడేండ్లు కావు, శీఘ్రంబే, యింతలోనె చేకూడుతున్నది, యింక దాపేల, కోడెగాడితో తక్కరబిక్కరలాడుకుంటూ కులకనున్నావె, అప్పుడు నన్ను మెచ్చేవే, కోర్కె లిచ్చేవే,

* * *

నీకు నాథుండ నర్యోద నని యిప్పుడిచ్చటనే యున్నాడు, నీపై చాలా దయ వచ్చింది, శీఘ్రంబే పెండ్లియాడు, నీకోర్కె చేకూరు, నమ్మి నాబుట్టతోడని నమ్మించి చెప్పిన —

* * *

ద్విపద

అంత నయ్యింతి యింతం తనరాని
సంతోష మంది యాశ్చర్యంబు నొంది

* * *

యెరుకలసానిగా దెన్న నాపాలి
హరకృపమూర్తియై యవతరించినది
ఇచ్చెలి మెచ్చి నే నే మిచ్చుదాన
నిచ్చెదను జగంబు లిచ్చినఁ జాల
వన తనమూర్తికహారంబు కంఠ
మున నైపె మల్లెపూమొగ్గలదండ
వరునిపై వరియించి నైచెనో యనఁగ

* * *

వినయవాక్యములచే వీడ్కొల్పె నంత.

కథానిర్వహణానికిన్నీ, వినోదము చేకూర్చడానికిన్నీ యీకొరవంజి ఏ విధంగా తోడ్పడిందో గమనించదగ్గ విషయం.

(౨) రంగాజమ్మవ్రాసిన మన్నారుదాసవిలాసనాటకం —

దరువు

"చెలువ మన్నారుదాసుపై వలపు నిలుప లేక, కలవరింపుచునున్న కాంతిమతికి దలఁచిన తలఁపెల్లఁ దార్కాణగాఁ జెల్ప, నల చెంగమ్మ యెరుకచెలువయై వచ్చె"

చెలికత్తె ఎరుకసానిసంగతి కాంతిమతికి చెప్తోంది —

"విను కాంతిమతి! యొకవింత యీవేళ
మినుకుబంగరుఛాయ మెఱయు నెమ్మేను
సుప్పాణిముత్యాల సొబగుకమ్మలును
గప్పురాజిగిమించు కస్తురిబొట్టుఁ
బలుచని చెక్కులు బటువుపాలిండ్లుఁ
జెలునైనకెంగేలఁ జెలఁగుబెత్తంబు

* * *

విరులచెండును నెమ్మిపింఛంబు మెఱయ
నురమున బురుకని హాయలుగాఁ బూని

* * *

ఎఱుకత యొక్కతె యిదె రాజవీథి
నొఅపుగా వచ్చుచునున్న దోయమ్మ.

కాంతిమతి కొరవంజిని పిలిపించింది. ఎరుకసాని వచ్చి తనయిష్ట దేవతలను కొనియాడిందీవిధముగా.

శ్రీరాజగోపాల, ద్వారకానాథ,
బంగారుమన్న, శంగమరేండా,

* * *

నల్లనిదేవర గొల్లలసామి

* * *

యాకలికి తలంచిన తలంపు నిజముగా బలుకవయ్యా, నిక్కముగా బలుకవయ్యా, తార్కాణగా బలుకవయ్యా —

అమ్మాయమ్మ, అమ్మాయమ్మ, శెయి సూపు, శెయి సూపు, శెయి సూపవే దుండి, దనముగల శెయ్యే, దాన్యము గల శెయ్యే, బంగారు శెయ్యే, బాగ్గెముల శెయ్యే దుండి, అటునిటు సూడక నే శెప్పేగురి ఊంకొని వినవే దుండి, కండ్లంటే తోడు, కడుపంటే కొడుకు, కంటెంటే మగండు వొండే రెండే వొండు ............ ఆతం డేనితమువా డంటా అడిగేవే ...... అయితే తెలిపేను వినవే దుండీ—
"వేయారుపెలదుల పెలయుచు దక్షిణ నాయకుండని మించి నలువొందువాడు అతడె నీపతి యని నందుకు దార్కాణ యిశ్రైన సెప్పెలి యిదిగొ వచ్చినే

అని పలికి యాకలికి చిలుకలకొలికిచేత సకల బహుమతులు జెంది నిజమందిరంబు నేరె.

* * *

### (3) తులాభారం అనే యక్షగానం (కవిపేరు తెలియదు.)

"బ్రహ్మసమ్మతిని యాభారతీదేవి
యెరుకలవేషంబు (యింపుగా) దాల్చి
భామను చూడంగ భామిని వచ్చె.

కురజంపె

జిలుగుబంగరుచీర తెల్లనిజారుపచ్చాలు
మెరయగా! గరిమతో గుత్తంపు చం
దురుకావి రవికయు దొడగుమా!
వచ్చె నెరుకత అహహా॥
చొక్కమగు రత్నములు జెక్కిన
బుట్ట శిరసున బెట్టుకొని!
కుందనపుకట్లమరవేసిన
కురుచబెత్తము చేతబట్టుకు ॥వచ్చె॥

ఫాలమున నసియాడు అల నెలవంక
పాపిటబొట్టుతో! సోగకన్నులు వాలు
చూపులు సైగసూర్యపచ్చాబొట్టుతో॥
వచ్చె॥

అంద మలరగ యెడమమూపున ఆపశిశువును గట్టుకు! మందయానలతోటి కీథులు మళ్లీ మళ్లీ తిరుగుచూ॥ వచ్చె॥

చిలుకతాళియు కంకణమ్ములు
తెలుసు దంతపు కమ్మలున్!
పెలయు ముత్యపు సరులు గవ్వల
పేరు లల్లలనాడగా.

* * *

కురజంపె

యెరుకోయమ్మ యెరుక! వచ్చేది పోయ్యేది యెరుకా! కాగల దయ్యేది యెరుక దానంబు జేసినా దెరుకా!

* * *

వారణాశికి బోతి నవ్వా! అన్నపూర్ణ కెరుక జెప్పితి నవ్వా! వరహాలపేరి స్తే నవ్వా...

అప్పుడు సత్యభామ అడుగుతోంది.

దరువు

"యేసీమదానావె యెరుకతా! నీ
కెందారు సవతులే యెరుకతా!

* * *

మగడు నీపై నెపుడు యెరుకతా!
మక్కువతో నుండునా యెరుకతా.

* * *

బుట్టముందర ముమ్మారు పూజ జేసి
భాగ్యవతియైన శ్రీసత్యభామ నపుడు
భమిడిబెత్తంబు తనవ్రేళ్ల బట్టమనియు
యెరుక జెప్పంగదొడగె నామముగనిబొమ్మ.

* * *

శ్రీవెంకటేశ్వరా శ్రితపారిజాత
మంగళాద్రి నృసింహ మదనగోపాల
బెజవాడ మల్లయ్య బేరికోటయ్య
జిల్లెళ్ల కనకయ్య శ్రీసుబ్బరాయ
కోరిక లిచ్చేటి కొల్లాపురమ్మ
గుంటూరు సర్వేశ గవ్వలచెన్న
ఓరుగంటిపురమ్మ ఓకూనలమ్మ.

* * *

దుండి, వకమేలు కని యడిగినావే, యవ్వో యవ్వా, సతులకు సాధ్య మగుచోట నందువే యవ్వ— నారదముని వచ్చేనే యవ్వా, వ్రత మడిగితివే యవ్వ, మగని దాన మిమ్మనెనే యవ్వ, వద్దనకపోతివే యవ్వా, బిరునవ్వు నవ్వకే యవ్వా—

* * *

ఎరుకసాని తనగొప్పతనం చెప్పుకొని చివరకు చెప్పిన మాటలు—

* * *

"అవ్వా అవ్వా వకటే, రెండే, మూడే, నాలుగే, నాల్గంటే నాలుగుసంవత్సరాలు గావు ..... ......నాలుగుదినంబులలోనే నీ వొకగొప్పనోము నోచేవే యవ్వా, నీవు పెనిమిటిని పారుజాతపుష్పమునకు గట్టి దాన మిచ్చేవే యవ్వా, నీసవతు లందరు నీమీదకు కయ్యానికి వత్తురే యవ్వా, సవతులలో నీవు చాలా కించనొందుదువే యవ్వా...

* * *

### (4) ఏనుగలూరి పాపరాజు వ్రాసిన రుక్మాంగదచరిత్ర అనేయక్షగానం —

మోహిని విరహబాధపడుతుంటే "సిరజగర్భునిపంపున గారవమున యోగమాయ" యెరుకతవేషముతో వచ్చింది.

"అంగన! నాదుపేరు కోర
వంజి యటందురు; నాదుసామియున్
జంగడు; తావు ద్రోణగిరి
సీమ, జను లొక్కనియాడ నెప్పుడున్

పొంగుచు సోదె చెప్పి వర
భూషణముల్ కొని వార్త కెక్క మా
బంగరుపల్లెవాని మదిఁ
బాయక నమ్మినవార మెయ్యెడన్."

*　　*　　*

అని యీవిధంగా ఎరుక చెప్తుంది.

"సూర్యవంశకులోద్భవుండైన రుక్మాంగద రాజేంద్రుండు నిన్న విడనాడి అన్యకాంతల గూడినాడని నీమనస్సున నెంచినావే వెర్రి తల్లీ, ఆయన నీయందు మోహితుడైనాడు, అన్యకాంతల గూడనివాడు వినవోయమ్మ.

అంతేకాకుండా స్త్రీ సాముద్రికం కూడా చెపుతుంది యీ కొరవంజి.

"శుక్లపక్షంబు పంచమి శుక్రవార
మంచితంబుగ సతివల కగును మేలు.

" తరుణికి దాపలికుచమున
స్థిరముగ కెంపలరుమచ్చ దీకొనియున్నన్
వరసుతుఁడు పుట్టు ................"

*　　*　　*

"పొలఁతికి దాపలిపక్కను
తిలకమువలె మచ్చ గలిగి స్థిరమైయున్నన్
తొలిచూలు కొడుకు గలుఁగును."

*　　*　　*

"మందూకోదరగతి భూ
మండలమున తరుణికుక్షి మానితమైనన్
మెండుగ లాభము భాగ్యము
పండితులగుసుతులఁ గాంచుఁబరమప్రీతిన్."

(౫) వెంకటరాయకవి వ్రాసిన లేపాక్షి జలక్రీడలనే నాటకంలో ఎరుకలవారి పుట్టుపూర్వోత్తరాలు వర్ణించబడ్డవి.

"......అఖిలభూతముల
తెర గెల్లభంగులు తెల్లంబుగాను
ఎరుకగల్గినవార మాటకు మమ్మ
యెరుకలవారని యందురే చెలియ."

అంతేకాకుండా ఈక్రింది విద్యలు కూడా తనకు వచ్చునని కొరవంజి చెపుతుంది.

"స్తంభన, వశీకరణ, ఆకర్షణ, ఉచ్చాటన, విద్వేషణ, వ్యోమగమన, పరకాయ ప్రవేశాది విద్య లెరుంగుదునే యవ్వా; పర మంత్ర, పరతంత్ర, పరయంత్ర భేదంబు లెరుంగుదునే యవ్వా; అశ్వలక్షణ, గజ లక్షణ, రత్నలక్షణ, స్త్రీలక్షణ, పురుష లక్షణ సాముద్రికలక్షణంబు లెరుంగుదునే యవ్వా."

*　　*　　*

ఈమె శ్రీకృష్ణబాలునికి చెయ్యి చూచి సాముద్రికంకూడా . చెపుతుంది.

(౬) పార్వతికొరవంజి అనే కన్నడ గ్రంథంలోకూడా కొంచెం హెచ్చు తగ్గుగా ఎరుకలసాని తెలుగునాటకాలలోవలెనే ప్రవర్తిస్తుంది —

దశరథుడు పుత్రకామేష్టి ఆచరించిన తరువాత కౌసల్య గర్భవతి అయింది. అప్పుడు

"పరమేశ్వరను పార్వతియన్ను కరెదు
ఏకతాళ

కొరవంజివేషదలి ధరగె పోగువుదు
అరసి కౌసలెగె నీకణియ హేళివుదు.

(పరమేశ్వరుడు పార్వతిని పిలిచి కొరవంజివేషం వేసుకొని కౌసల్యాదేవికి ఎరుక చెప్పమంటాడు)

కొరవంజివేషం యిట్లా ఉన్నది:

"హిడిదళె యొళు హొన్న బెత్తకడు చెల్వ శిశువు బెన్నినొళిరె కొరవంజి (చేత బంగారు బెత్తము, మూపున చిన్నశిశువును కట్టుకొంది.)

"తరుణి యెన్న మాతుత లెయమృతవాక్కు
కరెయుకొళెసదు కొల్లాపురదమ్మనాణె."

(కొల్లాపురమ్మ ఆనసుమా, ఎరుక చెప్పతా, నామాట అమృతవాక్కు.)

ఈమె తనదేవతలను పేర్కొంటోంది.

"హో కొల్లాపురదమ్మ గోవిందరాజ సోభానదైయ్యాన సోమేశలింగ కొండలగిరితిమ్మ కోనేటిరాయ చెలువ అహోబలరాయ జానకీరమణ కంబదరాయనికకుద్గిరీశ, కల్యాణ బసవణ్ణ కరుణదడింగా..."

*　　*　　*

ఇంతలో

"సింగాసానియ సరసుత్త యరుకలసింగను బందన దెంతెనె."

పైపదములు తెలుగుకూ కన్నడముకూ సమానముగా ఉన్నవి.

కొరవంజి కౌసల్యాదేవికి పుత్రోత్సవవార్త చెప్పి సెలవుతీసుకొంటుంది.

కౌసల్యాదేవి కొరవంజికి

"ముత్తురత్నంగళం, బుట్టియొత్తుంబి బురుకనిగె హోలు తుప్పవనెరెదు అనేకవస్త్రాభరణ గళింద అలంకరిసి కళుహిదళు."

*　　*　　*

పై విషయములనుబట్టి చూచిన తెలుగు యక్షగానములు ప్రశస్తమైన వాఙ్మయశాఖ అనిన్ని, ద్రావిడ వాఙ్మయంతో సంబంధంకలవి అనిన్ని వెల్లడి అవుతోంది.

# ప్రేమరాజ్యము

ఉన్నవ లక్ష్మీనారాయణ

"ఏకమేవాద్వితీయం బ్రహ్మ". ఇది "బహుస్యాం ప్రజాయేతి" అను సంకల్పము జనించుటకు పూర్వపు భూమిక. అది సత్. అది కేవలము సత్-మాత్రమే యైనచో సంకల్పము గలుగదు. అది శుద్ధ ప్రేమస్వరూపము గూడాను. అందువల్లనే సృష్టికార్యమునకు సంకల్పించినది. సంకల్పింపగనే ఒకటి రెండయినది. ద్వైతము సిద్ధించినది. కాని లింగభేదము కలుగలేదు. లింగభేదము కలిగినది మూడవభూమిక. ఇదియే త్రిమూర్తిఘట్టము. ఇప్పటికిస్థితి కంతకును శక్త - శక్తి స్వరూపము సిద్ధించినది. పృథక్ భావ మేర్పడినది. ఏకత్వమునకు బహుత్వము రా మొదలిడినది. ఈస్థితియందే మహామైథున కార్యమునందు తిక్కన "శుక్ర మగ్రభాసితమగు" నని శాంతిపర్వమున జెప్పినాడు. పిపీలికాది బ్రహ్మపర్యంతమును - ఇంతియే కాదు - స్తంబబ్రహ్మపర్యంతమును - ఇంతియే కాదు- తత్ప్రాగ్వమున సహితమును స్త్రీపురుషతత్వముల పరస్పర మేళనముచేతనే సృష్టి వికాసము జెందుచున్నది.

పరబ్రహ్మము వరుసగ మహాపరనిర్వాణ, పరనిర్వాణ, నిర్వాణభూమికలనుండి దిగి విజ్ఞానమయ, మనోమయ, కామమయ భౌతిక భూమికలయందు సహితము అవతరించి అనుభవించుచున్నాడు. భూమికలలో ఒకకోశమునుండి మఱియొకకోశమునకు సంకోచవికాసములు స్వవశమున గలుగవచ్చునుగాని భౌతిక భూమికయందు స్థిరత్వ మేర్పడకుండుటచే ఈభూమికయందు అమృతత్వము ఇంకను సిద్ధింపలేదు. అందఱు మతకర్తలును సృష్టియొక్క గమ్యస్థానము "అమృతత్వ మానశుః" అని అమృతత్వమును స్వభుక్తములోనికి తెచ్చుకొనుటయే యని చెప్పచున్నను, గమ్యస్థానమును చేరుటకు దారిలో నున్నామని తెలియక ప్రస్తుతస్థితియే యథార్థ మని గ్రహించి జననమరణములనుండి విముక్తి నొందుటయే పరమార్థ మనియు - సృష్టి అనిమిత్త మనియు తలంచుచున్నారు.

భగవానుడు నామరూపరహితమయినస్థితినుండి సృష్టిని నామరూపసహితస్థితికి దెచ్చి ధాతువృక్షజంతువర్గముల దాటించి మానవుడను నొక మహత్తరవస్తువును ఫలింపజేసినాడు. కాని యితని కింకను సంపూర్ణానుభవము గలుగలేదు. సర్వతోముఖజ్ఞానము సిద్ధించలేదు. నిర్మలానందము లభించలేదు. ఈస్థితి సప్తభూమికలయందును అమృతత్వము గలిగినగాని సమకూరదు. ముక్తియనగా బహుకాలవికాసమువలన భగవంతుడు లభింపజేసిన సప్తభూమికల బ్రద్దలుగొట్టుట గాదు అనగా; ఉపాధుల నశింపజేయుట గాదు; ఇది వెనుకకుబోవుట. సప్తభూమికలయందును అమృతత్వమును సిద్ధింపజేసికొనుటయే పరమగమ్యము.

సృష్టియంతటను పరివ్యక్త మౌతున్న స్త్రీపురుష సంబంధమే అన్నిటికిని మూలము. శక్తి-శక్త రూపమున నున్న యీ పురాణ దంపతుల సాంగత్యమే • అన్ని సంబంధములకును ఆధారము. సృష్టి యంతటను నిరంతరము నీ మహామైథునమే సాగి ఉత్పత్తికి కారణ మగుచున్నది. ఈ స్త్రీపురుష సంబంధమే నాయకీనాయక పితా మాతా పుత్ర ప్రభు భృత్యాది సంబంధముల కన్నిటికిని కారణమయినది. స్వదార పుత్రాదిక పరిపోషణమునకు ధన మవసరమయినది. గృహధర్మములు సంఘధర్మములు, రాజధర్మములు ఈ సంబంధముల పరివర్తనమున కేర్పడినవే. వర్ణాశ్రమధర్మము లీధర్మముల నిర్వహించుట కేర్పడినవి. సృష్టి కార్య నిర్వహణమున కంతకును పరమ గమ్యస్థానమును పొందుటకు అవసరమయిన ధన దారపుత్రేచ్ఛలు ఈషణము లని త్యాజ్యము లని ఎందు కన్నారో తెలియదు. "అతి

సర్వత్ర వర్జయేత్" అనునది సత్యము కావచ్చును. అంతకుదప్ప ఈ యీషణసిద్ధాంతమునకు తావు లేదు.

సృష్టి ప్రవర్తకుల విషయమును వదలి స్త్రీపురుషరూపియగు కుండలి రూపమున శక్త - శక్తులు అవతరించి సమష్టిరూపమునను వ్యష్టిరూపమునను సృష్టికార్యమును నిర్వహించు కార్యమును కొంత విమర్శింతము. జలసృష్టి రాకపూర్వము సప్తమ భూమికయందు జరిగిన వికాసవర్ణనము మనకు సమగ్రముగ చిక్కదు. మహత్ తత్త్వము, అహంకారము జనించి 'ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యాం ఓషధయః' అని అస్థూల వర్ణనముమాత్రము మన కున్నది. అవతారములలో మొదటిదయిన మత్స్యావతారము జలసృష్టిలోనిది. వాస్తుశాస్త్రమున రాళ్లకుకూడ లింగభేద మంకురించినట్లు కన్పట్టుచున్నది గాని, వ్యక్తి కుండలి ధాతువర్గమున అనుభవమును సేకరించుకొని వృక్షవర్గమున ప్రవేశించినప్పటినుండియే దాంపత్యభేదము పరివ్యక్త మగుచున్నది. జీవకణము మొట్టమొదట సముద్రతీరపు నీటిపై తేలియాడ ప్రారంభించినది. అది విరివిగ విస్తరించి ధాతువర్గముగ మారినవి. ఇచ్చట స్త్రీపురుష భేదము స్పష్టముగ గన్పట్టుచున్నది. పృథక్భావమును పొందని మొదటి శక్తి-శక్త స్వరూపము (పార్వతీ పరమేశ్వరులు)వలెనే వృక్షసృష్టిలో స్త్రీ-పురుష తత్త్వములు రెండును ఒక వ్యక్తియందే ఉండి స్త్రీపురుష చిహ్నములు రెండును ఒక వ్యక్తియందే కన్పట్టును. బెండ, చిక్కుడు మొదలయినవానిలో స్త్రీపురుషతత్త్వములు ఒక చెట్టునందే ఉండి స్త్రీపురుషావయవములు రెండును ఒకపుష్పమందే కన్పడి అన్యోన్యసంయోగము గలుగును. తరుగుల్మలతాదులలో బహుభాగ మీ జాతికే చెందియున్నవి. కాకర పొట్ల బీర మొదలగువానిలో పిందె పూవులు వేరుగా నుండును. ఇవి స్త్రీలు, వట్టిపూవులు పురుషులు. దీనియందలి పుప్పొడి రేతస్సు. కాని యీ రెండు పూవులును ఒకచెట్టుననే ఉత్పత్తి యగును. ఆడ మగ చెట్లభేదము వృక్షవర్గములో బహుతక్కువ. తాళ్లలో పోతుతాడి పెంటితాడి అని వేరుగా నుండును. బొప్పాయి మున్నగునవి ఈవర్గములోనివి. మొత్తముమీద స్త్రీలు పురుషులు అని వేరుగా నుండుట చెట్లలో బహు తక్కువ. ఒకటిగా నున్నను విడిగా నున్నను సాయంకాల మగునప్పటికి చల్లగాలి వీచుటకు మొదలిడుతోడనే చెట్లు పులకరించి ఒడలు పొంగి పుష్పవతు లగును. కింజల్కముల నుండి పుప్పొడులు జారి వానియందలి కోట్లాది జీవకణములు విచ్చలవిడిగ విహరించుచు పుష్పాండములకై అన్వేషించుచు ఒక్కొక అండము దొరకినప్పుడు దానిలో ప్రవేశించుటకు చోటు దొరకక బహు అండములు పోరి బలముగలవి అండములో జొరబడును. ఈ పోరాటము జంతు మానవవర్గములలో కంటె వృక్షవర్గములో తక్కువనుటకు వీలులేదు. చెట్లపడుచులలో సహితము నీసంగమకాంక్షను బెట్టి పురికొల్పి పోటీలు పెట్టి సృష్టికార్యమును చిత్రమును చిత్రముగ నిర్వహించుకొనుట వేడుకచేత గాబోలు. ఈ తార్పుడు తనము భగవానున కెబ్బెటికముగా దోచదు గాబోలు. పెద్దవాండ్లను మన మేమనగలము? గొప్పవాండ్లు రంకు పోతే అది నోమో వ్రతమో అంటారు. చిన్నవాండ్లు వ్రతము చేస్తే ఏ రంకుతనమునకో అంటారు. ఇది లోకమర్యాద.

ఈ దారేషణముతోపాటు చెట్లలో పిందెలను, కాయలను, విత్తనములను రక్షించి పెంపుచేయుటకును, తమకును, తమసంతానమునకును ఆహారము సేకరించుటకును చేయు ప్రయత్నములును కాంక్షయును జంతు మనుష్య వర్గములలోవలె మిక్కుటముగనే యుండును. ఈ కోరికెలను ఈషణము లని పాడు పేరు పెట్టుటకంటె స్వవికాసమునకు ఆద్యధర్మ మయిన స్వపోషణ సంతాన రక్షణధర్మ మనుట మేలు. ఈషణశబ్దమునకు అసలు కోరికె యనియే అర్థమయినను ఇటీవల వేదాంతు లీ యపార్థమును గల్పించినారు.

ఇక జంతువర్గమును విచారింతము. సరీసృపములలో ద్విలింగ జాతులు కలవని ప్రకృతిశాస్త్రములు చెప్పుచున్నవి. వీనిని 'హెర్మాఫ్రడైట్స్' అను పేరుతో నీజాతులు దక్షిణ అమెరికా సముద్రతీరమున పెక్కు లున్నవి. ఇట్టి ద్విలింగజాతులు అనూపస్థలములలో కొన్ని గలవని చరకములో వ్రాయబడి

యున్నది. కాని సృష్టిలో, జంతు సృష్టి ప్రారంభములో లింగవిభేదము పూర్తియయినది. అయినను జంతువులలోను మానవులలోను గూడ లింగవిభేద మేర్పడినను స్త్రీలలో పుంస్త్వమును పురుషులలో స్త్రీత్వమును అణిగియున్న చిహ్నములు వ్యక్తమగుచు నే యున్నవి. పురుషులలోను మగ జంతువులలోను బిడ్డలకు స్తన్యమిచ్చు పనిలేకున్నను యుక్తవయఃస్సు వచ్చునప్పటికి పెరుగకున్నను స్తనచిహ్నములు గన్పట్టుచున్నవి. స్త్రీలలో బ్రహ్మచారిణులకును కాన్పు లుడిగిన వారికిని మీసము లంకురించును. కాని స్త్రీ పురుష భేదము మాత్రము జంతుమనుష్యవర్గములలో వేర్పడి కన్పట్టుచున్నది. మరికొన్ని వేల సంవత్సరములలో నీభేదము మానవులలో సంపూర్తియగును గాబోలు. ఒక్క మానవులలోనేగాక దేవయక్షగంధర్వులలో గూడ స్త్రీపురుష భేదము పురాణములు చెప్పచున్నవి. అక్కడ ఈభేదము సంపూర్ణమయినదో లేక సాంకర్యమయినదో తెలియదు. కాని విచారణీయము.

"శరీర మాద్యం ఖలు ధర్మసాధనం" అను సూత్రప్రకారము జీవుడు స్వవికాసమునకై శరీరధారియై యుండుటయు, వీలయినంతవరకు జీవితమును పొడిగించుకొనుటయు అవసరము. ఇందుకు స్వరక్షణము సంతానమును బడసి పెంచుట అను రెండు ధర్మములును సర్వసామాన్యములు. ఆహారనిద్రాభయమైథునము లను నాలుగు సామాన్య ధర్మములను భర్తృహరి చెప్పినాడు గాని వీటిని స్వరక్షణ తిరిగిపుట్టుట అను రెంటి క్రిందికి దేవచ్చును. ఈ రెంటిని గూర్చి మన మిచ్చట కొంత వరకు చర్చించవలసి యున్నది. మొదట స్వరక్షణమును గూర్చి యోచింతము. ఆకలి దీర్చుకొనుటయు రుచి ననుభవించుటయు ద్వారా నీపని నెరవేరుచున్నది. ఈ రెంటిని జరుపుకొనుటకై ఆహార పదార్థములను లేక వాటి విలువ రూపమయిన ధనమును నిలువచేసి కొనుట అవసరమయినది. జంతువు లాకలి యైనప్పుడు పదార్థములకై దేవులాడును. మానవుడు ముందుగా నిలువజేసి పెట్టుకొనును. ఈ పనిలో లోభము, దూబరతనము, అతిసంచయేచ్ఛ, పరధనాపహరణము, అరుకువరోగములు, బీదతనము, ఐశ్వర్యము, దానధర్మములు, ధనికవర్గము, వైరాగ్యము మున్నగునవి బయలుదేరినవి. వీటిని నడుపుటకు ధర్మశాస్త్రములు పుట్టినవి. ఇక సంతానమును బడయుటకై యౌవనము, మైథునేచ్ఛ, రతి, ఆనందము, స్వేచ్ఛావిహారము, వివాహము, పాతివ్రత్యము, ఏకపత్నీ వ్రతము, వ్యభిచారము, చిలిపిరోగములు, అందము, శృంగారము, అందవికారము, కుటుంబము, మాతా పితా పుత్ర సంబంధములు, వాత్సల్యము, బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థధర్మములు, పరదారాపహరణము, వారసత్వము మున్నగునవియును వానికి సంబంధించిన ధర్మశాస్త్రములును బయలుదేరినవి. ఈ రెంటి సంబంధమున ఈషణాత్రయమునకు తోడు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములను ఆరుగుణములును బయలుదేరినవి. ఈ తొమ్మిదియును రెండు ఒరల కత్తులు ఈ తొమ్మిదింటిలోను పనికిరాని దొక్కటియును లేదు. వీనిలో నేది లేకున్నను సంసారము నడువదు. లోకవ్యవహారము కుంటుపడకతప్పదు. వీటిని ఈషణము లని శత్రువులని చెప్పట దైవదూషణమని నా భావము. వీటిని నిగ్రహించి యథాస్థానమున నుంచి, ఉపయోగించినప్పుడే సృష్టియొక్క నిజ ధర్మమును గ్రహించి వర్తించినవార మగుదుము. సక్రమముగ యోచించిన యెడల వీటి యన్నిటియందును ప్రేమయొక్క నడక అంతర్వాహినిగ కన్పట్టుచునేయున్నది.

మనకిప్పుడు సృష్టిలో శక్తియొక్క విజృంభణమే ఎక్కువగ గన్పట్టుచున్నను మనము దీర్ఘముగ యోచించినయెడల సృష్టిలో క్రూరజంతువులయొక్క వ్యాపకము నశించినదని తెలియును. సృష్ట్యాదినున్న భీకరకరాళదంష్ట్రా నఖసహితములయిన వన్యమృగములు రూపుమాసినవి. నరకరావణ జరాసంధాదుల కిది కాలము గాకున్నను, బ్రహ్మాస్త్ర పాశుపత నారాయణాస్త్రముల ప్రభ తగ్గినను ఇంకను హిట్లరు, ముసులోనీలు హావిడ్జర్లు, బాంబులు, టాంకులు, ఫిరంగులు, విషవాయువులను సృష్టించుచున్నను ప్రహ్లాద, బుద్ధ, క్రైస్తు, గాంధీ కంఠములనుండి అహింసానినదము క్రమక్రమముగ విస్తరించు

చునేయున్నది. ఇప్పటి యవతారములు దుష్టసంహారమునకు గాక దుష్టత్వసంహారమునకై యవతరించుటచేత అహింసాసిద్ధాంతము ఎన్నియో మెట్లు పైకెక్కినదని చెప్పవలసియున్నది. ఇటీవల జరిగిన ప్రపంచ విషయములను బట్టి బలవంతుడే న్యాయవంతుడను సిద్ధాంతమునకు బలము తగ్గినట్లు కన్పట్టుచున్నను లోతుగ విచారించినయెడల న్యాయవంతుడే బలవంతుడను సిద్ధాంతముగూడ బలపడుచున్నట్లే స్పష్ట మగుచున్నది. "బహుస్యాం ప్రజాయై" అనుసంకల్పము ప్రేమనుండియే బయలుదేరుటచేత శక్తికి మాతృస్థానము ప్రేమయే. క్రమముగ అన్నిరకములయిన బలములును ప్రేమకు లొంగక మానవు. శివస్వరూపమునకున్న బలము శక్తిస్వరూపమునకు లేదు.

హిందూపురాణములందు వర్ణింపబడిన సముద్రమథనకథనుబట్టి దైవ రాక్షస శక్తులయొక్క సంఘర్షణము వల్లనే అమృతము సిద్ధించినది. నిరోధరూపక మయిన రాక్షసశక్తి ప్రతిబంధకము గాక నిజముగ లోకకల్యాణమునకే ఉద్దేశింపబడినది. ఏవిధముగ జూచినను సృష్టిలో నిస్పృహత్వమునకు తావే లేదు. సర్వజ్ఞుడును ప్రేమమయుడు నగు భగవానునియొక్క నిర్మాణమే యీ సృష్టియంతయును. గమ్యస్థానమును శీఘ్రముగ చేర్చుటకు అన్ని శక్తులును అనుసంధింపబడినవే గాని ఒకదాని కొకటి ప్రతిబంధకములు గావు. ఈ శక్తులలో నొకటియును పనికిరానిదియును, ప్రతిబంధకమయినదియును, తీసివేయవలసినదియును లేనేలేదు. అట్లుండినయెడల భగవంతునియొక్క సర్వజ్ఞత్వమునకును, సర్వ దయాపరత్వమునకును ప్రత్యవాయము రాకతప్పదు. సత్యము జ్ఞానము ప్రేమ అను మూటియొక్క ప్రభావమే ఈ విశ్వ మని చెప్పక తప్పదు.

సృష్టి ప్రారంభమై గమ్యస్థానము వైపునకు చాలవరకు నడచినది. భౌతికముగ విచారించినయెడల జీవుడు ధాతు, వృక్ష, జంతువర్గముల దాటి మానవవర్గమునకు వచ్చినాడు. కుండలికి నాలుగవ వ్యూహములో పని జరుగుచున్నది ఆంతరంగికముగ విచారించినయెడల పరనిర్వాణ, నిర్వాణ, జ్ఞానమయ, మనోమయ కోశములు దాటినవి. ఈ నాలుగువ్యూహములును స్థిరపడినవి. శరీరము మారినప్పుడు నశించుట లేదు. కామమయ అన్నమయ కోశములకు మాత్రమింకను నిలుకడ చిక్కలేదు. ఇవి ఇంకను గట్టిపడలేదు. ఇవి గట్టిపడిననేగాని సర్వతో ముఖజ్ఞానమును సత్యమయిన ఆనందమును సిద్ధింపవు. ఈనాలుగును జరుగునప్పటికి లోకములో పశుబలప్రభావము తగ్గి ప్రేమరాజ్యము రావలెను. అదియే ముక్తి.



# సూర్యరాయాంధ్ర నిఘంటువు



**వడ్లమూడి వెంకటరత్నంగారు**

'ఆంధ్రసాహిత్యపరిషత్తువారు సమగ్రాంధ్రనిఘంటువు తయారుచేయబూనుకొన్నారు. నిఘంటువు సిద్ధమగుచున్నది. ఆంధ్రభాష కొకపెద్దలోటు తీఱనున్నది' అని ఆంధ్రలోక మెదురు చూడగా చూడగా దాదాపు పాదశతాబ్దికి ఒక్కసంపుటము బయలువెడలినది (౧౯౩౬ లో). అందు అజాది పదములు సంగ్రహింపబడినవి. మిగిలిన భాగము లింకను పరిషద్గర్భమునందే యున్నవి. అవి యెప్పటికి బయటపడునో తెలియదు. ప్రకటితమయిన యీ ప్రథమసంపుటము రానున్న సంపుటముల స్థితిగతులను కొంతవఱకు తెలుపుచున్న దనవచ్చును. దీనిలో నున్న లోటుపాట్లు వానిలోకూడ ఉండకతప్పవని యూహించుట సాహసము కాదు. నిఘంటు నిర్మాణములో పరిషత్తువారి యుద్దేశము చూడుడు: "భాషలో నున్న శబ్దజాల మంతయుఁ జూపుచు ఆ శబ్దముల రూపములు, నర్థభేదములును సప్రమాణముగాఁ దెలుపునట్టి బృహన్నిఘంటు వావశ్యక మని ... అట్టి నిఘంటువును రచించి ప్రకటించుట యాంధ్ర సాహిత్యపరిషత్తువారి ముఖ్యోద్దేశములలో నొకటి" (నిఘంటుపీఠిక, ౨-౩ పుటలు). ఈ యుద్దేశమున కీనిఘంటువు ఫలితమే యయినచో వారిప్రయత్నము వ్యర్థ మయిన దని చెప్పక తప్పదు. ఇట్లనుటకుగల కారణములను ఈ వ్యాసమున కొన్నిటిని సంగ్రహమున దెలిపెదను.

లేక, 'యిది సమగ్రము కాదు; సమగ్ర నిఘంటువునకు మరల ప్రయత్నము చేయవలసియున్నది' అని పరిషత్తువారితలంపయినచో నా నిఘంటువు నీతరమువారు చూడలేరు. మఱి యెప్పటి కాయదృష్టము గలదో ఆ పరమాత్మునకె యెఱుక. నిఘంటువు సర్వాంగ సంపూర్ణముగా లేదని పరిషత్తువారే తల పోసినట్లు పీఠికలోని యీ క్రిందివాక్యములు తెలుపుచున్నవి:

దేశ్య వైకృతవిభాగవిషయసందర్భమున "ఈ సంబంధ మింకను విమర్శనపూర్వకముగా నిర్ణీతము కావలసియున్నది. వర్తమానకాలమం దీ విభాగముచేయుట సాహసముగానుండును అనుభూతిచేత మానివేయుటయైనది" (పీఠిక ౫ పుట). "ఏయేయర్థ మెప్పు డెప్పుడేరీతిగా నేర్పడినదో నిర్ణయించుటకుఁ దగిన సాధన సామగ్రి మాకు దొరకలేదు" (౬ పుట). తత్సమ దేశ్య వైకృత పదసమ్మిళితమయిన యీ భాషాపరిచయము గలుగవలయునన్న దేశ్య వైకృతవిభాగము తెలిసికొనకతప్పదు. ఒకపదముయొక్క అర్థము లెప్పు డెప్పుడేయేరీతులుగా మాఱి రూఢి కెక్కినవో భాషాజిజ్ఞాసువు లవశ్య మెఱుఁగదగినది. కనుక నీ విషయములు రెండును నిఘంటు సంపూర్ణతకు ప్రధానాంగములే యనవచ్చును. కావున నివి లేని నిఘంటువు సమగ్రము కాదని తలంచుట సాహసము గాదుగదా! కనుక ఈ నిఘంటునిర్మాణమునకు బూర్వము ఆంధ్రసారస్వతమున కెట్టిలోటున్నదో దాదాపుగ నట్టిలోటే — ఇంతమందిపండితులు — ఇన్నియేండ్లకాలము — పనిచేసినపిమ్మటగూడ — ఏర్పడియున్నదని తలంచుట తెంపరితనముగాదు.

శబ్దరత్నాకరములో ౧౨౬ పుటలలోనున్న అజాదిశబ్దముల గ్రంథము ఈనిఘంటువులో ౧౦౦౦ పుటలదాక పెరిగినదే; ఇది యంతకంటె బృహన్నిఘంటువు కాదా? యన్న అవును; అంతకంటె దీనిలో కొంత బృహత్త యుండుట నిశ్చయమే; కాని మనభాష కవసరమగు — సమగ్రరూపమగు నిఘంటువుతో బోల్చి చూచినచో దీని గొప్పతన మొక్కలెక్కలోనికి రాదు. ఈ గొప్పతనము కూడ కళేబరమునందేగాని రచనాపద్ధతిచేత గాదు. ఆకళేబరమును సహజముగా పెరిగినది కాదు. కృత్రిమరూపముగా బెరిగినది; అనగా భాషలో ఉన్న శబ్దములచేతగాక లేనిశబ్ద రూపములను కల్పించుటచేత. సంస్కృతశబ్ద రూపములను పెక్కింటిని పరిషత్తువారు వ్యాకరణశాస్త్రమును ముం దుంచుకొని సృష్టించియున్నారు. ఈ రూపముగా నిఘంటువునాకారము కొంత పెరిగినది. కాని సమగ్ర నిఘంటునిర్మాణమునకు ఇప్పుడు పరిషత్తువారు స్వీకరించినపద్ధతి చాలదు.

మన కవసరమగు నిఘంటువులో ఆంధ్ర పదము లన్నియు మనభాషలో చేరినయితర పదసమూహముతో నిమిడియుండవలయును. గ్రంథములలోగాని, వ్యవహారములోగాని ఉన్న తెలుగుపద మొక్కటియైన తప్పించుకొనిపోగూడదు. ఆ పదములు వ్యస్తములై ఏరూపముతో ఏయర్థము నిచ్చుచున్నవో, సమస్తములై యేరూపముతో ఏయర్థ మిచ్చుచున్నవో స్పష్టముగ బోధింపవలయును. అవి తత్సమములో, వైకృతములో, దేశ్యములో ఏభాషలోనుండి వచ్చినవో వాని మూలపదము లేవో వానియర్థ మెట్లు మాఱినదో తెలుపవలయును. తెనుగునామములకు మూలధాతువు లేవో వివరింపవలయును,

గ్రామనామములు మున్నగువానిలోని శబ్దముల మూలరూపములు తెలిపి వానియర్థములును, వానిపరిణామములును, ఆ శబ్దముల చరిత్రములును క్రమముగ నెఱిగింపవలయును. భాషలో నేశబ్దమును గూర్చియైన ఏవిషయమైన మనకు విస్పష్టముగా వెల్లడింప వలయును. అటులైననే అది సమగ్రనిఘంటువు కాగలదు. అట్టిసమగ్రనిఘంటువు మాటలతో నయ్యెడిది కాదు అనుట నిశ్చయమే; కాని పరిపుష్టినందిన భాషలలో మనదికూడ నొక్కటి గావలయు ననుకొన్నచో నందులకు ప్రయత్నింపక తప్పదు. అట్లు లేని యసంపూర్ణ నిఘంటువులవలన సమగ్రలాభమె ట్లుండగలదు?

ఇప్పు డీనిఘంటు నిర్మాణ పద్ధతినిగూర్చి "వాఙ్మయ మంతయు క్రొత్తగా జదివి యర్థసహితముగా నొక్కొక్కశబ్ద మొక్కొక్క కాగితపు ముక్కమీఁద నెత్తి వ్రాసి.... రెండు మూఁడుతడవలు పరిశీలించి నిర్ణయించుటరైనది" (పీఠిక ౫-౬ పుటలు) అని వ్రాసియున్నారు. కాని యీమాట నమ్మవలెనో, నమ్మకపోవలెనో తెలియుటలేదు. ఏమందురా? మ॥ రా॥ శ్రీ జయంతి రామయ్య పంతులుగారి వంటివారు చెప్పుచున్నప్పుడు నమ్మకయుండుట యెట్లు? ఇక ఆంధ్రసారస్వతములో అందునను ఆంధ్రభారతములో ఉన్న పదములే వందలో వేలో ఈ నిఘంటువులో చేరనప్పుడు ఇది వారు చెప్పినట్లు నిర్మింపబడ్డదని నమ్ముట యెట్లు?

'వందలో వేలో' అన్నందులకు కారణమేమనగా:-ఈనడుమమామిత్రులుఉ. భా-ప్ర. అబ్బరాజు వీరరాఘవయ్యగారు (P. O. L.) తమసోదరులు ఉ. భా. ప్ర. అబ్బరాజు సూర్యనారాయణగారి తోడ్పాటుతో మూడు సంవత్సరములు శ్రమపడి ఆంధ్రమహాభారతమునకు ఒకచక్కని నిఘంటువును తయారుచేసియున్నారు. ఆనిఘంటువును, సూర్యారాయాంధ్రనిఘంటువును పోల్చి అకారాది పదములలో పరిషన్నిఘంటువులో లేని పదముల నెత్తి వ్రాసినాను. చూడగా భారతములోని వానిలో అకారాదిపదములలోనే దాదాపుగా ౫౦౦ పదములు పరిషత్తువారి నిఘంటువులో కనబడలేదు. మరి తక్కిన అజాదిపదములలో ఎన్ని విడువబడ్డవో, హళాదిపదములలో ఎన్ని విడువబడ్డవో ఎట్లా చెప్పవచ్చును? ఇక తక్కిన వాఙ్మయ ప్రపంచములో ఎన్నిపదము లిందు లేవో చెప్పుట యెట్లు? ఒకచక్కని నిఘంటువు సిద్ధమయినప్పుడుగదా బయటబడునది? నేను పైన చెప్పిన ౫౦౦ పదములనుగూర్చి ఒక్కమాట తెలుపవలసియున్నది.

శ్రీ రామయ్య పంతులవారు "వీలునుబట్టి యన్నియో కొన్నియో జన్యశబ్దములనుగూడ ప్రధానశబ్దములయడుగున నుదాహరించి - - చూపితిమి" (పీఠిక, ౭-వ పుట) అని వ్రాసియున్నారు. వీలులేకనో మఱెందువలననో కొన్ని జన్యశబ్దములను వారు విడిచిపెట్టియున్నా మనుచున్నారే. మే మాజన్యశబ్దములనుగూడ లెక్కవైచినాము. తమ నిఘంటువులో లేనిజన్యశబ్దములలో అర్థభేదములేదను కారణముతో కొన్ని శబ్దములను పంతులవారు త్రోసివేయఁగలిగినను మిగిలిన శబ్దములు సయితము విశేషముగనే యుండును. ఇక ముందు రానున్న సంపుటములలో భారత పదము లన్నియు సంగ్రహించినను ఇప్పుడు విడిచినవే వందలలో నుండును. పరిషన్నిఘంటువులోలేక ఆంధ్రమహాభారతములో నున్న పదములు 'ఆంధ్రమహాభారత నిఘంటువు'నుండి యేఱి వ్రాసినవి మచ్చునకు కొన్ని :

అంగజన్ముఁడు
అంగత్రాణము
అంగవంచనము
అంగశోధనము
అంజలికము
అంతఃపరివారము
అంతశ్చరము
అంపపెట్టు
అంపసేల
అంబుజగర్భుఁడు
అంబుజనాభుఁడు
అంబుజాక్షి
అంబుజాక్షుఁడు
అంబుజాప్తుఁడు
అంబుజోదరుఁడు
అకా
అఖిలాండము
అగ్నిదైవత్యము
అగ్నిభవుఁడు
అగ్ర్యము
అగ్నివర్తి
అగ్నివేశుఁడు
అగ్రపుస్తకము
అద్రిధరుఁడు
అనంతశయనుఁడు
అనిమిషగురువు
అనిలజుఁడు
అబ్జభాండము
అబ్జనాభుఁడు
అబ్జముఖి
అబ్జాక్షి
అబ్దకము
అరుణగభస్తి
అరుణమణి
అలుఁగుటమ్ము
అల్లఁదనము
అవనిజము
అవనిపుఁడు
అవనిభృత్తు
అవసథము
అసిపట్టిక
అహంకరణము.

శ్రీ రామయ్య పంతులువారు పీఠికలో "ఉపసర్గ శతంతాది శబ్దములుగూడ నిందు గ్రహింపఁబడినవి", (పీఠిక 3-వపుట) అని వ్రాసియున్నారు. శబ్దములు అనుమాటకు 'కొన్ని' అనువిశేషణ మున్నచో నది యథార్థమే

యగునుగాని ఆ విశేషణములేక 'అన్నియు' అనుభావము కలుగవలయును ననుతలంపుతో వ్రాసినయెడల నది ఘోరాసత్యమే యగును. పంతుల వారిమాటలలో 'ఉపసర్గ' అనుటకు ఉపసర్గపూర్వకములు అనియేగదా వారి భావము. చూడుడు ఆంధ్రమహాభారతము నుండియే కొన్ని పదములు:

అకలంకము
అకాలకౌముది
అవిత్తు
అజరామరము
అతిలోకము
అధశ్శయనము
అధిపాలుఁడు
అధోనీవి
అధ్యాత్మ
అనపహార్యము
అనధీయానుఁడు
అనవిత్త్వము
అనింద్యము
అనిమీలతో
అనిర్వాచ్యము
అనీహమానుఁడు
అనుజన్మ
అనుజాతి
అనుపోష్యుఁడు
అనుమృతి
అనుసంభవుఁడు
అనువర్తి
అపక్రాంతము
అపత్త్రిము
అప్రసక్తము
అప్రాప్యము
అఫల్గువు
అభిఘట్టము
అభిదారణము
అభియుక్తి
అభిలీఢము
అభివిష్టము
అభిశోభి
అభిష్టుత్యము
అవసాదితము
అవిద్ధము
అవినాభవత్
అశ్లథము.

ఒక్క మహాభారతమునుండియే కాదు; వీరు శబ్దములను విడిచి పెట్టినది. తక్కిన వాఙ్మయమునుండియు వదలి వైచినారు. ఎన్నింటిని వదలిపెట్టినారో ఆ దేవునికే యెఱుక. ప్రబంధములనుండి నేను సర్తు వ్రాసికొన్న పదములలోనుండి కొన్నింటిని, ఈ సంపుటములో లేనివానిని, మచ్చునకు ఉదాహరింతును.

అధఃప్రపంచము (పాండు.)
అయ్యాలదొడ్డి ,,
అట్టహాసము (భీమ.)
అనాక (కాశీ.)
అనాదల (హర.)
అధ్వానము ,,
అయాదము ,,
ఆటపాటము (భీమ.)
ఆరణాలు (శివ.)
ఆదికపి (పాండు.)
ఇరుచంబడు (క్రీడా.)
ఉమ్మస (న) (కేయూర.)
ఎడగర (భార.)
ఎలపాసెము (హర.)
ఏకభోగము (భీమ.)

గ్రంథస్థపదము లిటు లుండగా దేశ్యపదముల నెంతవఱకు స్వీకరించినారో చూతము. సమగ్రనిఘంటువునకు గ్రంథస్థము లెంత ప్రధానములో యితరములు నంత ప్రధానములే యన నచ్చును. మన తెలుగు దేశ్యపదములు గ్రంథస్థములు కావసినవి, నిఘంటువుల కెక్క వలసినవి వందలకొలదిగా గలవు. వేలలో నుండునన్నను ఆశ్చర్యముకాదు. ఆంధ్రకవీశ్వరులు సంస్కృతమునందలి తీపిచేత దాని నాదరించుచు తెనుగుపదములన్న నీసడించుచువచ్చినారు. కనుక వారు సిసలగు తెనుగుపదములను పెక్కింటిని గైకొననేలేదు. ఇట్లు వదలివేయుటచే 'కండగల చిక్కని తెనుఁగులు' కాల గర్భమున బడిపోయినవి. కనుకనే కొందఱు విమర్శకులు "తెనుగువారు దీపము నెఱుఁగరు. వారికి పాపపుణ్యవివేచన లేదు. వారికి దేవుడు లేడు" అనుచున్నారు దీపము, పాపము, పుణ్యము, దేవుడు మున్నగు పదములు సంస్కృతపదము లగుటయే యందులకు కారణము. ఇట్టి విమర్శనలకు తావిచ్చినవారు మనతెలుగు గ్రంథకర్తలే కనుక ఇప్పుడైనను తెలుగువారు తెలివితెచ్చుకొని తమ మిగిలిన దేశ్యపదసంపదనైన సంగ్రహించుకొనవలయును. లేనిచో వారు ఒకప్పటికైన పశ్చాత్తాపముపాలుగాక తప్పదు. ఇంత, మంది మార్బలముతో, ఇన్నియేండ్లు పూండ్లు పని చేసిన పరిషత్తువారే వానిని కూర్చుటకు నడుము గట్టనప్పుడు అంతలింతలవా రెవ్వరు పూనుకొనగలరు? పూనుకొని యెవ్వరు గట్టెక్కింపగలరు?

ఆ మాటలు కూర్పవలయునన్న పండితులాయా ప్రాంతములసంచారము చేయవలయును. అచ్చటచ్చటనున్న భాషాభిమానులను కోరి వారి సహాయమున ఆ ప్రాంతీయ పదములను సంగ్రహింపవలయును. సామాన్యులను, అడుగ ద్రొక్కబడిన జాతులను నిరసింపక వారి వాడుకలోని తెనుగుపదముల నేఱి కూర్పవలయును. తాము సమకూర్చిన 'తెనుగుపదముల' పట్టికలను ప్రకటించి అందులేనిపదములు తెలుపవలయు నని దేశీయులను కోరవలయును. ఏపని చేయుటకైనను ఈకాలమున పెక్కు అవకాశములు గలవు. నేడు చేయలేనివా రేనాడును చేయలే రనుట స్పష్టము. ఇట్లు చేసియున్నచో అసలగు తెలుగు పలుకుబడులను, వానియర్థములను, వాని వింతప్రయోగములను సేకరింప వీలయ్యెడిది. కాని పరిషత్తు వారి కాప్రమేయమే లేదు. భాషలోలేని సంస్కృతపదములను పుట్టింప పాటుబడినారుగాని ఉన్న తెనుగు పదములను సమకూర్ప పాటుపడలేకపోయినారు. ఔరా! ఏమియభిమానము!

చూడుడు కొన్నిమాటలు:

అబ్బరలు = ఇతరులు

ఆటి = ఎక్కువ

ఉదా: ఆట్రగడబియ్య మాటివచ్చును.

అమాంతము

ఊకము

ఉదా. ఊరు ; ఊకము

అత్తవపువేళ = మధ్యాహ్నసమయము

అతకలు = ప్రాతచెప్పులు

అంకె వేయుట

ఉదా. ఎద్దు అంకె వేసినది.

ఉచ్చిళ్లు = కూరము తినునపుడు చేయు 'ఉ'స్సనుధ్వనులు

ఆయగట్టుట.

ఉదా: వాడు కడు పాయగట్టుకొని చేయుచున్నాడు.

ఇట్టివ్యస్తపదములే గాక సమస్తపదముల లోని అంగములను పెక్కులు వివరణమును వాంఛించుచున్నవి. సమగ్రనిఘంటువున కవి యన్నియు గ్రహణీయములే.

చూడుడు :

ఆది :— పంచాది, ఏనాది, ఉత్తరాది, దక్షిణాది, ఏడాది.

ఆరు :—ఆరు దొండ, ఆరుకాడు, ఆరుమూడి, ఆరుపీటి, ఆరుగొలను, ఆరుకోణము, ఆరుంబాక, ఆరువల్లి, మొ.

ఏరు :— ఉదా: కోనేరు, కొల్లేరు, పాలేరు.

ఇందలి ఆరు, ఆది, ఏరు మున్నగువాని కర్థమేమి? వీనికి మూల మేది? వీనియర్థ మెట్లెట్లు మాఱినది? అయితానగరము, అయితవోలు, అయితము, అయితాపట్నము మొదలగు ఊళ్లపేర్లలో అయితా అనుశబ్దము కనబడుచున్నది. బాలచంద్రునితల్లి 'అయితాంబ'. ఈ అయితకు మూల మేది? ఈ నామముతో దేవి యెవరైన గలరా? మొదలగు విషయములను నిర్ధారణపూర్వకముగా - తాయి గ్రుద్ది - చెప్పకున్న పోనిండు; కొంతదూరమైన ప్రయత్నింప నక్కరలేదా? ఇట్టివిచారణలో నెంతవఱకు పయనించినారు పరిషత్తువారు? ఇట్టిపదముల చరిత్రము భాష కక్కఱనే లేదా? వీని పుట్టుపూర్వోత్తరములు అవసరములే. అందువలన మన కెన్నియో గుట్టుమట్టులు ఎఱుక పడగలవు. మన మొక్కసారి సంపూర్ణ చరిత్రమును సమకూర్పలేకపోయినను కొంతదూరమువఱకైన ఆధారములు తెలిసికొని ప్రయత్నించినచో వానిని ప్రాతిపదికగా చేసికొని మఱికొందఱు ప్రయత్నములుచేయ వీలగునుగాదా? అట్టిసాధనసామగ్రినైన- కొంతవఱకైన- ప్రోగుచేయవలదా? కాని పరిషత్తువా రేమియు చేయక పెండ్లినడకలు సాగించినారు.

పోనిండు తాము సంపాదించిన పదములకైన మనభాషలో సందర్భానుసారముగా చెప్పవలసిన యర్థముల నన్నిటిని చెప్పినారా యన్న నదియు లేదు.

చూడుడు కొన్నిదృష్టాంతములు :

అయ్య — దీనిని శ్రీనాథుడు పురుషసామాన్యవాచకముగా తన శృంగారనైషధములో ప్రయోగించినాడు. "కొంద ఱయ్యలు కొనియాడనేరరు." (శృం. నై, ౧. )

వ్యవహారమునందును 'పిల్లను ఎవరో ఒకయ్యచేతిలో పెట్టి బరువు దింపుకొనవలెను' అని కనబడును కాని పరిషత్తువారీయర్థమును గ్రహింపలేదు.

అనుప్రాసము, ఆమ్రేడితము, అధ్యాహారము, ఇత్యాదిపదములను శ్రీనాథ కవిచంద్రుడు తనకావ్యములలో ప్రయోగించియున్నాడు.

ఉదా: "ముక్కంటి దరహాసమున

కనుప్రాసంబు......

నలువశుద్ధాంతంబున కనుభాష

త్రిదశేంద్రుకరటి కామ్రేడితంబు

పుండరీకారణ్యమునకు నధ్యాహారము"

(భీమ. ౧.)

"అధ్యాహారమోకాని యమృతపతికి

అన్వాదేశమోకాని యత్రినేత్రోద్భవునకు

ఆమ్రేడితమొకాని యబ్ధిజునకు"

( కాశీ, ౪. )

వీనికి లక్ష్యార్థములు చెప్పవలయునుగాని శాస్త్రపరిభాషతో నర్థములు పొసగవు. కాని నిఘంటుకర్త లాజోలికి పోలేదు.

అక్షయ్యము : గ్రాసమాత్రభిక్షము అను నర్థమున కాశీఖండమున బ్రయోగింపబడియున్నది. కాని పరిషత్తువారు దానిని చూడనేలేదు.

తెలుగు పురుషనామములలో కొన్నింటికి చివర 'అమ్మ' అనుశబ్దము గానబడుచున్నది. కృష్ణమ్మ, అంకమ్మ, నల్లమాచార్యులు, కృష్ణమాచార్యులు మొదలగువానిలో నిది స్త్రీలింగబోధకమేమో కాదు. మఱి సీతారామాచార్యులుగారు చెప్పిన 'నాపామాయాగమము' లందుమా! అం దర్థము లేదు. దీనికి మూల మొకటియైయుండును. ద్రావిడములో 'అమ్మా' యనుపుంలింగశబ్ద మొకటి గలదు. దీనికి స్త్రీలింగరూపమే 'అమ్మాళ్' అనునది. అదియే దీనికి ప్రకృతియనుట సముచితము. కాని పరిషత్తువారీమూలపదము నుట్టంకింపనేలేదు. ఆతెనుగు పదములందలి వింతదనమును గమనించినట్లే లేదు.

పరిషత్తువారు ప్రకరణార్థమును గమనింపలేదనుటకు దృష్టాంతముగా మహాభారత పదములనే నాలుగయిదింటిని, 'ఆంధ్రమహాభారత నిఘంటువు' సంగ్రహించినవాని నుండి యుదాహరింతును.

అంతర్గతము =మనస్సు

ఉదా : ఇట్లతని రూపాతిశయంబున

కోటుపడి

చూచుచు నిజాంతర్గతంబున

అసు = ఆధారమగు, ప్రాపగు

( విరాట, ౧-౨౧౪. )

ఉదా: అధికతాపతప్తమైనది నాచిత్త

మొనర నతనితోడ నొకట నునికి

యెన్నడొక్కొ మనకు నిందఱు

[ కగు నాతం

డేల మసలెనొక్క యిన్నియేండ్లు
(అరణ్య, ౩—౨౯౦.)

ఇచటి 'యగు' ధాతువున కాశ్రయమగు నని యే యర్థము చెప్పవలయును.

మూలము చూడుడు

శ్లో. "సర్వేషా మాశ్రయోఽస్మాకం,
రణేఽరీణాం ప్రమర్దితా"
(అరణ్య, ౧౮౧—౧౬.)

మూలములోని 'ఆశ్రయ' అనుమాటకే తెలుగు భారతమున 'అగు' ప్రయోగింపబడినది.

అగు = జీవించు

ఉదా: నేఁడు రణభూమియందు నర్జునుం
డొండెఁ ద్రిగర్తులొండెం
గావలయు
(ద్రోణ, ౧—౨౨౦.)

ఈ అగుధాతువునకు 'జీవించు' అను నర్థము చెప్పుటయే సమంజసము. మూలము చూడుడు:

శ్లో. "అద్యాస్త్వ నర్జునా భూమి
రత్రిగర్తాఽథవా పునః"
(ద్రోణ, ౧౬ — ౧౭.)

అడరు = వెంబడించు

ఉదా: అతిరభసంబున నడరి యాతనిఁబట్టి
సుశర్మ వెల్చనార్చి
(విరాట, ౩—౨౦౧.)

ఈ 'యడరు'నకు వెంటాడి అని కాదా యర్థము? మూలము తిలకింపుడు.

శ్లో. "ప్రమథ్య జిత్వాచ
ప్రసహ్య మత్స్యం
విరాట మోజస్విన మభ్యధావత్"
(విరాట, ౩౩ — ౮.)

అడరు = పడు

ఉదా: "అట్లు వచ్చునాగదఁ గని యచటి [యోధు
లలికి తమతమమీఁదన యడరు ననియుఁ
దలఁచి యొదిగిరి రారాజుఁ దలపడ్డైరి"
(భీ, ౩ — ౫౮.)

ఈ 'యడరు'నకు పడు అని కాదా యర్థము చెప్పవలెను? ఇదిగో మూలము.

శ్లో. "విహాయ సర్వే తవ పుత్ర ముగ్రం,
పాతం గదాయాః పరిహర్తుకామాః"
(భీ, ౮౬—౩౬.)

మూలములోని 'పాత'మునకే గాదా తెనుగున 'అడరు' ప్రయోగింపబడినది?

ఇట్టి యర్థములను గమనింపకపోయినచో మనము కవిహృదయమును చక్కగా గ్రహింప శక్తుల మగుదుమా? అప్పుడు కవి పడినశ్రమ యంతయు వ్యర్థమే గదా! ఆతని పలుకులు 'మూగ చెవిటివారి ముచ్చటలే' గదా యగును?

ఈ లఘు విమర్శనమువలన పరిషత్తువారి బృహన్నిఘంటువులో పస యెంతగలదో పాఠకు లూహింపగలరు. వ్యాసవిస్తరభీతిచే వినుకొడవలసి వచ్చుచున్నది స్థాలీపులాకముగా నొక కొన్ని విషయములుమాత్రమె ఇందు చెప్పబడినవి.

ఇంతకును నిఘంటులోపములను నలుగురి చెవుల వేసి పరిషత్తువారిని పరిహాసపాత్రులను చేయుట నాయుద్దేశము గాదు. సమగ్రనిఘంటువు నాకాంక్షించువారు దాని స్వరూపమును స్థూలముగా నిర్ణయింపబూనుట సాహసముగాదు. అందుల కిప్పుడు బయలువెడలిన సంపుటములోని లోటుపాట్లను తెలిపి యవి దిద్దుట కవకాశము గల్పించుటయు సహింపరానిది కాదు. ఇది యంతయు భాషాభిమానమునసే. పరిషత్కార్యనిర్వాహకులు ఈ లోపములు గమనించి రానున్నసంపుటములందైన నిట్టిదోసగులు కలుగకుండునట్లు జాగరూకత వహించి, అయినయాలస్య మెటులైన నయినది కావున నింక కొంత యాలస్యమైనను సైరించి, నిఘంటువుమాత్రము సమగ్రముగా నుండునట్లు ప్రయత్నింప ప్రార్థితులు.



వెలస్వల్పము ! ఫలమధికము !!

పెరిదేపి - పి - శి - ఏ. అండ్ కంపెనివారి, శ్రేష్ఠమైన

# నారసింహ లేహ్యము




సువర్ణము, రజితము, సాలామిశ్రి, సఫేదామిశ్రి, రూమిమస్తకి, పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, మొదలగు విలువగల వస్తువులచే తయారుచేయబడినది. బలమును కలిగించుటలో అత్యుత్తమమైనది. మేహములు, నిర్బలకనిస్సత్తువ, శుక్లనష్టము, అతిమూత్రము, మొదలగువాటిని ఖండించి బలమును, వీర్యవృద్ధిని, కాంతిని. సంతానప్రాప్తిని కలిగించుటలో అమోఘమైనది. 2 డబ్బిలుచాలును. 20 తులముల డబ్బి రు 2-8-0 పోస్టేజి ప్రత్యేకము.

నోటు:—ప్రతి 20 తులముల లేహ్యమునందును రు 2-4-0 ఖరీదుగల 3/4 తు॥ లోహాభ్రకసింధూరమును గాని, వంగాభ్రకసింధూరముగాని కలిపిపుచ్చుకొనిన మధుమేహాది సమస్తవ్యాధులను శీఘ్రముగా ఖండించి అత్యధికమైన గుణాధిక్యమును గలిగించును. వేలకొలదిమందిచే వాడబడుచున్నది.

యింకా మావద్ద అన్నిరకములగు భస్మములు, వంటఖజ్జలి ఔషధములు, ఆసవారిష్ఠ లేహ్యములు, మొదలగునవన్నియు సిద్ధముగానున్నవి. కోరినవారికి మా క్యాటలాగుయుచితముగా పంపెదము.

పి - శి - ఏ. అండ్ కంపెనీ, ఆయుర్వేదసమాజం,

పెరిదేపి, నెల్లూరుజిల్లా.

---

కొనేటప్పుడు దీనిని గమనింపుడు




ట్రేడు  మారుక


(రిజిస్టర్డు)

తలనొప్పికి, పడిసెమునకు వివిధరకముల నొప్పులకు, బాధలకు

# జామా ఆయిల్

అంతట అమ్మబడును.

అమర్ చెందు, శోభాచెందు,

ఇంగ్లీషుమందులు, పలుసరకులు, సల్ఫ్యూరిక్

నైట్రిక్, మొరాటిక్ ఆసిడ్ల వ్యాపారస్థులు

నెం. 95, నైనప్పనాయనివీధి, పి. టి. మద్రాసు.

# "ఏమి మగవాళ్లు!"

(ఏకాంకము)

పాకల రాజమన్నారు

## పాత్రలు

| | | |
|---|---|---|
| వేణుగోపాల్ | ... | |
| సోమసుందరం | ... | వేణు పెదతండ్రి |
| సుందరమ్మ | ... | సోమ॥ రెండవభార్య |
| కృష్ణమూర్తి | ... | సోమ॥ తమ్ముడు |
| శంకరశాస్త్రి | ... | సోమ॥ స్నేహితుడు |
| కనకాంగి | ... | వేశ్య, వేణుభార్య |
| నిర్మల | ... | సోమ॥ మొదటిభార్య కూతురు |

కాలం — ప్రస్తుతం

రంగము : సోమసుందరంగారి ఇంట్లో.

[భోజనం చేసి తాంబూలం వేసుకుంటున్నారు సోమసుందరంగారు. వయసు సుమారు ౫౦, ప్రాత కాలంవాడే. బుర్రమీసకట్టు, స్థూలకాయం, అయితే ఒడ్డూ పొడుగూ ఉండడంచేత అసహ్యంగా లేడు.

సుందరమ్మ సోమసుందరంగారి రెండవభార్య. మొదటి భార్య ఒక్క కూతుర్ని వదిలిపెట్టి గతించింది. సుందరమ్మకు ౨౫ కన్న ఏండ్లు ఎక్కువ ఉండవు. సన్నగా ఉండడం చాలించిందిగాని ఇంకా లావు కాలేదు. అందంగానే ఉంటుంది. ముస్తాబు క్రొత్తరకమే. గ్రామఫోను త్రిప్పుతూ నిలబడి వుంది.

ప్రక్కనే కృష్ణమూర్తి రికార్డులను అందిస్తూ నిలబడ్డాడు, సోమసుందరంగారి తమ్ముడు. ఒక్క పలచగా ఉంటాడు, వయసు ౨౭. ఖద్దరుపంచా, చొక్కా, క్రాపు, కంటికద్దాలు.

సుందరమ్మ సావకాశంగా ఉన్నప్పుడల్లా కృష్ణమూర్తివంకనే చూస్తూవుంటుంది. కృష్ణమూర్తిమాత్రం ఎప్పుడో తప్ప గోడమీది బొమ్మలు, పైకప్పు చూస్తుంటాడు...

నిర్మల (౧౦ సం॥) సోమసుందరంగారి మొదటిభార్యకూతురు గుమ్మందగ్గరకు వచ్చి పాట వింటూ నిలబడ్డది.]

సుందరమ్మ

(నిర్మలతో) వెళ్లు! వెళ్లి చదువుకో, పాట లేమిటి చిన్నపిల్లలికి ?

నిర్మల

పాఠా లన్నీ చదివేశాను పిన్నీ.

సుందరమ్మ

అబద్ధం.

నిర్మల

లేదు. నిజంగా.

సుందరమ్మ

చూడండీ !

సోమసుందరం

పిన్నిమాటకు అలా ఎదురు మాట్లాడ్డం తప్పుకదూ ...ఈపాట విని వెళ్లిపో.

సుందరమ్మ

గారాబంకూతురు !

నిర్మల

(పాట ముగించకముందే వెళ్లిపోతుంది.)

సోమసుందరం

(పాట ముగిసింది.) అబ్బ! ఎంత సేపూ ఈహిందీ నాటకం పాటలేనా, చెవులు చిల్లులు పడిపోతూవున్నవి.

సుందరమ్మ

అయ్యో! చండీదాసులో పాటలండి. సైగాల్‌వాళ్లూ పాడినవి.

సోమసుందరం

ఏడిచిన ట్లున్నాయి. రాగమా, తాళమా,—ఏదోగోల. ఒక్క_త్యాగరాజుకీర్తనలో వుండే సంగీతం వుందీ వీటినన్నీ కలిపినా ?

సుందరమ్మ

అవి వేరు, ఇవి వేరు. ఫిల్ముల్లో త్యాగరాజుకీర్తనలు పాడితే ఏమీ రక్తిగట్టవు. అందుచేతే మనతెలుగు ఫిల్ముల్లోకూడా బంగాలీ, మరాఠీ మెట్లే... ఏదీ కృష్ణా! మొన్న మనం వెళ్లిన "చంద్రహాస"లో కనకాంగి పాడింది.

సోమసుందరం

చాలు చాలు. ఇవ్వేళటికి చాలు.

కృష్ణమూర్తి

ఈ కనకాంగినే మనవేణు పెళ్లాడింది.

సోమసుందరం

ఎవత్తో ఒక భోగం ముండ, కనకాంగో - రత్నాంగో — చిత్రాంగో, ఎవరైతే నేమి ?

సుందరమ్మ

ఇక మనతో కలిసివుండడుకదా, తనభాగం తన కిమ్మని అడిగాడండీ వేణు ?

సోమసుందరం

లేదులే. కాని, అడక్కుండా ఊరుకుంటాడా ? చేతులో గవ్వలు తగ్గగానే పార్టీషనుదావా బయలుదేరుతుంది.

కృష్ణమూర్తి

అతడూ వకీలేగా.

సోమసుందరం

అయితే మాత్రం భయపడతానా?

సుందరమ్మ

ఏమండీ? ఈవివాహం చెల్లుతుందండీ మనధర్మశాస్త్రాలప్రకారం ?..

సోమసుందరం

మనధర్మశాస్త్రాలు మట్టిలోకలిసిపోయినవి. ఇప్పుడు మనకు చాకళ్లూ మంగళ్లూకూడా శాస్త్రాలు నిర్మిస్తూవున్నారు.... శాసనసభల్లో.

కృష్ణమూర్తి

చట్టప్రకారం ఈవివాహం చెల్లుతుంది, వదినెగారూ!

సోమసుందరం

ఏమిచట్టా లున్నానరే. అగ్నిసాక్షిగా, ధర్మసమ్మతంగా శాస్త్రానుసారంగా చేసుకున్నదాన్ని తప్ప ఇంకోదాన్ని భార్య అనడానికి నేను ఒప్పుకోను. సానిదానికి బొట్టుకడితే సతి అవుతుందా ? కుక్కకూ కడతారు బొట్టు మ్యునిసిపాలిటీవారు.

సుందరమ్మ

మంచిసామ్యం చెప్పారు. మీ వేణుకు చెప్పండి వస్తే.

(వీధితలుపు తట్టిన చప్పుడు.)

కృష్ణా! చూడు ఎవరో.

కృష్ణమూర్తి

(నవ్వుచు) వేణు!

(అని వెళ్లును.)

కృష్ణమూర్తి

(మళ్లీ ప్రవేశిస్తాడు చేతిలో కాగితంతో.)

వినండి. వినండి.

సోమసుందరం

ఏమిటి ?

కృష్ణమూర్తి

టెలిగ్రాము, వేణుదగ్గిరనుంచి. నేటి ఎక్స్‌ప్రెస్సులో వస్తున్నాడు — భార్యాసమేతంగా.

సోమసుందరం

ఆఁ!

సుందరమ్మ

నిజంగా ?

కృష్ణమూర్తి

అంటే ఈపాటికే వచ్చివుండాలే. టెలిగ్రాము ఆలస్యమైంది చేరడానికి.

సుందరమ్మ

ఏమి చేస్తారండి?

సోమసుందరం

ఏమి చెయ్యడం. ఈ యింట్లో మాత్రం కాపరం చెయ్య నివ్వను. వాడివాటా వాడిమొఖాన కొట్టడానికి సిద్ధంగా వున్నాను.

సుందరమ్మ

అయితే కడప తొక్కివస్తే నాళ్లని వెళ్లగొడతామా?

సోమసుందరం

నీ కెందుకు? నాపూచీ అది.

(మళ్లీ వీధిలో ధ్వని.)

సుందరమ్మ

వారే.

(పైట, తల సర్దుకుంటుంది. కృష్ణమూర్తి నిష్క్రమణ.)

[తెరలో మాటలు —.

'హలో! కృష్ణా! ఇది నావైఫ్!' 'నమస్కారం'- 'సామాన్లు ఈగదిలోనే ఉంచేయి!' 'ఏ కూలీ!—' 'హవ్ ఈజ్ ఎవ్విరి బడి'?]

[ప్రవేశం. కృష్ణమూర్తితో వేణుగోపాల్, భార్య కనకాంగి సమేతంగా. వేణుగోపాల్ సోమసుందరంగారి అన్నకుమారుడు. వయస్సు 30. వేషం, భాష, అంతా నవీనపంథా - తెలివికన్నా ఉత్సాహం ఎక్కువ. న్యాయవాది.

కనకాంగి పుట్టింది వేశ్యకులంలో. అవలంబించిన మొదటివృత్తి కులవృత్తియే గత్యంతరం లేక. సంగీతజ్ఞానం, సౌందర్యం, చాకచక్యం ఉండడంచేత కీర్తి గడించింది. ఆకీర్తి ఫిల్ముకంపెనీ వాళ్లని ఆకర్షించింది. నటి అయింది. ఆక్షణంలోనే మొదటివృత్తి వదిలివేసింది క్రొత్తచొక్కా రాగానే పాతచొక్కావలె... ధనం, కీర్తి, కావలిసినంత లభించినా గౌరవం, సంప్రదాయం అంటే అభిమానం. వివాహం అంటే గొప్ప మర్యాద...వయస్సు దాదాపు 30 ఉన్నా 21 లాగ వుంటుంది.]

వేణు

బాబయ్యగారు! నమస్కారం. పిన్నీ, ఆనవాలు పట్టినావా... మీ కోడల్ని అందరికీ పరిచయం చెయ్యవలెనని పిల్చుకొని వచ్చాను.

కనకాంగి

నమస్కారం!

సుందరమ్మ

కూర్చోండి!

కృష్ణమూర్తి

బాగా వుంది వదినెగారు! కోడలికి మర్యాద.

వేణు

ఏమి బాబయ్యా! నిరుడు చూచినప్పటికీ ఇప్పటికీ చాలా వయసు మీరినట్లు కనబడుతున్నారు ... ఒంట్లో కులాసాగా వున్నదా?

సోమసుందరం

ఆహా! నా కేమీ లేదు- రోంపైనా పట్టలేదు. నీవింకా అలిసిపోయిన ట్లున్నావు.

వేణు

అది ప్రయాణంచేత ... పిన్నీ! కోడల్ని లోపలికి పిల్చుకవెళ్లి నీళ్లు గీళ్లు ఇయ్యరాదూ?

సుందరమ్మ

ఇలా! రా.

(దారి తీస్తుంది.)

కనకాంగి

(చెంగున లేచి)

అలాగేనండి...

(సుందరమ్మతో లోపలికి వెళ్లును, కృష్ణమూర్తి రెప్పవాల్పకచూచి ఆనందిస్తున్నాడు ఆచురుకు, ఆచైతన్యం.)

సోమసుందరం

అబ్బాయి! ఏమి టీ ఆకస్మిక ఆగమనం?

వేణు

(నవ్వుచూ) ఆశ్చర్యంకదూ. అవును. మేము నిన్నటివరకూ అనుకోనే లేదు. ఆదివారం సెలవురోజే గదా, మిమ్మల్ని అందర్నీ ఒకసారి కలుసుకొని రావచ్చునని కనకాంగి చెప్పితే సరే నన్నాను. (మెల్లగా) కనకాంగికి మీరందరంటే చాలా గౌరవం, భక్తి. దానికి కొంచెమైనా అహంభావం, బడాయి లేదు...

సోమసుందరం

అయితే మళ్లీ......

వేణు

వెళ్లడమా? రాత్రికో, రేపో.

సోమసుందరం

అలాగా...కృష్ణమూర్తితో కబుర్లు చెప్పుకుంటూ వుండు. నేను అలా బజారు వెళ్లి వచ్చేస్తాను. .

(వెళ్లును.)

వేణు

ఏమి, కృష్ణా! ఏమిటివిశేషాలు?

కృష్ణమూర్తి

సరే. కూపస్థమండూకంలాగ వున్న నేనా నీకు విశేషాలు చెప్పేవాణ్ణి.

వేణు

ఒప్పుకోను, పట్టణంవిశేషాలు వేరు, పల్లెటూరు విశేషాలు వేరు... పోనీ, వివాహం ఎప్పుడు?

కృష్ణమూర్తి

విఘ్నేశ్వరునికి జరిగినమర్యాదు.

వేణు

నేనూ అలాగే అనేవాణ్ణి.

కృష్ణమూర్తి

అందరికీ దారిలో బంగారం దొరుకుతుందా?

వేణు

అంటే?

(ప్రవేశం సుందరమ్మ: కనకాంగి)

కనకాంగి

(కృష్ణమూర్తి మాటలు విన్నది.)

నన్ను దెప్పిపొడుస్తున్నారండీ ... నాలో లేకపోయినా నాపేరులో బంగారం వున్నదని.

వేణు

(నవ్వుచు) అదా! కనకాంగి వనా?

కృష్ణమూర్తి

(కనకాంగితో) ఏమండోయ్! నామీద అన్యాయంగా అపనింద మోపుతున్నారు. తమరు సార్థక నామధేయలు, యథార్థం చెప్పు తున్నాను.

సుందరమ్మ

వేణూ! నీవు కాఫీగన పుచ్చుకోవూ?

వేణు

ఎస్! కాఫీ అంటే జ్ఞాపకం వచ్చింది. నా ఓల్డు ఫ్రెండ్ రామారావును కలుసుకొని వాడితో రమణమ్మగారి కాఫీహోటలు దర్శించి రావాలి. తప్పదు కనకం! వెళ్లనా?

కనకాంగి

అయ్యో! నా ఆజ్ఞమీదనే నడుచుకొంటున్నారు గాబోలు — మీవారిదగ్గర అగుడు చెయ్యడానికి నన్ను — అంతే...

వేణు

ఆల్ రైట్; పార్డన్ మి...గుడ్ బై.

(వెళ్లును.)

(కొంతవరకు ఎవ్వరూ మాట్లాడరు. కృష్ణమూర్తి కనకాంగిని కండ్లతో తినేస్తున్నాడు. సుందరమ్మ కృష్ణమూర్తివంక కోపంగా చూస్తున్నది.)

కనకాంగి

ఓహో! గ్రామఫోను! సంగీతమంటే అందరికీ ఇష్టమేనా?

కృష్ణమూర్తి

నాకు మరిన్నీ ... మీపాటంటే చాలా ఇష్టం ...

కనకాంగి

నాపాటా! టాకీల్లోవేనా? అన్నీ సెకండు హ్యాండు హిందీతర్జుమా లేగా?

కృష్ణమూర్తి

అయితేమాత్రం మీకంఠం! అది ఫస్టుహ్యాండు కాదూ?

కనకాంగి

నాకంఠం మీరే మెచ్చుకోవాలి.

కృష్ణమూర్తి

నే నొక్కడినేనా ... ఎందరో వేలకు - పదివేలకు మించి ...

సుందరమ్మ

మీది ఏవూరండీ?

కనకాంగి

ఒకటి గాదు. పుట్టింది ఏలూరు- పెరిగింది కాకినాడ.— నాటకాలు, ఫిల్ముల కోసరం ఏవూరు పడితే ఆవూరు—బొంబాయి, కలకత్తాతో సహా.

కృష్ణమూర్తి

మాకు పుట్టడం, పెరగడం, చావడం — అన్నీ ఒక్కవూరిలోనే లెండి.

కనకాంగి

శాంతిజీవులు.

కృష్ణమూర్తి

ఆఁ- జీవచ్ఛవాలం...

సుందరమ్మ

ఒంటరిగానే వెళ్లేవారా ఇన్ని చోట్లకీ?...

కనకాంగి

అంటే?

సుందరమ్మ

మా వేణుని పెళ్లాడకపూర్వం?

కృష్ణమూర్తి

ఏమిప్రశ్న అది వదినెగారు?

కనకాంగి

జవాబు చెప్పుతున్నా ... పది మందిలో ఒంటరిగానే...

సుందరమ్మ

సమస్య.

కనకాంగి

పరమసత్యం...

కృష్ణమూర్తి

బలే! ఎంతభావం చల్లేశారు.

సుందరమ్మ

(కోపంగా) ఏమిటో! నా కేమీ అర్థం కాలేదు. మొద్దుముండను.... మీరు మాట్లాడుకోండి, నే నింట్లో పనులు చూచుకొంటాను.

(రంయ్యమని వెళ్లిపోతుంది.)

(కృష్ణమూర్తి కనకాంగివంక చూస్తాడు. కనకాంగి ఫక్కుమని నవ్వుతుంది. కృష్ణమూర్తి కూడా నవ్వుతాడు -పకపకా. ...)

కనకాంగి

కోపం వచ్చింది మీావదినెగారికి.

కృష్ణమూర్తి

ఎందుకు ?

కనకాంగి

మీాకే తెలియాలి.

కృష్ణమూర్తి

పోనివ్వండి...ఒక పాట పాడరూ?

కనకాంగి

అమ్మయ్యో! ఇక్కడ పాడడమే ?

కృష్ణమూర్తి

ఏమీా ? అరణ్యమా ?

కనకాంగి

అరణ్యంలో చక్కగా పాడుకోవచ్చును. దుష్టమృగాలుకూడా పాడుతూవుంటే ఏమీా చెయ్యవట.

కృష్ణమూర్తి

అయితే ఈయిల్లు అరణ్యంకంటే చెడ్డదిన్నీ, సింహశార్దూలాల కన్న నేను దుష్టుణ్ణి అనిన్నీ మీా అభిప్రాయం !

కనకాంగి

అంతంత ఊహలు చేస్తే నేను బ్రతకలేనండోయి ... పోనీ ... మెల్లగా పాడతాను.

(హిందీపాట పాడుతుంది.)

కృష్ణమూర్తి

(పరవశుడై పోతున్నాడు. ఆ సన్నని స్వరం మరింత తల త్రిప్పేస్తూవుంది. పాడే టప్పుడు కొంచెంగా ఎత్తిన మెడ, విప్పినకండ్లు అదురుతూవున్న నాసికాపుటాలు మోహ సముద్రంలో ముంచేస్తున్నాయి.)

హాయి! హాయి! ఏమి ఆనందం!

(అకస్మాత్తుగా తెలిసియో తెలియకనో కనకాంగిచెయ్యి పట్టుకుంటాడు.)

కనకాంగి

(పాట ఆపి) ఆగండి! ఏమి టిది? ... మరిచిపోతున్నారు.

(చెయ్యి లాగుకోపోతుంది)

కృష్ణమూర్తి

(పిచ్చిగా) వదలను. నేను వదలను... బంగారం చేతికి దొరికితే వదుల్తానా ?

(ప్రవేశం వేణు.)

వేణు

హలో !

(చూచి ఆగిపోతాడు.)

కృష్ణమూర్తి

(కనకాంగిచెయ్యి వదిలివేసి లేచి, వేణు వంక చూడకుండా)

చాలా థ్యాంక్సు ! పాట అద్భుతంగా వుంది.

(అని నిష్క్రమిస్తాడు.)

కనకాంగి

(కృష్ణమూర్తి వెళ్లగానే గొల్లుమని నవ్వి)

రండి. రండి. చాలాసంగతులు చెప్పాలి, రండి.

వేణు

(నవ్వడు, ఉత్సాహం చూపించడు.)

కనకాంగి

మీాయింట్లో ముచ్చట్లు చెప్తా, రండి. కూర్చోండి.

వేణు

(కూర్చుని) ఇంతలోనే విశేషాలా?

కనకాంగి

కావలసినన్ని...అయితే తర్కించకుండా వినాలి... మొదటివిశేషం మీాపిన్నిగారికి మరిది మీాదే మనస్సంతా.

వేణు

(ఉలికిపడతాడు.)

కనకాంగి

సందేహం లేదు. ఆవిడ అతన్ని కళ్లతో చూడ్డంలేదు; తినేస్తూవుంది. పాపం ఆ అబ్బాయి గ్రహించినట్లు లేదు; లేదా గ్రహించి మింగాలేక కక్కాలేక సందిగ్ధావస్థలో బాధపడుతూవున్నాడు. రెండోవిశేషం. నేను వచ్చినప్పటినుంచీ మీాకృష్ణమూర్తికి నామీాదే కళ్లు. మంచి యౌవనం. బ్రహ్మచారి. సంగీత సాహిత్యాలంటే అభిరుచి. ఈసంగతి అప్పుడే కనిపెట్టింది మీాపిన్ని... అల్లాంటిసంగతులు మా ఆడవాళ్లకు సులభంగా తెలుస్తవిలెండి...

వేణు

తరువాత ?

కనకాంగి

ముగ్గురమూా కూర్చుని రెండు నిమిషాలు మాట్లాడేసరికి మీాపిన్ని కోపంచేసుకొని రివ్వుమని తారాజువ్వలాగ లేచి వెళ్లిపోయింది. ఇద్దరమే ఉండిపోయాము. పాడమని బ్రతిమాలాడు. పాడుతూవుంటే హఠాత్తుగా చెయ్యిపట్టుకున్నాడు పిచ్చివాడు... నిజంగా అంత మతిపోయి ప్రవర్తిస్తాడనుకోలేదు...ఇంతలో మీారువచ్చారు ద్రౌపదీమానసంరక్షణంకోసం వేణుగోపాలమూర్తివలె.

వేణు

తల తిరిగిపోతూవుంది...రాత్రికే తప్పక వెళ్లిపోవాలి...

(లోపలికి వెళ్తాడు.)

కనకాంగి

(ఒంటరిగా వుంది కూనిరాగం తీస్తూ. ప్రవేశం మెలమెల్లగా నిర్మల.)

కనకాంగి

రామ్మా! రా. ఎవరమ్మాయివి?

నిర్మల

పంతులుగారి అమ్మాయిని.

కనకాంగి

అమ్మగారు ఏమి చేస్తున్నారు ?

నిర్మల

(పలకదు.)

కనకాంగి

నాతో మాట్లాడ వద్దన్నారా ?

నిర్మల

(ఏడుస్తూ) మా అమ్మ లేదు. చచ్చిపోయింది.

కనకాంగి

( కరిగిపోయి ) నాతల్లి విగదూ. ఏడవవద్దు. రా.

(అని చేరదీసి ప్రక్కన కూర్చోపెట్టుకుంది.)

నిర్మల

పిన్ని చూస్తే తిడుతుంది.

కనకాంగి

నే నున్నానుగా భయం లేదు చదువుకుంటున్నావా?

నిర్మల

ఓ...మాబళ్లో పాటకూడా నేర్పుతారు. నాకు పాటంటే ఇష్టం...

కనకాంగి

నే పాడనా ?

నిర్మల

(సంతోషంతో తల ఊపుతుంది. )

కనకాంగి

('చక్కనిరాజమార్గము' అనే కీర్తన పాడుతూవుంటుంది.

ప్రవేశం వెనకనుంచి సోమసుందరం గారు పాటసారస్యం అనుభవిస్తూ.)

సోమసుందరం

(పాట ఆగగానే) చాలా బాగా పాడతావు. అందులో కీర్తన, బంగారంలాంటి కీర్తన.

(నిర్మల జారిపోతుంది.)

కనకాంగి

(లేచి సగౌరవంగా) కూర్చోండి. మామగారికి వెధవ హిందూస్తానీ మట్లకన్నా మన పూర్వపుకీర్తనల పైనే అభిమానంలా వుంది.

సోమసుందరం

ఆఁ. బాగా చెప్పావు. వెధవ హిందూస్తానీమట్లు...

కనకాంగి

నా కసలు మనసంగీతం అంటేనే ఇష్టం. చిన్నప్పుడు కొంచెం నేర్చుకున్నాను కృతులు, పదాలు, జావళీలు.

సోమసుందరం

జావళీలుకూడా వచ్చునా ?

కనకాంగి

ఏవో కొన్ని.—పాడనా ?

సోమసుందరం

మెల్లగా పాడు. మెల్లగా, మృదువుగా పాడితే జావళీలు సుఖంగా ఉంటవి.

కనకాంగి

అబ్బో ! మామగారు రసికులు.

(జావళీ పాడుతుంది.)

సోమసుందరం

వహావా! చిన్నప్పుడు చదువుకున్న మనుచరిత్ర జ్ఞాపకం వచ్చింది నీకంఠం వింటే.

(కొంచెం రాగయుక్తంగా)

"రహిపుట్టజంత్రగాత్రముల రాల్ కరగించు, విమలగాంధర్వంబు విద్య మాకు..."

కనకాంగి

(చప్పట్లు తట్టుతూ, సంగీతం సాహిత్యం అన్నిట్లో ప్రవేశంవుంది మామగారికి.

సోమసుందరం

( ఒళ్లు తెలియనంతేను, కుర్చీ కనకాంగి దగ్గరకు లాక్కుంటాడు. )

ఏదీ! ఇంకోపదం ఒకటి!

కనకాంగి

( పాడుతూంటుంది.)

సోమసుందరం

(కనకాంగి పాడుతూవుంటే తాళం వేస్తుంటాడు. తప్పిపోయో ఉద్దేశించో ఒక దరువు కనకాంగి తొడమీద వేస్తాడు.)

కనకాంగి

(చప్పుమని పాట ఆపి లేచి నిలబడుతుంది.)

శ్రుతి మారిపోతూంది.

సోమసుందరం

(ఖంగారుతో లేచి, తడబడుతూవుంటే వీధితలుపు తట్టిన చప్పుడు వినబడుతుంది).

వస్తున్నా : వస్తున్నా.

(అని త్వరగా వెళ్లి శంకరశాస్త్రితో ప్రవేశిస్తాడు )

(శంకరశాస్త్రి సోమసుందరంగారి ఆప్త వర్గంలోవాడు. రమారమి ఏకవయస్కులే ఇద్దరు. రసికుడు.)

శంకరశాస్త్రి

ఎవరది? కనకమా?...కనకమే!

కనకాంగి

శాస్త్రిగారు!

సోమసుందరం

(ఇక నిక్కడుండకూడ దనుకొని)

కూర్చో, కూర్చో. ఇప్పుడే వస్తా. (వెళ్తాడు.)

శంకరశాస్త్రి

నిజంగా ఇవి నాకళ్లేనా?...నేను మేలుకున్నానా ...ఎన్నాళ్లకెన్నాళ్లకు.

కనకాంగి

అంత ఆపేక్ష మరి.

శంకరశాస్త్రి

(కూర్చుని) నేనేమిచెయ్యను? అందరానిపండు వైపోయావు ... అన్నట్లు ఇక్కడికెలా వచ్చావు, ఆశ్చర్యంగా వుంది.

కనకాంగి

ఇంకా ఆశ్చర్యం ... నే నెవ్వరి ననుకున్నారు ? ... సోమసుందరం గారి కోడల్ని.

శంకరశాస్త్రి

(పకపక నవ్వుచు) తరవాత ?

కనకాంగి

మీరు నమ్మటం లేదు. ఒట్టు.

శంకరశాస్త్రి

అంటే వేణు పెళ్లాడాడా నిన్ను?

కనకాంగి

ఊఁ.

శంకరశాస్త్రి

ఎలాగ ? చెల్లుతుందా ?

కనకాంగి

ఓ: చట్టం వుందట.

శంకరశాస్త్రి

ఓసి. ఎంతపని చేశావు! సోమసుందరంగారి వంశం అంటే అంత ఛాందసులని ప్రతీతి ... దిగ్విజయమే నీది...ముసలివాడు ఒప్పుకున్నాడా?

కనకాంగి

వివాహం అయ్యాక తెలిసింది వారికి. నన్ను చూచింది నేడు.

శంకర

మండిపడ్డాడా?

కనకాంగి

లేదు. వచ్చినప్పుడు చల్లగా పైకి వెళ్లిపోయారు. మళ్లీవచ్చాక ఎవ్వరూ లేకపోతే నాసరసన వచ్చి కూర్చున్నారు. పాడమన్నారు. పాట మెచ్చుకున్నారు.

శంకర

ఆఁ ఆఁ...

కనకాంగి

(నవ్వుతూ) పాటపారవశ్యంలో గాబోలు పొరబాటున తాళం నాతొడపైన వెయ్యడం మొదలు పెట్టారు.

శంకరశాస్త్రి

(విరగబడి నవ్వుచు) ఓరి ముసలి నక్కా!

కనకాంగి

(నవ్వుచు) పాపం! ఖంగారుపడి పోయారు నేను అదిలించేటప్పటికి.

శంకరశాస్త్రి

ఎంత అవస్థ!

(ఇద్దరు కలసి నవ్వుతూఉంటే ప్రవేశం వేణుగోపాల్.)

వేణు

(కఠినంగా) కనకం! ఏమిటది!.. శాస్త్రులుగారు! నమస్కారం!

శంకరశాస్త్రి

చాలాకాల మైందికదూ, వేణు! విన్నాను. కనకం చెప్పింది. అదృష్ట వంతుడవు. కనకం మంచి పిల్ల.

వేణు

(ఈప్రసంగం నచ్చడం లేదు.)

కనకాంగి

శాస్త్రులుగారు నన్ను చిన్నప్పటినుంచీ ఎరుగుదురండి.

వేణు

ఓహో!

(సోమసుందరంగారు ప్రవేశించి)

సోమసుందరం

శంకరం! రావోయి!...

(అని వీధికి దారితీస్తాడు.)

శంకరశాస్త్రి

కనకం! సెలవు. కొన్నిరోజు లుంటారా ?

వేణు

లేదు. రాత్రికే ప్రయాణం.

శంకరశాస్త్రి

అయితే సెలవు.

(సోమ, శంకర, నిష్క్రమణ.)

కనకాంగి

ఎందుకండీ అంత కోపంగా వున్నారు ?

వేణు

వైఖరి బాగా వుంది. వచ్చి రోజన్నా కాలేదు. కృష్ణమూర్తితో

సరసం, ఎవడో కోన్ కిస్కా శాస్త్రి లతో నవ్వు తాలు, పిన్నితో దెబ్బ లాట...

కనకాంగి

అవును. అన్నీ నాతప్పేగదూ? ముసలివాణ్ణి కట్టుకొని మరిదిమీద మీపిన్ని మరులుకోవడం నాతప్పే. పిచ్చి బ్రహ్మచారి అందమైన పిల్ల కనబడగానే అపకతవకగా ప్రవర్తిం చడం నాతప్పే. మరిది నామీద కన్ను వేశాడని ఆవిడఉడికిలితే నాదే తప్పు ... ౬౦ ఏండ్ల ముసలివాడు ధర్మశాస్త్రాలు తలక్రిందుగా చదివే మీ బాబయ్య ఒంటరిగా చూచి వద్దచేరి, వావీ వరసా లేకుండా, నాతొడమీద చెయ్యి వేస్తే నాదే తప్పు. ఎప్పుడో కాకినాడలో మా యింటి ప్రక్కనున్న శాస్త్రిలతో ఆగొడవ చెప్పుకొని నవ్వితే అదీ నాతప్పే...

వేణు

ఆఁ ఆఁ... అంతపని చేశాడా బాబయ్య...తనంత...నీవు ప్రోత్సా హం చెయ్యకుండా... కృష్ణమూర్తి మాత్రం...నీవే వాళ్లని బుట్టలో వెయ్యడానికి ప్రయత్నించివుంటావు.

కనకాంగి

రామ రామ!

వేణు

చాల్చాలు. అసహ్యం. వెనకటి బుద్ధి ఎక్కడ పోతుంది?

కనకాంగి

(లేచి దీనంగా) అలా అనకండి. నన్ను చంపేస్తున్నారు...

వేణు

నిన్ను పదినిమిషాలు వదిలి వెళ్ల డానికి జంకుగా వుంది. ఏమైనా చేస్తావు...అవును. నీలాంటిదాన్ని పెళ్లి చేసుకోవడమే పొరపాటు.

కనకాంగి

ఆఁ.

వేణు

అప్పుడే ఇద్దర్ని చెడగొట్టినావు.

కనకాంగి

నేనా? వెర్రికుక్కల్లాగ వాళ్లు పైనబడితే...

వేణు

ఛప్. నోరు ముయ్యి.

కనకాంగి

(దుఃఖం కోపం ఆపుకుంటూ) ఎందు కంతమాట?

వేణు

వెళ్లి పోవాలి ఈ రాత్రికే.

కనకాంగి

సరే.

వేణు

(లోపలి కివెళ్లిపోవును.)

కనకాంగి

(కండ్లనీళ్లు తుడుచుకొని, నిరసనభావం తో పెదవి విరిచి, మంగళసూత్రం చేతితో తెంపి పారవేసి)

చిఛీ! ఏమి మగవాళ్లు...

(వీధి గుమ్మంవైపు వెళ్లుతుంది.)



# తమిళభాషా ప్రాచీనత

**చిలుకూరి నారాయణరావు**

భాష అనేది అనాది. పశుపక్ష్యాదులకు గూడా వాటి జీవితావసరములకు కావలసిన భాష ఉండనే ఉంటుంది. దానిని గురించి ఎవ్వరున్నూ పరిశోధన చేయలేదు. మనుష్యునికి మాత్రం మాట్లాడేజంతువు అని పేరు పెట్టినారు. ఈ మనుష్యులు దేశభేదమునుబట్టి, కాలభేదమునుబట్టి, యితర అవస్థాభేదములనుబట్టి వేర్వేరు సంఘములుగా నివసించి, భాషావిషయమై ప్రత్యేక సంకేతములను ఏర్పాటు చేసుకొని జీవిస్తున్నారు. ఆయా తెగల భాషలన్నీ మొదట ఏకభాషగా ఉండి ప్రత్యేక భాషలుగా విడిపోయినవో, లేదా ప్రత్యేకభాషలుగా ప్రత్యేక స్థలములలో ఉద్భవించి, ఆయాజాతుల పరస్పర సమ్మేళనమువలన విశాలమైన భాషలుగా పరిణమించినవో చెప్పడానికి వీలులేదు.

ప్రపంచములోని భాషల నన్నిటిని వర్గీకరించి వాటివాటి లక్షణసామ్యమువల్ల శాస్త్రజ్ఞులు వాటిని వేర్వేరు కుటుంబములుగా విడదీసినారు. ఆకుటుంబములలో ఇండో-యూరోపియనుకుటుంబము చాలా విస్తారమైనది. అది ఆసియా, యిరోపాఖండములలోని అనేక భాషలకు సామాన్యమైన కుటుంబముగా ఉన్నది. ఆ ఇండో - యూరోపియను భాషలలో వైదికభాష, సంస్కృతభాష, ప్రాకృతభాషలు అనేవి చేరిఉన్నవి. భారతవర్షములోనున్న భాషల కన్నిటికిన్నీ ఇవి మూలములని ఆయాభాషల వ్యాకరణములను వ్రాసినవారు తెలిపి ఉన్నారు. కాని కాల్డువెల్లు అనే పాశ్చాత్యపండితుడు దక్షిణ ఇండియాలోని ద్రావిడభాషలకును, ఉత్తర హిందూస్థానములోని ఆర్యభాషలకున్ను ఎట్టి సంబంధమున్ను లేదనిన్నీ, ద్రావిడభాషలు మధ్యఆసియాలో ఉండిన, ఇండో-యూరోపియను భాషలకు సంబంధించని, సిథియను భాషలతో పోలిక గలిగి ఉన్నవనిన్నీ, సిద్ధాంతము జేసినాడు. అసలు సిథియనుభాషా కుటుంబ మనుపేరే తగినదికాదనిన్నీ, సిథియనుభాషలని చెప్పబడేవాటిలోనే పరస్పర సంబంధము కానరాకున్నదనిన్నీ, సిథియను భాషలని చెప్పబడేవాటిలో కొన్ని ఇండో-యూరోపియను భాషాకుటుంబమునకు జెందినవనిన్నీ, సిథియను భాషలకున్ను ద్రావిడ భాషలకున్నూ గల కాల్డువెల్లు చూపిన పోలికలు సరియైన పోలికలు గావనిన్నీ నిర్ణయిస్తూ గ్రియరుసను మొదలైన పాశ్చాత్యపండితులు ద్రావిడభాషలను ప్రత్యేక కుటుంబముగా ఏర్పాటు చేసినారు. సంస్కృత ప్రాకృతములకును ద్రావిడభాషలకునుగల సంబంధమును గురించి వారెట్టి పరిశ్రమనూ చేయలేదు. హిందూదేశ చరిత్రమునుబట్టి ఆలోచిస్తే ద్రావిడులను అనార్యజాతులుగా పరిగణించడానికి కారణములు కనబడవు. హిందూదేశములో అనార్యజాతులు లేకపోలేదు. కాని జాతులకున్ను, భాషలకున్ను ఎడతెగని సంబంధము ఉంటుందని చెప్పవీలులేదు. బలవంతులు, నాగరికులు ఐన జాతులవారి భాషలను, అంతకంటె తక్కువ నాగరికత కలవారు అవలంబిస్తారని చెప్పడానికి ప్రపంచ చరిత్రనుండి అనేకములైన ఉదాహరణములను చూపవచ్చును. ద్రావిడభాషల తత్త్వమునుబట్టిన్నీ, దక్షిణ హిందూదేశపు చరిత్రమునుబట్టిన్నీ, లక్షణగ్రంథములను వ్రాసిన పండితుల అభిప్రాయములనుబట్టిన్నీ ఆలోచిస్తే, ద్రావిడభాష లార్యకుటుంబములో చేరినవే అనిన్నీ, అవి ఒకరీతి ప్రాకృతభాషా విశేషము లనిన్నీ నేను రచించిన ఆంధ్ర భాషాచరిత్రములో నిరూపించడానికి ప్రయత్నించినాను.

హిందూదేశములోని అనేక భాషలలో వాఙ్మయము లేదు. ఉత్తర హిందూస్థాన భాషల వాఙ్మయము చాల నవీనమైనది. ద్రావిడభాషావాఙ్మయము అంతకంటె కొన్ని శతాబ్దములకు పూర్వమునుంచీ ఉన్నట్లు చరిత్ర తెలుపుతున్నది.

ద్రావిడభాషావాఙ్మయములో అతి ప్రాచీనమైనది తమిళ మనిన్నీ తరువాత కన్నడ వాఙ్మయమూ, పిమ్మట తెలుగువాఙ్మయమూ, ఆ తర్వాత మలయాళవాఙ్మయమూ ప్రాచీనము లనిన్నీ ఇప్పుడు మనకు లభ్యములైన గ్రంథజాలమునుబట్టి చరిత్రకారులు నిర్ణయించినారు. ఇది స్థూలముగా సత్యముగానే కనిపిస్తున్నది. ఈప్రాచీనత విషయమున తమిళ భాషకును తక్కిన ద్రావిడభాషలకును వేయిసంవత్సరములకు తక్కువకాని అంతరమును తమిళభాషాప్రియులు నిర్ధారణచేస్తున్నారు. తమిళభాష తమిళవిద్వాంసులు చెప్పినంత ప్రాచీనమైనది కాదనిన్నీ, ప్రధాన ద్రావిడభాషలలో వాఙ్మయ మించుమించు ఏకకాలముననే బయలువెడలిన దనిన్నీ, చెప్పడానికి తగిన ఆధారము లున్నవి.

తమిళభాష అతిప్రాచీనమైనదని చెప్పడానికి ముఖ్యాధారము దానిలో "సంగం" ('సంగము') వాఙ్మయము అనేది ఉండడమని తమిళభాషాప్రియులు చెప్పతున్నారు. కనకసభాపిళ్లగారు "౧౮౦౦ ఏండ్లక్రిందట తమిళులు" (Tamils 1800 years ago) అనే గ్రంథమును వ్రాసి దానికి సంగంవాఙ్మయమునే మూలాధారముగా చేసి తమిళులు తమ తమిళభాషతోపాటు, క్రీ. శ. మొదటి శతాబ్దములలో అత్యుచ్ఛదశలో ఉండేవారని తెలిపినారు. నాటినుంచిన్నీ పాశ్చాత్యచరిత్ర

కారు లాసిద్ధాంతమునే అవలంబించి దానిని లోకములో ప్రచారముచేసినారు. కొందరు తమిళులు తమభాష కా ప్రాచీనత చాలక క్రీస్తుపూర్వము ఐదవశతాబ్దమునుంచిన్నీ తమిళభాష ఉన్నదని నిర్ధారణ చేయడానికి ప్రయత్నించినారు. ఇటీవల తమిళపండితు లలో కొందరు క్రీస్తు మొదటి శతాబ్దముల వరకుమాత్రము తమిళభాషావాఙ్మయమును నిలిపినారు. కొందరు దానిని క్రీ. శ. ఏడవ శతాబ్దమువరకును తీసుకొనివచ్చినారు. ఈ రీతిగా తమిళపండితులలోనే తమిళభాషా ప్రాచీనతనుగురించి అనేకములైన భిన్నాభిప్రాయము లున్నవి.

ఈ ప్రాచీనతను నిర్ణయించడానికి ఈ పండితుల కందరికిన్నీ గల ఆధారము 'సంగము వాఙ్మయ'మనేది ఒక్కటే. ఈ వాఙ్మయము స్వరూపమును మనము కొంతవరకు తెలుసు కొంటేనేగాని తమిళభాషా ప్రాచీనతత్త్వము బోధపడదు. తమిళములో పాటలు, పదములు మొదలైన గేయరూపములతో కొంతవాఙ్మయ మున్నది. ఆపాటలలో కొన్నిటిలో పూర్వవీరులపరాక్రమము, దాతృత్వము మొదలైన గుణవిశేషములు కీర్తింపబడిఉన్నవి. కొన్నిటిలో శృంగారరసము వర్ణితమైఉన్నది. కొన్నిటిలో నీతు లుపదేశింపబడినవి. కొన్ని మతవిషయములకు సంబంధించినవి. వీటి అన్నిటినుంచిన్నీ ఆయాపాటలు రచింపబడిన కాలమునాటి జనుల ఆచారవ్యవహారములను గురించి తెలుసుకొనవచ్చును. మొదట ఈ పాటలున్నూ, పదములున్నూ చాటువులవలె ప్రత్యేకము ప్రత్యేకముగా ఉండేవి. వాటి నన్నిటినీ ఎవరో ఒకచోట జేర్చి "అహం" "పురం" మొదలైన విభాగములుగా ఏర్పాటు చేసినారు. "అహం" అనగా శృంగారమును వర్ణించునట్టి భాగము. "పురం" అనగా పరాక్రమము మొదలైన విషయములను వర్ణించే భాగము. ఈరీతిగా ఆయా సంపుటములను ఏర్పాటుచేసి వానిలోని ప్రత్యేకములైన పాటలకును పదములకును ఛందో వ్యాకరణాలంకారాది జ్ఞాపికలతో ఆగ్రంథములను వ్రాసి ఉంచినారు.

ఈ జ్ఞాపికలలో కొన్నిటిని తరువాతివారు కూడా చేర్చినారు. ఈగ్రంథములలోని పాటలున్ను పదములున్ను అనేకములు చాల చిన్నవి. కొన్ని పెద్దవికూడా కలవు. కొన్నిటిలో వాటిని రచించిన కవులపేళ్లు అంకితములై ఉన్నవి. కొన్నిటిలో లేవు. ఈగ్రంథ సంచయముల వ్రాతప్రతులలో అనేకములయిన తబ్బిబ్బులు కానవస్తున్నవి. వాటిలో పాఠభేదము లనేకము లున్నవి. ఈపాఠభేదముల వలన ఆపాటల కర్తృత్వాది విషయమున ఎన్నో సందేహములు కలుగుతున్నవి. వీటి నన్నిటిని గమనించి మహామహోపాధ్యాయ వి. స్వామినాథయ్యరుగారు అనేకవ్రాతప్రతులను పరిశోధించి తమయభిప్రాయమున కనుకూలమగునట్లు వాటిని పాఠభేదముల ననుసరించి సవరణలను చేసి లభ్యమయిన ఈవాఙ్మయమును ప్రకటించినారు. దీనినే సంగము వాఙ్మయమని అంటున్నారు.

"సంగము" అనేది సంఘశబ్దభవము. రాజాస్థానములందు ప్రఖ్యాతి వహించిన మహాకవులు నియమింపబడి, దేశములో కవిత్వము చెప్పగలవారు చేసిన కావ్యములు తమచే పరిశీలింపబడి తమ మెప్పును పొందితేనే గాని వాటికి ప్రచారము కలుగగూడదని శాసించేవారట. ఈమహాకవుల సమూహము నకే సంగమని పేరుండేదట. ఇటువంటిసంగములు మూడు ఉండేవట. ఈసంగముల గూర్చిన గాథ "ఇరైయనార్ అహప్పొరుళ్" అనే గ్రంథముమీది వ్యాఖ్యానములో ఈవిధముగా ఉన్నది.

'పాండ్యరాజులు ఆదిసంగము, మధ్యసంగము, అంత్యసంగము అని మూడు సంగములను స్థాపించినారు. వీటిలో మొదటి సంగములో ౫౪౯ మంది కవు లుండేవారు. వీరిలో మొదటివాడు 'అగత్తియనార్' (అగస్త్యుడు). త్రిపుర సంహారకుడైన ధూర్జటి శివుడు, మురుగన్ లేక కుమారస్వామి, మురంజియూరి ముడినాగరాయడు, దిక్పాలకుడైన కుబేరుడు కూడా యీపరిషత్తు లోనివారే. వీరి యెదుట ౪౪౪౯ మంది కవులు తమకావ్యములను విమర్శార్థము సమర్పించినారు. ఆ కావ్యములలో 'పరిపాడల్', 'ముదునారై', 'ముదుకురుహు', 'కలరియావిరై' అనేవి కొన్ని ఉన్నవి. ఈసంగములోని ౫౪౯ మందిన్నీ ౪౪౪౦ ఏండ్లు తమ వ్యాపారమును సాగించినారు. వారిని 'కాయ్సినవళుది' అనేరాజునుండి 'కడుంగోన్' అనేరాజువరకు ౮౯ మంది రాజులు ఆదరించినారు. ఈ రాజులలో ఏడుగురు స్వయముగా కవులు. ఈసంగము మదురలో ఉండేది. ఈమదుర తరువాతికాలమున సముద్రములో మునిగి పోయినది. ఈ సంగమువారు 'అగత్తియమ్' అనేవ్యాకరణమును ప్రమాణముగా తీసుకొన్నారు.

రెండోసంగములో ౫౯ మంది ఉండేవారు. వారిలో 'అగస్త్యుడు', 'తొల్కాప్పియనారు', 'ఇరుందయ్యూర్ కరుంగోయి', 'మోశి', 'వెల్లూర్ కాప్పియనారు', 'శిరుపాండరంగన్', 'తువరై' (ద్వారక) రాజైన 'తిరైయన్ మారన్', 'కీరందై' అనేవా రుండేవారు. వీరియెదుటికి 3౭౦౦మంది తమకావ్యములను తెచ్చినారు. ఆకావ్యములలో 'కలి', 'కురుహు', 'వెండాళి', 'వియాళమాలై అహవల్' అనేవి కొన్ని. అగత్తియం', 'తొల్కాప్పియము', 'మాపురాణము', 'ఇశైనుణుక్కము', 'బూదపురాణము' అనేవీ వీరనుసరించిన వ్యాకరణములు. ఈసంగము 3౭౦౦ సంవత్సరము లున్నది. 'వెండేల్ శెళియన్' అనే రాజునుండి 'ముర త్తిరుమారన్' అనే రాజువరకు ౫౯ మంది పాండ్యరాజులు దాని నాదరించినారు. ఈ రాజులలో ఐదుగురు స్వయముగా కవులు. ఈసంగము కపాటపురములో

చేరేది. ఈస్థలముకూడా సముద్రములో మునిగిపోయి ఉంటుంది.

మూడో సంగములో ౪౯ మంది ఉండే వారు. వీరిలో ముఖ్యులు శిరుమేదావి యారు, శేందం బూదనారు, అరివుడయ నార్ పెరంగొంయూల్ కిళార్, ఇళం దిరుమారన్, నల్లందోనార్, మరుదన్ ఇళనాగనార్, నక్కిరర్ అనేవారు. వీరి యెదుటికి ౪౪౯ మందికవులు వచ్చినారు. వారు పరిశీలనార్థము సమర్పించిన కావ్యములలో 'నెడుందొగై' (అహనానూఱు), కురుందొగై – నానూఱు, నట్రిణై – నానూఱు, పుఱ – నానూఱు, అయింగుఱు – నూఱు, పదిట్రుప్పత్తు, (పదిపదులు), కళి (నూటయాభై), పరిపాడల్ (డెబ్భై), కూత్తు, వరి, శిట్రిశై, పేరిశై అనేవి ముఖ్యములు. ఈ సంగము వారు 'అగత్తియము,' 'తొల్కాప్పియము' అనేవ్యాకరణాలను ప్రమాణములుగా అంగీకరించినారు.

ఈసంగము ౧౮౫౦ సంవత్సరము లుండినది. తన రాజ్యములో కొంత భాగము సముద్రములో మునిగిపోగా మదురలో రాజధానిని స్థాపించుకొన్న 'ముడత్తిరు మారన్' అనేరాజు నుండి ౪౯ మంది రాజులీ సంగమును ఆదరించినారు. ఈరాజులలో తుదివాడు 'ఉక్కిరప్పెరువళుది' అనేవాడు. ఈసంగము ఉత్తర మదురలో అనగా నేటిమదురలో సమావేశమయ్యేది.'

పైని తెల్పిన విషయములం దత్యద్భుతములు, అసాధారణములు, అసాధ్యములు, అసంభావ్యములు ఐన సంగతులు గోచరిస్తున్నవి. శివుడు, మురుగడు, కుబేరుడు మొదలైన దేవతలే యీసంగములలో ఉండడమూ, ఈ దేవతలు ఊరును పేరును లేని కవులతోను, కవయిత్రులతోను కలసి ఉండడమూ, ఈ సంగము లుండిన అతి దీర్ఘకాలము, పాండ్యరాజుల దీర్ఘరాజ్యకాలములు, కృత్రిమపుటంకెలు, ఒకసంగపుకవి తక్కిన సంగములలోకూడా ఉండడము, ఇవన్నీ యీసంగం గాథ కృత్రిమ మనిన్నీ, కల్పిత మనిన్నీ చెప్పకయే చెప్పతున్నవి. మొదటి సంగము ౪౪౪౦ ఏండ్లుండినదట. ఇంతకాలములోనూ ౪౪౪౯ మంది కవులుమాత్ర మున్నారట. రెండవ సంగములో ౩౭౦౦ ఏండ్లకు ౩౭౦౦ మందే కవులున్నారట. మూడవ సంగములో ౧౮౫౦ ఏండ్లున్నూ ౪౪౯ మంది సభ్యులట. అంటే ఈమూడు సంగములకాలము, ౪౪౪౦ + ౩౭౦౦ + ౧౮౫౦ = ౯౯౯౦ సంవత్సరము లన్నమాట. తక్కిన పదేండ్లను చేర్చి పదివేలేండ్లుగా చేస్తే బాగుండేది. విన్నవారు నమ్మరేమోనని అట్లుచేయడం మానివేశి ఉంటారు.

ఈ సంగములగాథ అవిశ్వసనీయ మనడానికి ఈక్రింది కారణములను మద్రాసు విశ్వవిద్యాలయము పరిశోధక శాఖలో పనిచేస్తూ ఉన్న కె. ఎన్. శివరాజపిళ్లగారు వివరించి ఉన్నారు.

౧. సంగములను గూర్చిన సంప్రదాయము జనసామాన్యమునకు తెలియదు. కొందరు విద్వాంసులును పురోహితులునూ గలసి దీనిని కల్పించినారు.

౨. సంగం గ్రంథములు అని చెప్పబడే వాటిలో ఏసంగమును గూర్చిన్నీ ప్రస్తావన లేదు.

౩. సంగము వాఙ్మయములో గనబడే రాజకీయ సాంఘికపరిస్థితులనుబట్టి అట్టి సంగ స్థాపనకుగాని, పోషణకుగాని అవకాశములు లేవు.

౪. ఈ సంగసంప్రదాయములో తెలుపబడిన విషయములును, అంకెలును చాలకృత్రిమములు. వాటిని బుద్ధిపూర్వకముగా అంకగుణితము చేసి ఆరీతిగా ఏర్పరచినట్లు స్పష్టమవుతున్నది. అవి సహజములు కావు.

౫. సంగసభ్యులలో దేవతలనూ మనుష్యులనూ కలిపి చేర్చడము ఆర్యులు తమిళదేశము నాక్రమించి తమపురాణకథలను తమిళదేశములో వ్యాపింపజేయ ఆరంభించినకాలము నుండి జరిగిఉంటుంది.

౬. మూడుసంగముల కాలమైన ౯౯౯౦ సంవత్సరములను వాటిని పోషించిన పాండ్య రాజులసంఖ్య ౧౯౭తో భాగిస్తే ఒక్కొక్క తరమునకు ౫౦ చిల్లర ఏండ్లు ఏర్పడుతవి. సాధారణముగా ఒక్కొక్క తరమునకు ౨౫ ఏండ్లకంటె ఎక్కువ ఇవ్వడానికి వీలులేదు.

౭. ఈ దీర్ఘకాలములో ఒకటి రెండు సార్లు సముద్రము భూమిని ముంచివేసినది. అట్టి సందర్భములో ఒక సంగమునాటి వృత్తాంతములు తక్కినసంగమువారికి ఎట్లు తెలిసినవో వింతగా ఉన్నది.

౮. మదురకు 'తళయ్యాలన్ గానత్తుపాండ్యన్' కాలమువరకును 'కూడల్' అనే పేరుండేది. దానికి తరువాతికాలములో ఉత్తర మదుర అనిపేరు పెట్టడము దక్షిణమదుర సముద్రములో మునిగిపోయినదని చెప్పినదానిని సమర్థించుకొనడానికై ఉంటుంది. ఆప్రాచీన కాలంలో మదురఅనే సంస్కృతము పేరుండడానికి వీలులేదు.

౯. మొదటి రెండు సంగములలోని గ్రంథములలో ఒక్కటిన్నీ నేడు మిగిలి ఉండలేదు. ఆ రెండుసంగములలోని గ్రంథముల విషయము కేవలము కట్టుకథగాని మరొకటి గాదు.

౧౦. ఈ సంగములవృత్తాంత మంతా అసహజము, అశాస్త్రీయము. ఏ దేశములోనైనా, జ్ఞానము, పాండిత్యము క్రమక్రమంగా అభివృద్ధి ఔతవిగాని ఒక్కసారిగా అత్యుచ్చ దశపొంది నానాటికిన్నీ క్షీణించిపోవు. సంగమును గూర్చిన కథనుబట్టి తమిళవాఙ్మయములో నానాటికి క్షీణత ఉన్నట్టు తెలుస్తున్నది. ఇది సరికాదు.

ఇట్టి కారణములనే తెలుపుతూ ఇతర తమిళవిద్వాంసులుకూడా మొదటి రెండు సంగములను వదలుకొన్నారు.

ఇక మూడో సంగమును గూర్చిన గాథ. 'వంగియ సాగరన్' (వంశశేఖరుడు) అనే

రాజు కాలములో కాశీపట్టణములో బ్రహ్మకు సరస్వతిమీద కోపము వచ్చి ఆమెశరీరమైన ౫౧ వర్ణములలో ఆ నుండి హ వరకుగల ౪౮ వర్ణములునూ మనుష్యజన్మ మెత్తి కవు లగుదురుగాక అనిన్నీ, తక్కిన వర్ణములకు మొదటిదిన్నీ, మధురలోని దేవుడున్నూ అయిన అకారము దేహమును ధరించి కవియై తక్కిన వారితో ౪౯-వవాడై ఒకసంగమును స్థాపించునుగాక అనిన్నీ అతడు చెప్పినాడట. ఆశాపము ప్రకారము ౪౮ అక్షరములున్నూ భౌతిక దేహములతో ప్రపంచములో సంచరిస్తూ, అనేక స్థలములలో విద్వాంసులతో వాదములు చేసుకొంటూ తుదకు మదురకు జేరుకొన్నారట. అక్కడ వారికి శివుడు, మనుష్య రూపముతో ఎదురుపడి మదురలోని దేవుని పూజించవలసిన దని ఉపదేశించినాడట. అప్పుడు వారు ఆదేవునిమీద పద్యములను జెప్పి పాండ్యరాజు సమ్ముఖమునకు పోయినారట. ఆరాజు దేవాలయమునకు వాయవ్యదిశను వారికోస మొక సభామంటపమును గట్టించి వారి కనేకములైన బహుమానములను చేసినాడట. అంతకుపూర్వము రాజ సమ్మానమును బొందుతూ ఉండే విద్వాంసుల కీర్ష్య పుట్టినదట. ఈ కొత్తవిద్వాంసులు పాతవిద్వాంసులను వాదములో ఓడించి ఇతరుల కవితా ప్రాశస్త్యమును, పాండిత్యమును పరీక్షించేటప్పుడు తాము కూర్చొనడానికి ఒక కట్టెపలకను ప్రసాదించవలసిన దని శివుని వేడుకొన్నారట. అప్పుడు శివు డొక కవివేషముతో వారికి సాక్షాత్కరించి రెండుజేనల చదరపు పలకను చేతితో పట్టుకొని వారియెదుట నిలిచినాడట. వారాపలకకు ధూపమువేసిన మీదట 'నక్కీరరు' మొట్టమొదట దాని మీద కాలుపెట్టినాడట.

అతని తరువాత ఒకరివెనుక ఒకరు కపిలరు, పరణరు మొదలైనవా రెక్కినారట. సరియైన విద్వాంసుడు దానిపై ఎక్కుతూఉన్న కొద్దీ ఆపలక పెద్దదికావడ మారంభించిందట. ఇట్లు కొంత కాలానికి నాకవిత్వం గొప్పదంటే నాకవిత్వం గొప్పదని ఆ కవులు పోట్లాడు కోవడం ఆరంభించినారట. అందుచేత శివుడు పదేపదే వచ్చి వారివివాదాలను పరిష్కారం చేసేవాడట. ఇది కథ.

ఈగాథ విశ్వాసపాత్రమైనా కాకపోయినా సంగమనే దొకటుండే దనిన్నీ, మూడు లే వనిన్నీ స్థిరపరుస్తుంది. ఈమూడో సంగముకూడా లేదనే తమిళ విద్వాంసులు కూడా లేకపోలేదు. కాని తమిళ వాఙ్మయమునుబట్టి తమిళభాషప్రాచీనతను నిర్ణయించడానికి ఇంకా అనేకులు ప్రయత్నిస్తున్నారు కాబట్టి దాని తత్త్వమునుగురించి కొంతవరకు ఆలోచింతాము.

మొదటి సంగములోని గ్రంథములన్నీ పోయినవి. దానిలోని 'పరిపాడల్' అనేది మూడో సంగముదై ఉంటుంది. తక్కిన గ్రంథములకొనను 'నార్రై కురుహు' అనే పదము లుండడంచేత అవి సంగీతగ్రంథములై ఉండవచ్చు నంటారు. రెండోసంగం గ్రంథములుకూడా అన్నీ నష్టములై పోయినవి. అప్పటి గ్రంథములలో 'తొల్కాప్పియమ్' మాత్రము మిగిలినది. కాని ఇదికూడా మూడో సంగములోనిదే అని కొంద రంటారు; కొందరు ఈ తొల్కాప్పియము నవీనమైనదని కూడా అంటారు. ఈ తొల్కాప్పియమును గురించి యీక్రింధగాథను చెప్పతారు.

మూడో సంగంకాలమున పాండ్యదేశములో ద్వాదశవర్ష క్షామము కలిగినదట. అప్పుడు పాండ్యరాజు తనసభలోని పండితులనూ కవులనూ పోషించలేక మరియెక్కడికైనా పోయి జీవనము చేయమని పంపివేసినాడట. కరువు పోయిన తర్వాత అక్కడక్కడ మిగిలిన పండితు లందర్నీ పిలిపించి అడుగగా వారిలో యెవ్వరికిన్నీ తొల్కాప్పియములోని 'ఇరైయనార్ అహప్పొరుళ్' అనే భాగమునుగురించి తెలియలేదట. ఏమిచేయుదునా అని రాజు ఆలోచిస్తూంటే శివునికి రాజుమీద కనికరం పుట్టి యీభాగమును అరవై సూత్రములలో పూర్తిచేసి రాగిరేకులమీద చెక్కించి మధుర దేవాలయములోని విగ్రహముపీఠముక్రింద పెట్టి పోయినాడట. పూజారి ఉదయం పోయి గర్భగుడిని తుడుస్తూంటేగా ఈ రాగిరేకులు అతనికంట బడినవట. తొల్కాప్పియములోని అంత పెద్దఅధ్యాయము అరవై సూత్రములలో మాత్రము సంగ్రహింపబడడముచేత దానిఅర్థ మెవరికిన్నీ బోధపడలేదు. అందుచేత రాజుగారు ఆ స్థానవిద్వాంసులను ఆసూత్రములకు వ్యాఖ్యానము వ్రాయమన్నాడట. అనేకులు ప్రయత్నించినారు. కాని ఆ వ్యాఖ్యానము సరిగా ఉన్నదో లేదో నిర్ణయించడానికి ఒక అధ్యక్షుడు కావలసి వచ్చింది. అట్టి అధికారం కలవాడు ఎవడున్నూ కనిపించలేదు. అందుచేత రాజు శివునికే మొరపెట్టుకున్నాడు. మొరపెట్టుకోగా అతడు మదురలోనున్న ఒక బ్రాహ్మణుని కొడుకును చూపినాడు. ఆ పిల్లవాని వయస్సు ఐదేండ్లు. వాడు పుట్టుమూగ. వాని పేరు రుద్రశర్మ. వాని తండ్రిపేరు 'ఉప్పూరి కుడికిళార్.' ఆమూగబాలునికి యీ వ్యాఖ్యానము లన్నీ చదివి వినిపించినారు. ఒకొక్క వ్యాఖ్యానము వింటూ వాడు ఊరుకునేవాడు. తుదకు 'మరుగన్ ఇడనాగన్' అనేవాని వ్యాఖ్యానమును చదువుతూంటే కొన్నికొన్ని పట్టులలో ఆపిల్లవాడు ఏడ్చేవాడట. తరువాత 'నక్కీరర్' తన వ్యాఖ్యానమును చదవ నారంభించినప్పటి నుండి ముగించేవరకూ ఒకటే ధారగా కన్నీళ్లు విడిచినాడట. ఈ తొల్కాప్పియములో మూ డధికారము లున్నవి. 'ఎయత్తదిగారం', 'శొల్లదిగారం', 'పొరుళదిగారం' అని వాటిపేళ్లు. గ్రంథములో మొత్తము ౧౬౧౨ సూత్రము లున్నవి. ఒకొక్క అధికారంలో తొమ్మిది 'ఇయలు' లున్నవి. ఈ గ్రంథముపై అనేకులు వ్యాఖ్యానములు వ్రాసినారు.

పై గ్రంథము కాక మూడో సంగమునకు సంబంధించిన గ్రంథములు 'ఎట్టుత్తొహై', 'పత్తుప్పాట్టు', 'పదినెణ్ కీల్ కణక్కు' అనేవి. వీటికి శిలప్పదిగారం, మణిమేహలై అనేవాటినికూడా కొందరు చేరుస్తారు. ఈ

తుదిరెండున్నూ నవీనము లని, అనగా తరు వాతికాలపు వని కొందరి అభిప్రాయము.

'ఎట్టుత్తొహై' అనే గ్రంథములో 'నట్రిణై', 'కురుందొహై', 'ఐంగుఱు నూఱు', 'పదిట్రుప్పత్తు', 'పరిపాళల్', 'కలి త్తొహై', 'నెడుందొహై', 'పుఱనానూఱు' అనే ఎనిమిది గ్రంథసంపుటము లున్నవి.

౧. 'నట్రిణై'లో నన్నూటఒక్క పద్యము లున్నవి. ఒకొక్క పద్యములో తొమ్మిది నుండి పండ్రెండు పంక్తులవరకు ఉన్నవి. ఇవి ౧౭౫ మందికవులు రచించినవి. ఈపద్య ములు ఐదు 'తిణై'లకు సంబంధించినవి. 'తిణై' అనగా ఒకస్థల మన్నమాట. ఇవి 'ముల్లై' (పర్వత ప్రాంతములు), 'మరుదం' (నదీ ప్రాంతములు), 'పాలై' (ఎడారులు), 'నెయ్దల్' (సముద్రతీరములు), 'కురింజి' (అరణ్యములు) అని ఐదు విధములుగా ఉంటవి. మనుష్యుని నాగరికత ఆయా స్థల ములందు వరుసగా అభివృద్ధి పొందుతూ వచ్చిందని దీనికర్థం చెప్పతారు. 'నట్రిణై' లో 'ముల్లై'కు సంబంధించినవి ౨౮, మరు దం'కు సంబధించినవి ౩౨, 'పాలై'కు సంబం ధించినవి ౧౦౪ 'నెయ్దల్'కు సంబంధించినవి ౧౦౩, 'కురింజి'కి సంబంధించినవి ౧౨౦ పద్యము లున్నవి. ప్రణయము వీటిలోని విష యము. 'పన్నాడుతంద పాండియన్ మాఱన్ వఴుది' అనే పాండ్యరాజు ఈ పద్యము లన్నిటినీ ఒకచోట చేర్పించినాడు. ఈగ్రంథ మమీద ప్రాచీన వ్యాఖ్యాన మేదీ లేదు. క్రీ. శ. ఎనిమిదో శతాబ్దిలో మహాభారత మును 'తమిళించిన' పెరుందేవనార్ అనేవాని ఈశ్వరస్తోత్రరూపమైన పద్యము ఈ గ్రంథ మున కాదియం దున్నది. ఈ విషయమును బాగుగా గమనించవలెను.

౨. 'కురుందొహై' అనగా చిన్నపద్య ముల సంపుట మన్నమాట. దీనిలో ౨౦౫ మందికవుల 'అహవల్' ఛందస్సులో నన్న ౪౦౨ చిన్నపద్యములు చేరినవి. ఒకొక్క పద్యమునకు నాల్గునుండి ఎనిమిది పంక్తులుంటవి. 'నట్రిణై'వలెనే వీనిలోని పద్య ములు ప్రణయ విషయకములు. వీటినికూడ ఐదు 'తిణై'ల క్రింద విభాగించవచ్చును. ఈ గ్రంథమును 'పూరి' అనేదేశపు రాజైన 'పూరిక్కో' అనేవాడు ఒకచోట చేర్పించి నాడు. దీనిమీద 'పేరాశిర్యర్', అనేవాడు వ్యాఖ్యానమును వ్రాసెనట. కాని అదిప్పుడు లేదు. దీనిలోని ౨౦ పద్యములమీదమాత్రము 'నచ్చినార్క్కిణియర్' వ్రాసిన వ్యాఖానము మాత్ర మున్నది.

౩. 'ఐంగుఱునూఱు', అనగా ఏనూరు చిన్నపద్యము లన్నమాట. ఇవికూడా 'అహ వల్' ఛందస్సులోనే ఉన్నవి. నూరేసిపద్య ముల కొకభాగముక్రింద ఈ గ్రంథమును ఐదుభాగములుగా విభజించవచ్చును. వీటిలో ఒకొక్క పద్యములో మూడునుండి ఆరుపం క్తులవరకు ఉన్నవి. ఐదు భాగములలో ఒక్కొక్క భాగమును ఐదు'తిణై'ల క్రింద విభజించ వచ్చును. మొదటి భాగములోని నూరుపద్యములు నదీప్రాంతమునకు సంబంధిం చినవి. వీటిని వ్రాసినకవి 'ఓరంబోగియార్'. రెండోభాగమును 'అమూవనార్' రచించినాడు. దీనిలోని పద్యములు సముద్ర తీరమునకు సంబంధించినవి. మూడోశతక మును కపిలరు వ్రాసినాడట. దీనిలోని పద్య ములు అరణ్యవాసుల ప్రణయమునకు చెంది నవి. నాల్గోశతకమును 'ఓదలాందయ్యార్' అనేకవి రచించినాడు.

దీనిలో పద్యములు ఎడారులకు సంబం ధించినవి. 'తేయనార్' అనేకవి పార్వతీయ ప్రేమకు సంబంధించిన ఐదోశతకమును రచించి నాడు. ఈగ్రంథమును ఒకచోట చేర్చిన విద్వాంసునిపేరు 'కూడలూర్ కిళార్' అనే సంగ్రహనామముగల 'పులత్తురై ముట్రియ కూడలూర్ కిళార్' అనేవాడు. ఈవిద్వాం సుడు 'చేరమాన్ ఇరుంమొఱై' అనే సంగ్రహ నామముగల 'యానైక్కాట్ శైమాందరన్ జేరల్ ఇరుంమొఱై' అనేరాజు ఆస్థానము వాడు. ఈ గ్రంథముమీద వ్యాఖ్యాన మేదీ దొరకలేదు.

౪. 'పదిట్రుప్పత్తు' – అనగా పదిపదులు. దీనిలో చేరవంశమునకు సంబంధించిన అనేక రాజుల పరాక్రమము వర్ణింపబడినది. పది భాగములలోనూ మొదటిదిన్నీ తుదిదిన్నీ యిప్పుడు లేవు. తక్కిన ఎనిమిది సంపుటము లలో ఒకొక్కదానిలో నూరుపద్యము లున్నవి. వీటిలో ఇమయవరంబన్ నెడుంజేరలాతన్, పల్యానై చెల్కెళు కుట్టువన్, కలంగాక్కణ్ణి నార్ముడిచ్చేరల్, శంగుట్టువన్, అతని కొడుకు కుట్టువన్ జేరల్, ఆడుకోట్పాట్టు చ్చేరలాతన్, శెల్వక్కడుంగోవాళియాతన్, తగడూరింద పెరుంజేరల్ ఇరుంపొఱై, కుడక్కో ఇళంజేరలిరుంపొఱై అనేరాజులపేర్లు కనబడుతున్నవి. రెండోపదిలో 'ఇమయవ రంబన్' ఏభైయెనిమిదేండ్లు రాజ్యముచేసి నట్టున్నూ, మూడోపదిలో అతని తమ్ముడు 'పలియానైకుట్టువను' ఇరవైయేండ్లు రాజ్యము చేసినట్టున్నూ తెలుస్తున్నది. ఈరెండోవాడు 'పాలైగోదవనార్'అనేవానికి గొప్పయజ్ఞము చేయడమునకు సహాయముచేసినట్టున్నది. నాలుగోపదిలో 'నార్ముడిచ్చేరలు' ఇరవై సంవత్సరములున్నూ, ఐదోపదిలో శంగుట్టవను ఏభైయేండ్లున్నూ, ఆరోపదిలో చేరలా తను ముప్పైఎనిమిదేండ్లున్నూ రాజ్యమేలిన ట్లున్నది. ఏడోపదిలో 'శల్వక్కడుంగోను' ౨౦ ఏండ్లున్నూ, ఎనిమిదోపదిలో'ఇరుంబొఱై' ౧౭ ఏండ్లున్నూ, తొమ్మిదోపదిలో 'కుడక్కో' ౧౬ ఏండ్లున్నూ రాజ్యముచేసినట్లు తెలుపబడ్డది. ఈ'పదిట్రుప్పత్తు'ను ఎవరు గ్రంథముగా కూర్చినారో, ఏరాజు కూర్పించి నాడో తెలియదు.

౫. 'పరిపాడల్' – అనే గ్రంథము మొదటి సంగముగ్రంథములలోనూ, మూడోసంగము గ్రంథములలోనూకూడా కనపడుతున్నవి. ఈరెండుగ్రంథములున్నూ వేరువేరుఐనయెడల, మొదటి సంగములోనిది నశించినది. మనకు మిగిలినగ్రంథములో ౨౪ పద్యములు మాత్రము మిగిలిఉన్నవి. వీటిమీద 'పరిమేలళగరు' వ్యాఖ్యానము వ్రాసినాడు.

౬. 'కలిత్తొహై' — అనేపేరు దానిలోని నూటయాభై పద్యములన్నూ 'కలి' అనే ఛందస్సులో వ్రాయబడడమువల్ల కలిగినది. ఈగ్రంథమునకు కురుంగలిత్తొహై లేక 'కలి' అనికూడా పేర్లున్నవి. దీనిలోని పద్యములు ఐదు 'తిణై'లకు సంబంధించినవి. వీటిలోని విషయము ప్రణయమేఐనా, కొన్ని నీతివాక్యములుకూడా ఉన్నవి. దీనిలోని పద్యములనుబట్టి ఆకాలములోని వివాహములను గురించిన ఆచారములు కొన్ని తెలుస్తున్నవి. దీనిలోని పద్యములను కడుంగోఙ్, కపిలర్, మరుదఙ్ ఇళనాగనార్, చోళ నల్లుత్తిరఙ్, నల్లందువనార్ అనేకకవులు రచించినారు. ఈ పద్యములను ఎవరు చేర్చినారో, ఎవరు చేర్పించినారో కూడా తెలియదు. పైకవులలో ఒకడైన నల్లందువనారే వీటిని చేర్చినాడని ప్రతీతి. నచ్చినార్క్కిణియరు యీ గ్రంథము మీద వ్యాఖ్య వ్రాసినాడు.

౭. 'నెడుందొహై' — దీనికి అహప్పాట్టు, అహనానూఱు, అహం అనికూడా పేర్లున్నవి. దీనిలో ౪౦౧ పద్యములు 'అహవల్' ఛందస్సులో ఉన్నవి. వీటిని 'కైట్రియానైనిరై' అనే ౧౨౧ పద్యములుగాను, 'మణిమిడైపవళం' అని ౧౮౦ పద్యములుగాను, 'నిత్తిలకోవై' అని ౧౦౦ పద్యములుగాను విభజించినారు. ఈగ్రంథములోని విషయముకూడా ప్రణయమే. పద్యములలో ౧౩ నుండి ౩౨ వరకు పంక్తు లున్నవి. దీనిలో ౧౪౫ మంది కవులపేర్లు కనబడుతున్నవి. వీటి నన్నిటిని మదురలోని 'ఉప్పూరిగుడికిళార్' అనేవాని కొడుకైన 'ఉరుత్తిరశర్మఙ్' అనేవాడు పాండ్యరాజైన 'ఉక్కిరప్పెరువళుది' అనే వాని ఆస్థానమున గ్రంథముగా కూర్చినాడు.

౮. 'పుఱనానూఱు' — లేక 'పుఱప్పాట్టు' లేక 'పుఱం' అనే గ్రంథములో 'అహవల్' ఛందస్సులో ౪౦౦ పద్యము లున్నవి. ఇది అహనానూరు అనేదానికి శేషగ్రంథ మనవచ్చును. ఈగ్రంథములో తర్వాతికాలపు 'పాయిగెయ్యార్' అనే కవిపే రుండడము చేత ఇది నవీనగ్రంథ మని కొందరంటారు.

ఇంతవరకునూ 'ఎట్టుత్తొహై' అనే గ్రంథమును గురించి వ్రాయబడినది. ఇక 'పత్తుప్పాట్టు'లో పదికావ్యములున్నవి. 'ఇరైయనార్ అహప్పొరుళ్' అనేగ్రంథపు వ్యాఖ్యానములో చెప్పబడ్డవాటిలో ఈగ్రంథము లేకపోవడముచేత ఇది సంగంకాలపు గ్రంథము కాదని కొందరంటారు. కాని వాటిలో 'ఎట్టుత్తొహై'లోని భాగములను రచించిన కవులున్నూ, దానిలో చెప్పబడ్డ రాజులున్నూ దీనిలోగూడా ఉండడముచేతనున్నూ, భాషావిషయమునుబట్టిన్నీ దీనిని సంగంకాలపు గ్రంథముగానే పరిగణించవలసిన దని కొందరి వాదము.

ఈగ్రంథములో (౧) తిరుమురు హాట్రుప్పడై, (౨) పొరునరాట్రుప్పడై, (౩) శిఱుపాణాట్రుప్పడై, (౪) పెరుంబాణాట్రుప్పడై, (౫) ముల్లైప్పాట్టు, (౬) మదురైక్కాంజి, (౭) నెడునల్వాడై, (౮) కురింజిప్పాట్టు, (౯) పట్టణప్పాలై, (౧౦) మలైపడుకడామ్ — అని పదికావ్యము లున్నవి.

౧. వీటిలో 'తిరుమురు హాట్రుప్పడై'లో ౩౧౭ పంక్తు లున్నవి. దీనిని వ్రాసినకవి 'నక్కీరర్'. తమిళదేశములో వివిధ దేవాలయములందున్న మురుహానికి (కుమారస్వామికి) స్తోత్రములుగా ఈపాటలు కూర్చబడినవి. సుబ్రహ్మణ్యభక్తు లందరున్నూ ఈపద్యములను తప్పక వల్లెవేసుకుంటారు. ఈకావ్యము మీద నచ్చినార్క్కిణియర్ వ్రాసిన వ్యాఖ్య ఉన్నది.

౨. 'పొరునరాట్రుప్పడై'— దీనిని వ్రాసిన కవి 'ముడత్తామక్కణ్ణియార్.' దీనిలో చెప్పబడ్డరాజు ఇలంజేట్చెన్ని కొడుకైన కరికాల్ చోడన్. దీనిలో కరికాలచోడునిపుట్టి వృత్తాంతము, అతని వీరకృత్యములు, జన్మపాలనా సామర్థ్యము వర్ణితమైనవి. ఈకావ్యములో ౨౪౮ పంక్తు లున్నవి.

౩. 'శిఱుపాణాట్రుప్పడై' — దీనిని 'ఇడైక్కళినాట్టునల్లూర్ నత్తత్తనార్' అనేకవి రచించినాడు. దీనిలోని రాజుపేరు ఓవియర్ తెగకు చెందిన ఓయిమానాట్టిప్రభువైన 'నల్లియక్కోడన్' అనేవాడు. ఈ రాజుపేరే కాక మరికొందరు చిన్నప్రభువుల పేర్లున్నూ ఈ గ్రంథములో గలవు. దీనిలో ౨౬౯ పంక్తు లున్నవి.

౪. 'పెరుంబాణాట్రుప్పడై' దీనిని రచించినకవి — 'కడియలూర్ వురుత్తిరన్ కణ్ణనార్.' 'పత్తినప్పాలై' అనేభాగమును రచించినకవికూడా ఇతడే. 'పొరునరాట్రుప్పడై'లో చోళరాజ్యము వర్ణింపబడియుండగా, నీ గ్రంథములో కాంచీరాజ్యము వర్ణింపబడినది. దీనిలోనిరాజు 'తొండైమాఙ్ ఇళందిరయఙ్' అనేవాడు. దీనిలో ౫౦౦ పంక్తు లున్నవి.

౫. 'ముల్లైప్పాట్టు' ను కావిరిప్పూంబట్టినమ్‌లోని 'నప్పూదనార్' అనేకవి రచించెను. దీనిలో ౧౦౩ పంక్తు లున్నవి. 'తలైయాలంగానమ్' రాజైన నెడుంజెలియఙ్ అనేవాని స్తోత్రమే ఈకావ్యము. దీనిలోని విషయము ప్రణయము. యుద్ధమునకు వెళ్లిన వీరుడైన తనభర్తయెడల, అతనిప్రేయసికి గల ప్రణయమిందు వర్ణితమైనది.

౬. 'మదురైక్కాంచి' ని వ్రాసినవాడు మాంగుడి మరదనార్. ఈగ్రంథములో పాండ్యరాజ్య మభివర్ణితమైనది. దీనిలో స్తుతింపబడిన రాజు పాండ్యఙ్ తలైయాలంగానత్తుచ్చెరువెన్ర నెడుంజెలియఙ్ అనేవాడు. దీనిలో ౭౮౨ పంక్తు లున్నవి.

౭. 'నెడునల్వాడై' అనే గ్రంథమును వ్రాసినవాడు 'నక్కీరర్'. ఇందలిరాజు 'తలైయాలంగానమ్'నకు సంబంధించిన నెడుంజెలియన్. యుద్ధమునకు వెడలిన ప్రియునికై అతనిప్రేయసికి గల ప్రణయ మిందు వర్ణితము. దీనిలో ౧౮౮ పంక్తు లున్నవి.

౮. 'కురింజిప్పాట్టు'ను కపిలర్ రచించెను. ఒకచక్కనియువతి మరియొకకన్యకతోజొన్న

చేనిని కాచుటకు బంపబడినది. ఒకకొండ రాజు వేటాడుతూ అక్కడకు వచ్చి ఆమెను చూచి మోహించి గాంధర్వవివాహం చేసుకున్నాడు. నాటినుంచిన్నీ వా రిద్దరున్నూ జొన్నచేనిలో కలుసుకుంటూ ఉండేవారు. ఆ సంగతి ఆమెతలిదండ్రులకు తెలియదు. ఆమె నానాటికిన్ని కృశించిపోతున్నది. దానికి కారణమును కన్యక తల్లితో చెప్పింది. వారిద్దరికీ పెండ్లిచేసినారు. ఇది దీనిలోని కథ. కావ్యములో ౨౬౧ పంక్తు లున్నవి.

౯. 'పత్తినప్పాలై' అనే కావ్యమును వ్రాసినవాడు ఉరుట్టిరన్ కణ్ణనార్. దానిలోనిరాజు కరికాల్ చోళన్. కావ్యము సొగసును గుర్తించి రాజు కవికి ౧౬౦౦౦౦౦ పొన్నులు బహుమానముగా నిచ్చినాడట. దీనిలో ౩౦౧ పంక్తు లున్నవి.

౧౦. 'మదురైకాంజి' — దీనికి 'కూత్తరాట్టుప్పడై' అని నామాంతరము కలదు. దీనిని పెరుంగౌశిగనార్ అనేకవి రచించినాడట. దీనిలోని ౫౮౩ పంక్తులలో 'నన్నన్' అనేవానినిగురించిన్ని, వానిపూర్వికులను గురించిన్నీ వర్ణన లున్నవి.

'పదినెన్ కీళ్ కణక్కు' - ఇది నీతిని బోధించే ౧౮ కావ్యములుగల సంపుటము. కీళ్ కణక్కు అంటే ఏభైపద్యములకు తక్కువ ఉన్న కావ్య మన్నమాట. ఏభైనుండి ౫౦౦ పద్యముల వరకుగల కావ్యములకు మేల్ కణక్కు అని పేరు. 'ఎట్టుత్తొహై', 'పత్తుప్పాట్టులు' 'మేల్ కణక్కు' గ్రంథములు. ఈ కీళ్ కణక్కులో చేరిన ౧౮ గ్రంథములున్ను ఇవి :—

౧. తిరుక్కురళ్ - దీనికి ముప్పాల్ అని కూడా పే రున్నది. దీనిని తిరువళ్లువర్ రచించినాడు. ఇతడు క్రీ. పూ. మొదటి శతాబ్దములలో ఉండేవా డని కొందరున్ను, క్రీ. తర్వాత ౬, లేక ౭ శతాబ్దములలో ఉండేవాడని కొందరున్ను అంటారు. దీనిలోని పద్యములు ద్విపదల రూపముగా నున్నవి; అంటే ఒకొక్క పద్యములో రెండుపాదము లుంట వన్నమాట. వాటికిన్నీ తెనుగులోని ద్విపదలకున్నూ సంబంధము లేదు. వీటిలో ధర్మార్థ కామముల విషయము బోధింపబడినది. గ్రంథములో ౧౩౩ అధ్యాయము లున్నవి. ఒకొక్కధ్యాయములో ౧౦౦ పద్యము లున్నవి. ఈగ్రంథము తమిళవాఙ్మయములో ఉన్నత స్థానము నాక్రమించినది.

౨. నాలడియార్ - ఇదీ కురళ్ వంటి గ్రంథమే. దీనిలో అధ్యాయమునకు ౧౦ పద్యముల చొప్పున ౪౦ అధ్యాయము లున్నవి. ఈ పద్యములను వివిధకవులు రచించినారు. వాటిని పదుమనార్ అనే ఆయన ఒకచో జేర్చినాడు. ఈ పద్యములలో ముత్తరైయర్ల ప్రశంస ఉండడముచేత ఇది ఎనిమిదో శతాబ్దపు దని కొంద రంటారు.

౩. కళవై నాల్పదు - అనగా యుద్ధ పద్ధతులను, సాధనములను తెలిపే నలభై పద్యము లన్నమాట. దీనిని 'పొయిహైయార్' అనే కవి రచించినాడట. దీనిలోనిరాజు చేరన్ కణైక్కాల్ ఇరుంబొరై అనేవాడు. ఇతనిని శేంగణాన్ అనేచోడరాజు కళుమలంయుద్ధములో ఓడించి కుడవాయిలులో చెరలో ఉంచినాడు.

౪. కైనిలై అనే గ్రంథము వ్రాతప్రతిమాత్ర మున్నది. ఇంకా అచ్చుపడలేదు.

౫. ఇనియవై నాల్పదు, లేక ఇనియదు నాల్పదు - లో నలభై పద్యము లున్నవి. దీనిని పూదన్ శేందనార్ అనేకవి రచించినాడట. ఇనియవై అనగా ఇష్టార్థము లని యర్థము. అట్టి అర్థములు ప్రపంచములో ౧౨౬ కలవని కవి యీగ్రంథములో తెల్పినాడు.

౬. ఇన్నా నాల్పదు - ఈగ్రంథమును కపిలరు రచించెను. దీనిలోకూడా నలభైపద్యము లున్నవి. ఇన్నా అనగా అనిష్టమని అర్థము. అనిష్టార్థములు లోకములో ౧౬౪ ఉన్నవనిన్నీ, బుద్ధిమంతుడు వాటిని కోరకూడ దనిన్నీ కవి యీగ్రంథములో ఉపదేశించినాడు.

౭. నాన్మణిక్కడిగై-అనేగ్రంథమును విళంబినాగనార్ రచించెను. ఈకవిని గురించి ఏమిన్నీ తెలియదు. గ్రంథమునుబట్టి అతడు వైష్ణవు డైనట్టు తెలిసికోవచ్చును. గ్రంథములో ౧౦౪ పద్యము లున్నవి. మనుష్యుడు చేయవలసిన, చేయరాని పనులనుగురించి ఈ గ్రంథములో ఉపదేశింపబడినది.

౮. కార్ నాల్పదు. - దీనిని రచించినకవి మదురైక్కణ్ణన్ కూత్తనార్. ఈగ్రంథములో ౪౦ పద్యములున్నవి. విషయము ప్రణయము. ప్రోషితభర్తృక విరహ మిందు వర్ణితము. గ్రంథము మేఘసందేశముమాదిరిగ నుండును.

౯. ఐందిణై ఐంబదు. - ఇదికూడా శృంగారగ్రంథమే. దీనిని మారన్ బొరైనార్ రచించినాడు. ఇతనినిగురించి ఏమీ తెలియదు. దీనిలో ఏభైపద్యము లున్నవి.

౧౦. తిణైమొళియైంబదు. దీనిని శాత్తందయార్ కొడుకైన కణ్ణంశేందనారు రచించినాడు. కవినిగురించి ఇంతకంటె ఏమిన్నీ తెలియదు. దీనిలో ఏభై పద్యములునూ ఐదు తిణైలకు సంబంధించినవి గలవు.

౧౧. వెందిణై ఎళుబదు.- ఇది పైరెండు గ్రంథములవంటిదే. కవి మువ్వాదియార్. ఇతనినిగూర్చి యేమిన్నీ తెలియదు. గ్రంథములో ౭౦ పద్యము లున్నవి. విషయము శృంగారము. ౧౪ పద్యముల కొక తిణై చొప్పున వర్ణన లున్నవి.

౧౨. తిణైమాలై నూఱ్ఱైంబదు. ఇది పై మూడు గ్రంథముల వంటిదే. కణిమేదావియార్ అనేవాడు. దీనిని వ్రాసినాడట. దీనిలోని ౧౫౦ పద్యములున్ను ఐదుతిణైలకు సంబంధించిన శృంగారవర్ణనములుగనున్నవి. కవినిగూర్చిన యితరవిషయములు తెలియవు.

౧౩. తిరిగడుహం (త్రికటుకం). దీనిలోని ౧౦౧ పద్యములను నల్లాదనార్ అనేకవి వ్రాసినాడు. త్రికటుకములు ఏరీతిగా శారీరిక రోగములను పోగొట్టునో అట్టేరీతిగా

ఈ పద్యములలోని యుపదేశములు మానసిక రోగములను పోగొట్టి శాంతి నిచ్చునని కవి అభిప్రాయము.

౧౪. ఏలాది. ఇది తిరిగడుహం అనే గ్రంథమువంటిదే. తిరిగడుహములోని ఒక్కొక్క పద్యములో మూడేసి ఇష్టపదార్థములు చెప్పబడి ఉండగా దీనిలో ఆరేసి చెప్పబడినవి. ఈ ఉపదేశములుకూడా మానసిక రోగములను పోగొట్టేమందులే. ఈ గ్రంథములో ౮౦ పద్యము లున్నవి. దీన్ని వ్రాసినవాడు కణిమేదావియారు. ఇతడు జైనుడుగా కనబడుతున్నాడు. గ్రంథములో నాల్గువేదముల ప్రశంస ఉన్నది.

౧౫. ఆచారక్కోవై అనే గ్రంథమును పెరువాయిల్‌లోని ముళ్లియార్ రచించినది. దీనిలో గృహస్థుల ధర్మములు వివరింపబడినవి. ధర్మశాస్త్రములో నున్నట్లే దీనిలో గృహస్థధర్మములు వివరింపబడ్డవి.

౧౬. పళమొటి నానూఱు.— దీనిని రచించినవాడు మున్రుఱయ్యఱయ్యార్. ఇతడు జైనుడు. ఈ గ్రంథములో నన్నూరుపద్యము లున్నవి. ఒకొక్క పద్యము తుదను ఒకొక్క సామెత ఉన్నది. ఈ సామెతలు కొన్ని నేడును వాడుకలో ఉన్నవి.

౧౭. శిఱుపంచమూలం-అనగా మందుకు పనికివచ్చే ఐదువేళ్లన్నమాట. దీనిలో ౯౭ పద్యము లున్నవి. పంచమూలములవల్ల శారీరికరోగములు కుదిరినట్లే, ఈ ఉపదేశములవల్ల జననమరణరోగము కుదురుతుందట. కవిపేరు కార్యాశాన్. గ్రంథములోని విషయము స్వధర్మము, అహింస, సత్యము, మాంసాహారవర్జనము, అస్తేయము అనేవి.

౧౮. ముదుమొళికాంజి.- దీనిని రచించినవాడు మదురై కూడలూర్‌కిళార్. గ్రంథములో పది అధ్యాయము లున్నవి. అధ్యాయమునకు సూత్రప్రాయముగా పదినీతివాక్యము లున్నవి. లోకములోని అనిత్యపదార్థములకు నిత్యత్వముకలిగే ఉపాయము ఈ గ్రంథములో తెలుపబడినది. దీనిని రచించినకవి పుఱనానూఱు, కురుందొహైలలోని కొన్ని పద్యములనుగూడా వ్రాసినాడు. ఇతడు తొండైమండలమువాడని కొందరున్ను, మదురవాడని కొందరున్ను అంటారు.

ఇంతవరకున్ను సంగముగ్రంథము లని చెప్పబడేవాటినిగురించి సంగ్రహముగా చెప్పబడినది. వీటిని ఆధారముగా చేసికొని తమిళవిద్వాంసులు తమిళభాషాప్రాచీనత్వమును స్థిరపరచడానికి ప్రయత్నిస్తున్నారు. వీటిలో తెలుపబడిన రాజులుగాని ఇతర నాయకులుగాని ఎవ్వరున్నూ చరిత్రప్రసిద్ధులు కారు. వీరిని గురించి తెలిపే ఒక్క శాసనమున్నూ లేదు. ఆయా పురుషుల పేళ్లు వికారములుగా ఉండడమే కాకుండా సాధారణమనుష్యుల కుండవలసిన పేళ్లుగాకూడా కనబడవు. వారివారి గుణములను వర్ణించే పదములు వారి పేళ్లుగా ఉదాహరించడమువల్ల అవి కల్పితనామము లేమో అనిపించును. ఐనా తమిళవిద్వాంసులు ఆయా పురుషులను చరిత్రపురుషులుగా నమ్మి వారికాలమును నిర్ణయించడానికి పాట్లుపడుతున్నారు. వారిలో నక్కీరరు, కపిలరు, పరణరు, అవ్వయ్యారు, అనేవారి చరిత్రములను వర్ణించడానికి ప్రయత్నములు జరుగుతూఉన్నవి. వీ రందరున్ను క్రీస్తుమొదటిశతాబ్దములవా రని ఎట్లాగో సరిపెట్టుకొంటున్నారు. కాని వారి కాలనిశ్చయమునకు తమ ఊహలే ఆధారముగా ఉన్నవి కాని సరియైన ఒక్క కారణమున్ను వీ రెవ్వరున్ను చెప్పియుండలేదు. చారిత్రకపురుషులుగా కనబడే కరికాలుడు, కోచ్చెంగణాన్, శెంగుట్టువన్ మొదలైనవారిని గురించికూడా అవిశ్వసనీయములైన, లేక అతిశయోక్తులతో కూడిన కొన్ని గాథలు మాత్రము కనబడుతున్నవి కాని వారిని గురించి మరేమిన్నీ తెలియదు. అందుచేతనే వీరు చాలాపురాతనపురుషులుగా ఎన్నబడవలెనని సంగమవాదు లంటారు. వారు చారిత్రికపురుషులు కారనిగాని, ఇతివలి పురుషులై ఉండవచ్చుననిగాని చెప్పడ మెంత నిర్హేతుకముగా ఉంటుందో వారు క్రీస్తుశకారంభమున ఉన్నవా రని చెప్పడముకూడా అంత నిర్హేతుకముగానే ఉంటుంది.

వీరిపేళ్లలో ఒకటిన్నీ ఒక్క శిలాశాసనములోగానీ ఒక్క తామ్రశాసనములోగానీ కనిపించకపోవడము చాలా వింతగా కనబడకమానదు. ఐనా శాసనములమీద అంత నమ్మకముంచి గ్రంథస్థవిషయములను, అనగా తాటియాకులమీద వ్రాసిన విషయములను నమ్మకపోవడానికి కారణము కనబడ దని నీలకంఠశాస్త్రిగారు మొదలైనవారు తమ గ్రంథములలో శాసనపరిశోధకులను, వాటిపై విశ్వాసముగలవారిని ఎత్తిపొడిచినారు. కాని శాసనస్థవిషయములకున్ను గ్రంథస్థవిషయములకున్ను ఒక గొప్పభేద మున్నది. శాసనము శిలాశాసనమైనయెడల దానిని కల్పించడానికి వీలే ఉండదు. శిలాశాసనాలు సాధారణముగా జను లందరియెదుటనూ నిత్యమునూ కనబడుతూఉండేవి. వాటిని ఫోర్జరీ చేస్తే వెంటనే యెప్పటి కప్పుడు దొరకిపోతారు. తామ్రశాసన విషయములలో ఫోర్జరీలు కలగడానికి అవకాశము లేకపోలేదు. కాని ఏవి ఫోర్జరీలో ఏవి కావో కనుగొడానికి అనేకమార్గము లున్నవి. వ్రాతలోని భేదమునుబట్టి తిథి, వార, నక్షత్ర, మాస, సంవత్సరములలోని అవకతవకలనుబట్టి, రాజుల పేళ్లను ఉదాహరించడములో తబ్బిబ్బులనుబట్టి ఇంకా ఎన్నివిధములుగానో ఫోర్జరీలను సులభముగా కనుగొనవచ్చును. అట్టి కృత్రిమశాసనముల నెన్నింటినో ఫ్లీటు మొదలైనవారు కనుగొని ప్రకటించియే ఉన్నారు. ఒకవేళ శిలాశాసనములుకూడా ఫోర్జరీలైనయెడల వాటినికూడా సులభముగా కనుగొనవచ్చును. ఇదిగాక శాసనములు ఒకసారి వ్రాయబడినతర్వాత స్థిరముగా నిలిచిపోతవి. వాటిలో మరెట్టిమార్పున్నూ కలుగదు. కలుగజేయడానికి ప్రయత్నిస్తే రాయి పగిలిపోవడమో క్రిందియక్షరము స్పష్టముగా కనిపించడమో జరిగితీరుతుంది. తామ్రశాసనములవిషయములోకూడా ఇంతే,

ఇట్టివాటినే ఇంగ్లీషులో పేలింప్‌సెస్టులు (Palimpcesta) అంటారు. ఇట్టివాటిని కూడా ఎన్నింటినో శాసనపరిశోధకులు కనిపెట్టియే ఉన్నారు. గ్రంథముల వ్రాతప్రతులవిషయములో అట్లు గాదు. అక్షరములు వ్రాయబడిన ఆకు చిరస్థాయిగా నిలవదు కొద్దికాలములో అది చివికిపోతుంది.

అందుచేతనే గ్రంథములను మరల మరల ఎత్తి వ్రాయవలసి ఉంటుంది. ఏ తాటాకు పుస్తకంగూడా నేటికి మున్నూరేండ్లకు పూర్వపుది దక్షిణహిందూదేశములో ఇంతవరకున్నూ కనబడలేదు. గ్రంథములను త్రిప్పి వ్రాసేటప్పుడు గ్రంథవిషయమును వ్రాయసగాని జ్ఞానము ననుసరించి మారిపోవడము సంభవిస్తుందని వ్రాతప్రతులను పరిశోధించినవారికి తెలిసినసంగతే. అందులో విషయములు కవుల నోళ్లలో పడి బుద్ధిపూర్వకముగానూ, కాకుండానూకూడా అనేకవికారములకు లోనైనవి. ఒకడు మరియొకణ్ణి మించవలెనని తనపాండిత్యము చూపించి, ఉన్నదానిని మార్చి, లేనిదానిని కూర్చి, ఉన్నదానిని పెంచి లేక కుదించి, అద్భుతవిషయములను జేర్చి, సాధారణవిషయములను ఆశ్చర్యావహములుగా జేసి, ఎన్నోమార్పులను గలుగజేస్తూంటారు. ఇట్టిగ్రంథములను పరమ ప్రమాణములుగా స్వీకరించడము సాహసమే. గ్రంథములోని విషయములు శాసనములలోని విషయములను స్థిరపరుపగలుగునేగాని, చారిత్రకముగా వానికెక్కువవిలువను ఇచ్చుటకు వీలులేదు. గ్రంథస్థవిషయములు శాసనములమూలమున స్థిరపడును. శాసనాధారములు లేనప్పుడు చారిత్రకముగా గ్రంథములు నిరుపయోగములు.

దక్షిణహిందూదేశమున అశోకుని నాటి నుండియు శిలాశాసనములు కానవచ్చుచున్నవి. అవి సంఖ్యలో వెనుకకు పోనుపోను తక్కువ ఔతున్నమాట నిజమే. ఆరోశతాబ్దమునుంచిన్నీ మనకు శిలాశాసనములసంఖ్య హెచ్చవుతున్నది. తామ్రశాసనములుకూడా పల్లవులకాలమునుంచిన్నీ ఎక్కువతరముగా కనిపిస్తున్నవి. క్రీస్తు మొదటి శతాబ్దములలో నాసిక, అమరావతి, మదుర, తిరుచునాపల్లి, మొదలైనచోట్ల బ్రాహ్మీలిపిలో కొన్ని శాసనములు కానవచ్చినవి. కాని వీటివల్ల సంగము వాఙ్మయస్థితిని నిర్ణయించడానికి తగిన ఆధారాలు కనబడలేదు. తిరుచునాపల్లిప్రాంతములలో కనబడిన చిన్న శాసనములు తమిళభాషలో ఉన్నవని నిర్ణయించడానికి కె. వి. సుబ్రహ్మణ్యయ్యరుగారు చాలా తంటాలుపడినారు. అవి ప్రాకృతశాసనములే అని రుజువు చేయడానికి (New Indian Antiquary) లో వ్రాసిన వ్యాసములో నేనున్నూ తంటాలుపడినాను. దక్షిణదేశశాసనముల చరిత్రను బట్టిగాని, వాఙ్మయచరిత్రమునుబట్టిగాని ఆలోచిస్తే ఈప్రాంత మంతట్లోనూ ప్రాకృతభాషలే ప్రచారములో ఉండినట్లు తెలుసుకోవచ్చును.

తమిళభాషలో వ్రాయబడి కాలము నిరూపింపబడిన ఒక్కశాసనమున్నూ ఆరవశతాబ్దానికి పూర్వపుది లేదని తమిళవిద్వాంసులే ఒప్పుకున్నారు. ఐనా అంతకు పూర్వము తమిళభాషావాఙ్మయ ముండ కూడదా అని శంకించి, ఉన్నదని నిర్ధారణ చేయడానికి విద్వాంసులు పూనుకుంటున్నారు. అదేవిధముగా కన్నడులుకూడా క్రీ. శ. మూడో, నాలుగో శతాబ్దపు ఒకగ్రీకుభాషలోని ఒక ప్రహసనములో గ్రీకుభాషలో లేని కొన్ని వాక్యములు కనబడగా, ఆవాక్యములు కన్నడవాక్యములని నిర్ణయించడానికి ప్రయత్నము చేసి విఫలమనోరథు లైనారు. అట్లే తెనుగు వాఙ్మయమునకుకూడా ప్రాచీనతను కల్పించడానికి ప్రయత్నం చేసినవారు లేకపోలేదు. అట్టి అభిమాన ముండడము సహజమే. కాని తగిన ఆధారములు లేనప్పుడు శాస్త్రదృష్టితో పరిశోధన చేసేవారు ఎట్టిసిద్ధాంతమును చేయడానికీ పూనుకొనరు. తమిళసంగముగ్రంథములని చెప్పబడేవి వివిధకవుల చిన్నచిన్న కావ్యముల సంకలనములు. వీటిలో కొన్ని తెనుగులోని 'దేశింగు రాజుకథ', 'బాలనాగమ్మ కథ' మొదలైన పదములవంటివి. ఒక్కటి కూడా పెద్దగ్రంథముగా నెన్నదగినది లేదు. నోటిపాటలలోనూ, వానిని ఒకచోట కూర్చినవారి చేతుల్లోనూ, వాటిపై వ్యాఖ్యానములు వ్రాసినవారి చేతుల్లోనూ, తర్వాత వ్రాతప్రతులమూలమున వ్రాయసగాండ్ర చేతుల్లోనూ, ఆతరువాత వాటిని ముద్రణమునకు తయారుచేసిన పండితుల చేతుల్లోనూ ఎన్నోమార్పులు పొందిన గ్రంథములలోని విషయముల కపార్థములు గల్పించిన్నీ, లేని విషయములను ఊహించిన్నీ, సిద్ధాంతములకు సరిపడని విషయములను పరిహరించిన్నీ కూర్చిన చరిత్ర విశ్వాసార్హము కానేరదు. ఇంతవరకున్నూ స్వామినాథయ్యరుగారున్నూ, మరికొందరున్నూ ప్రకటించిన గ్రంథములు అసమగ్రము లనిన్నీ, వారు చేకొన్న పాతములలో ఎన్నో సందేహాస్పద విషయములున్నవనిన్నీ, గ్రంథములలో ఒకచోట ఉండవలసిన పద్యములు మరొక్కచోట చేరి ఉండవచ్చుననిన్నీ, అందుచేత వాటి అర్థము దురవగాహముగా ఉన్న దనిన్నీ, వారే గ్రంథపీఠికలలో వ్రాసుకొన్నారు. పెద్దగ్రంథము లైన శిలప్పదిగారము, మణిమేహలై అనే గ్రంథముల కాలముకూడా ఇప్పటికిన్నీ సరిగా నిర్ణయము కాలేదు. గ్రంథములోని జ్యోతిష వివరములనుబట్టి ఆ గ్రంథములు ఎనిమిదో శతాబ్దములో బయలువెడలినవని స్వామికన్నుపిళ్లె మొదలైన జ్యోతిశ్శాస్త్రపండితులు తెలియజేసినారు. ఆ గ్రంథములు సంగముకాలములోని వని నమ్మినవారు ఆతడు నిర్ణయించిన కాలము సరికా దని వాదిస్తున్నారు. స్వామికన్నుపిళ్లెగారి నిర్ణయమునకు ఆపాటి ఆధారమైనా ఉన్నది. వీరి కదికూడా లేదు.

ఇట్టి యవస్థలో ఉన్న సంగపుగ్రంథముల కాలమును నిర్ణయించడానికి ఒక్కటే మార్గమున్నది. అది భాషాచరిత్రమునకు సంబంధించినది. భాషాప్రాచీనత ననుసరించి ఇంచుమించుగా ఆయాగ్రంథములకాలమును నిర్ణయించవచ్చును. ఈవిషయమును నీలకంఠశాస్త్రిగారు చక్కగా గుర్తించినారు. "చోళులచరిత్రము — రాజ్యపద్ధతి" (Studies in Chola

**History and Administration**) అనే గ్రంథములో వారిట్లు వ్రాసినారు — (పుట. ౮-):

"ఈరీతిగా తేలిన కష్టసమస్యలనుగూర్చి సిద్ధాంతము చేయడము, ఈవ్యాసోద్దేశము కాదు. సంగమువాఙ్మయము విస్తారమైనది కాకపోయినా దానినిగూర్చిన చారిత్రకభాషా విషయములు చాలా చిక్కులతో గూడి ఉన్నవి. వాటినిగూర్చి సర్వతోముఖముగా, సక్రమముగా విచారింప అర్హతగల విద్వాంసులు చాలా తక్కువగా ఉన్నారు. వాటిని గూర్చిన పర్యాలోచన ఇంకా ఆరంభము కాలేదనే చెప్పవచ్చును. చరిత్రకారుడు ఈ వాఙ్మయములోని గ్రంథముల పౌర్వాపర్యమును కాలనిర్ణయమును చేస్తాడేమో అని భాషాశాస్త్రజ్ఞుడు నిరీక్షిస్తున్నాడు. అట్టి చారిత్రకజ్ఞానము లేకపోతే భాషాచరిత్రమును దాని వివిధావస్థలనూ నిర్ణయించడానికి వీలు లేదు. ఇట్లుండగా ఇతరవిధములైన సాక్ష్యమువల్ల ఎట్టిప్రయోజనమున్నూ కనబడక చరిత్రకారుడు భాషాపరిణామ విషయమున భాషాశాస్త్రజ్ఞులేమైనా కృషిచేస్తారేమో అని నిరీక్షిస్తున్నాడు" అని.

ఇంతవరకున్నూ సంగముగ్రంథముల భాషనుగురించిన పరిశోధనలు ఎక్కువగా జరుగలేదు. భాషాపండితులైన శివరాజపిళ్లె వంటివారు ఈకార్యమునకు పూనుకొనవలసి ఉన్నది. అట్లు పూనుకొనక పిళ్లగారు 'ప్రాచీనతమిళుల కాలనిర్ణయము' (**The Chronology of the early Tamils**) అనేగ్రంథములో ఒకక్రొత్తమార్గము నవలంబించినారు. వారు సంగమువాఙ్మయములో కనబడే అద్భుతములు, అసందర్భములు, ఐనవిషయముల నన్నిటిని విడిచిపెట్టినారు. ఆతరువాత ఈ తమిళ వాఙ్మయములో వారికి మూడు అవస్థలను తెలియజేసే పట్టులను ప్రత్యేకించి వాటికి ప్రాకృతికావస్థ, నైతికావస్థ, మతావస్థ అని పేరుపెట్టినారు. ఈ అవస్థలలో ప్రాకృతికావస్థ మొదటిదనిన్నీ, నైతికావస్థ తరువాతిదనిన్నీ, మతావస్థ తుదిదనిన్నీ నిర్ణయము చేసుకొన్నారు. ప్రాకృతికావస్థలో మనుష్యుడు దేహధారణముకోసము, అన్నపానముల కొఱకుమాత్రము పాటుపడుతూ ఉండేవాడట. జీవితసౌకర్యములు కొంతవరకు సమకూడినతర్వాత సంఘములుగా జేరి నీతి నలవరచుకొన్నాడట. ఆ తరువాతనే ఈశ్వరుడు ఆత్మ మొదలైనవాటి విచారమునకు దిగినాడట. ఈ సంగమువాఙ్మయము ప్రాకృతికావస్థకు సంబంధించి ఉండవలెనట. కాబట్టి ప్రాకృతికావస్థకు సంబంధించిన సంగంవాఙ్మయపు పద్యములే ఆకాలపు చరిత్రనిర్మాణమునకు పరమాధారములట. కాబట్టి వాటినే ఆధారములుగా చేసికొని తమిళుల ప్రాచీన చరిత్రమును నిర్ణయించడానికి ఆయన పూనుకొని తనగ్రంథమును సాగించినారు. సమకాలికులై ఉండవచ్చునని తానూహించిన కొద్దిమందిపురుషులను మాత్రమే తీసుకొని ఒక పెద్ద పట్టికను ఏర్పాటుచేసినారు. ఈ విషయమై చేసిన పరిశ్రమ అసాధారణమైనదని ఒప్పుకోక తప్పదు. కాని వీరిప్రయత్నము కూడా సంగంకాలనిర్ణయ విషయమున కృతార్థతను బొందలేదు.

పైని చెప్పినవిషయములనుబట్టి ఇప్పటివరకున్ను క్రీ. శ. ఆరోశతాబ్దమునకు పూర్వము తమిళవాఙ్మయ మున్నదని చెప్పడాని కాధారములు కానరాలేదని స్పష్టమౌతున్నది. సుమారు ఈ శతాబ్దములోనే తక్కిన ద్రావిడ వాఙ్మయములలో కూడా పెద్ద గ్రంథములు లేకపోయినా వాఙ్మయము కలిగి ఉండడాని కనుకూలమైన పరిస్థితులను సూచించే పద్యములును, గద్యములునూ శాసనములలో కనబడుతున్నవి. కాబట్టి తమిళ, ఆంధ్ర, కన్నడములు మూడింటిలోనూ ఏకకాలమునందే వాఙ్మయము బయలుదేరడానికారంభించిందనిమాత్రము ఇప్పటికి చెప్పవలసిఉన్నది. అంతకు పూర్వపు భాషావస్థలను నిర్ణయించడానికి తగిన ఆధారము లింతవరకున్ను బయలుపడలేదు. ఉన్న ఆధారములనుబట్టి చూస్తే ప్రాకృతభాషలే దేశములో వాఙ్మయమునందు వినియోగపడుతూ ఉండే వనిన్నీ, ప్రాకృతభాషల వ్యావహారికరూపములుగా ఉండిన ద్రావిడభాషలు గ్రంథస్థములగుటకు ఆరోశతాబ్దపుప్రాంతమున ఆరంభించినవనిన్నీ చెప్పవలసిఉన్నది.

## ఈవ్యాసరచనకు తోడ్పడినగ్రంథములు:


1. Tamils 1800 years ago—by Kanakasabha Pillai.
2. The Beginnings of South Indian History — by Dr. S. Krishnaswami Ayyangar.
3. Historical sketches of Ancient Deccan—K. V. Subramanya Iyer.
4. History of the Tamils — P. T. Srinivasa Iyengar.
5. Studies in Tamil Literature and History — V. R. Ramachandra Dikshitar.
6. The Pandyan Kingdom — K. A. Nilakantha Sastry.
7. Studies in Chola History and Administration — K. A. Nilakantha Sastry.
8. The Cholas — K. A. Nilakantha Sastry.
9. History of the Pallavas of Kanchi — R Gopalan.
10. The Chronology of the Early Tamils — K. N. Sivaraja Pillai.
11. Tamil Studies — M. Srinivasa Iyengar.

## తక్కువ వ్యయమునకే

## ఎక్కువ మోటారు సౌకర్యములు

# వాక్సుహాల్

**ది వాక్సుహాల్ రేంజి.**

10 హెచ్. పి. ఫోరు. ప్రపంచమున అన్నిటికంటె ఎక్కువ మితవ్యయముతో కూడినది.

12 హెచ్. పి. ఫోరు; 12 హెచ్. పి. కారు—గాలన్‌కు 35 మైళ్లు వచ్చును.

14 హెచ్. పి. సిక్సు. సౌకర్యముతో కూడిన ప్రయాణము చేయవచ్చును.

అందరు దీనినే కావలెనని కోరుచున్నారు.

25 హెచ్. పి. సిక్సు ప్రపంచమున పోటీనెదుర్కొనుటకు ప్రత్యేకముగా తయారుచేయబడినది.

**వాక్సుహాల్**

**ప్రత్యేకాంశములు**

చాలాకాలము వినియోగపడును. హాయిగా ప్రయాణము సాగింపవచ్చును. కంట్రోల్సు సింక్రో-మెష్. ఓవర్ హెడ్ వాల్వు ఇంజను. మిత వ్యయముతో కూడిన కార్బొరేటర్. అనుకూలమైన సీట్లు. అందమైన ఆకారము. నిశ్శబ్దముతో కూడినది.



**సింప్సన్ అండ్ కో., లిమిటెడ్,**

మదరాసు ఉదకమండలము తిరుచునాపల్లి.

# మరల చెవర్లెట్!

అనుభవమున్న "ట్రక్ మన్" ప్రతివాడును చెవర్లెట్‌నే కోరుచుండును. రోడ్డుపై ప్రయాణము హాయిగా నుండును. మితవ్యయముతో కూడినది. ఎట్టి వాతావరణ పరిస్థితులలోగూడ అతివేగమున పనిచేయును. చాలాకాలము నమ్మకముగా వినియోగపడును.



ప్రయాణము

నమ్మకమైనది. CHEVROLET మితవ్యయముతో కూడినది.

పూర్తి వివరములను ఫోన్ ద్వారా తెలుసుకొనుడు లేదా ఈదిగువ ఎడ్రసుకు వ్రాయుడు

**SIMPSON & CO., LIMITED,**

MADRAS OOTACAMUND TRICHINOPOLY



# టి. టి.

మంచి సువాసనగలదు. ఆహారపదార్థము లకు ఎక్కువరుచి కలుగజేయును.

## జీర్ణశక్తికి ఎక్కువగాతోడ్పడును

బొమ్మకు రుచిచూపించి ఆమె సంతృప్తి నొందుచున్నది

బహుమతి కూపనులతో అమ్మబడుచున్నది

ఖరీదు 1 పౌ॥ 1 కి రు 1-14-0.

---

## Rice Mill Spare Parts & Hullers



మంచిపనితనముతో శ్రేష్ఠమైనపద్ధతితో, తయారుచేయబడియున్న మేలైన రైస్ హల్లర్లు పిండి మిరపపొడిచేయుమిల్లులు, వాని కుపయోగపడు స్పేర్ పార్టులు

బెల్టులు వగైరాల, పుల్లీలు బాల్ బేరింగులు ఇంకను మిషీను సంబంధ మగు సకల సామానులును తక్కువ ఖరీదుకు

నాణ్యముగను సప్లై చేయబడును.
**కావలసినవారికి వ్రాయుడు.**

లక్ష్మీమిల్ స్టోర్సు రైస్‌మిల్ సామానుల వ్యాపారం,

24, ఎఱ్ఱబాలుశెట్టివీధి, మదరాసు.



# Lakshmi Mill Stores,

Rice Mill Engineers,

**24, Errabalu Chetty Street G. T. MADRAS.**

# "రమ్యాలోక" సమీక్ష

కురుగంటి సీతారామయ్య

ఇది శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు రచియించిన నూతనగ్రంథము. వెనుకటివాని వలెగాక యిది విలక్షణమైనది. దీనిని చదివిన వెంటనే యందలి ప్రాశస్త్యము నుగ్గడింపవలెనని ప్రేరణము జనించెను

## స్వవిషయము

నేను నాకించిజ్జత్వము నెరుగకపోలేదు ఈగ్రంథముయొక్క సమీక్షను రచించుటకు నా కెట్టి యధికారమును లేదు. నవ్యుడను గాను. నలువదికి మించిన వయసు కల్గి ప్రాత యభిప్రాయములతోను, నాశయములతోను నిండినవాడను. ఆంధ్రభాషయందు ప్రజ్ఞకలవాడను కాను. సంస్కృతము నా యభిమానభాష. కవిత బొత్తుగ నాకవ లేదు ప్రకటితముగా ఒక్క పద్యమైనను నాది లేదు. ఇట్టి నేను శ్రీ సుబ్బారావుగారి గ్రంథమును సమీక్షించుట మిక్కిలి సాహసము నిస్సహాయుడనై ప్రకృతికి లొంగి వ్రాయుచున్నాను. ఎక్కడనైన — కాదు కాదు — యిందంతటను గ్రంథకర్తగారి యభిప్రాయములను కనుగొనకపోయినగాని, పొరబాటొనర్చినగాని క్షంతవ్యుడను.

## సందేహము

గ్రంథకర్తగారిపద్య మొకటి యిచ్చట మిక్కిలి ప్రస్తుతముగా నగపడుచున్నది.

> "కానబడ కనుమానప్రమాణమునకె
> అంది యందని పరతత్త్వ మవల నుంచి
> పంచభూతదృశ్యంబైన ప్రకృతి యొకటె
> సన్నిహితలక్ష్య మనియె వచస్వి నేడు."

ఎట్లు గ్రంథకర్తగారికి పరతత్త్వ మంది యందకుండున ట్లున్నదో యట్లె గ్రంథకర్తగారి తత్త్వము నాకుకూడ నంది యందక ట్లున్నదనక తప్పదు గ్రంథకర్తగారి కెట్లె దుటనున్న ప్రకృతి లక్ష్యమయ్యెనో యట్లె వారి యక్షరరాశి నాకు లక్ష్యమైనది. ఇచ్చట మరియొకవిషయము చెప్పవలసి యున్నది. నేను తెల్పు నీక్రిందివిషయములలో నెచ్చటనైన కవిగారి యభిప్రాయమునకు భిన్నముగా నుండవచ్చును. రచియించి ప్రచురించినంతవరకును మాత్రమే వారి యధికారము. శబ్ద మెప్పుడు వెలువడెనో యప్పుడె యది శక్తులు మూటికిని లోబడవలెను. నే నెంత ప్రయత్నించినను నాయల్పబుద్ధికి తగినంతనే గ్రహింపగలనని నాకు తెలియకపోలేదు.

## అనుబంధ చతుష్టయము

మొదట నీగ్రంథముయొక్క యనుబంధ చతుష్టయమును వివరింతును: (౧) రసవంతమగు సాహిత్యలక్షణము విషయము. లక్షణగ్రంథములు సామాన్యముగా తలనొప్పి పుట్టించును. కాని యిది మొదటినుంచి తుదివరకు రసవత్తరముగా నున్నది. కేవల నవ్యాంధ్రకవితాలక్షణములే గాక నవ్యాంధ్రభాషాలక్షణములుకూడ ప్రాస్తావికముగా నియ్యబడినవి. ఏది చెప్పినను రసవచ్ఛబ్దజాలములో చెప్పబడినది. మరియు సామాన్యసాహిత్యవిషయము లుగ్గడింపబడి యవి నవ్యాంధ్రకవిత్వమందు సమన్వయింపబడినవి; (౨) రెండవది ప్రయోజనము. లోకోపకారమే ప్రయోజనము. ఇంతవర కిట్టిగ్రంథము వెలువడ కుండుటచే దాని విలువ (ప్రయోజనము) మరింత హెచ్చుగు చున్నది; (౩) మూడవది సంబంధము. ఉపపాద్యోపపాదకభావ్యాపారకాదు లెన్నియో స్ఫురించును. కాని నాకు లక్ష్యలక్షణసంబంధము ముఖ్యముగా స్ఫురించుచున్నది. ఇంతవరకును శ్రీ సుబ్బారావుగారు లక్ష్యములనే రచియించియున్నారు. ఇప్పుడు వానియన్నిటియందును ననుస్యూతముగా కన్పడునట్టియు, వారికి అనుభవముచే సాధనలో నున్నట్టియు లక్షణములను తెల్పుకాల మాసన్నమైనందున నీగ్రంథము వెలువడినది. కావున వారి వెనుకటి వానికిని దీనికి నుండుసంబంధము లక్ష్య లక్షణాత్మకమని వేరుగా చెప్పబనిలేదు. లక్ష్యముల వెనుకనే గదా లక్షణము నిర్దిష్టమగుట; (౪) నాల్గవ యనుబంధ మధికారి. వెంటనే సహృదయుడు, జిజ్ఞాసువు నధికారులని తోపకమానదు. ఇట్లనుబంధచతుష్టయ నిర్ణయానంతరము ౧౯౧౦-౧౧ నాటి కవిత్వస్థితిని గూర్చి కొంచెము ముచ్చటింతును.

## పూర్వస్థితి

నవ్యాంధ్రకవితకు పునాదులు దాదాపు ౧౯౧౦ - ౧౧ సంవత్సరప్రాంతమున, ననగా షుమా రిరువదియెనిమిది వత్సరముల క్రిందట వేయబడినవని మనము చెప్పవచ్చును. ౧౯౧౦-౧౧ నాటికే శ్రీ వీరేశలింగంగారు మొదలగువారు, ముఖ్యముగా కింకవీంద్ర ఘటాపంచాననులు సారస్వతకాననమున నూతనమార్గముల కంచనాలు వేయుచుండిరి. గ్రంథములలో పరోక్షులుగా నున్న కవులు ప్రత్యక్షులగుటకు ప్రయత్నించు చుండిరి. భాషావిషయమున గూడ పట్టు సడలించుటకు ప్రారంభించిరి. ఈ కార్యముల ముఖ్యముగ ప్రవర్తించినవారు తిరుపతి వేంకటేశ్వరకవులు. ఏనాడు శ్రీనాథాదుల కాలములో వింటిమో! తరువాతి కవు లందరును గతానుగతికములగు కావ్యములను శబ్దమే పరమావధిగా పెట్టుకొని రచియించుచుండగా నీ తిరుపతి వేంకటేశ్వరులు భగవత్కృపచేన నధానవిధానమునకు గడంగిరి. అందు వా రనుసరించిన కవితాపద్ధతి వారి

గ్రంథముల నుపయోగించుటయేగాక రాబోవు మార్పునుకూడ సూచించెను. ఇట్లు సారస్వతమునకు చేసిన మేలునకు వారు సర్వదా సంస్మరణీయులు. అప్పటినుండి రెండు పద్ధతులు సారస్వతమున నాటబడెను. మొదటిది "స్వానుభవభావ్యములను విప్పి" వ్రాయుట; రెండవది "ఇంపుఘటిల్లు తెనుగు పలుకుబడి."

## బ్రహ్మ; నవ్యాంధ్రసాహిత్యదండి

రెండువ్యక్తు లీ నవ్యాంధ్రకవితామార్గదర్శి పదవికి పోటీచేయుచున్నారు. కొంతకాలము క్రిందట గోలకొండ పత్రికలో నేను శ్రీ సుబ్బారావుగారినిగూర్చి యొక వ్యాసమును వ్రాయుచు నందు శ్రీ సుబ్బారావుగారి యొక్కయు, శ్రీ గురజాడ అప్పారావుగారి యొక్కయు నన్యోన్యస్థానమునుగూర్చి వ్రాసియుంటిని. అందలి యొక్క వాక్యము ననువదించుచున్నాను. "అప్పారావుగారు భాషాసంస్కర్త. సుబ్బారావుగారు కవితామార్గసంస్కర్త." శ్రీ అప్పారావుగారికి కవితామార్గ సంస్కారము ప్రక్కవాద్యమువంటిది. కాని శ్రీ సుబ్బారావుగారి కది ప్రధాన సాధన. కాని యీ రెండు వ్యక్తులలోను బ్రహ్మత్వము శ్రీసుబ్బారావుగారికే యిచ్చుట సమంజస మని నాయభిప్రాయము. మరియు నాత్రోవను నిరంతరసాధన చేయుచున్నవారు శ్రీ సుబ్బారావుగారు. ఇదిగాక వీరి మార్గము ననుసరించిన తరువాతివా రందరును వీరినే భావనాగురువుగా నంగీకరించినప్పుడు వీరే యీగౌరవమునకు తగుదు రనుటలో పొరబా టుండదు. మామిత్రులు శ్రీతల్లావఝుల శివశంకరశాస్త్రిగారు "ఆధునిక కవిత్వమునకు తృణకంకణము ఆదిగ్రంథమని అస్మదాదుల ఆశయము" అని తృణకంకణ రజతోత్సవసంచికకు నీరాజన మిచ్చినారు. నవ్యాంధ్రసాహిత్యప్రవర్తకులే యట్లనునపు డిక మన కావిషయమున సందేహ ముండకూడదు.

ఇప్పు డీనవ్యకవిత యపారముగా పెరిగిపోయినదని లోకమున వాడుక. ఎంత పెరిగిన దనుకొనినను నెడారిలోని పచ్చికబయళ్లవలె కొందరి కృతులుమాత్రమే సహృదయహృదయాహ్లాదకరములుగా నున్నవని చెప్పినందులకు నన్ను మన్నింపవలయును. ఏది యెట్లున్నను నవ్యకవిత యనుపేరుతో కొంత సారస్వతము ప్రబలియున్నది. ఈ ద్రచయితలు తమకవితయందు వెనుకటికవితకంటె పార్థక్య మున్నదని వాదించుచున్నారు. కాని యీపార్థక్య మెచ్చట నున్నది? అది యేలక్షణములు గలది? యను ప్రశ్నముల కింతవర కెవ్వరును తృప్తికరమగు సమాధాన మిచ్చుట కలుగలేదు. ఎచ్చటనో యుపన్యాసములలోనో, సంభాషణములలోనో, పీఠికలలోనో, కొందరు దీనిని చెప్పుటకు ప్రయత్నించిరిగాని సమగ్రముగా నెచ్చటను కానము. దానిని సమగ్రముగా తెలియజెప్పుటకుకూడ శక్తి కావలసియున్నది. కవులు కొందరు తమపద్యములకే కొన్నిటి కర్థము చెప్పలేని స్థితియం దున్నారని నా యనుభవము. ఇదివరలో నిట్టిసాహిత్య లక్షణగ్రంథమును సర్వతోముఖపాండితిగల శ్రీశివశంకరశాస్త్రివంటివారు వ్రాయుదురని యనుకొనుచుంటిని. నవ్యాంధ్ర సాహిత్య పరిషదధ్యక్షుల యుపన్యాసము లన్నిటిని కడు జాగ్రత్తతో చదివితిని. పైప్రశ్నల కెట్టిసంపూర్ణ సమాధానమును రాకపోగా తామే జీర్ణముచేసికొన జాలని యభిప్రాయములను కొంద రుల్లేఖించి విషయమును గహనముచేసివైచిరి. ఇట్టిస్థితిలో నీ "రమ్యాలోకము" వెలువడినది. శ్రీసుబ్బారావుగారీగ్రంథమును రచించి యాంధ్రలోకము యొక్క కృతజ్ఞతకు పాత్రులైరి. నవ్యాంధ్రకవిత్వగ్రంథరచనయందు శ్రీసుబ్బారావుగారెట్లు ప్రథము లనిపించుకొనిరో, తత్సాహిత్యలక్షణగ్రంథకర్తలలో ప్రథమస్థానమునుకూడ బడసిరి. వీరిని నవ్యాంధ్రసాహిత్యదండి యని పిలుచుట తప్పుగాదు.

## శక్తి

సాహిత్యలక్షణ గ్రంథమును రచించుట సామాన్యకార్యము కాదు. అది కొంతవరకు విమర్శనాశక్తికి సంబంధించిన కార్యము. అప్పుడప్పుడు సంభాషణములలో వీరికి సృష్టిశక్తితోబాటు విమర్శనాశక్తి యున్నట్లు వ్యక్తమగుచున్నప్పటికి, నేతద్గ్రంథ రచన తరువాతకాని యిట్టిగ్రంథమును రచించుశక్తి యున్నట్లు స్పష్టము కాలేదు. ఇట్టిశక్తిని వారి సన్నిహితమిత్రులలో నొకడనగు నాకడ గూడ దాచుట యాశ్చర్యము. ఇటీవల "ఆంధ్రసారస్వతమార్గములు." అను విషయముపై వీ రుస్మానియావిశ్వవిద్యాలయ పక్షమున నిచ్చినయుపన్యాసములను విను భాగ్యము నాకు లభించినది. అవి విన్నప్పు డీయనసామర్థ్య మమోఘమైనదని నాకు స్పష్టమయ్యెను. ఆ యుపన్యాసములను గ్రంథరూపమున విద్యాలయమువారు ప్రచురింతురని యాశించుచున్నాను. ఆయుపన్యాసములయందు వా రుపయోగించిన యాంగ్లభావ, నింగ్లీషుక క్లార్లైలు, న్యూమెను మొదలగువారిభావముతో బోల్పనగును. రమ్యాలోకమువలెనె యదికూడ నొకకావ్య మనదగును.

•

సంస్కృతమున దండ్యాచార్యుడు, పండితరాయలు మొదలగు నల్పసంఖ్యాకు లెవ్వరో తప్ప కవులైన లాక్షణికులు గానరారు. ఆంధ్రసారస్వతమునకూడ నేబట్టుమూర్తివంటివారో యల్పసంఖ్యాకు లగపడుదురు. ఆంగ్లవాఙ్మయము నవలోడనచేసినగూడ నేకొలెరిడ్జి ఆర్నాల్డువంటివారో యల్ప సంఖ్యాకులే యగపడుదురు. సృష్టియు విమర్శనయును పరస్పరవిరుద్ధగుణములుగల శక్తులని చెప్పుదురు. ఎట్లు లక్ష్మీసరస్వతులు శ్రీసుబ్బారావుగారి నాశీర్వదించిరో యట్లే సృష్టి విమర్శనములు రెండును వీరియందు బొందుపడెను. ఈయన హృదయము ఋష్యాశ్రమమువలె మిక్కిలి పవిత్రమైనది. సహజశత్రుత్వముగల జంతువులు ఋష్యాశ్రమమున మైత్రితో నెట్లుండునో పరస్పర విరుద్ధములుగ కనపడుశక్తు లీయనయందు తమ యందచందములతో కలిసియున్నవి. శ్రీ శివశంకరశాస్త్రిగారివద్దకూడ నీ శక్తులు రెండు నున్నవి.

వచ్చేది రైతురాజ్యం
ఏలేది రైతుసంఘం

సుభాస్ బాబు
విజయం విన్నా,—
కాంగ్రెసులోని
తీవ్రవాదుల విజృంభణ
చూచినా,—
ఫెడరేషన్
విషయంలో
నాయకుల
దృక్పథం
ఆలోచించినా,
తేలేది
ఇది

* *

సారథి

## "రైతు బిడ్డ"

యీ సత్యాన్ని చాటటానికి
త్వరలో వస్తున్నది.




*For Booking apply to:—*
**SARATHI FILMS LTD.,**
159, Lloyds Road, Royapettah P. O.

Telegrams: "SARATHFILM"
Telephone: 8436



# పావురముల జంట

చిత్రకారుడు:

మాధవపెద్ది గోపాలకృష్ణగోఖ్లే.

## వాఙ్మయచక్రము

ఈయనకు తిక్కనాగుల కవితాసంప్రదాయములయం దెంత ప్రతిపత్తిగౌరవము లున్నవో, దండ్యాచార్యాదుల సాహిత్యలక్షణ సంప్రదాయముల నంత ప్రతిపత్తి గౌరవము లున్నవి. చారిత్రకముగా చూచిన సారస్వత విషయములు కాల మెట్లు చక్రభ్రమణమున నడచుచున్నదో యట్లే చక్రనేమిభ్రమణముతో దిరుగుచుండును. పూర్వసంప్రదాయములపై కొంతకాలమైనవెనుక ప్రత్యయము తగ్గును ఇది యాతగా శృంఖలావిచ్ఛేదనము గావింపబడును. ప్రకృతి యెల్లప్పుడును నియమబద్ధగాన నియమము మరల వరలును. ఈ విధముగా తత్వములు, క్రిందినుంచి పైకిని, పైనంచి క్రిందికిని పరిభ్రమించుచుండును. వెనుకటి సూర్యోదయమే! వెనుకటిసూర్యాస్తమయమే! వెనుకటి స్త్రీపురుషప్రణయమే! వెనుకటి హృదయావేదనలే! వెనుకటి చిత్తోద్వేగములే! ఆనందదుఃఖము లన్ని ప్రాణులందును సమానములే! కాని వానిని వెలిబుచ్చుపద్ధతులు భిన్నవ్యక్తులందు భిన్నములైనట్లే, పునాదియదియే యైనను పైకట్టడములోని మార్పులు భవనమును నూతనము చేసినట్లే, మూలసూత్రములపై ననుసరింపబడుచున్న పద్ధతు లీకవితకు నవ్యత నాపాదించుచున్నవి. ఈవిషయమును శ్రీ సుబ్బారావుగారు చక్కని రసవద్వాక్యములతో నీక్రింది విధముగ తెల్పినారు.

"ప్రాతసొమ్ముబు కరగించి, పసిడిదేర్చి,
క్రొత్తనగలను చేయించుకొనరె జనులు."

ఈ వాక్యములు శ్వేతకేతూపాఖ్యానమును స్ఫురింప జేయుచున్నవి. ఒకటే మృత్తు! కుండ, చట్టి, మూకుడు ననుభేదము! ఒకే బంగారము! నగలలో భేదము! ఆవిధముననే యవియే శబ్దములు! అదియే వాగర్థప్రణయము! వక్తృపద్ధతిలోని భేదమును, వక్తృదృష్టిభేదమును పృథక్త్వము నాపాదించుచున్నవి. ఈవిషయమునే మరియొక చక్కని యుదాహరణముతో విశదీకరించినారు గ్రంథకర్తగారు.

"వాణి వాయింప మ్రోగిన వీణమీద
పారసీకగీతంబులు పలుక మనెనె?
ఋషుల నీవారములు ఫలియించినట్టి
పొలమునందు గులాబీలు పూయమనెనె?"

అదియే వీణ! అదియే పొలము! అదియే నాదము, అవియే సప్తస్వరములు! అదియే మట్టి, అదియే బీజావాపనసూత్రము! కాని పరిణామము నూతనము! అచ్చట పారసీకగీతము! ఇచ్చట గులాబీపువ్వు! ఎంత చక్కని సాదృశ్యము! కవి తన ప్రతిభావిశేషముచే దేశకాలపాత్రములను తనవెంట నిడుకొని మానవుని హృదయము కరగునట్లు పాడును "కవి సామ్రాట్, కృతుల్ నగల్" అని యొకయాధునికకవి యనినాడు. కమసాలి యాబంగారముతోనే యాయాకాలములకు తగిననగల జేయుటలేదా? కర్షకుడు వెనుకటి భూమియందే వెనుకటి సూత్రముల నాధారము చేసికొనియే క్రొత్తపంటలను పండించుటలేదా? గాయకుడు వెనుకటి సప్తస్వర సమ్మేళనముచేతనే నూతనరాగముల నాలాపన చేయుచుండలేదా? ఎంత నవ్యమైనను ప్రతిదానిక్రిందను సార్వకాలికములై శాశ్వతములగు మూలసూత్రము లుండును. కావున నవ్యతనే మోక్షముగా చూచు నవ్యులకును, దానినే పతనముగా గ్రహించు పురాతనులకును, నది దేశపాత్రముల ననుసరించి కాలపురుషుడు చేయుమార్పనియు, దానివలన ద్వంద్వములకు పాలుగా నవసరములే దనియు మనవి చేయుచున్నాను. నన్నయదానినుండి శ్రీనాథమార్గము నవ్యము! అంతకంటె పెద్దన నవ్యుడు! వీరేశలింగ మింకను నవ్యుడు! సుబ్బారావుగా రంతకంటె నవ్యుడు! ఇప్పటికి దాదాపు వారి మార్గము ముప్పది సంవత్సరములు నడచినది గాన ప్రాత పడవచ్చును. శ్రీ సుబ్బారావుగారి చిత్తసంస్కార మట్లే యున్నదిగాని దేశకాలములు మారుచున్నవి; సుబ్బారావుగారికంటె ముద్దుకృష్ణ నవ్యుడు! ఆ నవ్యత కొన్ని సంవత్సరములు గడచినతరువాత మరల దాని కొక ప్రవక్త బయలు వెడలును! విప్లవము! నియమము ననునది యొకదాని వెనుక నొకటిగ వచ్చును. సృష్టి, స్థితి, సంహారములు. మరల సృష్టి "ధాతా యథాపూర్వమకల్పయత్" అని శ్రుతి. రాజకీయమున, సాంఘికమున, వ్యావహారికమున, సారస్వతమున, నీచక్రభ్రమణము కనపడుచునే యున్నది! శ్రీసుబ్బారావుగారు మొదట వ్రాసినపుడు విప్లవమే కనబడెను! ఇప్పు డది సహజమై సలక్షణమగు కాలము వచ్చినది. "కాలో హ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ" యనుకొని కవి వ్రాయును! దానిని కాలపరిణామమని సహృదయుడు గ్రహించును. వీ రిద్దరిసంబంధ మవినాభావసంబంధము. ఈసంబంధమును గ్రంథకర్తగా రీక్రింది పద్యమున చక్కగా విశదీకరించినారు.

"ఉత్తరోత్తరోత్పతనసముత్సుకులగు
కవుల కంఠము సూక్ష్మాంబరవివృత మగు
సహృదయాకాంక్ష చేత నాధాయ లెల్ల
అల్లనల్ల నుమ్మక్తమై యవతరించు."

కవి వాక్యములకును ప్రపంచమునకును నడుమగా నొకసన్నని యవనిక యుండు ననియు దానిని సహృదయుడు డెడలించి, కవిభావమును ప్రపంచమునకు విప్పి చెప్పు ననియు, గ్రంథకర్తగారి యాశయమని నాకు తోచుచున్నది. కార్లైలుమహాశయుడు కవిని ప్రవక్త యనియు, విమర్శకుని నావేశముగల కవిని పాఠక ప్రపంచమునకు తెలియజేయు వ్యాఖ్యాత యనియు తెల్పియున్నాడు. పైపద్యభావ మట్టిదె.

## అందరకును నన్వయించునా?

ఒక్క ప్రశ్నము రావచ్చును. శ్రీ సుబ్బారావుగారు తెల్పిన సూత్రము లన్నియు ప్రతినవ్యకవి కవిత్వమునకు వర్తించునాయని. ఇది యొకగడ్డుప్రశ్న! కాని యిక్కడ శ్రీ సుబ్బారావుగారి సాధనయే మన కుత్తరవాది యగుచున్నది. ఆయన తనకృతుల ననేక పర్యాయములు తనస్వవిషయమును తెల్పియున్నాడు. దీనిసారాంశ మిది. "నిర్గుణం కష్టసాధ్యం కావడంచేత తాను పంచా

భూతాత్మకమైన ప్రకృతి నారాధించా నని ఆయన కంఠోక్తిగా చెప్పాడు... ఈన మొదట్నించి ఆస్తికుడు. ఈ ఆస్తిక్యం యీన్ని భావకవిగా చేశింది. అందులో శాక్తుణ్ణి చేశింది. ఈనగవేషణం యీవ భావగీతిలో చూడచ్చు... ఆశక్తినే మానసికంగా లలితగాను, వాచికంగా ప్రకృతిమాతగాను ఆరాధించాడు" (ఆంధ్ర వార పత్రిక ౨౦-౧౦-౩౮). ఎందులకు నాట్యము చేయుచున్నదో తెలియని మయూరమువలె, యెందులకు కూయుచున్నదో తెలియని కోకిలవలెగాక యీాయన గీతమునకు పూర్వ రంగముగా నీయనలో విజ్ఞానబీజమును జిజ్ఞాసయు నున్నవి. ఈజిజ్ఞాస యీాయనను తత్త్వాన్వేషణమునకు పురికొల్పినది. గురుశుశ్రూష యొనర్చి తత్త్వమును గ్రహింప ప్రయత్నించినాడు. కాని యీాయనబుద్ధి కదియందిలేదు. శివశక్తులలోని శివు డందకపోవుటచేత నీయన శక్తి నారాధించినాడు. ఈయర్థమునే యీాక్రింది పద్యరత్నములలో నుద్ఘోషించినాడు.

"కానబడె కనుమాన ప్రమాణమునకె
అంది యందని పరతత్త్వ మవల నుంచి,
పంచభూతదృశ్యంబైన ప్రకృతి యొకటె
సన్నిహితలక్ష్య మనియె వచస్వి నేడు.

అందు నీవిలక్షణజీవయాత్రకయిన
పృథివినే నవ్యులు సమాశ్రయింత్రు భక్తి
తల్లిగా ధాత్రిగా దేవతామతల్లి
గా, సమస్తపరాపర కార్యములకు.

జ్ఞానమో, మోక్షమో, తదైక్యంబొయగును
నరుని సత్సాధనకెల్ల పరమసిద్ధి
వాగతీతం బనిరి దాని; వాగ్వ్రతులగు
కవుల కదియెట్లు సిద్ధలక్ష్యముగ నొప్పు?"

ఈ జిజ్ఞాసయు, తత్ఫలమగు సాధనయు నవ్యులలో నెంతమంది వ్రాసినకావ్యములలో కనపడునని ప్రశ్న వేసికొనిన బహుళముగా నా కగపడలేదని చెప్పవలెను. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ జాషువాలవంటి యొక రిద్దరిలో పోలిక లున్నవి. ఇతరులలో ప్రకృతి చిత్రవర్ణనము లుండవచ్చును. ప్రకృతిపరిశీలన సామర్థ్యముండవచ్చును. సరళమగు నుడికార ముండవచ్చును. వస్తువైచిత్రి యుండవచ్చును. భావపరంపర యుండవచ్చును. కాని యిట్టి భావపావిత్ర్యము, తత్త్వాన్వేషణము, ప్రకృత్యారాధనము, "నమలిన శృంగారము" మరి యెచ్చటను కానము. "ఈనకు లోకం పాఠశాల; ప్రకృతి ఉపాస్యదేవత. వ్యక్తు లందరు ప్రేమస్వరూపులు. ప్రకృతంతా కామరహితమైన పవిత్రప్రేమతో నిండి ఉన్నదని యీన ఆశయం. ప్రకృత్యారాధనమే యీనమతం." ఈవిషయము నీయన తనకు తానే యీాక్రింది పద్యమున చెప్పుకొని నాయభిప్రాయమునకు సాక్ష్యము నిచ్చుచున్నాడు.

"ధర్మమనుడు, యోగ మనుడు తత్త్వ మనుడు
ప్రాణి సాధింపగల పరమార్థములకు
తల్లి భావ ప్రధానసూత్రంబ యగుట
భావకంటె నవ్యులకు తపస్సు లేదు !"

ఇతరులు రసపిపాసులు కావచ్చును. సౌందర్యార్చకులు కావచ్చును. కాని యిక్తె భావతపస్సుతో సౌందర్యార్చన చేసి పరతత్త్వమును సాధింప ప్రయత్నించినవారని దని చెప్పకతప్పదు. కావున నీగ్రంథమునందలి సంపూర్ణలక్షణ మీాయనకవితకే వర్తించు ననియు కొందరు నవ్యుల కవిత్వమునకు వర్తింపజేయ వీలులేదనియు, చెప్పవలసియున్నది. అన్నినదులను గంగతో బోల్పనగునా? అన్నిపర్వతములను హిమాలయముతో బోల్పనగునా ?

## ముఖ్య భేదము

ఈయన తృణకంకణ రచనాకాలమునకు కొంచెము వెనుకనో ముందో వాయువిమానము పరిణామ మొంది యుద్ధములకుకూడ నుపయోగింపబడుట ప్రారంభమయ్యెను. అప్పటివారు, వీరు వ్రాసినకృతులు చూచి, వీరిభావికృతులు, విమానములవలె భూమి నంటక భావనాంబరవీథులలోనే సంచరించు ననుకొనిరి. కాని వీరు భూమిని వదలనందులకు వీరి కాంధ్రలోకము కృతజ్ఞము. నేల విడచి సాముచేయుట 'పతన హేతువు. అట్లు ప్రపంచమును వదలి కేవల భావాంబరవీథులనే సంచరించుచు, ననూహ్యానిర్దిష్టవస్తుసన్నివేశములు కలిగి సహృదయునికికూడ నందరానివై, యిటు భూమికి గాక యటు స్వర్గమునకుగాక కొన్నికృతులు నిరంతరాకాశయానమున నున్నవి. శ్రీ సుబ్బారావుగారికృతు లట్లుగాక పృథివి జన్మభూమిగా గలిగి, మాత యధిదేవతగా గలిగి, సాధనఫలముగా గలిగి, తోడిమానవులయం దానందజిజ్ఞాసలు కలిగింప సమర్థములై చిరస్థాయి నాశించుచున్నవి. పవిత్రత, సచ్ఛీలము వీరి కృతుల కాభరణములు. ఈ క్రిందిపద్యమును తిలకింపుడు.

"శీలమట్టుల నౌచితిం జెపరనీక
అహితవిధాన నశ్లీల మనాదరించి,
ప్రేమమంత్ర మహోపాసనామయులగు
నవ్యులకుపాధియయ్యె సౌందర్య మొకటె."

శీల మెంత ముఖ్యమో యౌచితి యంత ప్రధానము! అశ్లీలము త్యాజ్యము! ఈపరీక్షతో చూచిన నెందరు నవ్యుల కృతు లాగునో యనుమానింపవలసియున్నది. ఆనందముతోబాటు ధర్మముకూడా కావ్యమునకు పరమావధి యని యీాయన యాశయము.

"మంత్రమహిమావిభూతి బ్రహ్మర్షిగణము
నీతిబాహాబలస్ఫూర్తి నృపకులంబు
నమ్మ, విడిచిరె ప్రేమసూత్రమ్ము; దాని
తడవరాదొకొ కాంతాసమ్మితముగ నేడు?"

ఇందు 'కాంతాసమ్మితతయోపదేశయుజే' యను సూత్రము నంగీకరించుట కాదా? "సద్యః పరనిర్వృతి"మాత్రమే కాదు కావ్యోద్దేశ్యము కొందరు నవ్యు లంగీకరించినట్లు.

## ఉత్తమకావ్య పరీక్ష

పూర్వలాక్షణికాభిప్రాయములే సాహిత్యవిమర్శనమునకు పునాదియని వీరి దృఢాశయము. అందరికంటెను పూర్వుడగు దండ్యాచార్యు డీయనకు పరమగురువు.

"రుచిమదిష్టార్థ దోహన ప్రచురశబ్ద
సరమునే కావ్య మనియె ఆచార్య దండి."

" ఇష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ " యను దండివచనము నీపద్యమునందు గ్రహనముచేసినాడు. ఈవిషయమున మరియొకచో నిర్దిష్టార్థయుకంటె రసవదిష్టార్థమే పరిగ్రాహ్యమనుచు రమణీయత యన నీయిష్టతయేయని యీక్రిందివిధమున వివరించియున్నారు.

" కావ్యమందు నిర్దిష్టార్థకలనకంటె
రసవదిష్టార్థమే పరిగ్రాహ్య మగుట,
కవివచోవైఖరియు, రసజ్ఞప్రసాద
భవనవస్ఫురణయు, బ్రమాణంబు లిందు."

" క్షణేక్షణే య న్నవతా ముపైతి తదేవ రూపం రమణీయతాయాః" అను లాక్షణిక వచనమునే ప్రమాణముగా గొనినాడు. ఈరమణీయతయే రసవత్త్వమునకు పరీక్ష. ఈక్రింది యాంగ్లకవి కోలెరిడ్జి యభిప్రాయము నీసందర్భమున మాడవలయునని ప్రార్థనము.

**" Not the poem that we have read but that to which we return possesses the genuine quality of poetry" (Biographia Literaria).** రమణీయము గాకపోయిన పునః పఠనాసక్తి యుద్భవించునా ? కొన్నికావ్యములు మొదలిడినవెంటనే యౌదాసీన్యము కల్గును. మరి కొన్ని కొంత చదివిన తరువాత జుగుప్స కలుగ జేయును. ఇంక కొన్ని తుదివరకు చదువగలము గాని మరల చదువ మనసుపుట్టదు. అల్ప సంఖ్యాకములగు కొన్నిమాత్రము పునఃపునః పఠనాసక్తి కల్గింపను. ఇవియే యుత్తమ కావ్యములు. భారత భాగవత రామాయణాదులును, మనుచరిత్రాదులు నట్టివి. శ్రీసుబ్బారావుగారి కావ్యములు నట్టివె. తృణకంకణమేనాడు వ్రాసెను ? ఇప్పటికి పాఠకప్రపంచ మానంద మొందుచునేయున్నది. ఇంతకంటె పరీక్ష వలయునా ? ఈ పరీక్షతో నవ్యుల కావ్యము లన్నియు పరీక్షించిన నెవ్వరికావ్యములు నిలుచునో పాఠకులు తామే చూచుకొందురుగాక ! శ్రీసత్యనారాయణ, రామిరెడ్డి, జాషువా మొదలగు నల్పసంఖ్యాకు లెవ్వరోమాత్రమే నాబుద్ధికి తట్టుచున్నారు.

అట్టిదానికి ప్రథమసామగ్రి సంస్కారము. ఈ సంస్కార ముపాదాన కారణము. ఒకొక్కచో నీ సంస్కారముగల కవి వలయు నితరసామగ్రీసాధనములలో కొరవడినను నాతనికవిత్వము సహృదయుల నానందింపజేయును. ఒక్క యుదాహరణము. " యెంకిపాట "లను గొనుడు. అందంతయు చ్యుతసంస్కారమగు పామరుల భాష యుపయోగింపబడినది. కాని శ్రీ సుబ్బారావుగారి " శీలము, ఔచితి, అశ్లీల రాహిత్యము, సౌందర్యార్చనము "నను నీ ముఖ్య లక్షణములు కల్గియుండుటచేతను, కవియగు నండూరివారుకూడ చిత్తసంస్కారము కల్గియున్నవా రగుటచేతను, జానపదుల దైనను యెంకినాయుడుబావల పవిత్రప్రేమ, ప్రేమపూర్వక పవిత్రసంభాషణములు, మన యందు సానుభూతితంత్రిని బ్రోగించి రసమున ముంచి లేవనెత్తును. భాష యట్టిదగుట చేతనే గ్రంథము త్యాజ్యమనువారు సహృదయులు కారని నిస్సంశయముగా ననవలెను. శ్రీ సుబ్బారావుగారి గ్రంథములవలె నిదియు నుత్తమనవ్యకావ్యములలో నొకటియై పునః పునః పఠనాసక్తి కల్గించుచు సారస్వతమున శాశ్వతస్థానము కల్గియున్నది. మాగురువులును సహృదయోత్తములును నగు బ్రహ్మశ్రీ ఆదినారాయణశాస్త్రిగారిమన్నన వడసిన కావ్యమునకు కావ్యత్వమునకు లోటగునా ?

## ఔచితి ; పదజాలము

వీ రాదరించిన యౌచితిని కొంచెము విచారింతును. తమయాశయము నీక్రింది పద్యమున తెల్పినారు.

"సంధులు, విసంధులైన సాంస్కృతములు
దేశ్యములతోడ సమసించి తీవగొనిన."

మిశ్రమసమాసమని వెంటనే బహిష్కరింతురు వీరు. " తీవగొనిన "దాని నాదరింతురు. విడదీయుటకు వీలుగానంత కలిసిన దాని నెప్పటికిని వర్జించరాదు. ఇందు వీరు స్వతంత్రులు గారనియు లాక్షణికులనే యనుసరించుచున్నారనియు నీక్రింది పద్యము వలన దెలియనగును.

" సుప్రసిద్ధదేశ్యంబులకా శుద్ధసంస్కృ
తములతో గల్పదగు, సంప్రదాయమనడె
వామనుడు ?......................"

వామనుని పై యంగీకారము నాచరణమునం దుంచినాడు మల్లినాథసూరి తన మేఘసందేశవ్యాఖ్యయందు. ఇట్టిది సమంజసము కాదని యెవ్వ రనగలరు ? ఇట్టివిషయము లందు వీరికి ప్రమాణ మేమి యని యడుగ వచ్చును ? ఈక్రింది పద్యభాగమును దిలకింపుడు.

" ......శ్రవణసుఖంబు పాయదేని
అవిరళింతు రభంగిమ నాధునికులు."

కావున శ్రవణసుఖమే వీరికి ప్రమాణము. శ్రవణసుఖ మిచ్చుశబ్దజాలమును కూర్చుటలో వీరిని చెప్పి మరియొకనవ్యుని చెప్పవలయు. జాషువ రామిరెడ్డికూడ నిట్టిశబ్దజాలమును కూర్చుటలో సమర్థు లనవలెను. శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు మృదుపద గుంభనముకంటె భావగాంభీర్యమున కెక్కువస్థాన మిత్తురు. " ఆపాతతః " కొంతయైన నర్థమును స్ఫురింప జేయనట్టి పదజాలగ్రథనము శైలికి నారికేళత్వము నిచ్చును. కవియొక్క పాండిత్యప్రకర్ష కాదు కవితకు ముఖ్యలక్షణము ; "గూఢతయు జాటుతనంబును లేకయుండ" నన్నారు పెద్దన్నగారు. కైశికీవృత్తియు, వైదర్భీరీతియు కవితకు హృదయాహ్లాదకరత్వము నిచ్చును. ఈ "పదబంధసరణి" నీక్రిందిపద్యమున చూడనగును.

" మృదుల సరళాక్షరముల సమ్మేళనాప్తి
నార్ద్రనవనీతమార్దవ మగును నుడువు,
శ్రవణసుఖ మిచ్చు సలలితోచ్చారణమున
భంగిమ యటందు రీపదబంధసరణి."

నవ్యులు సామాన్యముగా రీతివాదులుగా కనపడుచున్నారు. వామనుడు రీతివాది. "రీతి రాత్మా కావ్యస్య" యని యాయన కోరిక. కాని శవ్కరీతివాదులవలె గాక శ్రీసుబ్బారావుగారు రసమును రీతిని రెంటిని

సమానమైన దృష్టితో చూచినారు. కవిత్వమునకు కావలసిన ముఖ్యాంశములగు "భావ, వస్తు, రచన"లలో భావ రచనల రెంటికిని సమానస్థాన మిచ్చినారు. ఈరెంటికిని ప్రత్యేకముగా "స్వతః" ఆనందమునిచ్చు శక్తిగలదు. రెంటియొక్క సమ్మేళనము నిక వేరె చెప్ప వలయునా? శ్రీసత్యనారాయణగారు భావ వస్తువుల కెక్కువప్రాధాన్య మిచ్చువా రని నాకు తోచుచున్నది. ఇచట మరియొక్క పద్యము నిట్టియర్థము నిచ్చుదానినే యనువదింతును.

"అన్యదేశ్యంబులను, సంస్కృతాదిపూర్వ
వాఙ్మయస్థశబ్దంబులన్, పాకెరింగి
నుడికరింతురు జాను తెనుంగునందు
మధురిమార్ధగౌరవముల్ ప్రమాణములుగ."

"మధురిమార్థ గౌరవములు" ప్రమాణములు. ఈమధురిమనే వెనుక శ్రవణసుఖ మనినది.

## భాషా విషయము

వీరు వెలిబుచ్చిన భాషాతత్వమునుగూర్చి కొంచెముగ ముచ్చటించి మరియొక విషయమునకు పోదును. సంస్కృత మెల్లభాషల కును తల్లి యనియు (ఇట్టి యభిప్రాయ మెల్లకాల ముండును.), గుణములు బిడ్డయందు సంక్రమించినవని యనియు నమ్మువారు వీరు. ఈగుణము జన్యజనక సంబంధ విశేషమును బట్టి మారు ననియు నను చున్నారు. సంస్కృతము మృతభాష యనువాదమునకు వీరు చక్కని సమాధాన మొసంగినారు.

"ఆసరస్వతి మ న్నదృశ్యయయి పోయె
నంచ్రు ; భావింతు నేను తదమృతజీవ
నము సమస్తభాషా స్తనంధయులకు
ఇచ్చి తాను కృశించినదేమొ యనుచు."

పెద్దలు పిల్లలను సర్వలక్షణలక్షితుల జేసి తాము విశ్రాంతినొందుట సహజమేకదా! విషయముపై సలహా కావలసినపుడు పెద్దల నడిగినట్లు సందేహము వచ్చినపుడు సంస్కృతము ప్రమాణముగా గొనుటయు సహజమె!

తెనుగు సంస్కృతజన్యమైనను తనచుట్టు నున్న భాషలతో సంపర్కముచే పలుకులను, వానినుండి గ్రహించి విశాలమై తదితరపదములను స్వీయమర్యాదల ననుసరించి స్వీయముల నొనర్చుకొన్న దనియు, నిప్పు డీపదముల పరీక్ష యనవసరమైన దనియు వీరిభావము. ఈ సంపర్కాగత పదజాలముతో, తెనుగు మిక్కిలి మృదువై వరలిన దనియు నీమార్దవము భాషకు సహజగుణమైన దనియు చెప్పుచున్నారు.

"ఈపలుకుబడి యింపుఘటిల్లె తెనుగు
భాషకు నిసర్గకోమలభూషణముగ."

అందువలననే వైదేశికు లీభాషను "(Italian of the East)" అని పిలుచుట తటస్థించినది.

"............బలిమికలిమి
నాచికొని స్వీయకోశకంఠప్రబద్ధ
ములుగ జేసికొన్న సువర్ణపుంజములకు,
అరవ కన్నడ యాజమాన్యంబు గలదె?"

శ్లేషప్రధానముగ నెట్టి సువర్ణములతో చెప్పినారు గ్రంథకర్తగారు!

## వ్యావహారిక భాష

వ్యావహారికభాషలయొక్క సామాన్య మర్యాద యిదియే! గ్రహించి పరిష్కరింపక పూర్వ మన్యభాషలకు సంబంధించినపదము లన్నియు సంస్కృతము లైనవెనుక నాభాషలోనివేయై, భాషను విశాలముచేసి కావ్యములలోని కెక్కి భాషాకుమారుల నానందింపజేయును. ఇచట నొకరసవదుదాహరణముచే చూపినారు గ్రంథకర్తగారు.

"ధేనువులు తిను బహువిధతృణచయమ్ము
త్రావు నానానదీకూపజీవనమును,
కలిసి పరిణమింపవె పాలుగా ధరిత్రి?
శబ్దమేళనతంత్రనైజమ్ము నిదియె."

కొంతకాలమునకు వెనుక నీశబ్దము లన్నియు కలసి భాష యొకసరసమైనట్టియు, విలక్షణమైనట్టియు నూతనవస్తువై వరలును.

## శాబ్దిక విమర్శకులు

ఇట్టిభాషలో వాఙ్మయము పుట్టి పెరుగును. ఈవాఙ్మయము కొంత పెరిగినవెనుక శాబ్దికుడును, విమర్శకుడును వరలుదురు. వాఙ్మయమును శాబ్దికుడు పరీక్షించి సామాన్య విశేషపరివర్తనములను గుర్తించి సూత్రింపును. భాషావాఙ్మయములు శబ్దవిమర్శనా శాస్త్రములకు పూర్వరంగము. భాషా వాఙ్మయములు స్వతంత్రములు. తత్కర్తయగు కవి స్వతంత్రుడు. ఈవిషయమునకు వేద భాషా వ్యాకరణముల నుదాహరణములుగ నిచ్చియున్నారు.

"ఋషులు శ్రుతి చేసి పాడిన ఋగనువాక
భాష నూని శాసించడే పాణినిముని."

ఆభాషయే తరువాత మార్పులతో కావ్యభాష యయ్యెను. తరువాత నాగిపోయెను. దేశభాష లట్లుగాక ధారావాహికగా జీవనదులవలె ప్రవహించుచున్నవి. వానిని పాణినీయమువలె సార్వకాలికమగు వ్యాకరణముచే శాసింతుటకు వీలులేదు. చూడుడు:

"ధాతునిష్పన్న రూపబద్ధంబ యగును
సంస్కృతంబు; ప్రవాహినీసదృశయగును
దేశభాష. ప్రమాణనిర్దిష్ట మొకటి
ఒకటి స్వస్థాననాగరకోపయోగి."

కవి శాబ్దికుల సంబంధమునుకూడ నెంత సున్నితముగను, కంఠోక్తిగను, నిరుత్తరముగను చెప్పిరో గమనింపుడు.

"భావగతి కవలంబనవాక్య మగుట
వాక్యసంధాత కవియాట వాఙ్మయమున,
శాబ్దికుండు ధూర్వహుడు కాజాల డెపుడు
అవయవవిభాగ మెటు లవయవిని దిద్దు?"

ఇటులనే గీతికిని, కావ్యమునకును రెండును నాదమూలము లైనను భేదము లున్నవి మొదలగు ననేకవిషయములపై పూర్వాధునికాభిప్రాయ సమన్వయముతో సరసోదాహరణపూర్వకముగ గ్రంథకర్తగారు విమర్శించి సమాధానముల నిచ్చియున్నారు. గ్రంథకర్తగా రొకచో కవి తాత్త్వికుల కెపుడును స్పర్ధ

యనియు, రాగరక్తతారాగముక్తతలు వారికి భేదము కల్పించుచున్న వనియు, సగుణ నిర్గుణములకు సఖ్య మసంభవ మనియు తెల్పుచున్నారు. రక్తతాముక్తతల కానందమే పర్యవసానముగాన నిద్దరు నుపాసకులే గాన, భిన్నత్వ మాభాసమే గాని వస్తుతః లేదని మనవిచేయుచున్నాను.

## లలితకళలు

కావ్యమున కానందనము పరమావధి యనియు, నట్టియానందము రసానుభవము చే కలుగుననియు, లలితకళ లన్నియు నట్టి యానంద పర్యవసాయులే యనియు రసానుభవమునకు హ్లాదరామణీయకములు మార్గము లనియు మొదలగు ననేకవిషయములను మిక్కిలి సమంజసముగా చర్చించియున్నారు. లలితకళలనగా, కావ్యగీతిచిత్రకళలు పశువులనుండి మానవుని వేరుచేయు నంశలని చెప్పుచు నీకళాత్రయముయొక్క విశిష్టగుణముల నీక్రిందివిధముగ రసవచ్ఛైలిలో చెప్పియున్నారు.

"సృష్టియందె యీశ్వరుని అర్చింత్రు కవులు
శ్రుతికి మూలంబయగును మాతృసుస్వరంబు
ధ్యానధారల ఫలియించు జ్ఞానరేఖ
అమలినానంద మొకడె లక్ష్యంబ యగును."

ఇప్పటికే చాలా పొడుగైన దీవిమర్శనము. కాని యెంత వ్రాసినను నింకను మిగిలిపోవుచున్నవి విమర్శింపవలసిన విషయములు. ఇంకొక విషయమును ముచ్చటించి తరువాత నవ్యకవితాలక్షణముల నిత్తును.

## వాఙ్మయము - దేశకాలములు

వెనుక దేశకాలముల ననుసరించి వాఙ్మయముకూడ మారుచుండునని తెలిసినది. ఒక్కమారు మనవాఙ్మయ పరివర్తనములను సింహావలోకనము చేసిన నిందలి నిజము తెలియగలదు. వెనుకటి పురాణ ప్రబంధయుగముల నటుంచుడు. ఈశతాబ్ద ప్రారంభమునను వెనుకటి శతాబ్దాంతముునను నాగరకతా ఫలముగా వచ్చిన సంఘసంస్కారసమస్య వీరేశలింగం మొదలగు మహామహుల హృదయముల బడి యెంత వాఙ్మయమును పెంచి సర్వతోముఖ మొనర్చెను? ఇటులే యాకాలపు "మాన్యము"గ నాటకము, ప్రహసనము, చిన్నకథ, వ్యాసము, పత్రికావాఙ్మయము మొదలగు వాఙ్మయ సోపానము లెన్నియో నిర్మింపబడినవి. తరువాత ౧౯౦౭ - వ సంవత్సరపు జాతీయతావ్యాపన మూతగా గొని యెంతజాతీయ వాఙ్మయము పెంపొందెను? ఇట్లె ౧౯౨౦ సంవత్సరపు సహాయనిరాకరణోద్యమ ఫలితముగ నెంత జాతీయోజ్జీవనకరమగు వాఙ్మయము పుట్టెను? శ్రీ లక్ష్మీకాంత కవిగారి పద్యప్రబోధము మరువవలె నన్నను మరపురాకున్నది. ఏకాలపు వాఙ్మయమును పరిశీలించినను నాకాలపు జాతీయజీవనమందు ప్రతిబింబించుచుండును. ఈనవ్యకవిత పుట్టిన యీ ముప్పది సంవత్సరములును భారతదేశమున కావేదనాకాలము. ఎందరో దేశభక్తు లుద్భవించిరి. కీర్తిశేషు లైరి. కొంద రదృష్టవశమున నింకను దేశస్వాతంత్ర్యసమరమును సల్పుచున్నారు. మరియు ననేకమతసాంఘికోద్యమములు పుట్టి, ప్రజలు వారివాసనల ననుసారముగా వాని నాదరించుచున్నారు. ఎన్నో రాజకీయార్థిక నూతనసిద్ధాంతములు పుట్టి యిప్పటికిని సాధింపబడుచున్నవి. వీని కన్నిటికిని దేశభాషాభిమానములు ముఖ్య బీజములు. కావున నీముప్పది సంవత్సరములలో వరలిన వాఙ్మయ మంతయు దేశభాషాభిమానములతో నుబుకుచుండవలసినది. ఎవరు మేము నవ్యులమని బిగ్గరగా చెప్పుకొనుచున్నారో వారిలో నే యల్పసంఖ్యాకు లందో తప్ప నీయభిమానము ముఖ్యసూత్రముగా కన్పట్టుట లేదు. శాశ్వతానశ్వరజాతీయ గీతముల కర్తయగు మామిత్రులు గరిమెళ్ల సత్యనారాయణగారినిగాని, "దండాలు దండాలు భరతమాత"యను గీతమును రచియించినకవిని గాని జాతి యెప్పటికైనను మరువగలదా? ఒకవేళ కృతఘ్నులై పేరులను మరచినను తద్గీతములను మరచిన క్షంతవ్యు లైన్నటికిని గారు.

"తాటిచెట్లు వాడివంట భరతమాతా! - వాడి
తాత వచ్చి పాతినాడో భరతమాతా."

ప్రస్తుత మద్యపాననిషేధోద్యమ మంతయు నీరెండుముక్కల నిమిడియున్నది. ఇట్టి దేశభాషాభిమానము ముఖ్యముగా గల ముగ్గురు నవ్యకవులు నా కగపడుచున్నారు. గ్రంథకర్తగారు, విశ్వనాథ సత్యనారాయణ గారు, జాషువాకవిగారు. వీరిలో నగ్రస్థానము శ్రీ సుబ్బారావుగారి కిచ్చుచున్నాను. కారణమును వెనుక నేను వ్రాసిన వాక్యముల నుదాహరించుచున్నాను. "ఈన చేసిన ప్రబోధంలోనూ, మిగతావారి దానిలోనూ వోహాగొప్ప భేద ముంది. ఈన ప్రబోధంలో అంతటా ఉత్సాహ ప్రవాహమే కాని దుఃఖం వెతికినా అగపడదు". ఈవాక్యముల కుదాహరణముగా రెండు పద్యముల ననువదించెదను.

"ఏప్రఫుల్ల పుష్పంబుల నీశ్వరునకు
పూజ సల్పితినో యిందు పుట్టినాఁడ!
కలదయేని పునర్జన్మ కలుగుగాక
మధురమధురంబయిన తెన్గుమాతృభాష!"

ఎంత మధురభావ మెంత హృదయంగమముగాను, నుత్సాహకరముగాను చెప్పబడినది! తమ జన్మసంప్రదాయములను మరచిన యాంధ్రులను హెచ్చరించుచున్నారు!

"ఏతదముల సౌందర్యార్చనాతిరేక
మాత్మభావన, నానందమై ఫలించు;
జంతువుల జన్మ, వర్ధనాస్తమయములను
ఆద్యసూత్ర మానందమే యగును కవికి."

తా నిట్టియానంద మనుభవించినగాని పాఠకునికి దాని నందియ్యలేడు. జన్మాంత మస్తమయము! పునర్జన్మమున కాది యస్తమయము. "ధీర స్తత్ర న ముహ్యతి" యనుగీతావాక్యమును స్ఫురింప జేయుచున్న వీపై పంక్తులు!

## నవ్యకావ్యలక్షణములు - చర్చ

పైవిధమున ముఖ్యవిషయముల యనంతరము నవ్యకవితా లక్షణములకు మరలుదును.

శ్రీసుబ్బారావుగా రుగ్గడించినవాని నానుపూర్విగా నిచ్చుటకు యత్నించెదను.

(౧) "భావకంటె నవ్యులకు తపస్సు లేదు". దీనినే శ్రీసుబ్బారావుగారు వాగ్వ్రత మనిమరియొకచో ననుచున్నారు. కావ్యనిర్మాత తనకర్తవ్యమును ధర్మబుద్ధితో, వాఙ్మూర్తుల మున తానానందము ననుభవించి, యితరుల నానందింప జేయవలెను. ఈలక్షణ మనితర సాధ్యముగా తోచుచున్నది. రాజకీయమున గాంధీమహాత్ముని సత్యాహింస లెట్టివో యీ లక్షణ మట్టిదే. ఈ లక్షణమును బట్టి నేము నవకవుల మని చెప్పకొను వనేకుల కబ్బను లీయావరణమున కావల నుండవలసివచ్చును. ఇది కేవలము శ్రీ సుబ్బారావుగారి కృతులకుమాత్రమే వర్తించునని చెప్పట తగదుగాని యట్టికృతు లత్యల్పసంఖ్యాకములనిమాత్రము చెప్పకతప్పదు.

(౨) "రసములకునెల్ల శృంగారరసము తల్లి
అనిరి పూర్వులు సంభోగ మవధిగాగ;
అక్షరానందసిద్ధి లక్ష్యముగ నెంచు
నవ్యులకు నది అప్రధానంబ యయ్యె."

స్థాయిభావమగురతినే ప్రణయ మందము. దీనినే పర్యాయముగా శృంగార మనియు, సౌందర్య మనియు వాడినారు.

"కానరాదు సౌందర్యశృంగారములకు
భేద మధిక మారాధనవృత్తియందు."

శృంగారరసమున నప్రధానమగు సంభోగమును వదలిన మిగులునది ప్రణయము. శృంగారముయొక్క రెండవవిధమగు విప్రలంభము (వియోగము)న నీసంభోగము లేకపోవుటచే నది పక్షాంతరమున వీరి కుపాదేయమే యయినది. అచ్చటగూడ విప్రలంభమునకు హేతువు ప్రణయమే! సంస్కృతభాషలోని యుత్తమకవులగు కాళిదాస భవభూతులుగూడ సంభోగమునకంటె విప్రలంభమునకే ప్రాధాన్యము నిచ్చినారు. ఉత్తరరామచరితమునందలి రసము విప్రలంభమైన ప్రణయమేగదా! మేఘదూతయందలిదికూడ విప్రలంభ మంతముగాగల ప్రణయమేగదా! కాళిదాసు కంఠోక్తిగా నీవిషయమునే యీక్రింది మాటలలో చెప్పినాడు.

"పరస్పరప్రాప్తి నిరాశయో ర్వరం
శరీరనాశోపి సమానురాగయోః."

ఈసందర్భమున శ్రీ సుబ్బారావుగారు పండితరాయల నీక్రిందివిధముగా ననువదించుచున్నారు.

"మూఢు లిచ్ఛయించెదరు సంభోగసుఖము
నే వియోగమాధుర్యలీలావిపాక
మనుభవింప నట్టాడెద నసడె యాంధ్ర
రసికకులరాజు పండితరాజు మున్ను."

మరియు సర్వరసబీజభూతమని పూర్వులచే నంగీకరింపబడిన శృంగారమందు, సంభోగమును తొలగించి, యట్లు తొలగించిన సాత్త్విక శృంగారమును ప్రణయ మనియు, సౌందర్య మనియు (వియోగ) నామ మిడి దానినే ప్రపంచంబునం దంతటను చూచుచున్నారు. అట్లు ప్రపంచమునందలి ప్రతివస్తువును ప్రేమ (ప్రణయ)మయముగా చూచి తత్ప్రణయము నుద్ఘాటించుట నవ్యకవికర్తవ్యము. దీనినే గ్రంథకర్తగారు సౌందర్యార్చన మనుచున్నారు. వీరిసిద్ధాంతమున సౌందర్యార్చనమేగాని సౌందర్యానుభవము లేదు. అనుభవాభావమే దాని నమలినము చేసినది. ఈ భావమునే శ్రీ సుబ్బారావుగా రీక్రిందిపద్యములలో తెల్పినారు.

"తీవమీద సుతారంపు తీవి నిలిచి,
పగలబడినవ్వు పువ్వు పైకెగయు అళిని,
ప్రియుడుప్రియురాలియట్లు చేర్చెనొక సుకవి
బిడ్డ తల్లి నిభాతి కల్పె మరొకండు."

వీరిశృంగారతత్త్వ మిది! రెంటను ప్రణయమే యున్నను రెండవది స్వార్థరహితము, అయినను నానందపర్యవసాయి!

"కలశుభాంగీవయోధీరకుసుమమందు
మోహమధువె గవేషించె మున్ను సుకవి
సాత్త్వికప్రేమకోశపేశలములయిన
వత్సలామృతరుచులను వలచె నేడు."

చూచితిరా భేదము? వీరికి మోహరహిత శృంగారమే ముఖ్యోపాదేయము. ఇదికూడ భాషాతపస్సువలెనే మిక్కిలి కఠినపరీక్ష. ఇతర నవ్యులకుకూడ రసము లన్నిటిలో శృంగారమే ముఖ్యోపాదేయమని వారిరచనములవలన తెలియుచున్నది. కాని యీ యమలిన శృంగారము చాల యరుదుగా కానవచ్చుచున్నది. వీరిదృష్టిలో స్వీయతప్ప యితరనాయికలు లేరు. ఏలన సంభోగసహితమైన శృంగారములో ధర్మరూపమైన కామపురుషార్థమునే వీరు తప్పక, యితరులు గ్రహించినందున నొర్చగలరు.

"విషయమయమైన సంభోగవిధి జగాన
క్షయమయమయ్యె, రూపాంతరసంగ్రహమున
సుప్రజాతంత్రనిర్వాహమాత్ర మగుట;
తలచెదరు దంపతీనిష్ఠ ధర్మముగనె."

చూచితిరా ధర్మబద్ధమైన కామమందుకూడ వీరి కెంత నైరస్యమో! విధిలేక యొప్పకొనుట! మనస్ఫూర్తిగ రాదు! ఇది ప్రపంచమున కతీతమైన పావిత్ర్యము! ఒకవేళ చెప్పవలసివచ్చినపు డెట్లు చెప్పవలెనో యొకయుదాహరణము నిచ్చినారు.

"పచ్చిముత్యాలతమ్మిపూబాల్శిరమున
తళుకు లరమోడ్పుగొను జంటకలువ లమర;
జారులతికల, విశదమంజరులతోడ
చెలియ దోచె భోగార్చన సలిపినట్లు."

ఎంత విషయనిగరణము! ఎంతగూఢత! ఈ గూఢత నవ్యకవిత కొకముఖ్య లక్షణము. గూఢత యనిన కావ్యదోషమగు గూఢార్థమును గ్రహింపవలదనియు, నింగ్లీషున mysticism అనుపదమునకు సమానార్థముగ వాడితి ననియు మనవి. కాని గూఢత యనిన మాయమాకాంత పండితుని యయోమయము కాదని హెచ్చరిక!

(3) ప్రకృత్యారాధనము నవ్యుల లక్ష్యమని చెప్పచున్నారు. అందును ప్రకృతిని "తల్లిగా, ధాత్రిగా, దేవతామతల్లిగా, సమస్తపరాపరకార్యములకు "ను భక్తితో

నవ్యు లాశ్రయించుచున్నారని నుడువుచున్నారు. ఈప్రకృత్యారాధనము బాహ్యముగాను నాంతరముగాను నుండవచ్చును. మరియు వర్ణనముగాగాని భావనగాగాని యుండవచ్చును. ఇచ్చటకూడ వీరికిని నితరులకును నంతరము గలదు. ఎచట చూచినను నుదాత్తమగు భావనాతపం బీయనలో నగపడును. కష్కమైనట్టియు, భావవిరహితమైనట్టియు, పవిత్రము గానట్టియు వర్ణనములు గానరావు. అప్పుడు కేవల వస్తువర్ణనమై సహృదయునియందు వలసిన భావపరివర్తనమును చేయజాలదు. పూర్వులకు ప్రకృతి వర్ణ్యము. నవ్యులకు సర్వస్వము !

(౪) ఇచటనే సౌందర్యార్చనమును తీసుకొందును. నవ్యులు సౌందర్యార్చన ముపాధిగా గలవా రనియు, నెల్లపుడును నానందమే వారి కనుభావ్య మనియు, నీసౌందర్యమునకు శృంగారము గుణ మనియు వీరుగ్గడించుచున్నారు.

"సుఃము శృంగార మగును, తద్గుణశరణ్య
మమృతసౌందర్య మగును నవ్యార్చకులకు."

"జంతువుల జన్మవర్ధనాస్తమయములను
ఆద్యసూత్ర మానందమే యగును కవికి."

ఈ యవిచ్ఛిన్నానందముకూడ సుబ్బారావుగారి కృతులలోనే యెక్కువగా నగపడుచున్నది. శ్రీసత్యనారాయణ రామిరెడ్డి జాషువగార్లుకూడ నీసందర్భమున చాలవరకు వీరికి దగ్గరకు వత్తురు. నవ్యులకంతయు మోదమయ మేగాని ఖేదమయ మెన్నటికిని యెచ్చటను లేదని వీరియాశయము. రసానుభవావస్థలో సహృదయునికికూడ నట్లే యని వీరియభిప్రాయము. కవి కెట్లున్నను సహృదయుని కట్లేయని ఘంటాపథముగా జెప్పచున్నాను. ప్రపంచానుభవమున ఖేదమోదములకు తావుండును గాని కావ్యరసానుభవమున ఖేద మెన్నటికిని లేదు ! ఇట్టి యానందము ప్రకృతిసహజగుణ మనియు నందుచే ప్రకృతి నర్చించు లలిత కళోపాసకులందరు నెల్లపు డానందానుభవము చేయుచుందు రనియు చెప్పుచున్నారు.

"ఇట్టిసౌందర్య మీసుప్రకృతి గరించు
బహువిధాల ననంతరూపముల నెపుడు,
రక్తి నర్చింతు రభిరుచిక్రమముకొలది
శిల్పులును గాయకులు కవిశేఖరులును."

ఈయర్థము నుగ్గడించుచు గ్రంథకర్తగారు చేసిన పృథివీవర్ణనములును, ఋతువర్ణనములును పాఠకుడు చదివితీరవలయును. సౌందర్యార్చనాపద్ధతిని తా ముదాహరణపూర్వకముగా చేసి చూపినారు గ్రంథకర్తలు. ఋతువర్ణనము కాళిదాసుని ఋతుసంహారమును స్ఫురింపజేయుచున్నది.

(౫) రెండు లక్షణముల నాదిలోనే స్థాలీపులాకన్యాయముగా చెప్పియుంటిని. వానిలో మొదటిది "స్వానుభవభావ్యములను" విప్పి వ్రాయుట. ఇగి యన్నిటికంటె బహుళముగా దాదా పందరు నవ్యులలో నగపడుచున్నది. ఇది కవియొక్క దృక్పథ పరివర్తనమేగాని వేరొండు గాదు. వెనుకటివారిలో నేచాటుధారలలోనో శతకములలోనో తప్ప యీగుణమును కానము. అట్టివారిలో శ్రీనాథుడు ముఖ్యుడు. ఇప్పుడు ప్రతికవియు నిర్భయముగా ప్రథమపురుషైకవచనమును ధారాళముగా నుపయోగించుటకు సాహసించుచున్నాడు. దీని కింకొక కారణముకూడ గలదు. ఇది స్వాతంత్ర్యకాలము. అంతటను వ్యక్తిస్వాతంత్ర్యసూత్రమనుసరింపబడుచున్నది. ఈ స్వాతంత్ర్యేచ్ఛ సారస్వతమున కవిస్వాతంత్ర్యముగా పరిణమించినది. ఆంగ్లసారస్వతమున ఫ్రాన్సువిప్లవము కారణముగా వ్యక్తిస్వాతంత్ర్య సూత్రము యూరపుఖండమున వ్యాపించెను. తత్పరిణామముగా నింగ్లాండున వర్డ్స్వర్తు మొదలగు కవు లుద్భవించిరి. హిందుదేశమున కట్టికాలమిది. తత్స్వాతంత్ర్యము సారస్వతమునకూడ స్థానమును పొంది కవితనుకూడ స్వతంత్రము చేసినది. నియమములయెడ నైరస్యము కలిగినది. కొందరిలో నీస్వాతంత్ర్యము పిచ్చిగా కూడ పరిణమించినది.

(౬) తరువాతిలక్షణము మృదుపదబంధసరణి. పరుషసరళవర్ణతత్త్వమును దెలిసి యెట్టి సన్నివేశమున నెట్టిశబ్దసమ్మేళన ముండవలెనో యోచించి కవి యుపయోగింపవలసియున్నది. ఇచట నొకవిశేషము కలదు. ప్రకృతి యెల్లపుడును సరళగాక, యొక్కొకకాలమున తీక్ష్ణగ నుండును. ఒక్కొకచో భావకర్కశతయు వర్ణింపవలసివచ్చును. ప్రకృతిదృశ్యములొక్కొక్కపుడు బీభత్సములై కన్పట్టును. అట్టి సమయములలోకూడ నీపదబంధసరణి తదనుగుణమై యుండవలెను. శ్రీసుబ్బారావుగారు కాళిదాసువలె సరళప్రకృతివర్ణనములకె గడంగిరిగాని భీకరప్రకృతి వారి కెన్నడును దృష్టిగోచరయైనట్లు తోచదు. ప్రకృతి యీయనకు తల్లిగాన మృత్యురూపమునకూడ నాదేవి యీయనకు సరళరూపమునే చూపుచున్నది. బహుళముగా నవ్యులలో నీసరళప్రకృతివర్ణనములే గన్పట్టుచున్నవి. భవభూతివలె శ్మశానములును, కరాళపంక్తులు, సర్పచీత్కారములు, మార్గముదొరకనికాననదృశ్యములును మొదలగునవి ప్రకృతిలో చాలమంది నవ్యుల కగపడినట్లు లేదు. ఒక్క శ్రీసత్యనారాయణగారు కొన్ని సందర్భముల నద్భుతదృశ్యముల వర్ణించుసామర్థ్యమున్నట్లు స్పష్టీకరించినారు. కృష్ణపక్షకర్త కామె ఫెళఫెళార్భటులు మొదలగువానితో క్వాచిత్కముగా కనపడినది. చూచినకొలది నవ్యులకు చాలామందికి ప్రకృతియొక్క సుందరసరళాకృతియే గోచరమయ్యెగాని, యామె తన బీభత్స భయానకాకారము చూపు దయ వారిపై రాలేదని తోచును.

(౭) తరువాతిలక్షణము భాషకు సంబంధించినది. వెనుక వీరి యాచితినిగూర్చి ముచ్చటించితిని. భాషావిషయమున వీరు పట్టు సడలించుటకు ప్రయత్నించిరి. నిజముగా చూచిన "శబ్దిరుడు ధూర్వహుడు" కాకపోవుటచేతను "కవి నిరంకుశు" డగుటచేతను భాషావిషయమున దేశకాల భేదముల ననుసరించి వ్రాయుటకు కవికి సంపూర్ణమైన యధికార మున్నది. మరియు

నిది విజ్ఞానవర్షమును ప్రజాబాహుళ్యములపై కురిపింపవలసిన కాలము. సారస్వతమున కాటపట్లు రాజాస్థానములు గావు. కవుల నాదరించువారు రాజులు గారు. అట్లైనపుడు రాజులనే నాయకుల గావించి వారిచరిత్రములనే కవులు గ్రంథస్థముల జేసిరి. ఇప్పుడట్లు చేయుట తగదు. బహుళప్రజాదరంబు వడయుటకు భాషయందు పరివర్తనము తప్పక యవసరము. నవ్యకవితాప్రథమలేఖకులలో నొకరగు శ్రీ అప్పారావుపంతులుగారీయుద్యమమును శ్రీ గిడుగు రామమూర్తిగారి సాయముతో లేవదీసిరి. ఈ నవ్యకవితా భాషోద్యమములు రెండును నొకేకాలమున నొకే యాదర్శములతో పుట్టినవి. భాషలో సహిత మీ మార్పును గమనింపదగియున్నది. ఈముప్పది సంవత్సరములనుండియు గ్రంథములయందు కవి కొంతస్వాతంత్ర్యము తీసుకొనుట కవకాశ మున్నదో యంతస్వాతంత్ర్యము తీసుకొనబడుచున్నది. ఉదాత్తములగు కావ్యముల నుదాత్తత యవసరమని కవు లుదాత్తభాషాశైలులనే యుపయోగించుచున్నారు. కావున నీలక్షణములు దాదా పన్నినవ్యకావ్యములకును సామాన్యగుణముగా గ్రహింపవచ్చును. శ్రీ సుబ్బారావుగారే యీలక్షణమున నింకను సంపూర్ణముగా ననుసరించుట లేదు.

(౮) వారు కంఠోక్తిగా చెప్పకపోయినను రెండువిషయములనుగూర్చి ముచ్చటింపవలసియున్నది.

౧. భావప్రాధాన్యము, ౨. గేయములు. పూర్వపు కవులుకూడ నీభావమును బొత్తుగ నిరాదరింపలేదు. భావ, వస్తు, రచనలకు మూటికిని సమానగౌరవ మొసంగినారు. ఇప్పుడు వస్తురచనలకంటె భావమునకే నవ్యులు బహుళముగా స్థానము నిచ్చుచున్నారు. ఇయ్యవలసినదే! ఎప్పుడు ప్రకృతి కవులు తల్లిబిడ్డలై ప్రవర్తించిరో, యెప్పుడు కవులు తమస్వానుభవములను వ్రాయ మొదలిడిరో, యెప్పుడు ప్రకృతి బిడ్డలైన కవులకు పాఠములు చెప్ప మొదలిడెనో యప్పుడు కవులు తప్పక కావ్యములయందు ప్రత్యక్షులై తమ భావములకు ప్రాధాన్య మియ్యక తప్పదు. "మనోరథానా మతటాః ప్రవాహాః" అన్నట్లే భావము లనూహ్యములగుట కావ్యమునకు ప్రాశస్త్యము తగ్గించును. ఇక గేయముల నుల్లేఖించినపుడు నవ్యులలో కొందరు గణచ్ఛందస్సులను వదలి మాత్రాఛందస్సులను గ్రహించుచున్నారు. దీనికి రెండుమూడు కారణములు కలవు. కష్టము గావున ననుడు, మరే మియైన ననుడు! నియమనైరస్యము, మొదటి కారణము, సౌలభ్యము రెండవ కారణము. వ్రాయువారికిని నర్థము చేసుకొను ప్రజాబాహుళ్యమునకునుకూడ నీకారణము వర్తించును. మరియు గేయమునకు పద్యమునందుకంటె హృదయాకర్షణ సామర్థ్యమున్నది. ఇంకను విజ్ఞాన ప్రచారమునకును, నుత్సాహజననమునకును, ప్రాచీన వీరగాథాబోధనమునకును గేయము మిక్కిలి యుపయుక్తమైనది. బొబ్బిలి పాటలను, పల్నాటివీరచరిత్రము నుదాహరణములుగా గొనుడు. కావున బహుసంఖ్యాకులు గేయములను వ్రాయుట ముదావహము.*

## ముగింపు

ఇక తుదిమాటలను చెప్పి విరమింతును. ఇది యొకలక్షణకావ్య మనవచ్చును. గ్రంథకర్తగారి పవిత్రవాక్సౌగన యీ గ్రంథమునకు పునాది. కాని యిందలి యన్నిలక్షణములును నవ్యుల యన్నికావ్యములందు నున్నవని చెప్పటకు వలనుపడదు. ఇక నిది యాయుత్తమలక్షణ గ్రంథశ్రేణిలో నెట్లు చేరుచున్నదో యట్లే యొక యుత్తమకావ్య మనవచ్చును. ఈ కావ్యమును వ్రాసి భాషామతల్లి కొక నవ్యాభరణమును చేకూర్చినారు గ్రంథకర్తగారు. దానినిగూర్చి నా పొడిమాటలలోనైనను వ్రాయుభాగ్యము లభించినందుల కానందించుచున్నాను. ఇంకను వ్రాయవలసిన విషయము లున్నవి. అయిన నివియే నమస్కారములు.



* ఈ సందర్భమున మా మిత్రులు శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారి "అనాదృతవాఙ్మయము" అను వ్యాసమును చదువవలెనని ప్రార్థన.

# వరూధిని - కళాప్రియ

కొండేపూడి సుబ్బారావు

వరూధిని అందమునకు పేరుగన్న యచ్చర. వయసున నవయౌవని. చిన్ననాటినుండియు రత్నకందరములందును, నందనచందనోత్కర సీమలందును కదళీనికుంజమధ్యమునను బెరిగినది. అందుచే, బాల్యమునుండియు వరూధిని సౌందర్యోపాసియు రసపిపాసువు కాగలిగినది. సౌందర్యవాతావరణమునందు వరూధిని హృదయము స్నిగ్ధముగ్ధమై పులకించినది. సౌందర్యమునకు దోడు కళాస్వరూపమును గూడ నీగంధర్వాంగన గ్రహింపజాలినది. మనోహరమగు సంగీతాభ్యసనమున కీమె సునిశితమైన రసజ్ఞతతోడైనది. ఈయమపసిడికలలు "తరుణాంగుళీధూత తంత్రీస్వనముల"లో జిలిబిలిపాటలుగా గరగి, ముద్దులు నటించినవి బ్రహ్మానందతుల్యమగు రసస్వరూపమును, సంతతానందప్రదము లగు కళాసౌందర్యములను వరూధిని నిత్యజీవితమున లీనము చేసికొనినది. తనకు జాలినవారు లేరని గర్వపడినదికూడ. ఆమె గర్వకారణమామధుర జీవితమే. వరూధినీవైదగ్ధ్యములకు ప్రకృతిసయితము చలించి, పూరేకులు విచ్చి చూచినది. వరూధినిని దన కుమారిగనే పెంచుకొనినది.

వరూధిని సౌందర్యమునకు బానిస. సౌందర్యమునకై తనమేని వంపులు దిద్దికొనినది. సౌందర్యోపాసనలో జీవితసూత్రముల నల్లికొని, సౌందర్యతృష్ణలో బ్రతుకుబాటను దిద్ది తీర్చినది. సౌందర్యమునకు, సరసతకు హృదయమిచ్చినది; కాని, తన సౌందర్యమును తానే గ్రహింప లేకపోయినది. రాళ్లైనను కరగునట్టి విమలగాంధర్వము నేర్చి, వీణ మ్రోయించినది. వీణానాదము సరియైనదా, కాదా, అనునది యామె ప్రశ్న కాదు. చమత్కారముగ మాటలాడగలదు; కాని మాయలు నేర్వని యమాయిక: జిత్తులు లేనిముగ్ధ. లోకమంతయు దనవలెనేయుండు ననుకొని పొరపడినది పాపము! అంతటితో నామె పసిడికల లన్నియు పండబారకమునుపే చెరిగిపోయినవి. వరూధిని అభాగ్య: అదృష్టవిహీన.

వరూధిని వృత్తాంత మింకను దెలిసికొనుటకు ప్రవరునితోడి పరిచయ మవసరము.

ప్రవరు డతేఖ్యతనూవిలాసుడే యైనను

'వాని చక్కదనము వైరాగ్యమున జేసి
కాంక్షసేయు జారకామినులకు
భోగబాహ్యమయ్యె; పూచినసంపెంగ
పొలుపు మధుకరాంగనలకు బోలె.'

అని వరూధినీయత్నవైయర్థ్య హేతువగు నతని వైరాగ్యదీక్షను పెద్దన లేఖిని తొలకరిలోనే చిత్రించినది. ఔషధహీనుడైన ప్రవరుడు హిమగిరిపై దెరువుం గానక, యచట గాంచిన కోనలోనికి మల్లిక లవలంబనముగ రత్నసోపానముల దిగి నడచునపుడు, పరిమళమై 'మగువ పొలుపు దెలుపు నొక్క మారుత' మెలసినది. అంతేకాదు, 'తదీయ పరంపరా పరిమళ వ్యాపార లీలయు' గలిగినది ప్రవరునకు. ద్వితీయాశ్వాసమున నీపద్యముననే వరూధినీవిషయ మారంభమున సూచింపబడుట. వైరాగ్యపు గ్రుడ్డితనముచే బ్రవరు డాచోట నెవరో జనులుండిరనుకొని 'జనాన్విత' మనినాడు, కాని, మగువ లున్నారను తలపే యాతని మనసున బొడమలేదు. అటుపోయి శశికాంతమణి పీఠిపయి 'నింపు దళుకొత్త వీణ వాయించు'చున్న యొకసుందరిని చూచినాడు. ఈమెయే నాయికాపాత్రమగు వరూధిని. ఈమె ధరించిన వేషము గూడ వేశ్యాసముచితమును, శృంగారసూచకము నగు భూషణాంబరాదులే. ఆలాపగతి జొక్కి పరవశయై పోవుచున్నది. ఆపరవశత్వ మంతయు కళోపాసనలోననే. ఎంతటి రససిద్ధి! ఆ పరవశత్వమునం దామె ఏమహాగానముల సృష్టించుకొనుచున్నదో, యేయే స్వప్నవీధుల విహరించుచున్నదో, యామెకే తెలియవలయును.

సౌందర్యరాశియగు వరూధినిని చూచినప్పటికిని, ప్రవరునిలో మార్పు లేదు సరికదా, భావచాంచల్యమైనను కలుగలేదు. అది వరూధినీవిభ్రమవిలాసములందలి లోపము కాదు; ప్రవరుడు వైరాగ్యము మూర్తీభవించిన వ్యక్తియగుటయే. అతడు శ్రోత్రియత్వమునకు నెలవు. అతనిలో జాంచల్యము కననిది; విననిది. ఈ విషయము నాతన్వి యెఱుగదు. ఎఱిగిన నేమి నలకూబరసన్నిభుడగు భూసురునిసౌందర్య మయస్కాంతము వలె వరూధినిహృదయమును దనవైపు లాగికొనినది. ఇక వరూధిని వరూధినిది కాదు. ఆ విషయ మామెకును సమ్మతమే కాని, తత్ఫలితము పాఠకులకు దెలిసినంతగ నామెకు దెలియదు.

నాయిక కనుదమ్ములు విచ్చి యబ్బురపాటుతో బ్రవరుని జూచినది. ఆమె కనీనికల కాంతులు వెల్లిగొనినవి. చిత్తమున గోరిక లీరికలెత్తినవి. పుష్పబాణు డిక యుద్ధసన్నద్ధుడగుటకన్న వేఱుపని లేదు. ఇది వరూధినీ ప్రథమదర్శనము. దశవిధ కామావస్థలలో బ్రథమమగు నభిలాష యప్పటికే యామె నావరించినది. వరూధిని ప్రవరుని 'చూచి,

ఝుళంఝుళత్కటక సూచితవేగ పదార విందయై లేచి......పూచిన యొక్క పోక' జేరి "తదీయ పదవీ కలశాంబుధి వెల్లి గొల్పి' నది. నూత్నపురుష దర్శనమున స్త్రీలకు లజ్జ విడువకపోవుట సహజమే కదా. ఈమె వేశ్య యయ్యును లజ్జాపరిత్యాగమునకు దగు రసానుభవ మింకను బరిపక్వము కాలేదు.

వరూధిని కళాస్వరూపము. విద్యుల్లతా విగ్రహ, కేవల రసోపాసిని. ప్రవరుడో 'అలేఖ్య తనూవిలాసుడు'. 'మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి.' చుట్టునున్న కోనకూడ నుద్దీపన విభావానుకూలము ప్రకృతిలో భావిరాజ మానము! "తావుల్ కేవల జల్లు చెంగలువ కేదారంబు తీరంబు." ఇక, నాయికాహృదయమున ప్రేమ యంకురింప కుండుట రసహీనము. తరువాత రసప్రతీతి ప్రకర్షకమును, ప్రేమరాగముగ మాఱుటయు నెట్లా యను నదియే ప్రశ్న.

వరూధిని శృంగారజీవి. కులట మాత్రము గాదు. ప్రథమదృష్టినే ప్రవరుని గామించిన దన్నమాత్రమున నపవిత్రయు గాదు. అట్లే యైనచో నెట్టి సౌందర్యరూపముసైన హరింప జాలు కామరూపియగు నాపూర్వ గంధర్వున కింతకుమున్నే యెన్నడో కైవసమయ్యెడిది. కాని వరూధినిసిద్ధియే వేఱు. ఆమెసౌందర్యము, కళాతపస్సు గంధర్వునికొఱకు గాదు; ప్రవరునికొఱకే. ఆ భూసురుని జూచినంతనే యామె కోడలు గగుర్పొడిచినది. కోరిక లూరినవి. ప్రవరుడు వరూధినికి హృదయసంబంధిగా గోచరించినాడు. అతనిలో దన కేకత్వము జూడ గలిగిన దామె. అబంధనమే క్షణలేశములో నామె నతనిపై పు లాగగలిగినది. సౌందర్యము సౌందర్యము నాకర్షించినది. ప్రవరుని తనూవిలాస మామెకన్నులకు బండుగ. అంతటి యందగాడు కనిపించుటతో వరూధినికి మనోరథ మీడేఱునటులుగను, కళాతపస్సులు ఫలించినటులుగను తోచినది. ఆమె ధోరణియేయామెది కాని, ప్రవరు డెట్టివాడో యోచింపనైన లేదు. తన ప్రేమప్రయత్నము సుఖపర్యవసాయి యగునో లేదో యనుసంశయ మే యామెకు గలుగలేదు. ప్రేమించు టే యామెపని. ప్రేమించిన తరువాత ముందున్న ముసుళ్లపండుగ నూహించుకొన లేకపోయిన దాయమాయిక. ఆమె సౌందర్యమును కొంచి, తప్పక ప్రవరు డామెవలలో జిక్కుకొనగల డనుస్థైర్యము వరూధినికి గలదేమో. నిజమున వరూధినీలావణ్యములు ప్రవరుని తలపులలో జిఱుకలతినైన గలిగింపలేదు. ఆ చిహ్నముల దెలిసికొనియైన నామె తనప్రయత్నములకు స్వస్తి చెప్పినదిగాదు. ఇదంతయు నూహయే; గాని, వరూధినియేకాదు, కామపరతంత్రులైనవా రెవరైన నిట్టితరుణమున, మీనమేషములు లెక్కించుచును ముందు వెనుక లారయుట యరుదే.

తాను విచ్చలవిడిగా నా విప్రకుమారుని జూడగలుగుటకే పోకమ్రాని మాటున జేరినది వరూధిని. అచటినుండి వికసిత నేత్రయై యతని జూచినది. ఎట్లు?

'ముకుమున్ బుట్టెడు కొంపు లొల్యమునిశన్
మోదంబు విస్తీర్ణతం
జొ..పం గోర్కులు క్రేళ్లుద్రిప్ప మదిమెచ్చుల్ ఔప్ప లల్లార్ప న
త్యనుమంగస్థితి టెచ్చపాటొసంగ నో
య్యారంబునం జంద్రికల్
దనుకం జూచె లతాంగి భూసురు బ్రఫుల్లస్నేత్ర పద్మంబులన్.'

ఇందు బ్రియుని దొలుత చూచినది మొదలు, నాయిక కను లాయాకారణములచే దశావిశేషముల బొందుచు బూర్ణవికాసము నందుట సహజముగను, సరసముగనే కవి చూప గల్గెను. మదనాగ్నితప్తయగునాయిక యట్లు బ్రియుని మరిమరి జూడ, నింతదనుక గొండొక చోనున్న పులక లిపుడు మే నెల్ల నంకురితములైనవి. వానిని 'అవిష్కృత మీనాంకానల సూచక ధూమాంకురములు' గ గవి యుత్ప్రేక్షించుట ప్రౌఢము. ఇంతదనుక ముగ్ధగా నుండిన వరూధినిని ప్రౌఢనాయికగా కవి చిత్రింప దలంచుట విస్పష్టము. ఇంకను నాయికకు లలాటముననను, చెక్కిళులయందును లేజెమ్మటలు గ్రమ్మినవి. భావోద్రేక కారణమగు సాత్వికాభినయమున గగుర్పాటు స్వేదము మున్నగునవి గలుగుట సహజమే కదా. ఈ వివిధభావప్రకటనమే రసోత్పత్తి కాధారమనుట యాలంకారిక సమ్మతమే. ఈమార్పు నాయికా నాయకులయందు గోచరించుటయే రసానుభవము.

ఆ వికలత, లేతమనసు, నెలవి వాఱు నవ్వులే గాక, బిత్తరపుజూపు, నవస్వేదసమృద్ధి, మోహావిర్భ్రాంతియు వరూధినిని సర్వవిధముల మానవాంగనగా గరగి పోసినవి. మానవుని భావించుటచే నామె మానవాంగనగా మాఱిపోయెనేమో యనిన సంశయము మనలనేకాను, కవినే బాధించినది. ఇక దుదివఱకును వరూధిని కవిప్రభావమున మర్త్యకాంత వలెనే పొడగట్టును. వరూధినీ దర్శనము పాఠకులకు దొలుతనే కలిగినది. ఆమె 'లేనడుమల్లలనాడ' జాటున కతి సుకుమారముగా ముద్దునడకలతో నేసుటతో నీచిత్రము మఱింత బ్రస్ఫుటము. వానికి దోడు పైభావ ప్రకటన లాధారముగా వరూధిని యిట్టి దని, యొకశృంగారరసాధినాయిక యగు సుందరాంగనను మన మూహించుకొన గలము. ఈ సౌందర్యమునకే, అల్లసాని కవిగారి వరూధిని రాయలంతటివానిచే నందలము బట్టించుకొనినది. ఈ గొప్పతన మితర ప్రబంధములలో జూడము. వరూధినితో బోటీపెట్టుకొనిన నాయిక రామరాజభూషణుని గిరిక. వరూధినికన్న వయస్సున గిరిక పెద్ద. సర్వశాస్త్రము లభ్యసించినది. సౌందర్యమున వరూధినికి దీసికట్టే. శాస్త్రసమ్మతముగ దాళలయవర్ణములు దప్పకుండగ గిరిక పాడగల దేమోకాని వరూధినివలె రాళ్లైనను కరగునంతటి మనోజ్ఞముగ బాడి, గానప్రభావమున రతిపారవశ్య విభ్రమము జెందునంతటి సిద్ధికి రాలేదు. మఱియు, గిరికరూప మిట్టి దని రామరాజభూషణుడు చెప్పలేక పోయినాడు. పద్యపద్యమున గామరూపిణిగా

# బ్యాంక్ ఆఫ్ హిందూస్థాన్

## లిమిటెడ్

భద్రపఱచుటకు, సేవచేయుటకు పేరుపొందినబ్యాంకు
పలుకుబడిగల ప్రముఖులతోకూడిన
డైరెక్టరేట్ చే నిర్వహింపబడుచున్నది

హెడ్డాఫీసు: మదరాసు.

లోకల్ ఆఫీసు: సావుకార్ పేట, తిరువల్లిక్కేణి.

బ్రాంచీలు:

బొంబాయి, బెజవాడ (బజారు, గవర్నరుపేట), బోడినాయకనూరు, బాలియపట్నము, కాలికట్, కన్ననూరు, కోయంబత్తూరు, మధుర, మంగళూరు, నెల్లూరు, పయనూరు, పొల్లాచి, తెలిచ్చేరి, తిరుప్పూరు, ఉడమల్ పేట.

**చెల్లించిన మూలధనము రు. 10,00,000**
**రిజర్వు ఫండ్సు రు. 50,000**

డైరెక్టర్లు:

యం. జమాల్ మహమ్మదుసాహెబ్ బహదూరు.
టి. ఆర్. వెంకటరామశాస్త్రిగారు, బి.ఏ., బి.యల్., సి.ఐ.ఇ.
దీ॥ బ॥ యం. బాలసుందరం నాయుడుగారు, సి.ఐ.ఇ.
నరకాశ్శేరి యస్. కృష్ణగారు,
వి. కే. తిరువేంకటాచారియార్ గారు,
పండిత విద్యాసాగర్ పాండ్యగారు,
సర్ వేపా రామేశం, కె. టి. గారు.

కరెంటు ఎకౌంటులకు రు. 50,000 వరకు రోజు నిల్వ మొత్తముపై వడ్డీ సం॥నకు 1½ %.

టైం డిపాజిటు ఎకౌంటులకు రు. 10,000 వరకు రోజు నిల్వ మొత్తముపై వడ్డీ సం॥నకు 2 %.

సేవింగ్సు బ్యాంకు ఎకౌంటులకు రు. 5 మొ॥ రు. 5,000 వరకు రోజు నిల్వ మొత్తముపై వడ్డీ సం॥నకు 2½ %. వారమునకు రు. 500 వరకు చెక్కులద్వారా తీసుకొనవచ్చును.

ఫిక్సెడు డిపాజిటులకు ఒకటి రెండు సంవత్సరములకు సరసమైన వడ్డీరేటు యొసంగబడును. కోరినవారికి ఈరేటు తెలుపబడును.

వివిధరకముల బ్యాంకింగువ్యాపారమును
నిర్వహింపబడును.

వివరములు బ్యాంకుకు చెందిన ఏ ఆఫీసులోనైనను
తెలుసుకొనవచ్చును:—

**సి. హెచ్. దివాన్‌జీ, కార్యదర్శి.**



THE APPROVED SOAP FOR THE ENTIRE FAMILY

Kerala Family Soap

KERALA SOAP INSTITUTE, CALICUT.

కుటుంబమున
అందరికి నచ్చినది
కేరళ
ఫ్యామిలీసోపు

శరీర
లావణ్యమునకు
చర్మమునకు
టానిక్ గా
పనిచేయు
వేపనూనె
ఇందు గలదు.



వెప్ సోపు




KERALA SOAP INSTITUTE
CALICUT.

సునాయాసముగా
క్షురకర్మ
చేసుకొనుటకు
కేరళ
షేవింగు స్టిక్

కేరళ సోప్ ఇన్‌స్టిట్యూట్, కాలికట్.

గిరిక కొన్పించును. ఇంతేకాని, యూహా సాధ్యమగు మనోహరసౌందర్యరూప మామెకు లేదు. ఎందునను గిరికపాత్రకు బూర్ణత లేదు. వరూధినిమాత్ర మన్నిటను పరిపూర్ణ. బాహ్యములగు ప్రబంధమార్గముల ననుసరించినను, పెద్దనకవితాహృదయము రామరాజభూషణునకు గ్రహింపలేకపోవుటయే యిందులకు గారణము.

దశవిధ కామావస్థలలో బ్రథమాభిలాష వరూధినికి బ్రవరుని జూచినప్పుడే చక్షుఃప్రీతితో గలిగినది. ఇంక మిగిలిన యవస్థలొక్కొక్కటియు నామెస్థితి నంతకంతకున్నతస్థానమునకు దీసికొనిపోయినవి. వరూధిని ఆవిప్రుని మేనిపసలను చూచుచే తనవుగ నామె యప్రయత్నముగ బ్రవరుని గుణకీర్తన మొదలిడినది "యక్షతనయేందు జయంతవసంతకంతు"లను చక్కదనమునం గెలువజాలిన యావిప్రు డెక్కడివాడో యని చింతించుచు నాతడు దనను పరిగ్రహించినచో మన్మథునైన నోడించి ప్రేమసామ్రాజ్యపట్టభద్రభాగ్యముంగొని సుఖింపవచ్చునుగదా యని వరూధిని యువ్విళ్ళూరుచున్నది. ప్రవరుని ప్రతియవయవము నెంతో వింతగ బరికించి పరికించి తుదకు

'నేరెటేటియసల్ దెచ్చి నీరజాప్తు
సానబట్టిన రాపొడి చల్లి మెదపి
పదను సుధ నిడి చేసెనో పద్మభవుడు
వీని గాకున్న గలదె యీ మేనికాంతి?'

అని తనలో ననుకొని పొంగిపోయినది. ఇంకను, దా నింతవఱకు గనుగొనిన 'సురగరుడోరగ నర ఖేచర కిన్నర సిద్ధ సాధ్య చారణ విద్యాధర గంధర్వకుమారు'లలో నొక్కరును వీని బోల రని తలచినది. అటు లనుకొనుచు జూపులనే గాదు, హృదయమునుగూడ బ్రవరునిపై కేంద్రీకరించి నిలిచినది. సౌందర్యమునకు సరసతకు హృదయ మిచ్చిన వరూధినిమనసు, ప్రవరునియందు లగ్నమైన దనుటలో నాశ్చర్యము లేదు. ఆమెభావములు బ్రవరుని దాటలేకపోయినవి. మదనజ్వరపీడితయగు వరూధినికి దనను బ్రవరునుండి విడదీయున దెవ్వియు లేనట్లు దోచినది. ఇంతవఱకుండిన సిగ్గుబిబ్బోకములు గూడ నొక్కొక్కటియే క్రమక్రమమున జిరిగి చెరిగిపోయినవి. ఈతరువాత నామెచాటుమాటులకు బోవలసిన యగత్యము లేదు. ఆమెచే నోడింపబడిన మన్మథుడే యావలకు బోవును. కావుననే, ధైర్యముగ నామె ప్రవరునిమార్గమున కడ్డమువచ్చి యొయ్యారమొలుక నిలచినది. ప్రవరుడు విభ్రాంతుడై యేమో సలుకబోవుచున్నాడు. విభ్రాంతి వరూధినీలలిత లావణ్యములకుమాత్రము గాదని, ప్రవరు నెఱిగిన యందఱకు దెలియును.

బ్రాహ్మణుడను. పేరు ప్రవరుడు. త్రోవ దప్పితిని. పురమునకు దెరు వెద్ది? యని ప్రశ్న. ఆపై 'శుభంబు నీకగున్' అనియొక యాశీర్వాదము. ప్రవరుని ప్రథమసంభాషణ మంతటితో సరి. శృంగారరసము చిను కైన నందు గాన్పింపదు. శృంగారము వాని వైరాగ్యమునకు బానిసయే. ఉన్న కొలదిశృంగారమునైన నాతడు 'మారిమిసోమిదమ్మకడనే' పచరించును. ఇచట వరూధినియెదుటమాత్ర మీయమె 'సౌందర్యమునకు జిక్కని 'వివిధాధ్వరనిర్మల ధర్మకర్మ దీక్షాపరతంత్రుడు'. నియమ నైష్ఠికత్వమున నాతని హృదయము గడ్డకట్టుకొని పోయినది. అది భక్తిభావమున గరగునేమో కాని, శృంగారమునకు నిలువ నీడగూడ నీయదు.

వరూధినియైన నంతటితో దనప్రయత్నముల విరమించుకొనలేదు. ప్రవరు నుద్రేకింపవలసినపని వరూధినిది. ఈమెయందు శృంగారమునకేమి గొఱతలేదు. వలపు గులుకు నటుల నాంగికములగు నొయ్యారముల నెఱపినది. నెలవివాఱ నవ్వినది. మేనెల్ల బులకింప వడకినది. అంతటితో నాగలేదు. వాచికముగగూడ దనవగలు మిగిలినది. తా 'నేకాంతమునందు నున్న జవరాలి' ననెను. ప్రవరుడు రసికుడే యైనచో నీసరికే వరూధిని ప్రయత్నములు ఫలించియుండును. కాని, ప్రవరునియందు నీరసము మెండైనది. ఎటులైన బ్రవరుని లోబఱచుకొనుతలపుతో నామెతనవిద్యావంశములగూర్చియు దనయానందమయ జీవితమును గూర్చియు గవయిత్రివలె నీ క్రిందివిధమున జెప్పినది:

'చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధి
పొడమిన చెలువ తోబుట్టు మాకు,
రహివుట్ట జంత్రగాత్రముల రాల్గరగించు
విమల గాంధర్వంబు విద్య మాకు,
ననవిల్తు శాస్త్రంపు మినుకు లావర్తించు
పని వెన్నతోడ బెట్టినది మాకు,
హయమేధ రాజసూయములని పేర్వడ్డ
సవనతంత్రంబు లుంకువలు మాకు,
కనక నగసీమ గల్ప వృక్షములనీడ
బచ్చరాచట్టుగమి రచ్చపట్టు మాకు
పద్మసంభవ వైకుంఠ భర్గసభలు
సాము గరిడీలు మాకు గోత్రామకేంద్ర.'

అని మఱియు నింకెన్నియో మాయలు పన్నినది. తుదకు 'పరిఖేలన్మంజరీ సౌరభ విలసితములగు వరూధిని యుద్యానములు గూడ బ్రవరుని మోమోటపెట్టలేకపోయినవి. తుద కామె తన యభిప్రాయము మఱికొంత తేటపఱచి యాతిథ్యము గైకొనుటకు నిలువు మనినది. ఈమె పలుకు లన్నిటికి నొక్క ప్రత్యుత్తరమే ప్రవరుడు నేర్చికొనినాడు. 'ఇం దుండగరాదు......వేగ జనగావలయు' నని చెప్పి 'కరుణింపు' మని వేడుచున్నాడు. ఆపై, 'తల్లి' యనిగూడ నామెను సంబోధించుచున్నాడు. ఈమాటలు నుడువునపుడు ప్రవరునిలో, నెచ్చటను చిఱు కదలికయైన లేదు. ధ్వనిలో నొకింత మార్పు యైనను లేదు. ఎట్లు వచ్చెనో యట్లే యుండిపోయినాడు. ఇది యంతయు వరూధినిప్రయత్నములకు మొదటి గొడ్డలిదెబ్బ. ఇది యామెయందుగూడ నెందుచేతనో మార్పు గొనిరాలేదు. ఆమె 'కూరక లేతనగ వానననీము దోచినది'.

నర్మోక్తులింకగట్టిపెట్టి తనవిషయ మేమో చెప్ప నుంకించినది వరూధిని. ఆమె 'తన్న

కందరములు' 'నందనచందనోత్కరములు' 'గాంగసైకతములు', 'లవలీనికుంజములు' ప్రవరుని కాతని 'కుటీరనిలయము'లకంటె దక్కువగనే కన్పడినవి. వరూధిని స్వయం దూతియై ధైర్యమూని యతనితో 'నీపైం జిక్కె మనంబు నా' కనినది. ఇంతటితో నామె ప్రేమభావము పరమావధి జెందినది. ఇందుల కతని ప్రత్యుత్తరము వెనుకటి రీతిగనే 'తా నాహితాగ్ని' ననియు, దా 'నిల్లు సేరకపోయినచో సమస్తధర్మములు తూలు' ననియు జెప్పినాడు. ఎప్పుడు నొకేవాక్యము. పరమావధి జెందిన వరూధిని ప్రణయభావమునకు పతనము వెంటనే సంభవించినది. తత్ఫలితముగ నింతవఱకు గలకలలాడు వరూధినివదనమున విన్నబాటు దోచినది. అంతతో, నూరుకొనక, వరూధిని ప్రవరునందలి మమతచేత నాతనిని యుక్తిమార్గముల లో గొనుటకై మఱియొకమాఱు ప్రయత్నించినది. ఆతని 'యెలప్రాయము వైదికకర్మనిష్ఠలందు' వెచ్చించు టుచితముగా దనియు, గంధర్వాంగనలపొందు సామాన్యలభ్యముగా దనియు నింక నెన్నెన్నియో విధముల బల్కినది. ఈ మారు తా 'నకాముడ' నని ప్రవరుడే చెప్పినాడు. అంతటితో నాగక వరూధిని 'ఆనందమే బ్రహ్మ' మనియు, 'విషయానందమే పరబ్రహ్మ' మనియు నేమేమో, శృంగారతత్త్వము నాతనికి బోధింపసాగినది. ఈతర్కములు తత్త్వము లా శ్రోత్రియుని తల కెక్కవు. తుదకు వరూధినీ విలాసము లన్నిటికంటె 'నరణులు, దర్భలు, నగ్ను'లే ప్రవరునికి ప్రియము లైనవి. 'మీసాలపై తేనియ' లగునట్టి తుచ్ఛసుఖముల దనకు జెప్పవ ద్దనినాడు. ఈమాటలతో నతని తత్త్వము వరూధినికి బాగుగ నాటినది. ఇంక దనయాటలు సాగవనుకొనినది. ఆమెగళము గద్గదిక మైనది. హృదయము జల్లుమనినది. మోము వెలవెలబోయినది. కనులు గూడ చెమ్మగిల్లినవి. 'వనిత తనంత దా వలచివచ్చిన జుల్కనగాదె యేరికిన్' అనుచు తనను తానే నిందించుకొనినది. ప్రవరు డీమెకు మనసు నీయడు. అతనిపై నీమెకు మమత గొప్పది. అతనికి వైముఖ్య మెక్కు వైనకొలది వరూధినికి వేడిమి దుస్సహమైనది. త్రోసినపుడు నఖాంకురము సోకెననియో, మాసిపోని తన మేనిసోయగము జూపినను చలింపడను కినుకవలననో, యాడుది కనుకనో వేదన నెప్పంబిడి కలస్వనముతో నతికరుణముగ నేడ్చినది. ఆమె శృంగార మంతయు గనులవెంట గరుణముగా గరగి జాలువారినది. భూతదయార్ద్రబుద్ధిలేని యాతని చదువు వ్యర్థమనినది. వరూధినిదృష్టిలో బ్రవరునకు భూతదయయే గాదు, హృదయమే లేదు. ఎన్నో యుదాహరణముల జెప్పి 'ఇనుపకచ్చడాల్ కట్టుకొను మునిముచ్చులెల్ల తామరసనేత్ర లిండ్ల బందాలు' కాలేదా యని ప్రవరుని దూరుచున్నది. నిష్కరుణు డగు ప్రవరునిపై వరూధినికోప మంతటితో దీరిపోయినది. నిరాకృతప్రణయ యైనంతమాత్రమున బురుషులకు బ్రాణాపాయము దెచ్చునంతటి సాహసకార్యములకు దిగు చిత్రాంగివలెను, మఱి కొందఱు పాశ్చాత్యాంగనలవలెను, వరూధిని నీచస్వభావ కాదు. ఆమెగొప్పతనము కీవియు నామెనే. ఎంతకును వరూధిని యాటలు సాగలేదు. ప్రవరుడు మాత్రము వరూధిని వంటి జవ్వాదివాసనలు తన కంటుకొనగా బూర్తిగ గడుగుకొని తనదారిని పోయినాడు. వైరాగ్యమూర్తులకు సౌందర్యమేగాక, సువాసనకూడ దుర్భరమే కాబోలును.

ప్రవరుడు తనదారిని తాను బోయినాడు. ఇంక వరూధిని యొక్కతెయే ప్రవాసమున మిగిలిపోయినది. మిగిలి ప్రవరునితోడి స్నేహభాగ్యములేని తనహీనత్వమునకు గుమిలి కుళ్లిపోయినది. సుఖస్వప్న దరిద్రమైన యామె జీవిత మామెకే రోతగా గాన్పించినది. ఆమె యానంద జీవితమున దురదృష్టదేవత యిసుపపాదాలపైశాచికనృత్యము సల్పినది. ఆమె జీవితభాగ్యము లన్నియు గరాళగహ్వరాంధకారమున బడి, చీకటితెరలలో జిక్కుకొనిపోయినవి. వాసంతలక్ష్మల గుసుమితమై ఫలోన్ముఖము గావలసిన వరూధిని ప్రేమాంకురము, విరహగ్రీష్మానలమున వాడి మాడిపోయినది. అనన్యకాంత యగు వరూధినిని జేపట్టక బాధించిన ప్రవరుని క్రౌర్యమును సహింపలేక నభోమణిసైతము కషాయదీధితుల 'రోషభీషణ స్ఫురణ' వహించినదట. పెద్దన కవియై పల్కిన వాక్య మిది. వరూధిని కీజగ మంతయు విషాదచ్ఛాయగా తోచినది. దశదిశలు మృత్యుభీకరములై వెలుపుగొల్పినవి. ఆమెకు మరణమే గత్యంతరము. అదిగో! వరూధిని. ఆమెసౌందర్యమంతయు నిపుడేమైనదో, తలవిరియబోసికొనికను లెఱ్ఱజేసి భయంకరాకృతితో వెఱ్ఱిచూపుల జూచుచున్నది. ఇది యంతయు నిరాకృత ప్రణయఫలితమే కాబోలును. నిబిడాంధ మృత్యువీథిం బడి, దరులులేని యగాధపాతాళమునకు బోవ నామె తనకు హృదయబాంధవి యగు మృత్యుదేవి నాహ్వానించుచున్నది. తాను గంధర్వాంగన యగుట నీ విషయమున గూడ వరూధిని భగ్నమనోరథయే. మృతిలేని యామెచెలు వామెకే దుస్సహమైనది.

ప్రవరుడుగూడ పట్టినపట్టు విడువని మూర్ఖుడన వీలులేదు. సకలనిగమశాస్త్రవేత్త. వివిధాధ్వర నిర్మలధర్మకర్మ దీక్షాపరతంత్రుడు. కాని వరూధినియార్ద్రహృదయ మాతనిలో లేదు. ఈతని గభీరతయు నామెయందు లేదు. తుదకు మాయాప్రవరుని వేషమున వచ్చిన గంధర్వుని నిజమగు ప్రవరు డనుకొని పొరపడినది వరూధిని.

# "మూరి"

## పరిమళద్రవ్యములలోకెల్ల ఉత్తమమైనది.




జేబురుమాలకు, అనుకూలమైన పరిమళద్రవ్యము.

ప్రధాన నగరము లన్నిటిలోను డిస్ట్రిబ్యూటర్లు, స్టాకిస్టులు కావలెను. వరతులకు, ధరల జాబి తాకు ధఖాస్తులను పంపుడు.

ఫ్రెంచి పరిమళద్రవ్యములు.




శ్రేష్ఠమైన పరిమళద్రవ్యములకంటె మేలైనవి, క్రొత్తరకము.

ప్రాగ్దేశములకు ఇండియాకు సోల్ ఏజంట్లు:—ఆంగ్లో ఇండియన్ డ్రగ్ అండ్ కెమికల్ కంపెనీ,
జుమ్మామసీదు—బొంబాయి. 2

---

## బి. రెడ్డి అండ్ కంపెనీ, (రిజిష్టర్డు)

**ప్రొప్రయిటరు:—జి. వి. రెడ్డి.**
గోపాలపురం, తూర్పుగోదావరి జిల్లా.

### "సర్వకుష్ఠులకు గ్యారంటీచికిత్స"

మా "అతి విచిత్ర కుష్ఠునివారిణి" అష్టాదశకుష్ఠు, బొల్లి, సర్వవిధ చర్మవ్యాధులను నిర్మూలించుటలో వజ్రాయుధము వంటిది. 2 మాసములకు సరిపడు 6 రకముల మందుల సెట్టు వెల రు 25-0-0 లు.

### "సర్వరోగ నివారిణి"

ఎంత పురాతనమై జీర్ణించి, ఎట్టి అపాయస్థితియందున్న సెగ సవాయిరోగములకైనను 3 పూటలకే అద్భుతగుణము. పథ్యములేదు. వెల స్వల్పము. 40 దినములకు సరిపడు మందు వెల రు 4/- మాత్రము.

### "భాస్కరామృత లేహ్యము"

నూరు మూలికలచే తయారుకాబడినది. శుక్లనష్టము, నిస్సత్తువ అజీర్తి, నరములు లాగుట, మొదలగు దుర్గుణముల ఖండించి రక్తము, వీర్యము వృద్ధిజేసి సింహబలునిగాజేయును. 40 దినములకు రు 5-0-0 లు

డాంభికప్రకటనలకు, నకలుమందులకు మోసపోకుడు.

పోష్టు ఖర్చులు ప్రత్యేకము, క్యాటలాగు, సలహా, ఉచితము.

---

## ఒకనెలకు మాత్రమే



ఫాన్సీరిస్టువాచ్ రు 1-15-0 1939సం॥డయిరీఉచితము

నవీనమైన ఆకారము, బలమైనలీవరు తదితరయంత్రములు 3 సం॥ గ్యారంటీ. గుండ్రనిది, ఫాన్సీలేకనలు చదరముది రు 1-15-0. శ్రేష్ఠమైనది రు 2-8-0 రేడియం డయల్ రు 3-8-0. 18 సిటి బంగారముప్లేటుకేసుగలది రు 4/-. బొమ్మలో మాదిరిది నికల్ కేసు రు 5-8-0. బంగారముకేసు రు 7/-. 10 సం॥ గ్యారంటీ రోల్డుగోల్డు కేసు రు 10/- పోస్టేజి 10 అణాలు.

### అలారం పిస్తోలు




జర్మనీలో తయారైనది. పాకెట్ సైజు దొంగలను, దోపిడిగాండ్రను బెదరించుటకు వినియోగపడును. సర్కస్ వారు, అడవుల ఉద్యోగులు మున్నగువారు వాడుచున్నారు. లైసెన్సు అవసరములేదు. ఒక్కొక్కటి రు. 2-12-0. పిస్తోలుతోగూడ 100 గుండ్లు ఉచితము. అదనము గుండ్లు 50 ఖరీదు రు 1/-. పోస్టేజి 12 అణాలు అదనము.

CALCUTTA CLOCK Co., (Sce No. 5)
**15/1, Joy Mitter Street, P. O. Hatkhola, Calcutta.**

బర్మా కెమికల్ డైమండు వర్క్సు, నెం. 144 మొగల్ రోడ్డు, రంగూను.

## నేషనల్ వజ్రములు.

## జెయా క్వాలిటి కమలములు.

ట్రేడ్ మార్కు

రిజిస్టర్డు నెం. 2828.




వజ్రం 1-కి రూ 0-8-0.

ఆంధ్రదేశములో అన్నిచోట్లను ఏజంట్లు కావలెను. వివరములకు వ్రాయవలెను.

బ్రాంచి:
బర్మా కెమికల్ డైమండు వర్క్సు.
V. T. అణ్ణాసామి పిళ్లై.
పెద్దబజారు వీధి, తిరుచినాపల్లి.






ట్రేడ్ మార్కు

రిజిస్టర్డు నెం. 2576.

## నేషనల్ వజ్రములు.

అసలు వజ్రములవలె అన్ని రంగులుగల ప్రకాశమును, కాంతియును గలిగి జ్వలించుచున్నవి.

కెమికల్ వజ్రము లన్నిటికన్న మిక్కిలి మేలైనవి. ఒకసారి కొని చూచిన యెడల నిజము విశదమగును.

నేషనల్ వజ్రములకు పూచియిస్తాము. అసలు ట్రేడ్ మార్కు చూచి కొనవలెను.

## జెయా క్వాలిటి డైమండ్సు.

ప్రస్తుతం సీల్డు పొట్లములలో ప్రఖ్యాతిచెందినవి జెయా క్వాలిటి కమలములు. జెయా క్వాలిటి కమలములు, పరిపూర్ణ సంతృప్తి గలుగ జేయును.

జెయా క్వాలిటి కమలములు ఎల్లచోట్లను, మా యొక్క ఏజంట్లువద్దన్ను, అన్ని రత్న వ్యాపారస్తులువద్దను దొరకును.

అసలు సీల్డు పొట్లములోనుండు జెయా క్వాలిటి కమలములను కొని తృప్తిపొందుడు.

# మాతృభాషలో విద్య - ఆంధ్రరాష్ట్రము

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి

నేడు సర్వతోముఖముగ విద్యావిధానమున కలవరపెట్టుచున్న సమస్యలలో "ఉన్నత పాఠశాలలలోను, కళాశాలలలోను ఏభాషలో విద్యగరపుట" యనునది ముఖ్యమైనది. ప్రభుత్వపుటుత్తరువు ననుసరించి యికముం దన్ని పాఠశాలలలోను మాతృభాషద్వారా విద్య నేర్పవలెననువిషయము స్థిరపడినది. కళాశాలలలో ఈవిషయ మిప్పటికిని సమస్యగానే యున్నది. మాతృభాషలో విద్య నేర్పవలసిన ఆవశ్యకతను గుర్తించినను ప్రత్యేకరాష్ట్రనిర్మాణము కానిదో అది ఆచరణీయము కాదను అభిప్రాయము వెంటనే కలుగును. ఈవిషయమును విమర్శించుటకు పూర్వము ఇంగ్లీషున విద్యగరపుట యెట్లు ఎన్నాళ్లనుండి వచ్చుచున్నదో దాని పుట్టుపూర్వోత్తరములు తెలిసికొనుట ఆవశ్యకము.

క్రీ. శ. ౧౮౩౪-౩౫లో మెకాలే మొదటి లామెంబరుగా వచ్చినప్పుడు దేశములో రెండుతెగలవా రుండెడివారు. ఇంగ్లీషున విద్య నేర్పవలెనని కొందరును, దేశభాషలలో విద్య నేర్పవలసినదని కొందరును వాదించుచుండిరి. అప్పుడు మెకాలే తన సిఫార్సులో మొదటిపక్షమునే బలపరచుచు వ్రాసెను. అతను 'వడబోతసిద్ధాంతము'ను (Filtration theory) ఊహించెను. గొప్ప కుటుంబములవారికి ఇంగ్లీషున విద్య నేర్పినయెడల (దేశభాషలలో సరియైన పుస్తకములు లేకపోవుటచేత) వారే సాధారణ జనులకు జ్ఞానసంపద నిత్తురని అతని ఆశయము. అప్పటి పరిస్థితుల నాలోచించి గవర్నరు జనర లయిన బెంటింకు ప్రభువు మెకాలేతో ఏకీభవించెను. నాటినుండియు ఇంగ్లీషున విద్యగరపుట ఆచరణలోనికి వచ్చెను. కాని మెకాలే యొక్క వడబోతసిద్ధాంతముమాత్రము కొనసాగలేదు. ఇంగ్లీషున చదువు నేర్చుకొనినవారు తక్కినవారిని చేరదీయక, ప్రభుత్వోద్యోగముల కాశపడి తమ విజ్ఞానమును తక్కినవారికి చేరనీయక నిరక్షరాస్యతను పెంపొందించిరి. ఇంగ్లీషుభాష నేర్చుకొనుటకును, ఆ భాషద్వారా యితర విషయములు నేర్చుకొనుటకును గలభేదము గమనింపకపోవుటయే మెకాలేయొక్క ఆ సిఫార్సుకు కారణము. ఆనాడు మెకాలే చేసిన ఆ పొరపాటు నేటికిని దిద్దబడలేదు.

విజ్ఞాన సముపార్జనకై ఇంగ్లీషు తెలియవలెను; అంతర్దేశీయ వ్యాపారవిషయములలో ఇంగ్లీషు అవసరము; శాసనసభలలో ఇప్పుడు కూడ ఇంగ్లీషు కావలెను. కాని సాధారణజనులకు తెలియవలెనన్న ఇంగ్లీషున చెప్పుట శోచనీయము. ఇంతకన్న నష్టకరమైన విషయము విద్యార్థులు ఇంగ్లీషుననే వ్రాయవలెననుట. క్రొత్తవిషయమును నేర్చుకొనుటకే పరభాష నిరుపయోగము. తిరిగి ఆభాషలో మనము చెప్పవలె నన్న ఎంతకష్టమో ఊహింపవచ్చును. ఈకారణములచేతనే మన మీ క్రిందిలోపములను చూచుచున్నాము. (౧) పాఠశాలలలో మాతృభాషకు ౫ పీరియడ్లు ఉన్నయెడల ఇంగ్లీషునకు ౧౦ పీరియడ్లు ఉండుట. (౨) అయినను ఇంగ్లీషులో సరాసరి జ్ఞానము లభింపకపోవుట. (౩) ఇంగ్లీషున చెప్పుటచేత తక్కినవిషయములుకూడ సంతృప్తికరముగ తెలియకపోవుట. (౪) మాతృభాష మరచిపోవుట. ఇదికాక మన దేశములో ఇంగ్లీషుభాష నేర్చుకొను విధముకూడ విపరీతముగా నున్నది. పాశ్చాత్య దేశములలో విద్యార్థులు (౧) పుస్తకములలోనిభాష బోధపరచుకొనుటకును (౨) మాట్లాడినప్పుడు తెలిసికొనుటకును పరభాషను నేర్చుకొందురు. కాని మన దేశములో అట్లు కాదు. ఈదేశపు పరిస్థితులనుబట్టి (౧) ఇంగ్లీషు మాట్లాడుటకును, (౨) ఇంగ్లీషు వ్రాయుటకును మనము ఆభాష నేర్చుకొనుచున్నాము. ఇంగ్లీషు నేర్చుకొనుట గ్రహించుటకు మాత్రమే అయి వ్రాయుటకు

మాట్లాడుటకు మాతృభాషయే అయినట్లయితే అంత నష్టము లేదు. ఈఅభిప్రాయమునే వెస్టుదొరగారు చెప్పియున్నారు.

"Bilingualism is not necessarily a handicap if a child's education is bilingual in its receptive aspect but unilingual in its expressive aspect."

శాడ్లర్ కమిషనువారు ఉన్నత పాఠశాలలలో విద్య మాతృభాషను నేర్పవచ్చు ననియు, కళాశాలలలో మాత్రము ఇంగ్లీషున ఉండవలె ననియే నిశ్చయించిరి. కాని యీ మధ్య ప్రజాభిప్రాయము మారుచున్నది. కళాశాలలలో కూడ మాతృభాషను నేర్పుట ఆవశ్యకమని కొందరి అభిప్రాయము. దీని సాధక బాధకములను చర్చింతము. ఏదిఎట్లున్నను ఇంగ్లీషుభాషనునేర్చుకొనుట మానివేయ నక్కరలేదు.

కళాశాలలలో నిది పనికిరాదనుటకు సామాన్యముగ చెప్పబడు కారణములు: (౧) సరియైన పుస్తకములు మాతృభాషలో లేకపోవుట, (౨) ఇప్పు డధ్యాపకులుగ నున్నవారికే మాతృభాషలో చెప్పు సామర్థ్య ముండునా అను సందేహము, (౩) ఒక విశ్వవిద్యాలయములో నొక భాష యింకొక విశ్వవిద్యాలయములో నింకొక భాష అయినయెడల ఒకదగ్గరనుండి యింకొకదగ్గరకు పోవునప్పుడు విద్యార్థులకు కష్టము కల్గుట, (౪) క్రొత్త క్రొత్తపరిశోధనముల విజ్ఞానము ఇంగ్లీషులో వ్యాప్తిచెందినప్పుడు అది విద్యార్థుల అందుబాటులో నుండక పోవుట. వ్యాకరణ దోషములు లేకుండ ఇంగ్లీషున వాక్యములైనను వ్రాయలేని విద్యార్థులు దేశచరిత్ర, గణితశాస్త్రము మొదలగు నితర విషయముల నన్నిటిని ఇంగ్లీషున ఎంత అసంతృప్తికరముగా వ్రాయుచున్నారో గమనింపవలెను. ఇంగ్లీషున వ్రాయుట మాట్లాడుట వీటి మాట అటుండగా మాతృభాషలో కూడ చెప్పుకొనదగినజ్ఞానము లేకపోవుట విచారకరము. కనుక మాతృభాషలో విద్య గరపవలెనను సూత్రముగురించి వివాదపడనక్కరలేదు. కాని దీనికిగల ఆటంకములను పరిష్కరించుటకు తగిన మార్గములను చర్చించుట కర్తవ్యము. పుస్తకములు మాతృభాషను వ్రాయించవచ్చును; కొంచెము కష్టముతో ప్రస్తుతమున్న అధ్యాపకులు కూడ మాతృభాషను చెప్పగలుగుదురు. క్రొత్త విషయములను నేర్చుకొనుటకు ఆసక్తియున్నవారికి ఉపయోగపడునట్లు ఈ తెలుగుపుస్తకములలో పారిభాషికపదములకు వెంటనే యింగ్లీషుమాటలుకూడ వ్రాయవలె.

ఆచరణమున పెట్టుట యెప్పుడు? ప్రత్యేకరాష్ట్రము వచ్చువరకును వేచియుండవలెనా? అనుప్రశ్నలకు ఇక సమాధాన మాలోచింపవలసియున్నది. ఆవశ్యకమని తోచినప్పుడే ఆచరణీయముకూడ అగును. కాని దీర్ఘాలోచన చేసినచో కొంచెము సందేహము కలుగతప్పదు. మదరాసు ప్రభుత్వమున ముఖ్యమైన భాషలు నాలుగు. ఆంధ్ర ప్రదేశములలో విద్యాశాఖాధికారులు, విద్యాసంస్థలలోని అధ్యాపకులు, ఇంజనీర్లు, డాక్టర్లు ఒక్క తెలుగువారే కారు. అన్నిభాషలవారును వచ్చుచున్నారు. అందుచేత తెలుగున విద్యగరపవలెనన్న అసాధ్యమగును. ఇంగ్లీషుననే చెప్పవలసి వచ్చుచున్నది. ఆంధ్రప్రదేశములు చెన్నరాజధానిలో నొకభాగమైయున్నంత కాలము ఉద్యోగములలో ఈచిక్కులుండక తప్పదు. ప్రతి విషయములోను ప్రామాణిక గ్రంథములు ప్రభుత్వమువారు వ్రాయించవలెను. పంటలసౌకర్యములకే ధనము చాలకుండ క్షామబాధకు లోనగుచున్న ఆంధ్రప్రదేశములకు — చెన్నరాజధానిలో కలిసియున్నంతకాలము — విద్యావిషయమై ఖర్చు పెట్టుటకు ధన మెక్కడనుండి వచ్చును? ఆసుపత్రులను అభివృద్ధిచేయుటకు డబ్బు చాలక డిగ్రీలవిలువ పొందలేని ఆంధ్రులకు వైద్యశాస్త్ర గ్రంథములు తెలుగున వ్రాయించి ప్రచురించుటకు ధన మెక్కడనుండివచ్చును? శాసనసభలలో ఇంగ్లీషున మాట్లాడుట, స్థానికసంస్థలనుండికూడ ప్రభుత్వమువారికి ఇంగ్లీషుననే వ్రాసికొనుట మొదలగునవి ఉన్నంత కాలము ఇంగ్లీషు మాతృభాష యొక్క స్థానము నాక్రమించక తప్పదు. ఈవిషయముల నాలోచించినచో మాతృభాషలో విద్యగరపుటకు సత్వరాంధ్రరాష్ట్ర నిర్మాణ మావశ్యకమని స్పష్టమగును. విద్యాధికులును, ఆంధ్రనాయకులును ఈ సమస్యను పరిశీలించి తగిన చర్య తీసికొందురుగాక.

Simplex

# సింప్లెక్స్

## టాకీపరికరములు

### రెండు రకాలు:

### పోర్టబుల్, & ఎస్. పి. మాడెల్సు



టాకీ మెషిన్‌లలో
కోకిల వంటిది.

సింప్లెక్స్ మిషన్‌ను ఉపయోగించుటకు ఆంధ్రదేశము గర్వపడు తున్నది. ఎందుచేతనంటే,— ఆంధ్రులు ఉపయోగి స్తున్న మెషిన్‌లలో చాలమట్టుకు సింప్లెక్స్

సింప్లెక్స్ మిషన్ ఉపయోగించుటలో-తృప్తి, మన్నిక, ఎన్నిక, నమ్మిక, శబ్దఉచ్చారణ-ఈఅన్నీ గ్యారంటీగా ఉన్నవి.

సింప్లెక్స్ ను ఉపయోగించేవారు మళ్లీ సింప్లెక్స్ కావాలని కోరుతారు కాని, మరొక రకం అంగీకరించరు. ఉత్త మమైన రకములలో దీనికి ఇదే సాటి.

ఇప్పుడు ధరలు తగ్గించబడినవి — లాభం పొందాలంటే, ఆనందం కలగాలంటే, నేడే ఒక మిషన్‌ను తీసి నెలకొల్పండి.

సోల్ ఏజంట్లు:—

**డి సెంట్రల్ టాకీ ఇక్విప్‌మెంట్ కంపెనీ,**

1-18 మౌంట్‌రోడ్, మద్రాసు.

హెడ్ ఆఫీస్: కలకత్తా. బ్రాంచి: ఢిల్లీ.



# సృష్టిలోని కొన్ని రహస్యములు

**మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి**

సృష్టిలో ౮౪ లక్షల జీవరాసులు గలవని చెప్పగా విందుము. ఇది జాతి కొక్కటివంతున లెక్కించిన మొత్తము కావలయును. కానిచో నన్న జీవకోట్ల మొత్తమున కీసంఖ్య చాలదు. ఇన్నిలక్షల రకముల జీవరాసులు కలవా? యని శంకింపఁ జనదు. సృష్టి యెంత? సూక్ష్మదేహసృష్టి! స్థూలదేహసృష్టి!! అందులోను — స్థలప్రపంచ మెంత? జలప్రపంచ మెంత? ఇతరభూత ప్రపంచ మెంత? స్థలప్రపంచములోను — చరప్రపంచ మెంత? స్థిరప్రపంచ మెంత? బ్రహ్మాది స్తంబ (గడ్డిపోఁచ) పర్యంతము గల సృష్టి యీమొత్తమున నిమిడి యుండు ననుట కభ్యంతర ముండదు.

బ్రహ్మాది స్తంబ పర్యంతము గల జరాయుజములు, అండజములు, స్వేదజములు, ఉద్భిజ్జములు ననుచతుర్విధ సృష్టిలో నుత్పత్తి మొదలు వినాశమువఱకును నాశ్చర్య జనకము గాని యంశమే లే దని చెప్పవలయును. సృష్టియే గారడివలె వినోదకరమైనది గదా! అందు లోకసహజములై కొన్ని స్వాభావికము లనిపించుచున్నవి. అలోకసామాన్యములైనవి కొన్నిమాత్ర మద్భుతావహము లగుచున్నవి. అవాఙ్మానస గోచరమైన సృష్టిలో గల యద్భుతరహస్యములను వ్యక్తి పర్యాయముగా విశదీకరించుట సులభసాధ్యము గాదు. అందుఁ దెలిసినవి కొన్ని, తెలిసికొన్నవి కొన్ని యద్భుతావహము లని తోఁచినవి స్థాలీపులాకన్యాయముగ వివరించెద గాక.

## గోఁదురుకప్ప

ఈజాతికప్పలు వాన కురిసినపుడు నీళ్లపైఁ బసుపు పచ్చగాఁ బట్టెఁడేసియాకారములతో బెకబెక లాడుచు మనకుఁ గాన్పించును. ఆ నీ రింకిపోవఁగనే యవి యేమగునో మనకుఁ దెలియదు. వాన కురియఁగనే యవి యెక్కడనుండి వచ్చినవో యదిగూడ మనకుఁ దెలియదన్నమాటే. కాని

శ్లో. 'అహో! సృష్టి విచిత్రత్వం
భేకా భూరేణుతాం గతాః'

అనుసూక్తి కప్పలు భూరేణువులై భూమిలో నడఁగియుండు ననువైచిత్ర్యమును వెల్లడించుచున్నది ఇది యాశ్చర్యమని తోఁచి యొక మహనీయుఁడు తటస్థించినపు డడుగఁగా నీ రహస్యమునే వెలువరించెను. కప్ప, రాతిలోపల నుండఁగా మనలోఁ జాలమంది చూచియుందురు. అది యెట్లు రాతిలోనికిఁ బోయినదో యీరహస్యము తెలియదు. గోఁదురుకప్పలు భూరేణువులై యుండు ననుట చాలమంది కశ్రుతపూర్వమును —, అజ్ఞాతపూర్వమును — నై యుండవచ్చును.

## ఏనుఁగు

ఏనుఁగునకు జిహ్వాపరివృత్తి; అనఁగా నాలుక నోటిలోనుండి కంఠములోనికిఁ దిరుగఁబడియుండుట. ఏనుగు, నోరు తెఱచినపుడు దానినాలుక మొద్దువాఱి యుండినట్లు మనకుఁ గాన్పించును కాని యది మొద్దువాఱుట గాక తిరుగఁబడియుండుట యఁట. అట్లుండుట కగ్నిశాపము గలదఁట. ఈవిషయము భట్టబాణుని కాదంబరిలోని 'అగ్నిశాపా దస్ఫుటాలాపతా శుకానా ముపజాతా, కరిణాం చ జిహ్వాపరివృత్తిః' అనువాక్యమువలన స్పష్టమగుచున్నది. పూర్వము చిలుకలును, ఏనుఁగులును స్పష్టముగ మాట్లాడుచుండిన వనియు, ఏదో వాగ్దోషమునుబట్టి యగ్ని వానికి మాటలు పడిపోవునట్లు, చిలుకల కస్పష్టాలాపతయు, ఏనుఁగులకు జిహ్వాపరివృత్తియుఁ గలుగునట్లు శపించె ననియు నైతిహాసికము. ఏనుఁగులకు నాలుక తిరుగఁబడి యుండునను రహస్యము జనసామాన్యమునకుఁ దెలియనిది.

మఱియు 'కరి మ్రింగిన వెలఁగపండు గదరా సుమతీ' అను సుమతిశతకకారుని నీతివాక్యము ఏనుఁగు దినిన వెలఁగపండు మరల నది లద్ది యిడినపుడు పండు పండు తీరుననే యుండి, పగులఁగొట్టి చూడఁగా దానిలోని గుజ్జుమాత్రము మాయమై వట్టి లొత్తగాఁ గాన్పించు ననియు, దానిలోని గుజ్జెట్లు మాయమైనదియో యెవ రెఱుఁగుదు రనియు నీసృష్టిరహస్యమును బ్రకటించుచున్నది.

## కుందేలు

కుందేటికి దప్పి గలిగినపు డది నీరు త్రాగదఁట! దప్పి గలిగనేని వెనుకటి యెడమకాలు నాఁకుకొనునఁట. అంతటితో దానికి దప్పి తీరునఁట. కుందేటికి ఒకరు వేసిన పుల్ల దాఁటదని, ఒకరు వేసిన పడియ నీరు త్రాగ దని నియమమఁట. ఒకరు వేసిన పుల్ల దాఁటదను నియమమున కడవిలో వేఁటకాండ్రు వేసిన కుందేటి డొంకయె సాక్షి. కుందేళ్లను వేఁటాడువాండ్రు వాని జాడఁ బట్టి యిరుప్రక్కల నొకయరమైలునకు మిక్కిలి ప్రదేశమునుండియుఁ జెట్లమండలను నడికి మండవరుసను వేసికొనుచు వచ్చి, రానురాను డొంక దగ్గఱికి మూసికొనివచ్చునట్లు ముగియవేసి, యాదాపున నొకచో మాటుపెట్టుకొని యక్కడ రెండు కళప

కరలకును నడ్డముగా వల యొడ్డి యొకఁ డామాటులో దాఁగియుండఁగా ఆపైనుండియు వేఁటకాండ్రు రంపులు సేయుచు, రాళ్లు ఱువ్వుచు వెంటఁ బడఁగా నప్పుడే పొదలలోనో దాఁగియున్న కుందేలు ప్రాణభీతిచేఁ దప్పించుకొనవలె నని యిటు నటు ప్రక్కలకుఁ బరుగిడి వేఁటకాండ్రు వేసిన మంచె లడ్డపడ దాఁటి పోక ముందునకు సాగుచుఁ జివరకు వేఁటకాండ్ర బలవత్ప్రయత్నముతో వలలోఁబడి ప్రాణములను గోల్పోవుచున్నది. కుందేటి సృష్టిరహస్య మాటవికులకుఁ దెలియునుగాని నాగరకులకుఁ దెలియ దనియే చెప్పవచ్చును. ఆటవిక జనులవలనఁ దెలియఁ దగిన రహస్యము లింకెన్ని యున్నవో!

ఆటవికులవలనఁ దేనెపరీక్షలో నొక రహస్యమును గనుఁగొందుము. శుద్ధమైన తేనె తేనెటీఁగలు కూర్చినదియే. ఆ తేనెను గూర్చునే ర్పాయీఁగలకే తెలియవలెఁ గాని తదితరులకుఁ దెలియదు. కృత్రిమములైన తేనెలు గూడఁ గొన్ని లేకపోలేదు. చొక్కమైన తేనెను దెలిసికొనుటకు నీరు సోఁకినచో విఱిగిపోవునది పరిశుద్ధమైన దని చాలమందికిఁ దెలిసిన విషయమే. కాని యాటవికులవలనఁ దెలియురహస్య మేమన శుద్ధమైన తేనెలో నీఁగ పడిన చావక యది మరల నెగిరిపోవలయునఁట. అందులకు నిదర్శనముగాఁ జూపెట్టినపుడు నేను ప్రత్యక్షముగాఁ జూచితిని. తేనెపై వాలినయీఁగమీఁద ధారగట్టి తేనె పోసెను. ఆయీఁగ లోపలికి మునిఁగిపోయి కొంతసేపటి కీఁదుకొనుచుఁ బైకిఁ దేలివచ్చి ఱెక్కల కంటుకొనిన జిడ్డును దులుపుకొని యెగిరిపోయెను. అంతసేపు జిడ్డుపదార్థములో మునిఁగిపోయి చావక మరల నెగిరిపోయిన దనుట యాశ్చర్యము గాకపోదు. నూనె, నెయ్యి మొదలైనవానిలోఁ బడఁగానే యీఁగ చచ్చిపోవుచున్నదిగదా! ఈ రహస్య మాటవికులకువలె మనకుఁ దెలియలేదు.

## కోడి

కోడికి జీర్ణశక్తి యపరిమితమఁట. దీనిజీర్ణకోశమున కున్నంత తీక్ష్ణత మఱిదేనికిని లేదనఁగా విందుము. ఇది ముక్కునఁబొడుచుకొని, కడుపున వేసికొనినపదార్థము కడుపులోఁ బడిపడకముందే యంతలో జీర్ణించునఁట. కోడిజీర్ణశక్తిని నిరూపించు నొకసన్నివేశమును ప్రత్యక్షముగాఁ జూచినవారు చెప్పఁగాఁ దెలియనయ్యెను.

ఒక రక్షకభటుఁడు (పోలీసుకానిస్టేబులు) ఎక్కడికో పోయి యింటికి వచ్చి చొక్కా విప్పుచుండఁగా జేబులోనుండి వెండిబేడబిళ్ల క్రిందఁ బడెనఁట. అంతలో నాసమీపమునఁ దిరుగుచున్న కోడి యిది యేదో యనుకొని దానిని ముక్కునఁ బొడుచుకొని గుటుక్కున మ్రింగివేసెనఁట. బేడబిళ్ల పోయెనే యనియు —, ఏమి చేయుటకును వీలు గాదుగదా యనియు — నాతఁ డాలోచించుచుండఁగా నింతలోఁ గొంద ఱది విని యాశ్చర్యపడి, రెట్ట వేసినపుడు దొరకును లెమ్మని కొందఱును, ఇం కెక్కడిది? అప్పుడే జీర్ణించి పోయియుండు నని కొందఱును జెప్పిరఁట. అయినఁ — బరీక్షించి చూత మనియు —, నేఁడు గాకున్న రేపైన నుపయోగపెట్టుకోవలసినదే కదా యనియు— నాతఁడు వెంటనే కత్తితో దానిపొట్ట చీల్చి చూచెనఁట. ఇదియంతయు నగుసరికిఁ బది నిమిషములకాలముగూడఁ గాలేదఁట. అప్పటికే యాబేడబిళ్ల సగము జీర్ణించి సన్నబాఱియుండెనఁట.

కోడికూఁత — కోడిపుంజు జాముజామునకును వేళ తప్పకుండఁ గూయుచుండును. కోడికూఁతనుబట్టి రాత్రిందివములయందును కాలపరిమాణము తెలిసికొనఁబడుచున్నది. ఈనాఁడు విశేషముగ గడియారములు వచ్చిన తర్వాత ‘ తెడ్డుండఁగాఁ జేయి గాల్చుకొనుట యెందుల ’ కన్న సామెతగా ఆవిజ్ఞానము చాలవఱకు సడలిపోయినదిగాని, గడియారముల ప్రచారము లేని పల్లెటూళ్లలో నిప్పటికిని ఈజ్ఞానము చెక్కుచెదరక యున్న దని చెప్పవచ్చును. అందులోఁ బగటిపూఁట యెట్లున్నను, రాత్రులయందుమాత్రము కాలజ్ఞానమునకుఁ గోడికూఁతయే చాలవఱకు, ప్రధానసూచకము. ఇంతవఱకును మనయందఱికిని దెలిసినవిషయమే గాని పుంజుకోడి నియతి దప్పక యట్లేల కూయునో యను సృష్టిరహస్యమే తెలియఁబడనిది. పుంజుకోడికి జాముజామునకును గళమునకుఁ గఫ మడ్డుపడునఁట. ఆకఫము తొలఁగుటకై యది గొంతెత్తి కూయునఁట.

## చేఁపలు

వీనిలోఁ జిన్నిచేఁపలను బెద్దచేఁపలు తినునను రహస్యము ‘ అబలాన్ స్వకులాశినో ఝషాన్ ’ అను శ్రీహర్షనైషధోక్తివలన వెల్లడియగుచున్నది. మఱియు,

శ్లో. వీక్షణ ధ్యాన సంస్పర్శై
ర్మత్స్య కూర్మ విహంగమాః,
పుష్ణన్తి స్వా న్యపత్యాని
భేకాః పాదాహతేన చ.

అను నభిరూపోక్తి, చేఁపలయుఁ, దాఁబేళ్లయుఁ, బక్షులయుఁ, గప్పలయుఁ బ్రసవ రహస్యమును వెల్లడించుచున్నది. వీనిలోఁ బక్షులు గ్రుడ్లు పెట్టుటయు —, ఆగ్రుడ్లను బొదిఁగి పిల్లలను లేపుటయు మనము చూచుచునే యున్నారము. చేఁపల తాఁబేళ్ల కప్పల శిశూత్పత్తియే యజ్ఞాతపూర్వ మని చెప్పవచ్చును. చేఁపలు గ్రుడ్లు పెట్టి, ఆగ్రుడ్లు పిల్లలగుట కూరక వానివైపే చూచుచుండునఁట. చూడఁగాఁ జూడఁగా నాగ్రుడ్లు పక్వమునకు వచ్చి పిల్ల లగునఁట. అట్లే తాబేళ్లు గ్రుడ్లు పెట్టి, తా మెందున్నను దమ గ్రుడ్లను గూర్చి యూరక ధ్యానించుచుండునఁట. ఆ ధ్యానముచేతనే యాగ్రుడ్లవిసి పిల్ల లగునఁట. కప్పలు గ్రుడ్లు పెట్టి యాగ్రుడ్ల నెప్పుడును గాళ్లతోఁ గొట్టుచుండునఁట. ఆకాలిదెబ్బల కాగ్రుడ్లు ప్రిదిలి పిల్ల లగునఁట.

# ఉగాది కానుక

## సౌందర్యమును సంపాదించు

# "కామినియా" వస్తువులు

## కామినియా ఆయిల్
(రిజిష్టర్డు.)




వెల సీసా 1-కి రూ. 1-0-0
3 సీసాలు 2-10-0
వి. పి. చార్జి అదనము.

## కామినియా స్నో
(రిజిష్టర్డు)




సీసా ఖరీదు 0-12-0
వి. పి. చార్జి అదనము.

**కామినియా సూనె.** వెంట్రుకలు పట్టువలె నుండుటకు ఇది తోడ్పడును. మెదడుకు చల్లదనమును చేకూర్చును. వెంట్రుకలు నిగనిగలాడునటుల చేయును.

**ఆటో డిల్బహారు.** జేబురుమాలకు అనుకూలమైన, ఆకర్షణీయమైన పరిమళ ద్రవ్యము. మేలైన ఈసువాసన పదార్థమును కొన్ని చుక్కలు రాచుకొనినంతనే మీ చుట్టుప్రక్కల వాతావరణమున అద్భుతమైన మార్పులను కల్గించును.

**కామినియా స్నో.** అందమునకు, ముఖవర్చస్సునకు ఇది అత్యావసరము. మొటిమలను, మచ్చలను పోగొట్టి, శరీరమునకు లావణ్యమును, సౌందర్యమును చేకూర్చును.

**కామినియా సాండల్ సోపు.** నిత్యము స్నానమున వాడుకొనుటకు మార్కెటు నున్న సబ్బులలోకెల్ల శ్రేష్ఠమైనది. డిల్ బహార్, వైట్‌రోస్, లెవెండర్, హీనమున్నగు మా సబ్బులను గూడ వాడిచూడుడు.

## అంతట అమ్మబడును

తపాలా చార్జికి 4 అణాల స్టాంపు పంపిన సాంపుల్ ఉచితము.

## ఆటో డిల్ బహార్
(రిజిష్టర్డు)




¼ ఔన్సు సీసా వెల రు. 1-0-0
1 డ్రాం సీసా వెల రు. 0-12-0
వి. పి. చార్జి ప్రత్యేకము.

## కామినియా సాండల్ సోపు
(రిజిష్టర్డు)




మూడు బిళ్లలుండు పెట్టె ఖరీదు రు. 0-14-0
వి. పి. చార్జి ప్రత్యేకము,

సోల్ ఏజంట్లు:— **ఆంగ్లో ఇండియన్ డ్రగ్ అండ్ కెమికల్ కంపెనీ,**

**మాన్యుఫాక్చరింగు కెమిస్టులు మరియు డ్రగ్గిస్టులు, బొంబాయి 2.**

మద్రాసు రాజధాని రిప్రెజెంటేటివ్:—**యం. అహమ్మదు అజద్.**

# సృష్టిలోని కొన్ని రహస్యములు

## కోయిల

ఇది పక్షిజాతులలో గాయక శిఖామణి. దీని గానమున కానందింపని జీవి యుండదు. అంత లోకోత్తరమైన కంఠమాధుర్యము దీనికిఁ గల్పించుటలో సృష్టికర్తయొక్క నైపుణ్యమే తేటతెల్లమయ్యెడినిగదా! దీనిదగ్గఱ నింకొక విలక్షణమైన చాకచక్యము గలదు. ఇది తన కన్నసంతానమును కాకులచేఁ బోషింపఁజేయును. కనుకనే దీనికిఁ బరభృత మని వ్యవహారము. ఈవిషయమును ప్రత్యక్షికముగాఁ జూచి నట్లు మహాకవి కాళిదాసు శాకుంతలములో,

శ్లో. స్త్రీణామశిక్షితపటుత్వ
మమానుషీషు
సందృశ్యతే, కిముత ! యాః
ప్రతిబోధవత్యః !
ప్రాగన్తరిక్షగమనాత్
స్వమపత్యజాత
మన్యై ర్ద్విజైః పరభృతాః
ఖలు పోషయన్తి!

అని చెప్పిన శ్లోకార్థము బోధపఱచుచున్నది. ఆఁడకోయిలలు ప్రసవకాలమునఁ గాకిగూఁటిలో గ్రుడ్లు పెట్టి, యంతకుముందు కాకి పెట్టియున్న గ్రుడ్లను బాఱవేయునఁట. కాకి, యవి తనగ్రుడ్లే యన భ్రాంతితో వానిని బొదిఁగి, పిల్లలఁ జేసి, పెంచి, పోషించునఁట. ఱెక్కలు వచ్చి యెగిరి పోఁగలశక్తి వచ్చిన దనఁగానే యప్పుడు కోయిలపిల్లలు కూయఁగా, ఆధ్వని విని, యవి తమకూఁత కా దని, పెంచిన ప్రేమ గూడ లేకుండ వానిని దమగూఁటినుండి తన్ని వేయునఁట. ఱెక్కలు వచ్చినవి గానఁ గోయిలపిల్ల లెగిరిపోవునఁట. తల్లికోయిలలు, కాకులు తమపిల్లలను దఱిమివేయునంతవఱకును బైపైనుండి తమసంతానమును జూచి యానందించుచు, అవి తఱిమివేయఁగనే తమపిల్లలను దగ్గఱఁ దీసికొనునఁట. కనుకనే కాళిదాసు, స్త్రీలకు సంతానమును బోషింపఁగల శక్తి యొకవిలక్షణమైన దనియు, అగి యొకరిశిక్షణమువలన వచ్చునది గా దనియు, అట్టిది వివేకవిశిష్టమైన మనుష్యజాతియందే గాక తదితరమైన పక్షిజాతిలోఁ గూడ నున్న దనియు, నందులకు నిదర్శనముగా నాఁడు కోయిలలు తమకన్నసంతానమును గాకులచేఁ బోషించుచున్న వనియు సృష్టివైచిత్ర్యమున కబ్బురపడినాఁడు.

## తోడేలు

ఇది యారణ్యకమైన యొక ఘాతుకమృగము. దీని కన్నప్పుడెల్ల నోరు తెఱిపిడిపడదఁట. అందులకై యది నోట రాయి గఱచుకొని, జీవము దొరకినపుడా రాతిని విడిచి యాజీవమును బట్టుకొనునఁట. సాధారణముగా నిది రాత్రిపూఁట గొఱ్ఱెలు, మేఁకలు మంద చేరినచోటికి వచ్చి వానిని జంపి యీడ్చుకొని పోవుచుండును. గొఱ్ఱెలకాఁపరి మఱునాఁడు తనజీవము కనఁబడక పోఁగా జాడఁబట్టి తోడేలు విడిచిన రాతిని జూచి తోడేలే జీవమును వేసికొని పోయిన దని నిశ్చయించుకొనును. తోడేలి కన్నప్పుడెల్ల నోరు తెఱిపిడి పడ దను రహస్యమును వెల్లడించిన సృష్టితత్త్వవేత్త గొఱ్ఱెలకాఁపరి.

## బల్లి

ఇది గృహజంతువు. నిత్యము మనము మనయిండ్లలోఁ జూచుచునే యుందుము. దప్పి యైనపు డిది నీళ్లు త్రాగదఁట. పైనుండి తపుక్కునఁ గ్రిందఁ బడునఁట. పడఁగానే దీనికి దప్పి తీఱునఁట. మనము చూచుచుండఁగా నెన్నోమాఱులు పడుచుండును గాని యది దాహనివృత్తి కనునది క్రొత్తగా వినువారి కాశ్చర్యము పుట్టింపక పోదు. ఆశ్చర్యమగును! మండు వేసవిలోఁ గొండనెత్తముపైఁ జీమలు మన్నగు సూక్ష్మజీవులు పయాడుచుండును గదా! పాతాళజలములు లేమితోఁగూడ నెండిపోవు నాకాలములో నాసూక్ష్మజంతువులకు దాహనివృత్తి యెట్లగుచున్నదో! అసృష్టిరహస్యమేమో!

మఱియు, పిల్లిని మోసగించుటకు బల్లి యొకయుక్తి చేయునఁట. పట్టుకొనుటకు వీలుగాని యేదో యొకయెత్తు ప్రదేశమున బల్లి యున్నపుడు దాని నెట్లయినఁ బట్టుకోవలె నని పిల్లి తదేకదృష్టితోఁ గాచుకొని యుండును. పిల్లి దృష్టిని గనిపట్టి బల్లి తోఁక యాడింపసాగును. బల్లి కదలకుండ నున్నపుడు పట్టుకొంద మని పిల్లి యాఁటలు పుచ్చుకొనుచు నుండును. అట్లు బల్లి తోఁక యాడించుచు నుండఁగా నుండఁగాఁ దోఁక తునిఁగి క్రిందఁ బడును. క్రిందఁ బడి యది కొట్టుకొనుచుండును. అంతట దొరికెఁ గదరా యని పిల్లి క్రిందికిఁ జూచి యీయాందోళనలో నుండుసరికి ఇదే సమయ మని బల్లి తప్పించుకొని పాఱిపోవుచున్నది. వెంటనే బల్లికి విఱిగిన తోఁక యథాప్రకారముగాఁ బెరుఁగునఁట. ఇట్టి దృశ్యమును మనము చూడకపోలేదు. కాని దాని తత్త్వముమాత్రము మనకుఁ దెలియదు.

## ఊసరవెల్లి

'తొండ ముదిరి యూసరివెల్లియైనదఁట' అని చెప్పికొనెడి సామెతనుబట్టి తొండయే యూసరవెల్లి యగుచున్న దని తేలుచున్నది. వాడుకగూడ నిట్టిదియే. కాని ఊసరవెల్లి యనునది యొక ప్రత్యేకజీవియని దాని తత్త్వమును సాక్షాత్తుగాఁ జూచినవారు చెప్పిరి. ఊసరవెల్లి యనునది యెఱుపువర్ణమునకుఁ దిరిగి ముసలిదిగాఁ గనఁబడునదియే యని మన తాత్పర్యము. కాని చిన్నప్రాయములోను — నున్న యూసరవెల్లిని జూచినా మని కొందఱు చెప్పఁగలరు. ఊసరవెల్లి యొక్క యెఱుపువర్ణములోనే కాక యది తన యిష్టము వచ్చిన వర్ణములలోని కప్పటప్పటికి మాఱుచుఁ గనఁబడునఁట. మనము చూచుచుండఁగనే యొకమాఱు నల్లగాను, వెంటనే యెఱ్ఱగాను, ఆవెంటనే యాకుపచ్చగాను, తర్వాతఁ దెల్లగాను నీవిధముగా నొకనిమిషములోనే మాఱిపోవుచుండునఁట. అది యట్లు మాఱుట్లు చూడఁగా దాని మనోవికారపరి

ణామమే కారణముగా నుండవచ్చును. మనో భావములు రసానురూపముగఁ బరిణమించు నపుడు తత్తద్రసనూచకముగాఁ బై కట్లు కానవచ్చునేమో యని తోఁచెడిని.

మఱియు దానిచేష్టలను జూచినవారు చెప్పుదురు, అత్యాశ్చర్యజనకము లని దాని కన్నులు తలచుట్టు తిరిగి వచ్చునఁట ముందు భాగమున నున్న కన్నుల నంతలో ముచ్చిన గుంటలలోనికిఁ ద్రిప్పుకొని వెనుక వెనుకకుఁ బరుగెత్తునఁట. ఇష్టము వచ్చినట్లు కన్నులను మీఁదికిఁ, బ్రక్కలకు నెక్కడి కనుకొనిన నక్కడికిఁ ద్రిప్పుకొని తన కనుకూలముగాఁ బ్రవర్తించునఁట. ఇది ప్రత్యక్షముగాఁ జూచినవారు చెప్పిన విషయము గాని యుత్తది గాదు ఇట్లజ్ఞాతములైన విషయము లింకెన్ని యున్నవో!

## పాము

పామునకుఁ జక్షుశ్శ్రవ మని పేరు; అనఁగాఁ గన్నులే చెవులుగా నుపయోగించుకొనునది యని యర్థము దీనిని బట్టి చూడఁగాఁ బాములకుఁ గన్నులు తప్ప వేఱే చెవులు లేవని తెలియఁబడుచున్నది. అగుచో వినుటకును, జూచుటకును నొకటే యింద్రియ మెట్లు పని చేయుచున్నదో యనునదియే యిట నాశ్చర్యము! ఎంత తిన్నగా మాటాడినను వినెడివారినిగూర్చి 'పాముచెవు' లని చెప్పెడి సామెతవలనఁ బాములకు వినికి యెక్కువ యని తెలియఁబడుచున్నది దర్శన శ్రవణముల కొకటే యింద్రియముగదా! దీని కింత వినికి యెట్లబ్బినదో! నేత్రేంద్రియము పని చేయునపుడు శ్రవణేంద్రియ మేమగునో! శ్రవణేంద్రియము పని చేయునపుడు నేత్రేంద్రియ మేమగునో! ఏకకాలముననే యొకటే యింద్రియము రెండు విధములైన పనులను జేయును గాఁబోలు! ఉభయేంద్రియసమ్మేళన మెట్లమర్పఁబడినదియో యదియే తెలియరాని సృష్టిరహస్యము!!

పాము, కాటువేయునపుడు తల క్రిందికిఁ ద్రిప్పివేయు ననియు, పామునకు గ్రుడ్లు పెట్టినతర్వాతఁ గన్నులు గానరా వనియుఁ, బ్రసవించి యుండుటచే నాఁకటిమంట యధికమై యాహారమును గానక యది తన గ్రుడ్లను—, గ్రుడ్లు ప్రిదిలి పిల్లలైనతర్వాతఁ దనయొద్దఁ బాఱాడు పిల్లలను భక్షించు ననియుఁ—, దల్లిపాము భక్షింపఁగాఁ దప్పించుకొనవియే ప్రపంచములోఁ గాన్పించు సర్పము లనియు — మనము సాధారణముగా వినియుందుము

## పులి

ఇట్లే పులులు మున్నగు క్రూరజంతువులు కూడఁ బ్రసవించినతరువాతఁ గన్నులు గానరాక యాఁకటిమంటచేఁ దమయొద్దఁ దిరుగాడు తమకన్న సంతానమునే భక్షించు నని చెప్పుదురు ఇవ్విధముగా వీనిని సృష్టించుటలోఁ గల రహస్యమును గమనించినచో లోకానుగ్రహకాంక్ష గల సృష్టికర్తయొక్క సాధుసంరక్షణదీక్ష తేటతెల్ల మయ్యెడిని గదా! ఇట్లు గాక పుట్టినవెల్ల జీవించిన పక్షమున సాధుజీవులకు నిలువ నీడ యుండదేమో!

పులి కొక్క నియమ మున్నదఁట. అది యుత్తరపుఁ దలాఁపిగాఁ బరుండిన జీవిని ముట్టదఁట ఈరహస్యము దెలిసిన యొక శూద్రుఁడు పులినోటనుండి తప్పించుకొని వచ్చెను. అతఁడు మునిమునిచీఁకటిలోఁ గొండకుఁ బోవుచుండఁగ అల్లంతదూరము నుండి పులి గాండ్రించుచు వచ్చుచుండెనఁట. ఇఁకఁ దప్పించుకొనుటకు వీలు గాదని వాఁడు ఉత్తరపుఁ దలాఁపిగాఁ బరుండెనఁట. పులి వచ్చి మూర్కొని యేమనక యావల వెళ్లి పోయెనఁట. అవల వాఁడు తప్పించుకొని యూరఁ బడి యాసమాచార మందఱికును జెప్పెను.

## చెదలు

ఈ జాతిపురుగులు పుట్ట పెట్టుచుండును. ఇవి నీటిసంబంధ మేమాత్రమును లేని యెత్తైనమేడలమీఁద సయితము తేమమన్ను తెచ్చి పుట్ట పెట్టుచుండుట మనము చూతుము. కాని యట్టి వట్టి ప్రదేశములలో సయితము వానికిఁ దేమమన్ను దొరకుట యనునదియే యాశ్చర్యము. చెదపురుగులకుఁ దలఁచుకొనినచోట్ల నెల్ల మన్ను తేమ యగునట్లు లోకానోక సందర్భమున బ్రహ్మవర మొసఁగెనఁట ఆ విషయము యజుర్వేదములోఁ గలదు విస్తరభీతిచే ఆమంత్రభాగ ముదాహరింప మాన నయ్యె

## కొండచిలువ

ఇది యొక మంపు గల జంతువు కదలమెదల లేనిది. ఇట్టి దీని కేదో యొకరకముగా నాహారము పెట్టవలసిన భారము సృష్టికర్తపై నున్నది గనుక నప్రయత్నముగనే యాహారము దొరకునట్లు దీని కాయా జీవుల కంఠధ్వని గల్పించినవాఁడు. ఇది తనప్రాంతములకు వచ్చిన జీవులను బసి పట్టి, కనఁగొని, తా నచటికిఁ బోలేదు గనుకఁ దన దగ్గఱకవి వచ్చుటకుఁగా నాయా జంతువు లఱచినట్లే యఱచి, యవి తమ జాతిజంతు వేదో యెక్కడనో యుండి యఱచుచున్న దని యాధ్వని వచ్చినచోటికే వచ్చి యిటు నటుఁ జూచుచుండఁగనే యొక్కమాటుగా వానిని మ్రింగివేసి యరుగుదలకై యక్కడ నున్న చెట్టునకుఁ జుట్టుకొని బిఱ్ఱబిగియునఁట. మ్రింగిన జంతువు లోపలఁ బళపళ విఱిగి నమలినట్లగునఁట ఇది మనుష్యులనుగూడ మనుష్యకంఠస్వరముతో సంజ్ఞచేసి దగ్గఱకు రాఁగా మ్రింగివేయునఁట. తోడిమనుష్యులను గొండచిలువనోటఁ బట్టి విలపించినవా రెందఱో కలరు. కొండచిలువకు నానాజీవుల కంఠస్వరమును గల్పించుట సృష్టిరహస్యముగదా!

## విషదర్శనముచే జంతువులకు గలుగు వికారములు

విషము కడుపులోనికిఁ బోయిన తరువాత నది వికారపెట్టి ప్రాణాంతము గలిగించు ననుసంగతి యందఱికును దెలిసినదియే. కాని విషదర్శనమాత్రముచేతనే కొన్ని జంతువులకుఁ గొన్నివికారములు గల్గు ననునది క్రొత్త. అట్టి జంతువులకు

## అరోరావారి ఉగాది కానుక --- "అమ్మ"

తన ఏకపుత్రుడు ఐ. సి. యస్. ఆఫీసరు కావలెనని కలెక్టరు ఆఫీసు గుమాస్తా కోరిక.



వెనుకముందు చూడకుండా డబ్బు ఖర్చుపెట్టెను!

ఉన్న ఒక్క ఇల్లుకూడ అమ్మివేసెను!

మంచి రాబడివచ్చే ఉద్యోగమును గోల్పోయెను:

విధికృతము జరిగితీరును.

ఫలితము:

తల్లిదండ్రుల మాటవిని దుబారా ఖర్చు చేయు పుత్రుడు

ఎటుల — ఎందులకు

సమాధానమునకు

# అరోరావారి

తెలుగు సాంఘిక చిత్ర రాజము

# "అమ్మ" (హోంకమింగ్)



కై వేచియుండుడు.

**నవీన ఫిలిమ్సువారు తయారుచేసిరి**

మాతృప్రేమ, భక్తివిశ్వాసములున్న భార్య విద్యుక్తధర్మము చాటు ఆదర్శప్రాయమైన కథ.

ప్రతివాని జీవితమున నిత్యము సంభవించుచుండు సహజచర్య లిందు ప్రదర్శింపబడినవి.

డైరెక్టరు:— నిరంజనపాల్

కుమారి నాళం అమృతం భరతనాట్యము

నటీనటులు:— లక్ష్మీరాజ్యం, రాజకుమారి, కాశీనాథుని, కుమారి నాళం అమృతం

తెలుగు సంవత్సరాది దినోత్సవమున ఆంధ్రదేశమున విడుదల.

*DISTRIBUTED BY:—*

# Aurora Film Corporation,

**66, Armenian Street - - G. T., MADRAS**

## బసవపురాణము

**గ్రంథకర్త : పాలురికి సోమనాథకవి**

**పరిష్కర్త : వేటూరి ప్రభాకరశాస్త్రిగారు**

వెల రూ. 2-8-0.

పండ్రెండవ శతాబ్దమున వెలసిన శైవమత ప్రతిపాదకమగు ద్విపదకావ్యము. ఇందు శైవమతోద్ధారకుడగు బసవేశ్వరునియు, తత్పూర్వులు తత్సమకాలీనులునగు శివభక్తులయు చరిత్రములను రసికులు మనసుకరగినట్లుగను, కవి వర్ణించినాడు. గ్రంథము భిన్న భిన్న మండలములకు చెందిన పెక్కు తాళపత్ర మాతృకలతో సరిచూచి పరిష్కరింపబడినది. పాఠాంతరములు సూచింపబడినవి. పరిష్కర్త రచియించిన అమూల్యమగు పీఠిక (129 పుటలు) ఇందు గలదు.

## శతకమంజరి (భక్తి సంపుటము)

వృషాధిప; సర్వేశ్వర; దేవకీనందన; రఘువీర; నారాయణ; కాళహస్తీశ్వర; దాశరథి; రామతారక; రంగశాయి; రామచంద్ర శతకములు ఇందుగలవు. శతకకవుల చరిత్రలు పీఠికలయందు వివరింప బడినవి. వెల రూ. 1-8-0 విడివిడిగా ఒక్కొక్కటి 0-4-0

**ఆంధ్ర గ్రంథమాల, పో. బా. నెం. 212, మదరాసు.**



శ్రీ మల్లికార్జున

## పండితారాధ్యచరిత్ర

(శైవమత ప్రతిపాదకమగు ద్విపద కావ్యము)

ఇందలి పీఠిక కొన్నివందల పేజీలు గలది.

**పాల్కురికి సోమనాథకవి రచితము**

పరిష్కర్త :

**డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు**

**ఆంధ్రగ్రంథమాల, తపాలపెట్టె 212, మదరాసు.**

గలిగిన వికారములనుబట్టి యన్నాదులలో విష మున్నదని గమనించి, యట్టివిషజుష్టాన్నమును బరిత్యజింపవలె నని విషపరీక్షకై రాజు లట్టి జంతువులను నిజభవనములలోఁ బెంచవలె నని రాజనీతియందుఁ జెప్పఁబడి యున్నది.

విషమును జూచినమాత్రముచేతనే చిలుకలు, కూకరు గుడ్డాగి పిట్టలు, గోరువంకలు గట్టిగ నఱచునఁట. హంసలు కాళ్లు తడఁబడి నేలపైఁ బడిపోవునఁట. పెన్నెలపులుఁగు లాయాసముఁ జెందునఁట. విషము కంటఁ బడఁగానే చకోరపక్షికిఁ గన్నులు తెల్ల నగునఁట. క్రౌంచపక్షికి మద మతిశయించునఁట. పావురములు, కోవెలలు, కోళ్లు, చక్రవాకపక్షులు విషదర్శనమాత్రముచేతనే ప్రాణములు విడుచునఁట. పిల్లి భయపడి వణఁకునఁట. కోఁతి వెంటవెంట మలము విడుచునఁట. నెమలి పురి విచ్చి యానందించునఁట. ఈవిషయము అష్టాంగహృదయము సూత్రస్థానము 8-వ యధ్యాయములో

శ్లో. ఉత్క్రోశన్తి చ దృష్ట్వైత
చ్చుక దాత్యూహ సారికాః,
హంసః ప్రస్ఖలతి, గ్లాని
ర్జీవంజీవస్య జాయతే.
చకోర స్యాక్షివైరాగ్యం,
క్రౌంచస్య స్యా న్మదోదయః,
కపోత పరభృ ద్దక్ష
చక్రవాకా జహ త్యసూన్.
ఉద్వేగం యాతి మార్జార,
శ్శకృ న్ముంచతి వానరః,
హృష్యే న్మయూర స్తద్దృష్ట్వా.....

అని చెప్పఁబడినది.

## తరు గుల్మ లతాదులకు దోహదములు

తరుగుల్మలతాదులు వానివాని ఋతుకాలములయందుఁ బుష్పించుటయు, ఫలించుటయు సృష్టిలో సర్వసాధారణమైన విషయమే కాని యకాలమునందైనను వలసినపుడెల్లఁ గొన్ని వృక్షజాతులు పుష్పించునట్లు చేయవచ్చునఁట. అట్లు చేయుక్రియకు దోహదక్రియ యని పేరు. ఆదోహదము స్త్రీలే చేయవలయునఁట. అది యొక్కొక్క చెట్టున కొక్కొక్క విధముగా నుండును.

ఆవిషయ మీక్రిందిశ్లోకమువలనఁ దెలియనగును.

శ్లో. స్త్రీణాం స్పర్శా త్ప్రియంగు
ర్వికసతి, వకుళ స్సీధుగండూషసేకాత్,
పాదాఘాతా దశోక
స్తిలక కురవకౌ వీక్షణాలింగనాభ్యామ్,
మందారో నర్మవాక్యాత్,
పటు మృదుహసనా చ్చంపకో, వక్త్రవాతా
చ్చూతో, గీతా న్నమేరు
ర్వికసతి చ, పురో నర్తనా త్కర్ణికారః.

అనఁగా — ప్రేంకణపుఁ జెట్టు స్త్రీ చేతితో ముట్టుకొనినచోఁ బుష్పించును. పొగడచెట్టు పుక్కిటినిండఁ గల్లు దీసికొని యుమిసి తడిపినచో వికసించును. అశోకవృక్షము కాలితోఁ దన్నినచోఁ బూయును. బొట్టుగచెట్టు స్త్రీలు దృష్టిపెట్టి చూచినచోఁ బూయును. ఎఱ్ఱగోరంట స్త్రీ లాలింగనము చేయఁగనే పుష్పించును. మందారవృక్షము స్త్రీ లెదుట నిలిచి ప్రియభాషణము లాడినచోఁ బుష్పించును. సంపెఁగచెట్టు స్త్రీ లెదుట నిలిచి కొంచెము గట్టిగా సుకుమారముగా నవ్వినచోఁ బూయును. మామిడిచెట్టు నోటితో నూఁదినచోఁ బుష్పించును. సురపొన్నచెట్టు స్త్రీలు తనయెదుట గానము చేసినచోఁ బుష్పించును. కొండగోఁగుచెట్టు తనయెదుట స్త్రీలు నాట్యము చేసినచోఁ బుష్పించును. ఈదోహదములు ప్రబంధనాయిక లుద్యానవనములలోఁ జేయుచుండునట్లు ప్రబంధములలోఁ జదువుదుము. (ఈ దోహదములు మతాంతరములచే భిన్నభిన్నములుగాఁగూడఁ గలవు.)

సృష్టిలోఁ గొన్నివస్తువులకుఁ బరస్పరసంపర్క ముత్కర్షకముగాను, గొన్నిటికపకర్షకముగాను నుండు ననునది ప్రత్యక్షానుభవమే. అందుచేతనే లోకము విధినిషేధములతో ననేకనియమ నిబద్ధమై యున్నది. విధి నిషేధములను బాటింపనినాఁడు కలిగెడి పరిణామము చివర కనుభవైకవేద్యము గాకపోదు. అందులకే 'ఉచితమనుచితం వా కుర్వతా కార్యజాతం పరిణతిరవధార్యా యత్నతః పండితేన' అని పరిణామమును జూచుకొని పాటుపడవలె నని శ్రేయోభిలాషులు హితబోధ చేసిరి.

ఒకచో నొకదానిమ్మచెట్టునకు కోఁతులబాధపడఁజాలక చుట్టును వెదురుదబ్బలతో నల్లక మల్లించిరి. కోఁతులబాధ తప్పినది గానఁ జెట్టు గుబురుగా సాగి చుట్టు — అల్లిన యల్లకమునిండ నిండుకొనెను. కాని పూఁత, పిందె యేమియును లేదు. ఆ వెదురుబద్దల సందులలోనుండి వెలుపలికి వచ్చినకొమ్మలకు మాత్రము పూలు,పిందెలు, కాయలు పుష్కలముగా నుండెను. ఇట్లుండుటకుఁ గారణ మేమా? యని యూహించి, యాచెట్టునకు వెదురుతోడియావరణము కిట్టింపు గాదేమో యని యాయావరణము తొలఁగించిరి. తరువాత నెప్పటివలెఁ గోఁతులు తినఁగా మిగిలిన ఫలితము దక్కెను. కాన వృక్షాదులకును సంపర్క దోషము లేకపోలే దని మనము గుర్తింపనగును. 'కాకరకు కంపు గిట్టదు. పొట్లకు పొరుగు గిట్ట' దను సామెత మనము విననిది గాదుగదా!

వంకాయలు చేటలో వేసినచోఁ గనరెక్కుననియు, ఎంతసాగెడి గోదుమలకైనను మిరపకాయల సంపర్కము సోఁకినచో సాగవనియు నీమొదలుగాఁ గల పదార్థవిజ్ఞానమును దెలియఁజేయు విజ్ఞాన గురువులు వంటయింటిలో వంటకము చేయు నారీమతల్లులు.

స్థాలీపులాకన్యాయమున నింతవట్టు వివరింప నయ్యెను. ఇట్టి సృష్టి రహస్యము లింకెన్ని యున్నవో! అట్టివాని నెల్లఁ బెద్దల వలన వినఁగల్గుదుముగాక.

# గవర్నరుజనరలు - కార్యనిర్వాహకవర్గము

## వారిచరిత్ర (౧౭౭౩-౧౯౩౫)

**భావరాజు సత్యనారాయణగారు**

౧౭౭౩ లో బ్రిటిషుపార్లమెంటు వారిచే అంగీకరింపబడిన రెగ్యులేటింగు చట్టము (Regulating act of 1773), ఈస్టిండియా కంపెనీవారి పరిపాలనలో చాలమార్పులు కలుగజేసెను. వాటిలో ప్రధానమైనది గవర్నరుజనరలుపదవి శంకుస్థాపన. నూతనముగా సృష్టింపబడిన యీ గవర్నరు జనరలు, ఇతని కార్యనిర్వాహక వర్గము యేకమై కంపెనీ యొక్క పరిపాలనాబాధ్యత నంతటినీ వహింపవలసి వచ్చెను. అప్పటి గవర్నరు జనరలు బెంగాలునకు మాత్రమే ప్రభువు. మదరాసు, బొంబాయి రాజధానులపై స్వల్ప అధికారముమాత్రమే కలదు.

రెగ్యులేటింగుచట్టము ప్రకారము గవర్నరు జనరలుకు ప్రత్యేకము ఏమాత్రమూ చెప్పుకొనదగినంత అధికారము లేదు. పరిపాలనావిషయములలో ప్రతి అంశమునందును గవర్నరు జనరలు, కార్యనిర్వాహక వర్గము కలసి పనిచేయవలసివచ్చెను.

ఆరోజులలో గవర్నరు జనరలుకు ప్రత్యేక అధికారముల నిచ్చుటకు పార్లమెంటువారు భయపడిరి. అట్లు చేసిన గవర్నరు జనరలు ఆరువేల మైళ్లదూరముననుండి తన యిష్టము వచ్చినప్రకారము నిరంకుశపరిపాలన సాగించుచేమోయని పార్లమెంటువారుద్దేశించిరి. అందుచేత పరిపాలనాధికారముల నన్నిటినీ, గవర్నరు జనరలు నిండుసభలో విచారించి వారి యనుమతిచొప్పున నిర్ణయింపవలసినదిగా చట్టమునందు విధింపబడెను. కంపెనీ పరిపాలనక్రిందనున్న రాజ్యములో న్యాయమును విచారించుటకుగూడ గవర్నరుజనరలును అతని కార్యసభవారిని గలిపి న్యాయసభగా నిరూపింపబడెను. ఈ రీతిగా ఆదిలో ప్రత్యేకముగా అధికారశూన్యుడైన గవర్నరు జనరలు, రానురాను, అనేకప్రత్యేక అధికారములను ఎట్లు పొందెనో తెలిసికొనుట రాజకీయవిద్యార్థుల కెల్లరకు, పౌరులు కాదలచిన ప్రతివ్యక్తికీ, చాల ముఖ్యమైనవిషయము.

నూతన రాజ్యాంగమున, గవర్నరు జనరలుకు ఒసంగబడిన ప్రత్యేక అధికారములనుగాని, విచక్షణాధికారములనుగాని, ప్రత్యేక బాధ్యతలనుగాని, విమర్శించి చూచినచో, ౧౭౭౩ నుండి, గవర్నరు జనరలు అధికారము ఎట్లు అభివృద్ధి చెందినదో బోధపడును. తొలుత పార్లమెంటు వారు చట్టమునందు శాసించినది యొకటి; క్రియాకలాపములో చేకూరినది మరియొకటి. దాని మూలమున చట్టమురీతి యెట్లుండినను, గవర్నరు జనరలుకు భారతదేశ పరిపాలనలో ప్రాముఖ్యము, అగ్రస్థానము లభ్యమయ్యెను.

రెగ్యులేటింగు చట్టమునందు మొదటి గవర్నరు జనరలు, కార్యనిర్వాహకవర్గము వారి పేర్లుకూడ నిర్ణయింపబడెను. అప్పుడు బెంగాలు గవర్నరుగా నుండిన వారన్ హేస్టింగ్సును (Warren Hastings) మొదటి గవర్నరు జనరలుగా నియమించిరి. మొదటి కార్యనిర్వాహకవర్గపు సభ్యులు నలుగురు- జనరల్ క్లావరింగ్ (General Clavering), కలనల్ మాన్సను, (Colonal Manson), బార్వెల్ (Barwel), ఫిలిప్ ఫ్రాన్సిస్ (Philip Francis) ప్రభృతులు. గవర్నరు జనరలు సెలవుతీసికొన్నను, ఉద్యోగమునకు రాజీనామానిచ్చినను, లేక ఉద్యోగమును చాలించుకొనినను ఆపదవికి మరియొకనిని నియమించువరకు, ఎక్కువ అనుభవముగల కార్యనిర్వాహక వర్గపు సభ్యుడు, గవర్నరు జనరలుగా పని చెయ్యవచ్చును.

మొదట గవర్నరు జనరలుకు, కార్యనిర్వాహక వర్గమునకు ఒకరి

కొందరికి పడకపోవుట తటస్థించెను. దానివలన పరిపాలనకు చాల నష్టము కలిగెను. రెగ్యులేటింగు చట్టమందున్న లోపమే దీనికి కారణము.

గవర్నరు జనరలు బెంగాలుకు మాత్రమే ప్రభువుగా నిర్ణయింపబడినందున యితర రాజధానుల- బొంబాయి మదరాసుల- గవర్నరులు అతనిని లెక్కచేయరైరి. అటువంటి పరిస్థితులలో గవర్నరు జనరలు స్థితి యేమియు బాగుండదయ్యెను. ఒక్కొక్కప్పుడు కార్యనిర్వాహక వర్గములో తనమాటలను సభ్యులు లెక్కచేయని పరిస్థితులు ఏర్పడెడివి. అనవసరముగా గవర్నరు జనరలుతో ఏదియోవిధముగా వివాదము తెచ్చుకుని కాలయాపన చేయుటకు సభ్యులకు వీలుగా నుండెడిది. పాపం! గవర్నరు జనరలుకు వారిని త్రోసిపుచ్చి పని చేయుటకు అధికారము లేకపోయెను. నలుగురు సభ్యుల లోను ఇద్దరిటూ, ఇద్దరటూ విడిపోయినప్పుడే తన ప్రత్యేకపుఓటును (Casting vote) ఉపయోగించుకొనుటకు వీలయ్యెడిది. కాని ముగ్గురు సభ్యులు ఎప్పుడూ అతనికి ప్రతికూలముగానే వుండెడివారు. అందులో ఫ్రాన్సిస్ అనునతడు హేస్టింగ్సుకు బద్ధవిరోధి. వారన్ హేస్టింగ్సు రెగ్యులేటింగు ఆక్టు కల్పించిన యీ కష్టాలకు ఆరు సంవత్సరములు ఓపిక పట్టెను.

౧౭౮౦ లో గవర్నరు జనరలు అధికారమును వృద్ధి నొందించవచ్చునని హేస్టింగ్సుకు కొంచెము ఆశ కలిగెను. మాన్సన్, క్లావరింగు సభ్యుల మరణము, ఫ్రాన్సిస్ లండను ప్రయాణము అతని స్థితిలో మార్పును కలుగజేయుటకు కారణములయ్యెను. వారిస్థానే నియమింపబడిన సభ్యులతో హేస్టింగ్సు సఖ్యపడి కొత్తఅధికారమును, పలుకుబడినీ, సంపాదించి శక్తిమంతుడయ్యెను. నందకుమారుని ఉరిశిక్ష గవర్నరు జనరలువల్లనే తటస్థించెనని ప్రజలకు తెలియవచ్చెను. దానితో అతని పేరుప్రతిష్ఠలు మారుమ్రోగెను.

## ౨

౧౭౮౪ లో ఇండియా చట్టము (Pitt's India Act) రెగ్యులేటింగు ఆక్టులోని కొన్ని లోపములను సవరించెను. అది కార్యనిర్వాహక వర్గపు సభ్యులు నలుగురు అనవసర మనియును, ముగ్గురు చాలు ననియును నిర్ణయించెను. ఆ ముగ్గురిలోను ఒకరు సైన్యాధిపతిగా నుండవలె ననియు, గవర్నరు జనరలు తన ప్రత్యేకపు ఓటును ఎప్పటివలెనే ఉపయోగించుకొనవచ్చుననియు శాసించెను. సభ్యులు ముగ్గురే కనుక గవర్నరు జనరలు తన వోటును అవసరము వచ్చినప్పుడెల్ల ఉపయోగించుకొని, తన్మూలముగా తన అధికారమును, పలుకుబడిని అభివృద్ధి చేసికొనెను.

మరియు, బొంబాయి మదరాసు పరిపాలనావిషయములను పరిశీలించుటకు, గవర్నరు జనరలుకు, కార్య నిర్వాహకవర్గమునకు కలిపి అధికార మొసగబడెను. ఈకొత్తచట్టము బొంబాయి ప్రభుత్వమువారుగాని, మదరాసు ప్రభుత్వమువారుగాని గవర్నరు జనరలు యొక్కయు, కార్యనిర్వాహక వర్గము వారి యొక్కయు అనుమతి లేనిదే సంధి చేసికొనుటగాని, యుద్ధమునకు దిగుటకాని చేయరాదనియు, ఇక ఇతర విషయములందుగూడ యీ అధికారము వర్తించుననియు పిట్టు చట్టము శాసించెను. ఈ అధికార నిర్వహణములో, గవర్నరు జనరలు తన సభ్యులను వశపరచుకొన్నవాడగుటచే అతనికి రాజధానులపై ఎక్కువ పలుకుబడి సంప్రాప్తమయ్యెను.

ఈ సమయములోనే బ్రిటిషు పార్లమెంటువారు భారత రాజ్యాంగ వ్యవహారవిషయములలో గవర్నరు జనరలు ఇచ్చు సలహాలకు ఎక్కువ ప్రాముఖ్యము నిచ్చుట ప్రారంభించిరి. ఆరువేలమైళ్లదూరములో నుండుట చేతనూ, రాకపోకల సౌకర్యములు లేకపోవుటచేతనూ గవర్నరు జనరలు ఏమి వ్రాసినను, అదెల్ల పార్లమెంటువారికీ, డైరెక్టర్లకూ వేదవాక్యములయ్యెను. అందువలన ప్రభుత్వనిర్వహణములో తన తెలివితేటలను ఉపయోగించి, కార్యములను సాధించుటకు గవర్నరు జనరలు యత్నించెను. ఆపైన అతనికి చట్టమువల్ల లభించిన అధికారములు సున్నైనను లేనప్పటికీ, దేశకాల పాత్రములవల్ల, అప్పటిప్రత్యేకపరిస్థితులవల్ల ప్రత్యేకాధికారములు గలిగెను. ఈయధికారములే లేకపోయినచో హేస్టింగ్సు తరువాత వచ్చిన ప్రభువులు బ్రిటిషు సామ్రాజ్యమును విస్తరింపజేసియుండకపోదురు.

## ౩

౧౭౮౬లో గవర్నరు జనరలు కారన్‌వాలీసు ప్రభువు (Lord Cornwallis) తన అధికారగౌరవమును, స్థానబలిమిని నిలబెట్టుకొనెను. తను కోరిన కోర్కెలను పార్లమెంటు అంగీకరించినగాని గవర్నరు జనరలు పదవి తనకు అక్కరలేదని అతడు నిరాకరించెను. దానిమీద, రెగ్యులేటింగుచట్టములోని ముఖ్యమైన లోపము సవరింపబడినది. ఈసవరణ ప్రకారము కార్యనిర్వాహకవర్గపు సభ్యులను అత్యావశ్యకమైన, మిక్కిలి అవసరమైన సందర్భములయందు త్రోసిపుచ్చి తన ప్రత్యేకబాధ్యత మీద పరిపాలనకార్యములను చక్కబెట్టుకొనుటకు గవర్నరు జనరలుకధికారము కలిగినది. కారన్‌వాలీసుప్రభువు సైన్యాధిపతిగాకూడ పనిచేయవచ్చునని యీ చట్టము నిర్ణయించెను.

కారన్‌వాలీసుప్రభువు గవర్నరు జనరలుగా వచ్చుటవలన ఆ పదవికి గౌరవము, ప్రాముఖ్యము, పలుకుబడి ఎక్కువయ్యెను. అతడు ఒక గొప్ప గౌరవ కుటుంబములోనివాడు. కీర్తి గడించిన యోధుడు అనుభవము గల రాజకీయ వేత్త. అతని ననుసరించి, తరువాతకూడ గౌరవ కుటుంబములోని వానినే గవర్నరు జనరలుగా నియమించుటకు పార్లమెంటువారు అలవాటుపడిరి

ఇప్పుడు గవర్నరు జనరలుకు తన ప్రత్యేక బాధ్యతవల్ల పరిపాలించుటకు స్వాతంత్ర్యము కలిగెను. సైన్యాధిపతి తానే అయినందునను, ప్రభుత్వానికీ, సైన్యానికీ పేచీలు లేకపోయినవి. కారన్‌వాలీసు కాలములోనే గవర్నరు జనరలు వ్యక్తిత్వము విశదమగుటకు ప్రారంభమయ్యెననుటలో అసత్యము లేదు

౧౭౯౩ లో పార్లమెంటు ఆమోదించిన చార్టరుచట్టము ప్రకారము (Charter Act) జరిగినమార్పులవల్ల గవర్నరు జనరలుకు ఇతర రాజధానులపై అధికార మెక్కువాయెను రాజధానుల ప్రభుత్వములను పరిశీలించుటకు పోయినప్పుడు గవర్నరు జనరలుకు ఆరాజధాని గవర్నరుమీద తనకు గల పూర్ణాధికారము చలాయించుటకును, ఆ రాజధాని కార్యసభలో తాను ఆధిపత్యము వహించికంపెనీపరిపాలనమునకు సంబంధించిన ఉత్తర్వుల నన్నింటిని జారీ చేయుటకును అతనికధికారమొసంగబడెను వెల్లెస్లీప్రభువు (Lord Wellesley) టిప్పు సుల్తానుతో యుద్ధము చేయు సందర్భమున మదరాసుకు విచ్చేసినప్పుడు అతడీ అధికారబలమును సంపూర్ణముగా వినియోగించుకొనెను

న్యాయ విచారణాధికారభారము నింతకాలమును గవర్నరు జనరలును, అతని కార్యనిర్వాహకవర్గమువారును ఏకమై నిర్వహించుచు వచ్చిరి దీనివలన గవర్నరు జనరలుకు అపఖ్యాతి వచ్చునేమోయని యెంచియు, ధర్మశాస్త్ర ప్రకారము కార్యనిర్వాహక వర్గమును, న్యాయపరిపాలన వర్గమును వేరుగానుండవలెనని యుద్దేశించియు, వెల్లెస్లీప్రభువు గవర్నరు జనరలుకు న్యాయపరిపాలనతో ఏవిధమైన సంబంధము నుండకూడదని మొరపెట్టుకొనెను. ఈ విషయములో అతడు డైరెక్టర్లకు పంపిన రాజకీయలేఖ (Despatch) అమోఘమైనది వెల్లెస్లీకి పూర్వమే వారన్ హేస్టింగ్సు కొంతవరకు ఈ మార్పుకు పూనుకొన్నాడు అటుతరవాత ఇంపే (Impey) అనుసతనిని కంపెనీ ప్రధాన న్యాయమూర్తిగా నియమించుటలో ఉద్దేశము వేరయినా, వెల్లెస్లీ కోరిన సంస్కరణకు పునాదివేయుట అయినది ఇంకి వెల్లెస్లీలేఖకు ఫలితం సంపూర్ణమైనమార్పు జరుగుటయే ౧౮౦౧ లో అప్పటివరకు గవర్నరు జనరలు బాధ్యతలోనున్న సాదర్ దివాని అదాలత్ (Sadr Dıwanı Adalat) క్రొత్తగా నియమితులైన ముగ్గురు న్యాయమూర్తుల యధీనము చేయబడెను దానిమీదట గవర్నరు జనరలుకు న్యాయశాఖాపరిపాలనకార్యముల బాధ్యత తొలగినది ఇంక పరిపాలనాకార్యములందు కడుశ్రద్ధ వహించి పూనికతోను పూచీతోను పనిచేయుటకు గవర్నరు జనరలుకు అవకాశము చిక్కినది

౧౮౧౩-౩౩ మధ్య విశేషమైన మార్పులు ఏవియు జరుగలేదు కాని ఈయుగము బ్రిటిషు సామ్రాజ్యాభివృద్ధికి పేరుకెక్కినది దానితోపాటు గవర్నరు జనరలుకీర్తి ప్రతిభలు నలుదిక్కుల వ్యాపించెను సామ్రాజ్యాన్ని పెంపుచేయుటలో వెల్లెస్లీ

జగత్ప్రసిద్ధిగాంచిన

పరిమళ ద్రవ్యము

# మైసూరు "స్యాండల్ ఉడ్ ఆయిల్ (శ్రీగంధపునూనె)" వాడుడు



మైసూరుగవర్నమెంటు స్యాండల్ ఉడ్ ఆయిల్ ఫ్యాక్టరీ-ప్రక్కదృశ్యము

స్యాండల్ ఉడ్ (శ్రీగంధము) చెట్లును పెంచువిధానము మైసూరు రాజ్యములో ఒక ఉత్కృష్టకళ. సహజముగా నుండు పరిమళము ఈ చెట్లునుండి తయారగు స్యాండల్ ఉడ్ ఆయిల్ కు ఉండును. ప్రపంచమున శ్రేష్ఠమైన సబ్బులకు, పరిమళ పదార్థములకు ఈ స్యాండల్ ఉడ్ ఆయిల్ నే వాడుచున్నారు.

## గవర్నమెంటు స్యాండల్ ఉడ్ ఆయిల్ ఫ్యాక్టరీ, మైసూరు.

ఏజంట్లు :—

దక్షిణఇండియా, బొంబాయిరాజధాని, బర్మా :

మెసర్సు యం. ఎ. టి. ఆచార్య అండ్ కో., శ్రీకృష్ణ బిల్డింగ్సు, బెంగుళూరుసిటి.

మరియు

ది మైసూరు ప్రాడక్ట్సు లిమిటెడ్, ప్రిన్సెస్‌స్ట్రీట్, బొంబాయి.

చూపిన విశేషధైర్యోత్సాహములు, అతడు పన్నిన పన్నాగములు, హేస్టింగ్సు చూపిన ధైర్యసాహసకృత్యములు, తరువాత మరల డల్‌హౌసీ వేసిన ఎత్తుపైయెత్తులు చరిత్రపాఠకులకు విశదమే. ఈ యుగమునందు గవర్నరు జనరులలో సామ్రాజ్యదీక్ష మూర్తీభవించినది. ఆదీక్షలో మగ్నులై ఒళ్లుతెలియక వారు చేసినపనులను తలచుకొన్నచో దేహము కంపించును. అయినప్పటికిని వాటి మూలమున అప్రత్యక్షముగా భారతదేశమునకు కొన్ని ఉపకారములు, లాభములు కలిగినవి. హిందుదేశాన్నంతటిని గవర్నరు జనరలు ఒక్కమారు మేలుకొలిపినాడు తన విజయభేరిని మ్రోగించి. దేశములో ప్రజలలో ఒకవిధమైన సఖ్యత ఐక్యత కలిగెను. ౧౮౫౭ లో యీసఖ్యత మూర్తీభవించి భారతస్వాతంత్ర్యమునకై పోరాడినది. కొందరు గవర్నరు జనరలులు ప్రయాణసౌకర్యాలు కలుగజేయుటలో స్వలాభపరులైనా మొత్తముమీద, వారిపనులకు ఫలితముగా దేశములో రైలుమార్గాలు, పోస్టలువిధానము, విశ్వవిద్యాలయాలు నిల్చిపోయినవి. ఇంక బెంటింకుప్రభువు (Lord Bentinck) కాలములో సంఘసంస్కరణకుకూడా అవకాశము కల్గినది.

## ౪

మరల ౧౮౩౩లో గవర్నరు జనరలుహోదాలో గొప్ప మార్పు కలిగినది. ౧౮౩౩లో వ్రాసయిన చార్టరుచట్టము(Charter Act)వలన గవర్నరు జనరలును, అతని కార్యసభవారును ఒక్కబెంగాలుకేగాక, హిందూదేశానికి యావత్తు, అనగా బ్రిటిషుహిందూరాజ్యానికంతటికి అధిపతులైరి. కాని బెంగాలుకు మాత్రము గవర్నరు జనరలే యింకా గవర్నరుగా నుండవలసి వచ్చినది. అందుచే గవర్నరు జనరలుహోదా హెచ్చినప్పటికి, పరిపాలనాబాధ్యత క్లిష్టమయినది. ఇది గ్రహించి పార్లమెంటువారు ౧౮౫౩లో బెంగాలుకు ప్రత్యేకగవర్నరును నియమించిరి.

౧౮౩౩-౫౪ మధ్య ఏ చట్టములను అనుసరింపకయే తన ప్రత్యేకబాధ్యతవల్ల నయితేనేమి, తన శక్తిసామర్థ్యములవల్లనయితేనేమి, తనకున్న పలుకుబడివల్ల నయితేనేమి, తన బుద్ధి విశేషము నుపయోగించుకొని గవర్నరు జనరలు ఇంకా అనేక అధికారములను సంపాదించుకొనెను; అనగా కార్యనిర్వాహకవర్గముతో నిమిత్తములేకుండా చెలాయింపగలిగే అధికారాన్ని గవర్నరు జనరలు పొందెను. దీనికి నిదర్శనములు చాల కలవు. ఒక గవర్నరు జనరలు సింధుదేశమును వశపరచుకొని బోర్డు ఆఫ కంట్రోలు అధిపతితో (President, Board of control) ఉత్తర ప్రత్యుత్తరములు జరిపి, ఆ రాష్ట్రమును తను స్వయముగా పరిపాలించుట మొదలు పెట్టెను. గవర్నరు జనరలైన ఎల్లెన్‌బరోను (Ellenborough), అతనితరువాత వచ్చినవారిని బ్రిటిషురాణి పరిపాలనా విషయములందు తనతో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపవలసినదిగా నియమించి, వారు చేయుపనులకు రహస్యముగా తన అనుమతి నిచ్చుచువచ్చెను. దీనివలన గవర్నరు జనరలుగౌరవము వెనుకటికంటె ఎక్కువయినది. కార్యసభవారి ప్రాధాన్యము తగ్గినది.

అప్పటి గవర్నరు జనరలు రాజకీయవిషయములలోనేగాక, సైన్యము విషయములందును, సంధి, యుద్ధకార్యసందర్భములందును, స్వతంత్రముగా తన వ్యక్త్యధికారమును చెలాయించుటకు ప్రయత్నించి సఫలీకృతమనోరథు డగుచువచ్చెను. వెల్లెస్లీ టిప్పుసుల్తానుతోను మహారాష్ట్రులతోను పోరాడుట, ఆక్లండు ప్రభువు ఆఫ్ఘనులతోను, ఎల్లెన్‌బరో ప్రభువు గ్వాలియరు ప్రజలతోను పోరాడుట, హార్డింజి డల్‌హౌసీ ప్రభువులు అనేక యుద్ధాలలో ప్రాధాన్యము వహించుట - పైన చెప్పిన విషయానికి నిదర్శనాలు.

గవర్నరు జనరలు సామ్రాజ్యాభివృద్ధికి తోడగుట బోర్డ్ ఆఫ్ కంట్రోల్ వారికిలోపల యిష్టమున్నను లేకపోయినను పైకిమట్టుకు గవర్నరు జనరలును చివాట్లుపెట్టేవారు. వారు తుదకు వెల్లెస్లీని ఎలాఅయితేనేమి ఉద్యోగము చాలించుకొని రమ్మన్నారు. డల్‌హౌసీ మనస్సును విసిగించేసేరు. వారు ఏమన్నా గవర్నరు జనరలు లెక్కచేయకుండా ఉండడానికి అప్పటి పరిస్థితులు అనుకూలముగా ఉండేవి.

నిబంధనలకు లోబడినవి కొన్ని, నిబంధనలకు లోబడనివి కొన్ని అని (Regulation provinces and non-Regulation provinces) రాష్ట్రము

లను రెండు రకాలుగా విభజన చేయుటవలన గవర్నరు జనరలు అధికారము మరింత హెచ్చినది. నిబంధనలకు లోబడని రాష్ట్రములందు పరిపాలనాకార్యక్రమము గవర్నరు జనరలును, కార్యసభవారును కలిసి ఆమోదించిన ఉత్తరువుల ప్రకారము జరుగునట్లు నిర్ణీతమయినది. గవర్నరు జనరలు కార్యసభాసభ్యులను తన పక్షము చేసికొని, నిబంధనలకు లోబడనిరాష్ట్రములయందు, తనకు వశవర్తులైయుండు అధికార్లను నియమించి తన అధికారమును విస్తరింప జేసికొనుచుండెడివాడు.

౧౮౩౩ లో గవర్నరు జనరలు అధికారమునకు ఒకవిధమైన నవశక్తి కలిగినది. కార్యనిర్వాహకవర్గానికి ప్రభుత్వపుటుత్తరువులు నిర్ణయించుటయేకాక, చట్టములు చేయు అధికారముకూడ కల్గెను. కాని యీ కార్యమునకై వారు ప్రత్యేకముగా ఇతర రాజధానుల ప్రతినిధుల సమావేశము జరిపి, వారితో సంప్రతించవలెనని నిర్ణయింపబడెను. కార్యనిర్వహణమునకై సమావేశమైనప్పుడూ, చట్టనిర్మాణమునకై సమావేశమైనప్పుడూకూడా ఆధిపత్యము వహింపవలసినవాడు గవర్నరు జనరలే. శాసనసభ యంగీకరించిన చట్టము తనదృష్టిలో అనవసర మని తోచినయెడల గవర్నరు జనరలు అట్టిచట్టమును నిషేధించుటకుకూడ అధికారము కలిగెను. ఈయధికారమువలన గవర్నరు జనరలుపదవికి ఒక క్రొత్త వికాసము కల్గెను.

౫

౧౮౫౮లో గవర్నరు జనరలు పదవి ఇంకా అపూర్వమైన మార్పు పొందెను. ఇంతవరకూ అతడు పార్లమెంటువారిచేనియమింపబడెడివాడు. ౧౮౫౮ నుండి గవర్నరు జనరలును బ్రిటిషు ప్రభుత్వమువారే నియమించునట్లును, గవర్నరు జనరలు తాను చేయు ప్రతికార్యమువిషయమునను భారతరాజ్యాంగకార్యదర్శి ద్వారా (Secretary of state for India) బ్రిటిషు ప్రభుత్వమునకు జవాబుదారుగ నుండునట్లును శాసనమయినది. చట్టమునందు లిఖింపబడలేదుగాని, అప్పటినుండి గవర్నరు జనరలుకు రాజప్రతినిధి (Viceroy)యను నామము ప్రభుత్వపుటుత్తరువులలో స్థిరపడిపోయెను. ఈ వైస్రాయి బిరుదము గవర్నరు జనరలు పదవికి ఒక నవశక్తిని, నూతనవికాసమును ప్రసాదించినది స్వదేశ సంస్థానములలోకూడ ఆతనికి ప్రతిష్ఠ గౌరవము హెచ్చినది.

౧౮౫౮ తరువాత, ౧౮౬౧ లో భారత శాసనసభలచట్టము (Indian Councils Act)వలన, గవర్నరు జనరలుకుగల అధికారములలో కొన్ని మార్పులు జరిగినవి. కానింగుప్రభువు (Lord Canning) కార్యనిర్వాహకవర్గము అనవసర మని ఆ సభ నెత్తివేయుటకు యత్నించెను. కాని అది సాధ్యము కాలేదు. సభాసమావేశమునకు సంబంధించిన నిబంధనలను, కట్టుబాట్లను ఏర్పాటు చేయుటకు పార్లమెంటువారు గవర్నరు జనరలుకు అధికార మిచ్చిరి. ఈ అధికారమునను సరించి, కానింగుప్రభువు తన ప్రభుత్వశాఖా విభజనపద్ధతిని (Portfolio system) అమలులోకి తెచ్చెను. దాని ప్రకారము కార్యనిర్వాహక సభ్యులకు ఒక్కొక్కరికి ఒక ప్రత్యేక పరిపాలనాశాఖ (Department) ఒప్పగింపబడి, ఆశాఖ పరిపాలనకు వారు జవాబుదారులుగా నుండునట్లు ఏర్పాటయ్యెను. ఈ నూతన నిబంధనలవల్ల కార్యసభవారి ప్రాధాన్యము సంపూర్ణముగా నశించెను. ఇందువలన గవర్నరు జనరలుకు అధికారమింకను హెచ్చినది.

మరియు తన యిష్టము ననుసరించి హిందూదేశములో ఎక్కడైనను సరే తనయిచ్చవచ్చిన స్థలమునందు కార్యసభను సమావేశపరచుటకును, ఆసభకు ఒక సభ్యుడు హాజరయినను సభ జరిపి కార్యనిర్వహణము చేయుటకును గవర్నరు జనరలుకు అధికారము కలిగినది. పరిపాలనాశాఖలన్నింటికి ఒక్కొకకార్యదర్శి నియమితుడయ్యెను. ఈకార్యదర్శులందరును రాజప్రతినిధితో ప్రత్యేకముగా తమ కార్యభారమునుగూర్చి ముచ్చటించుటకు అధికారముకలిగినది. ఈ యేర్పాటువలన, రాజప్రతినిధి కార్యదర్శితో ఆలోచించి కార్యములనన్నిటినిచక్కబెట్టుకొనుచువచ్చెను. ఎప్పుడోకాని కార్యసభాసభ్యుని చూచుటకు రాజప్రతినిధికి అవసరముండెడిదికాదు. ఈవిధానమువలనకూడ కార్యసభాసభ్యుల ప్రాముఖ్యము క్షీణించినది. సెక్రటరీల పలుకుబడి యెక్కువయై, రాజప్రతినిధికి అధికారప్రాబల్యము చేకూరినది.




స్వచ్ఛమైన ఈ సబ్బు

# ముఖవర్ఛస్సుకు

చాల శ్రేష్ఠమైనది

చాల మృదువుగానుండును. మనోహరమైన సువాసన. మేలురకము సాండల్ ఉడ్ పరిమళముండును. ఎక్కువ నురుగువచ్చును. ఈ నురుగు శరీరమున ఉండు మలినపదార్థము నంతను వెడలగొట్టును. దీనినివాడిన ఆనందము కలుగును. శరీరము పరిశుభ్రముగాను, మృదువుగా నుండును.

# మైసూరు స్యాండల్ సోపు

నవీన శాస్త్రీయ పద్ధతుల ననుసరించి తయారైనది.

ఎల్లెడలనూ లభించును

# గవర్నమెంటు సోపు ఫ్యాక్టరీ,

బెంగుళూరు.

మదరాసురాజధాని, తిరువాన్కూరు, కొచ్చిన్, బర్మా, హైదరాబాదు (నైజాం డొమీనియన్సు)

ప్రాంతములకు ముఖ్యమైన ఏజంట్లు:—

మెసర్సు బెస్టు అండ్ కో, లిమిటెడ్., తపాలాపెట్టె 63, మదరాసు.

మీకు ఆరోగ్య భాగ్యమునిచ్చు రుచికరమైన భోజనము, అనుకూలమైన బస, నేతి పలహారములు కావలసినచో

Phone No. 4084.

**NEO**

# Raja Rajeswary Lunch Home

**Boarding & Lodging**

A Very Palatial Place

**No. 220-221,**
**Wall Tax Road, P. T.,**
**MADRAS.**

RATES FROM RS. 2 UPWARDS.



*For Your*
**Comforts**
**Convenience**
**Commands**

**A Few Minutes Walk From Central Station**

Our Representative Will Meet All Trains.

PROPRIETOR:
V. S. GANGARAM.

## నియో రాజరాజేశ్వరీ లంచి హోమ్,

220-221, వాల్‌టాక్సు రోడ్డు, - - పి. టి., మదరాసునకు దయచేయుడు.

సెంట్రల్ స్టేషనునుండి 2 నిమిషములలోనే ఈ భవనమునకు చేరగలరు.

విద్యుద్దీపములు, పంకాలు గల విశాలమైన గదులుగలవు. సెంట్రల్ స్టేషనువద్ద మా ఏజెంట్లు ప్రతి రయిలుకు సిద్ధముగానందురు.

ఒకపర్యాయము పరీక్షించిన మీకే తెలియును. ప్రొప్రయిటర్ :— వి. యస్. గంగారామ్,

జండా మార్కు ఎంపయిర్ సేమియా

ఎంపయిర్ అప్పడాలు ఉపయోగింపుడు




కొనేటప్పుడు సరుకునాణ్యము పరిమాణము గమనింపుడు

ఎంపయిర్ సేమియా తదితర సరకులన్నిటికంటెను ఎక్కువ శ్రేష్ఠమైనది.

మాన్యుఫాక్చరర్లు:

**The Empire Vermicelli Co.,**
(స్థాపితము 1919)
Choolai High Road, Madras.

అదికాక ఆ పరిస్థితులలోనే కార్యసభాసభ్యుని జీతమును ౮౦౦౦ పౌనులకు తగ్గించిరి. గవర్నరు జనరలుచే నియమింపబడిన, కార్యసభ్యునికిగల అధికారముకంటె తక్కువ అధికారము గల్గిన లెఫ్టనెంటు గవర్నరు (Lt Governor) జీతము ౧౦,౦౦౦ పౌనులు చేసినారు. కార్యనిర్వాహకవర్గసభ్యులను నియమించునపుడు ఇండియామంత్రి రాజప్రతినిధిసలహాపై నాధారపడుట ప్రారంభించెను. దానితో కార్యనిర్వాహకసభవారు గవర్నరు జనరలుకు సంపూర్ణముగా లొంగిపోయి, అతనికి జోహారుచేయుట మొదలిడిరి.

౧౮౬౧-౧౯౩౫ల మధ్య కార్యనిర్వాహకవర్గమునకును గవర్నరు జనరలుకును సంబాధింఛిన మార్పులు విశేషమైనవి ఏమీ జరుగలేదు. కాని కొన్ని బాహ్యపరిస్థితులు గవర్నరుజనరలు అధికారాన్ని ఎక్కువ చేసినవి. పోస్టలువిధానము ఏర్పాటగుటవల్ల, రైల్వే టెలిఫోను మార్గములు స్థాపించుటవల్ల, పరిపాలనకు సంబంధించిన ప్రధానవిషయములను గవర్నరు జనరలు అతివేగముగా తెలిసికొనుచుండుటకు వీలయినది. మరియు ఇండియాకు, లండనకు కేబులు (Cable)మార్గము పడుటవలన వైస్రాయి భారతరాజ్యాంగమంత్రితో ప్రతినిముషము పరిపాలనా విషయములనుగురించి ముచ్చటించుటకును, ఉభయులును సంగతిసందర్భాలను అవగాహనచేసికొనుటకును వీలయినది. వైస్రాయి, భారత మంత్రుల ఉత్తరప్రత్యుత్తరములు అతిరహస్యముగా జరుగుట కేర్పాటులు జరిగెను. గవర్నరు జనరలు భారత మంత్రికి తనకు జరిగిన సంభాషణ కార్యసభవారికి తనకు ఇష్టమైనట్లయితే తెలియజేయును. ఈసందర్భములవలన గవర్నరు జనరలు పలుకుబడి అపరిమితమైనది.

కొందరు భారతరాజ్యాంగ మంత్రులు గవర్నరు జనరలు అధికారములను తగ్గింపవలెనని యత్నించిరి. అందులో ముఖ్యుడు మోర్లే ప్రభువు (Lord Morley). కాని కర్జన్ మింటో ప్రభువులు (Lord Curzon and Lord Minto) గవర్నరుజనరలు ప్రాభవాధికార వ్యక్తిత్వములను నిలబెట్టుటకు ధైర్యసాహసములతో పనిచేసి వాటికి భంగము కలుగకుండ కాపాడిరి.

## ౬

౧౯౩౫లో పార్లమెంటువారిచే ఆమోదింపబడిన ఇండియాచట్టము, కార్యనిర్వాహకవర్గమును అంతరింపజేసి కేంద్రమున ఒకవిధమైన ద్వంద్వప్రభుత్వమును (Diarchy) నెలకొల్పుటకు నిశ్చయించెను. 'రిజర్వుడు' విషయములను (Reserved subjects) గవర్నరుజనరలు నూతనముగా నియమితులగు మంత్రులతో నిమిత్తము లేకయే పరిపాలించును. ఈవిషయములకు సంబంధించిన వ్యవహారములను నిర్వహించుటకుగాను గవర్నరు జనరలుకు సలహాదారులు(Counsellors) ఉందురు కాబట్టి కార్యసభవారి తరఫున మంత్రు లుండెదరని మనము ఆశపడుటకు వీలు లేదు. మంత్రులున్నప్పటికి, కొంతవరకు బాధ్యతాయుత ప్రభుత్వమును (Responsible Government) నెలకొల్పినప్పటికి గవర్నరు జనరలు అధికారము వెనుకటికంటె హెచ్చినది గాని తగ్గలేదు. అతని ప్రత్యేక అధికారములు, ప్రత్యేక బాధ్యతలు, తనే రాజప్రతినిధియై నిర్వహింపవలసిన సార్వభౌముని అధికారములు — అన్నియు కలిసి గవర్నరుజనరలుకు విశేషాధికారమును విస్తారమగు బాధ్యతను ఒసంగినవి.

ఈవిధముగా గవర్నరు జనరలు చరిత్రను సంక్షిప్తముగా విమర్శనతో తెలిసికొన్నపిదప అతడు తన అధికారమును భారతదేశాభివృద్ధికొరకై ఎంతవరకు వినియోగించుటకవకాశముండునో యూహించుడు.

# ఆర్య-ద్రావిడవాదము

ఎస్. శ్రీకంఠశాస్త్రి

ఆధునిక యూరోప్ ఖండమునందు రాజకీయ విప్లవ మారంభమై ఈ సమస్య ప్రపంచమునంతయు ఆందోళనపరచుచు యహూదు జనాంగములకు వివిధహింసాజనకమై పరిణమించినది. జర్మనీ, ఇటలీ, హంగెరీ, రుమేనియా, ఆస్ట్రియా, పోలెండు దేశములందు ఆర్యులనబడువారు యహూదులను తమ దేశములనుంచి తరుమ గొట్టుచున్నారు. బ్రిటిష్ ఛత్రాధిపత్యమునందు ఈ సమస్య లేకపోలేదు. జీయోనిస్ట్ ఉద్యమమునకు బ్రిటిష్ మంత్రిమండలమువారు ప్రోత్సాహమునిచ్చి అరబ్బీయుల దేశమగు పాలిస్టయిన్ మొదలయిన భాగములందు ప్రపంచమునందుండు యహూదులందరు వలసలేర్పరుచుకొనుటకు సహాయము చేయుచువచ్చిరి. టెల్-అవీవ్ అను ముఖ్యనగరమును కట్టించిరి. అయితే అరబ్బీయులు ఘోరాందోళనము గావించి మూడు సంవత్సరములనుంచి పోరాడుచున్నారు. ఇప్పుడు బ్రిటిష్ అధికారులు కన్ను తెరచి చూచి అరబ్బీదేశమును రెండు భాగములుగా విభజించు ప్రయత్నమును మానివేసినారు. జర్మనీదేశమునందు హిట్లర్ ఈ జాతివాదము నారంభించి ఆర్యులు జన్మతః ఉత్కృష్టు లనియు, తదితర జనాంగము లన్నియు ఆర్యులకు సేవావృత్తి చేయవలె ననియు, ఆర్యులు తమకులము శుద్ధముగ నుండుటకు తదితర జనాంగములతో సంబంధ బాంధవ్యములు చేయరాదనియు బోధించుచున్నాడు.

ఈజాతివాదము సాంక్రామిక జాడ్యమువలె యూరోప్ ఖండమునందేకాక ఆఫ్రికాఖండమునకు, దక్షిణ అమెరికాఖండమునకు వ్యాపించుచున్నది. ఆ యా ఖండములలో జాత్యభిమానముచే అనేకవిధములుగ అన్యాయములు జరుగుచున్నవి. ఈ విషబీజమును మన దేశమునందుకూడ నాటవలెనని కొందరు ఇటీవల ప్రయత్నించుచున్నారు. బ్రాహ్మణద్వేషులగు కొందరు ద్రవిడదేశీయులు ద్రావిడసంస్కృతియే యుత్తమ మనియు, ఆర్యులగు బ్రాహ్మణులు దక్షిణదేశమునకు వలసవచ్చినవారగుటచే వారికి ఏవిధమైన హక్కు-బాధ్యతలు లేవనియు వాదించుట కారంభించినారు.

సంస్కృతి యన్న నేమి ? జాతి యన్న నేమి ? పశుపక్షి కీటకాదిగాగల జరాయు జాండజ స్వేద జోద్భిజ్జ జంతువులు పరిణామవాదప్రకారము ఉత్తరోత్తర ఉత్తమోత్తమ జాతులుగా ప్రవర్ధిల్లుచు పశుధర్మములైన ఆహార నిద్రా భయకామముల నుత్తరించుటయే సంస్కృతి యనబడును. జాతులు కొన్ని దేహధర్మముల ననుసరించినవి, కొన్ని గుణముల ననుసరించినవి, కొన్ని కర్మముల ననుసరించినవి. చాతుర్వర్ణ్య విధానము శ్రీకృష్ణుడు చెప్పినట్లు గుణకర్మముల ననుసరించియే చేయబడినది. మనుష్యశాస్త్రమునందు (ఆంథ్రోపాలజి) 'ప్రైమేట్స్' అను మర్కట మానవాదు లెట్లు జనించినదియు, ప్రపంచమునందు ముఖ్యజాతు లెట్లు పుట్టినవియు నిర్ధరింపబడినది. లెమురాయ్డ్స్, టార్సియోయ్డ్స్, అమెరికాఖండ మర్కటములు, ఏషియా ఖండ మర్కటములు, ఆంత్రోపాయ్డ్ వానరులు, మనుష్యజాతులు క్రమముగా జనించి మానవశాఖాభేదము లేర్పాటైనవి.

భూ భాగములను వివరముగ పరిశీలించినచో శ్వేతజాతులు యూరోప్ పశ్చిమ ఆసియాభాగములందును, పీతజనులు పూర్వ ఆసియాఖండమునందును, తామ్రవర్ణజాతులు అమెరికాఖండమునందును, కృష్ణవర్ణమువారు ఆఫ్రికాఖండమునందును స్థూలముగ గనబడుచుందురు. అయితే ఎన్ని వేల సంవత్సరములనుంచియో ఆహారముకొరకును శీతోష్ణ బాధలను తప్పించుకొనుటకును అన్ని జనాంగములు వేర్వేరు ప్రాంతములకు వలసపోయి యుండుటచే నేడు శుద్ధజాతియనునది లేదు. వర్ణసంకరము ఇదివరకే ఎంతో జరిగిపోయినది.



మనసులో జ్ఞాపకము ఉంచండి
కలరు, ఆఫ్‌టోన్, లయిన్
ఇంక పలవిధములైన బ్లాకులును
తయారు చేయు కంపెని,
M.C.A. & Co.
14, JONES St.,
ఇదిమే కంపెని
ఎం. సి. అప్పాసామి శెట్టి అండు కంపెని
M.C.A & Co.
MANNADY
MADRAS
ఎం. సి. అప్పాసామి శెట్టి అండు కంపెని
14, జోన్స్ వీధి
మన్నడి ------------ మద్రాసు




# జండు బాలామృతము

క్షీణించి అనారోగ్యవంతులుగా నుండు బిడ్డలకిది యమృతమువంటిది.

వారి ఆకలిని వృద్ధిపరచి ఆరోగ్యము నిచ్చును.

పిల్లలకు దంతములు మొలుచునప్పుడు కలుగు నొప్పులను బోగొట్టును.

కాళ్లుచేతులు శుష్కించి కడుపు పెద్దదిగానున్న బిడ్డలకిది దివ్యౌషధము.

జీర్ణించిన జలుబు, దగ్గు మొదలగువాటినికూడ హరించును.

బుడ్డి ఒకటికి రూ. **0-10-0**

మీ పట్టణమునందలి జండూ సబ్ ఏజంట్లవద్ద దొరుకును.

బెజవాడ: చంద్రమౌళీశ్వర్ అండు కో.
మచిలీపట్నం: కె. వి. మాణిక్య రావు.
నెల్లూరు: ఆర్యన్ ఫార్మసీ
తెనాలి: శ్రీకృష్ణా ఫార్మసీ స్టోర్సు.

ఒంగోలు, తాతా జాలయ్య శ్రేష్ఠి.
గుంటూరు: మెడికల్ & ఆప్టికల్ ఎంపోరియము.
పెద్దాపురము: వేలు మెడికల్ స్టోర్సు.

విశాఖపట్నం: నీలం అండు కో.
జగ్గయ్యపేట: గ్రాండ్ మెడికల్ స్టోర్సు,
నంద్యాల: రాజ పెద్దసుబ్బారాయుడు శెట్టి
రాజమండ్రి: ఈశ్వర్ దాస్ అండు కో.

లేనియెడల రాజధాని ఏజంట్లవద్ద దొరుకును.

## దామోదర్ అండు కో., 78, చైనాబజారు, మదరాసు.

---

## టి. సి. ఎన్. గోల్డన్ మెటల్ నగలే

స్త్రీల కన్నివిధాల అలంకారానికి తగినవి

**2 సం||లు గ్యారంటీ: కాంతిలోను, వన్నెలోను,**

బంగారుగాజుల కేమాత్రము తీసిపోవు. నలుపెక్కవు



పెద్దసైజుగాజులు 2 ఇంచి మొదలు పైబడినవి జత 1-కి రూ 3-0-0

మధ్యమసైజు 1¾ ఇంచి మొదలు 2 ఇంచిలకు లోగా జత 1-కి రూ 2-8-0

బేబీసైజు 1¾ ఇంచికి లోబడినది జత 1-కి రూ 2-0-0

వి. పి. ఖర్చులు 1 జత మొదలు 6 జతలవరకు రూ 0-8-0

మా చక్కని బొమ్మలక్యాటలాగు ఉచితము

గాజులకు ఆర్డరుచేయువారు తాము వుపయోగించెడు గాజులలో చుట్టుకొలతను సిరాతో మార్కుచేసి పంపవలయును, లేక అడ్డుకొలత పంపవలయును.

N. B:—మీరు వ్రాయు ఆర్డరుజాబులయందు ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచిక పేరు నుదహరించిన మాధరలమీద రూపాయకు 1 అణావంతున తగ్గించబడును.

## టి. సి. నాగలింగప్ప అండు కో.,

నెం. 280, వాల్టాక్సురోడ్, పార్కుటవున్ పోస్టు, మదరాసు.

---

గ్యారంటీమందు

## కుష్టము - తెల్లపొడలకు



కుష్టము, తెల్లపొడలు మున్నగు చర్మవ్యాధులవలన బాధపడుచు ఎన్నిమందులను వాడినను ఎన్ని ఇంజక్షనులను తీసుకొన్నను నయముకాక నిరాశచెందినవారికి లెప్పర్ స్పెషలిస్టు పండిత [illegible]పర్ణ కవిరాజగారి మందు అమోఘముగా గుణమొసంగినది. ఉత్తరప్రత్యుత్తరములను ఆంగ్లమున వ్రాసిపంపుడు. ఉచితముగా పంపుగ్రంథములకుగూడ దరఖాస్తులనుపంపుడు.

### ఉచిత సచిత్ర గ్రంథము

"బాధపడువారికి మార్గదర్శిని"

రెండవకూర్పు ఇప్పుడే వెలువడినది

ఈ నూతనకూర్పులో వ్యాధిలక్షణములు, ఉత్పత్తి, నివారణమున్నగు వివరములు గలవు. నవగ్రహముల దోషము కలుగకుండా తప్పించుకొను సాధనమిందు సూచింపబడినది. శాశ్వత యౌవ్వనమును కలుగజేయు రహస్యము లిందుగలవు. కుష్టము, తెల్లపొడలు, వివిధ చర్మవ్యాధులు, నపుంసకత్వము, అజీర్ణవ్యాధి, స్త్రీల వ్యాధులకు చికిత్సావిధానము ఇందుగలదు. గ్రంథముఉచితముగా పంపబడును.

Address:—
HOWRAH KUSTHA-KUTIR.
No. 1 Madhab Ghose Lane, Khurut - Dharmatola, Howrah
Branch:—40, Harrison Road, Calcutta.

ఇట్లు జలచర భూచర ఖేచర జంతు గిన మనుష్యజాతులు సృష్టింపబడి వులందు అనేక భేదములు గల్గినవి. సవి. ఈ విధానమే దశావతారము




బృహద్విష్ణు పురాణమునందు,

> స్థావరం వింశతే ర్లక్షం
> జలజం నవలక్షకమ్।
> కూర్మాశ్చ నవలక్షంచ
> దశలక్షంచ పక్షిణః।
> త్రింశల్లక్షం పశూనాం చ
> చతుర్లక్షం తు వానరాః।
> తతో మనుష్యతాం ప్రాప్య
> తతః కర్మాణి సాధయేత్॥

స్థావర జాతులు ౨౦ లక్షలు, జలచరములు ౯ లక్షలు, స్థలజలోభయచరములు ౯ లక్షలు, ఖగములు ౧౦ లక్షలు, పశుజాతులు ౩౦ లక్షలు, వానర జాతులు ౪ లక్షలు, అనంతరము అత్యుత్తమమైన మోక్షమును సంపాదింపగలిగు మత్స్య (జలచర), కూర్మ (స్థల జలచర), వరాహ (వనచర - ఏనుగ, గేండామృగమువగైరా), నారసింహ (అర్ధపశు, అర్ధమనుష్య), వామన ('పిగ్మి' జనాంగములు), దశరథరామ, బలరామ, పరశురామ, కృష్ణ, బుద్ధ, కల్కి యనుటయందు సూచింపబడి యున్నదని యూహింపవచ్చును.

ఇది యెట్లుండినను మనుష్యశాస్త్ర ప్రకారము ప్రపంచమునందు మూడు ముఖ్యజనాంగము లున్నవి:

(౧) ఊర్ణకేశములు, కృష్ణత్వక్కు, విస్తృతనాసికములు, లంబకపాలములు గలవారు ఆఫ్రికా ఓషియానియాభాగములందు,

(౨) కృష్ణవర్ణ కేశములు, శ్వేత త్వక్కు, దీర్ఘనాసికలు, వృత్త నేత్రములు గలవారు,

(3) మంగోలాయిడ్ జనులు విస్తృత కపాలములను, ధనురాకార నేత్రములను, పీతవర్ణచర్మములను గలవారు చీనా జపాన్ కొరియ ఇత్యాది దేశములందు.

## ౨

ప్రపంచమున ప్రథమ సంస్కృతికి మూలకారణమయినవారు ఆర్యులా అనార్యులా? శ్వేత జనాంగమునందు రెండుతెగ లున్నవి. నార్డిక్ వంగడమువారు దీర్ఘదేహులు, నీల వర్ణములగు కన్నులు గలవారు, తామ్రవర్ణ కేశములుగలవారు. మెడిటెరేనియన్ జనులు మధ్యపరిణామ దేహులు, కృష్ణకేశములను, వృత్త నేత్రగోళములను, తామ్రవర్ణచర్మము గలవారు. చారిత్రక యుగమునకు పూర్వము మానవసంస్కృతికి పునాదివేసిన క్రొమాగ్నొన్, గ్రిమాల్డి, ప్రెడ్మోస్ట్, కూంబ్ షాపెల్ జనులు ఈ మెడిటెరేనియన్ వంగడమునకు చేరినవారు. వీరే ప్రాచీన సుమేరియన్, ఈజిప్ట్ సంస్కృతులకు కారణభూతులు. వీరే మనహిందూదేశ పూర్వ సంస్కృతియగు హరప్పా, మొహెంజోదారో సంస్కృతులకు కారకు లని కొందరు వాదించుచున్నారు. వీరే ఆధునిక యూరోప్ జనాంగములకు మూలపురుషులు. కాలక్రమముగా ఇతర జనాంగముల వారికి వీరితో దేహసంబంధము గలిగి వారు సంకరజాతులవారైరి. యహూదులుకూడ ఈ వంగడమునకు చేరిన

వారే. నార్డిక్ సంగడమువారు ప్రపంచమునందు ఏ సంస్కృతికైనను మూలపురుషులు గారు. విస్తృతకపాలములుగల శ్వేతజాతులు ఆల్పైన్ ఇరానియన్, ఆర్మినాయిడ్స్, దినారిక్ అనుసంగడములుగ విభజింపబడినారు. యూరోప్ ఖండములో శుద్ధజాతులు లేనేలేవు. ఇండో - ఇరానియన్, ఇండో - జర్మన్, ఇండో - యురోపియన్ ఇత్యాది నామములచే వ్యవహరింపబడు జనాంగములందు భాషాసామ్య మున్నదే కాని జాతిసామ్యము లేదు. జర్మనీ జనులు ఇంగ్లిషు జనులు ఒక్కరేనా ? వీ రిద్దరికి రక్తసంబంధము అత్యల్పము. గత యుద్ధకాలమునందు జర్మనులు తామే శుద్ధనార్డిక్ - ఆర్యజనుల మనియు, ఇంగ్లీషువారు ధనాశచే సంకరజాతులవారయిరనియు నమ్ముచుండిరి. నార్డిక్ జనులు శీతవలయమునందు సముద్రపరిసర ప్రాంతములం దుండినవారు. వీరు పర్వత ప్రాంతీయులగు ఆల్పయిన్ జాతితో సంబంధములు చేసిరి. జర్మన్ జనులు ప్రాయశః ఆల్పయిన్ జనాంగము వారు. ఇంగ్లండులో ప్రాక్ - శిలాయుగమునందు మెడిటెరేనియన్ జను లుండిరి. అనంతరము ఆల్పయిన్ జనులు ఇంగ్లండుకు వలస వచ్చిరి. కాలక్రమముగ బెల్జి, డేన్, ఆంగ్లో - సాక్సన్, నార్మన్, గైల్ జనులు వచ్చి చేరిరి. ఇట్లు ఆధునిక ఇంగ్లీషుజనులు జర్మనులు సంకరజాతులే కాని శుద్ధజాతులు కారు. ఈ జాతిసాంకర్యము యూరోపునందేగాక అన్ని దేశములయందును కలదు. దానిచే స్థూలముగా జనాంగములను జాతులుగా విభజింపవచ్చునే గాని, ఒక్క వ్యక్తిని దీసికొని వీడు ఈ జాతికి జేరినవా డని నిర్ధరించుట అసాధ్యమైన కార్యము. ప్రొఫెసర్ లోమ్బ్రొ అను విద్వాంసుడు కపాల ప్రమాణముల ననుసరించి జాతి నిర్ధారణము చేయుట కాని, బుద్ధిశక్తి నిర్ధరించుట కాని అసాధ్య మని చెప్పినాడు. అయినను మెడిటెరేనియన్ జనులకు కపాలముల ముందు భాగము అధికమగుటచేతను ఆల్పయిన్ జనమునకు వెనుకటిభాగ మధికముగ నుండుటచేతను కొన్ని వ్యత్యాసములు సహజముగ నుండును.

- (౧) వెడ్డిడ్
  - గాండిడ్
  - మ్యాలిడ్
- (౨) మెలానిడ్
  - దక్షిణ మెలానిడ్
  - కోలిడ్
- (౩) ఇండిడ్
  - గ్రాసెల్ ఇండిడ్
  - ఉత్తర ఇండిడ్

ఇండియా దేశమునందు నిట్లే అనేకజనాంగము లున్నవి. రిస్లేపండితుడు భరతఖండమునందు ఆర్యులు ఆర్యద్రావిడులు, ఆల్పయిన్, మంగోలాయిడ్స్, ముండ-మాన్ఖ్మేర్, శుద్ధద్రావిడ, ప్రాగ్ద్రావిడజాతు లున్నవని నిర్ధరించియుండెను. బేరన్ వాన్ ఐక్స్టెడ్ అను జర్మను పండితుడు భరతఖండజనులను ఈ రీతిగా విభాగించినాడు.

మొదట నీగ్రో జాతీయులగు మ్యాలిడ్ - మెలానిడ్ జాతు లుండినవి. అనంతరము ఉత్తరదేశము నుంచి గాండిడ్ జనులు వచ్చిరి. వీరితో ఇండిడ్ జనులు సంబంధములు చేసిరి. ఈ జాతులేకాక పెలియో-మంగోల్లాయిడ్స్, తురానిడ్, ఓరియంటలిడ్ మాన్ఖ్మేర్, హూణ, తుర్కి-మహమ్మదీయులు వచ్చి కలసిపోయిరి వీరుకాక పోర్చుగీస్, డచ్, ఫ్రెంచ్, ఇంగ్లీష్, జర్మన్ జనులు ఆధునికకాలమున భరతఖండమునకు వచ్చి చేరినారు.

## 3

ఆర్యు లెవరు, ద్రావిడు లెవరు, ప్రాగ్జను లెవరు ? ప్రాగ్భరతఖండ నివాసులలో ముండ, కోల్, సాంతాల, ముండారి, భూమ్జి, బిర్హోర్, కోద, హో, తురి, అసురి, కోరువ సవర, బైగ, ఖైన, భింజ్వార్, మొదలగుజాతులు చేరియున్నారు. వీరి భాష ఆస్ట్రో - ఏషియాటిక్ వంగడమునకు చేరినది. ద్రావిడజనాంగములో ఒరవన్, గాండ్, కంధ్, కురుభ్, భారియా, హాల్బ, లోద, హాళీపైక, కురుబ, కురుంబ, ఇరుళ, బంజార, లంబాణి, డోంబ, జెట్టి, మాదిగ, నాగజాతులు చేరినవి. వీరిభాష ప్రాగ్ద్రావిడభాష. థర్స్టన్ పండితుడును, ఐక్స్టెడ్ పండితుడును శుద్ధ ఆర్యజను లనగా నంబూదిరి, కనూజియ, ఆంధ్రబ్రాహ్మణులే అని నిర్ధరించినారు. తమిళబ్రాహ్మణులందు అనార్య సంబంధము, మహారాష్ట్ర బ్రాహ్మణులందు తురానియన్ సిథియన్ సాంకర్యము గలదు.

| | సరాసరి సెఫాలిక్ ఇండెక్స్ |
|---|---|
| తమిళబ్రాహ్మణులు ... | ౭౪.౨ |
| పట్టల్ ,, ... | ౭౪.౫ |
| మహారాష్ట్రదేశస్థ ... | ౭౭.౦ |
| మాధ్వులు ... | ౭౮.౦ |
| కర్ణాటక స్మార్తులు ... | ౭౮.౦ |

ఇట్లు బ్రాహ్మణులలోకూడ శుద్ధ జాతి లేనప్పుడు ఆర్యు డెవడో, అనార్యు డెవడో నిర్ధరించుటకు సాధనములు మొదలేలేవు. ఇంతేగాక ఆర్య ద్రావిడభేదమును భాషాపరముగను, సంస్కృతిభేదపరముగను సాధించుటకు వీలు లేదు. ఆర్యసంస్కృతికిని, ద్రావిడ సంస్కృతికిని గల భేదమును కొందరిట్లు చెప్పుచున్నారు.

౧. ఆర్యులు స్త్రీకి స్వాతంత్ర్య మీయలేదు; ద్రావిడులలో స్వాతంత్ర్యము హెచ్చు.

౨. ఆర్యులు బాల్య వివాహమును, ద్రావిడులు ప్రౌఢావివాహములను చేయుదురు.

౩. ఆర్యులు బ్రహ్మచర్య నియమము ననుసరింతురు; ద్రావిడులలో ఈ కట్టు లేదు.

౪. ఆర్యులలో దాంపత్య విచ్ఛేదము లేదు. ద్రావిడులలో నుండును.

౫. ఆర్యులలో వితంతూద్వాహము లేదు. ద్రావిడులలో గలదు.

౬. ఆర్యులలో వరదక్షిణపద్ధతియు, ద్రావిడులలో కన్యాశుల్కపద్ధతియు గలదు.

౭. ఆర్యులు శాకాహారులు; ద్రావిడులు మాంసభోజనులు.

౮. ఆర్యులలో ప్రాణిహింసాపూర్వక యజ్ఞములు లేవు. ద్రావిడులలో పశువులను గ్రామదేవతలకు బలిపెట్టుదురు.

౯. ఆర్యులు విగ్రహారాధకులు; ద్రావిడులు విగ్రహపూజ చేయరు.

౧౦. ఆర్యులు పురుషదేవతలను, ద్రావిడులు మాతృదేవతలను పూజింతురు.

౧౧. ఆర్యులలో తండ్రికి, ద్రావిడులలో తల్లికి ప్రాధాన్యము.

౧౨. ఆర్యులలో పురోహితులావశ్యకము, ద్రావిడులలో లేదు.

౧౩. ఆర్యులు చాతుర్వర్ణ్యనియమబద్ధులు, ద్రావిడులు కారు.

౧౪. ఆర్యులు శ్రాద్ధములు పెట్టెదరు, ద్రావిడులు పెట్టరు.

౧౫. ఆర్యులందు శవదహనము, ద్రావిడులలో ఖననము గలదు.

౧౬. ఆర్యులు అగ్నిపూజకులు. ద్రావిడులు అనగ్నిసంస్కారములు చేయుదురు.

౧౭. ఆర్యులు అనేకదేవతాపూజకులు. ద్రావిడులు ఏకదేవతాప్రాధాన్యవాదులు.

౧౮. ఆర్యులు వేదములను, ద్రావిడులు ఆగమములను తాంత్రికాచారములను అనుసరింతురు.

౧౯. ఆర్యులు జ్ఞానకర్మమార్గములను, ద్రావిడులు భక్తిమార్గము ననుసరింతురు.

౨౦. ఆర్యులు పంచకచ్ఛ ఉపవీతి ప్రాచీనావీతి నివీతి ఉత్తరీయములను రవికెలను ధరింతురు. ద్రావిడులు ధరింపరు. ... ఇత్యాది.

ఇవన్నియు పండితంమన్యులచే కల్పితములైన యూహాలే యగుటచే ఉపేక్షణీయములు. కొందరు శివుడు అనార్యదేవుడనియు,లింగపూజ తాంత్రికమనియు, మరికొందరు కృష్ణుడు రాముడు నల్లవారగుటచే అనార్య దేవత లనియు పిచ్చిపిచ్చిగా వాదములు చేయుచున్నారు. శివుడు తెల్లవాడు, బలరాముడు లక్ష్మణుడు తెల్లవారు-వీ రార్యు లెందుకుకారు? కాళి అనార్యదేవత, గౌరి ఆర్య దేవతయా ?

పార్జిటర్ పండితుడు పురాణములను విమర్శించి ఇంకొక వాదము నారంభించెను. బ్రాహ్మణులు ఆర్యులు కారు. క్షత్రియులే ఆర్యులు. విష్ణ్వవతారములలో ముఖ్యమైనవి క్షత్రియజాతికి చెందినవే యగుటచేతను, బ్రాహ్మణఋషులు పంచాగ్నివిద్య మొదలగు వేదవిద్యలను క్షత్రియుల నుండి నేర్చికొనుటచేతను, క్షత్రియులే ఉత్తములు. పురాణములలో వంశానుచరితమును పరిశీలించి చూచితిమేని చంద్రవంశీయులగు ఐల సంతతివారు శుద్ధ ఆర్యులు. సౌద్యుమ్న వంశమువారు ముండ - మాన్ ఖ్మేర్ జాతిలోనివారు. సూర్యవంశీయులగు మానవులు ద్రావిడు లని నిర్ధరింపవచ్చును. వ్యాడెల్ మహాశయుడు ఈజిప్ట్ సుమేరియన్ జనులు ఆర్యులనియు, వారే హిందూదేశమునకు వచ్చి సింధుసంస్కృతికి కారకులయిరనియు చెప్పుచున్నాడు.

డాక్టర్ ప్రాణనాథులు బ్రాహ్మణులు ఈజిప్ట్ దేశమునుండి వచ్చిన ఆర్యులనియు, ఋగ్వేదము ఈజిప్ట్ దేశములో పుట్టినదనియు అభిప్రాయపడుచున్నారు.

సింధుసంస్కృతి ఆర్యులదా, అనార్యులదా? ఆర్యసంస్కృతియని వ్యాడెల్, ప్రాణనాథులును, ఈ వ్యాసలేఖకులును అభిప్రాయ పడుచున్నారు. అయితే డాక్టర్ మార్షల్, హిరాస్ మొదలగువారు అది ద్రావిడ సంస్కృతి యనియు, వారిలిపి, భాష ప్రాగ్ద్రావిడమనియు వాదము నారంభించినారు. హరప్ప, మొహెంజోదారో నివేశనములందు దొరకిన అస్థులను పరిశీలించితిమేని అచ్చట ఆల్పయిన్, మంగోలాయ్డ్, ఆర్మినాయ్డ్, మెడిటెరేనియన్ జనాంగములవారందరు నుండిరని చెప్పవలెను. సింధుజనులభాష ఈజాతికి చేరిన దని దృఢముగా చెప్పుటకు సాధ్యముకాదు. శుద్ధ సంస్కృతమని ప్రాణనాథ్, సుమేరియన్ భాషయని వ్యాడెల్, ద్రావిడ భాషయని హీరాస్, చీనాభాషయని మరి కొందరు వాదించుచుండుటచే సింధుసంస్కృతి ద్రావిడసంస్కృతియే యని చెప్పుట సాహసము. ఆర్యులు హిందూదేశీయులే. పాశ్చాత్య ప్రాంతములనుండి వలసవచ్చినవారని యూహించుటకు బలమైన యాధారములు లేవు. కనుక ద్రావిడసంస్కృతి ఆర్యసంస్కృతి కుత్కృష్టము, ద్రావిడులే స్వదేశీయులు, ఆర్యులు పరదేశీయులు అనువాదము నిరాధారమయినది.

ఆర్యభాష వేరు, ద్రావిడభాష వేరు అను వాదమును కాల్డ్వెల్ పండితుడు ముందరికి తెచ్చెను. పంచగౌడభాషలు సంస్కృతజన్యములనియు, పంచ ద్రావిడభాషలు ఆదిమ ఆస్ట్రో - ఏషియాటిక్, లేక, ఆది ద్రావిడ భాషాజన్యము లనియు భాషాశాస్త్రజ్ఞులు కొందరు చెప్పుదురు. ద్రావిడభాషలందు తమిళు, మలయాళం, తుళు, కొడగు, తోద, కోత, కన్నడ, కురుఖ్, మల్టో, కొంది, కొలామీ, తెలుగు, బ్రాహ్వి భాషలు చేరియున్నవి. ఇవియన్నియు దార్దిక్ భాషాజన్యములనియు, పిశాచ జనులభాషలనియు డక్టర్ చిలుకూరి నారాయణరావుగారును, ఓరుమళ్ళ రాజగోపాలరావుగారును వాదించుచున్నారు. గ్రియర్‌సన్‌గారు పాళీ భాషావిశేషమే పైశాచి యనిరి. డాక్టర్ నారాయణరావుగారు పిశాచ జనులు సింధుప్రాంతమున నుండిరనియు, వీరు పూర్వదేశములగు నేపాళ, మగధ, గౌడ దేశములకు పోయి ఆయాభాషలకు మూల పురుషు లయి రనియు, వీరే దక్షిణ దేశములకు వచ్చి ద్రావిడభాషా విస్తారమునకు కారణభూతు లై రనియు అభిప్రాయపడుచున్నారు. పైశాచి - దార్దిక్ భాషలు వేదభాష లగుటచే వేదభాషయే ద్రావిడభాషలకును మూలము. ఇట్లు భరతఖండముననుండు భాష లన్నియు ఒక్క వేదభాషాజన్య మనియే చెప్పవలెను. ద్రావిడులకును సుమేరియన్, బ్యాబిలోనియన్ జనులకును సంబంధము లే దని ఖండితముగ చెప్పవచ్చును. జైనులుకూడ ఆంధ్ర ద్రవిడ కర్ణాట భాష లన్నియు సంస్కృతభాషా జన్యము లనియే నమ్ముదురు. కర్ణాటక శబ్దానుశాసనమునందు భట్టాకలంకుడు ఇట్లు చెప్పియున్నాడు:

" అనేక దుఃఖ దావస్కంధానుబంధ సంసార ఘోరాటవీ పర్యటన పరిక్షేప చేక్షిప్యమాణ వరాకోద్ధరణ పరిణతాంతఃకరణ స్వభావ భావిత వ్యస్త సమస్త దృగ్విశుద్ధ్యాది భావనా సంభావిత తీర్థకరపుణ్య ప్రభావావిర్భావిత శ్రావ్య దివ్య నవ్యవాణీ సమస్తాః కర్ణాట కాన్ధ్ర మగధ ద్రవిళ మాళవాది నానాజన పదనిః తైః దేవ మనుష్యాది జాతివికల్పైశ్చ నానాత్వం ప్రాప్తాః,......నను ఏకస్యా ఏవ భగవద్వాణ్యా నానాభాషాత్మకత్వం కథ ముపపద్యత ఇతిచేత్, దివ్యస్వనే రచిన్త్య మహిమా స్వభావః, యథా ప్రావృట్కాలే నభస్థలా త్పతిత మాంతరిక్షం జల మేక మవ్యక్తరసమపి లవణకృష్ణోష రాది క్షేత్రగతం సత్ తదేవ లవణ మధుర కషాయ రసభేద భిన్నం నానాత్మక మనుభూయతే ... తథా భగవద్భాషాపి స్వోత్పత్తిసమయే సముద్ర ఘోషవత్ అవ్యక్తైకభాషారూపాపి తత్త చ్ఛ్రోతృదేశం ప్రాప్తా సతీ తత్తద్భాషాత్మనాపరిణమతి, విచిత్రశక్తిత్వాత్"

హైందవులందును సూక్ష్మమైన అవ్యక్తమైన సచ్చిదానంద స్వరూపమైనవాక్కు పరా పశ్యంతీ మధ్యమా వైఖరీ విధానముగా వ్యక్త మగు నని నమ్మిక గలదు.

సూక్ష్మా వాగనపాయినీ పరచిదా
నందాత్మికా యా పరా
యా పశ్యం త్యపి బర్హిణోదురసవ
ద్వర్ణా న్బహూన్ బిభ్రతీ,

సంజల్పాత్మకతయా వికల్పశబలా
యా మధ్యమా తా బహిః
విద్యాతీర్థమునే శ్రీరూపణవిధా
క్వాస్యేపునర్వైఖరీ? ॥

ఈవిధముగా నే దృష్టినుంచి విమర్శించినను ద్రావిడవాదము నిల్చుట లేదు. బ్రాహ్మణద్వేషజన్యమైన ఈద్రావిడవాదము పామరజన మనోరంజనార్థమే పుట్టినది. రాజకీయవిషయములయందు ఈవిధమైన విప్లవము తెచ్చిపెటి స్వార్థపరులైన వారు హిందీభాషకును, సంస్కృతమునకును విరుద్ధముగా వాదించుచు, జనులను ముగ్ధులుగ చేయుచున్నారు. హిందూసంస్కృతిలో జాతిద్వేషముల కవకాశము లేదని వీరికి తెలియదు. సనాతన సంప్రదాయమందు సకలవర్ణాశ్రమజాతి మతముల సామరస్యము సిద్ధమైనది. ఈసిద్ధాంతమే శివకేశవాభేదరూపమగు హరిహరేశ్వరునియందు దృష్టాంతీకరింపబడి యున్నదని తెలిపి విరమించుచున్నాను.

మారరమణ ముమారమణం
ఫణితల్పం ఫణాధరాకల్పమ్,
మురమథనం పురమథనం
వందే బాణారియుగ బాణారిమ్॥



# యువజనులు ఎవరు ఏవృత్తికి అర్హులో నిర్ణయించడం ఎట్లా?

కొంచెర్లకోట సత్యనారాయణమూర్తి

"చివరకు ఇంగ్లాండును గురించి మనం ఆలోచించవలసినసంగతి "ఆ దేశపు ఎగుమతులూ దిగుమతులూ ఏ విధంగా వున్నాయి?" అని కాదు; "అచ్చట ఏడాది కెన్ని నౌకలు తయారవుతున్నాయి?" అని కాదు; "ప్రతియేడూ ఆ దేశంలోవున్న గనులలోనుంచి ఎన్నిటన్నుల రాక్షసి బొగ్గును తవ్వి ఎత్తుతున్నారు?" అని కాదు:

"ఇంగ్లీషుప్రజ ఏ విధంగా అభివృద్ధి చెందుతోంది?" అన్నదే ప్రధానవిషయం"

—జే. బి. ప్రీస్ట్లీ.

పల్లెటూళ్ల సామాన్యజీవితం, కుటీరపరిశ్రమలు, కుటుంబకట్టుబాట్లు—వీటి పలుకుబడి క్షీణించి, పట్నవాసపుకాపురాలు, మరపరిశ్రలు, విదేశవర్తకాలు, ఆధునికవిజ్ఞానం, సైన్సు, ప్రయాణసౌకర్యాలు, వార్తాసౌకర్యాలు అపారంగా అభివృద్ధిచెందుతున్నాయిగాని వాటితోబాటు వ్యక్తియొక్క జీవనోపాధికీ, సౌఖ్యానికీ అవకాశాలు హెచ్చడానికి బదులు క్షీణిస్తున్నాయి. పశ్చిమరాష్ట్రాలలో చాలాచోట్ల వ్యక్తుల అభివృద్ధికీ సంఘఅభివృద్ధికీ కావలసిన ఏర్పాట్లను ప్రభుత్వమే చేయవలసివస్తోంది. ఇంతెందుకు? దేశంలోవున్న బిడ్డలను పెంచి, విద్యాబుద్ధులు నేర్పి, తగినవృత్తులలో ప్రవేశపెట్టే బాధ్యత కూడా తలిదండ్రులమీదగాక ప్రభుత్వంమీదనే పడుతోంది. "ఆవిషయంలో తల్లిదండ్రులకన్న ప్రభుత్వాని కెక్కువ తెలుసునా?" అని మనం అనుకోవచ్చును. కాని ఇప్పటి క్లిష్టపరిస్థితులలో తలిదండ్రులు పూర్తిగా నిస్సహాయులైపోతున్నారు. ప్రతి దేశంలోను ఆర్థికపరిస్థితులు ఏరోజు కారోజు మారిపోతున్నాయి. యుద్ధప్రయత్నాలు, జాతీయభావాలు, సైన్సు పరిశోధనలు, ఫాషన్లు, వార్తాప్రయాణ సౌకర్యాలు—ఇవి అభివృద్ధియైనకొద్దీ, వృత్తివ్యాపారాలు కూడా మారిపోతున్నాయి. పాతవృత్తులుపోయి కొత్తవి ఏర్పడుతున్నాయి.—ఈ ప్రవాహం వడికి వ్యక్తులు ఆగలేక వెనకబడిపోతున్నారు. ప్రతిదేశంలోను దుర్భరమైన నిరుద్యోగ సమస్య యేర్పడింది. పనిపాటులలో నేర్పుగాని, అభిరుచిగాని, నూతన పరిస్థితులకు అలవాటుపడేశక్తిగాని ఇప్పటి యువకులకు లేవు. ప్రతియేడూ స్కూళ్లలోనుంచి బైటపడుతూవున్న లక్షలాది విద్యార్థులను ఏవో వృత్తులలో ప్రవేశపెట్టడం అవసరమవుతోంది. పశ్చిమరాజ్యాలన్నిటిలోను ప్రభుత్వం యీ కార్యక్రమాన్ని విరివిగా సాగిస్తోంది. ప్రతి దేశంలోను ప్రభుత్వసహాయంతో ఎంప్లాయిమెంటు సంస్థలు వెలిశాయి. వాటితోడ్పాటువల్ల వృత్తినిరూపణ ఉద్యమం బాగా అభివృద్ధి చెందుతోంది. ఈమధ్యనే స్కూళ్లు కూడా ఈ వుద్యమానికి సహాయంచేయడం ప్రారంభించాయి. అదివరకు, 'వృత్తు'లంటే యేమిటో, ఏవృత్తులకు ఎట్టి సమర్థత లుండాలో వట్టి స్కూలు మాష్టర్ల కేమి తెలుసును అన్న నిరసనభావం వుండేదిగాని ఇప్పుడిప్పుడది నశిస్తోంది. స్కూలుమాష్టర్లుకూడా ఈ వుద్యమానికి ఎంతో సహాయం చేయగలరు అని స్పష్టమైంది.

నేడు ప్రతిదేశంలోను జాతీయ అభిమానాలు, అంతర్జాతీయ స్పర్ధలు, విరోధాలు, ప్రబలంగా వున్నాయి. వాటితోబాటు నిరుద్యోగసమస్యా, వృత్తి నిరూపణ ఉద్యమం కూడా అభివృద్ధి చెందుతున్నాయి.

ఏవిధంగా? ఇంగ్లాండు, జర్మనీ, ఇటలీ, స్విట్జర్లాండు దేశాలకు కావలసిన ఆహారపదార్థాలు ఆ దేశాలలో ఉత్పత్తికావటం లేదు; హాలండు, డెన్మార్కు, అమెరికా సంయుక్తరాష్ట్రాలు ఆహారపదార్థాలను తమ అవసరాలకు మించి అపారంగా ఉత్పత్తి చేస్తున్నాయి. ఇటలీకి రాక్షసిబొగ్గు కావాలి; ఇంగ్లాండు సప్లయిచేయగలదు. ఇంగ్లాండుకు నూనె కావాలి; రష్యా సప్లయిచేయగలదు. ముడిలోహాన్ని ఫ్రాంసు జర్మనీదేశాలు సప్లయిచేసేటట్టయితే, ఉత్పత్తియైన సరకులను రష్యాదేశం కొనేమాటవుంటే, స్విట్జరులాండుదేశం అన్నిరకాలైన యంత్రాలను తయారు చేయగలదు. కాని, సాధ్యమా?

అంతర్జాతీయవర్తకవ్యాపారాలకు వుండే ఆటంకాలను రద్దుచేసి, జాతిమతభాషావైషమ్యాలను రూపుమాపి, ప్రతిదేశంలోను ప్రజల జీవనప్రమాణాన్ని హెచ్చించగలిగితే లోకాన్ని ఇప్పుడు కలవరపెడుతూవున్న యీ చిక్కులు, సమస్యలు ఉండనే వుండవు. అంతర్జాతీయగౌరవాలు, మర్యాదలు, నమ్మకాలు నశించడంవల్లనే ప్రతిదేశానికీ యీ కష్టాలు సంప్రాప్తమయినాయి.

స్థూలదృష్టిలో, నేటి పశ్చిమరాజ్యాలు ప్రజాప్రభుత్వాలనీ, నిరంకుశాధికార ప్రభుత్వాలనీ రాజకీయంగా రెండురకాలుగా వున్నాయి. అందులో ప్రజాప్రభుత్వాల ఆదర్శాలు

ఈ మాదిరిగా వుంటాయి: తన అభిరుచుల ప్రకారం, సమర్థతల ప్రకారం, ఇష్టాయిష్టాల ప్రకారం అభివృద్ధి చెందడానికి సంఘంలో వున్న ప్రతివ్యక్తికి నిరాటంకమైన స్వేచ్ఛా, అవకాశమూ వుండాలి. అందుకు కావలసిన విద్యను నేర్పును సంపాదించడానికి తగిన అవకాశాలను ప్రజలకు సమకూర్చవలసిన బాధ్యత ప్రభుత్వానిది. ఇతర స్వాతంత్ర్యాలతో బాటు ఇష్టం వచ్చిన వృత్తులను అభ్యసించి వాటిలో ప్రవేశించడానికి స్వాతంత్ర్యమూ అవకాశమూ ప్రజ లందరికీ సమానంగా వుండాలి. వాటిని సమకూర్చే విధి కూడా ప్రభుత్వానిదే. అందువల్ల వ్యక్తులకూ జనసామాన్యానికి కూడా ఎంతో లాభం కలుగుతుంది.

నిరంకుశ ప్రభుత్వాధికారుల ఆదర్శాలు అవి కావు. వారి ఉద్దేశంలో వ్యక్తుల లాభం వేరు; సంఘ క్షేమం వేరు. వ్యక్తుల లాభాలతోపాటు సంఘ క్షేమం పెంపొందించడం ప్రభుత్వం యొక్క ముఖ్యధర్మం. వ్యక్తిస్వలాభం కోసం సంఘ క్షేమానికి రాష్ట్రాభివృద్ధికి వ్యతిరేకంగా ప్రవర్తింపరాదు. అంతేకాదు, రాష్ట్రంయొక్క ఆశయాలను, ఉద్దేశాలను ఆచరణలో పెట్టడంలో, పెంపొందించడంలో వ్యక్తి ఒక సాధన మాత్రుడేగాని, నిమిత్త మాత్రుడేగాని సర్వస్వతంత్రుడు కాడు. రాష్ట్రంయొక్క ఆదర్శాలను అభిప్రాయాలను ఆచరణలో పెట్టడంకోసం ప్రజలకు కావలసిన విద్యాబుద్ధులను ప్రభుత్వమే ఏర్పాటు చెయ్యాలి. అనుకూలమైన కార్యక్రమాలను ఏర్పాటుచేసి, ఆచరణలో పెట్టి నడిపించాలి. సంఘంమొత్తానికి లాభప్రదమైన కార్యక్రమం ప్రజ లొక్కొక్కరికికూడా లాభప్రదంగా వుండకతప్పదు. అట్లుండకపోయినా నష్టంలేదు. సంఘక్షేమం యెదుట, వ్యక్తిలాభం అంతముఖ్యమైన విషయం కాదు. ఆ కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టడంకోసం ప్రజలకు మిలటరీకి మోస్తరుగా కఠినశిక్షణ ఇయ్యాలి. అవసరమైతే ప్రజల స్వాతంత్ర్యాన్నికూడా అణచివేయవచ్చును. "వ్యక్తి స్వాతంత్ర్యమే అంత ముఖ్యమైన విషయమా?" అని మొన్న నే ఒక జర్మనుమంత్రి అడిగాడు. ఇవి నిరంకుశాధికారుల ఆదర్శాలు — కాని క్రియలోమాత్రం ప్రతిదేశమూ, అన్నివిషయాలలోను, ఈరెండింటిలో ఏదో వక ఆదర్శంక్రిందకు వస్తోందని కేటాయించి చెప్పడానికి వీలులేకుండా ఉంది. ఇంగ్లాండు, ఫ్రాంసు, అమెరికా సంయుక్తరాష్ట్రాలు పేరుకు ప్రజాప్రభుత్వాలన్నమాటే కాని ఇష్టం వచ్చిన పనిలో ప్రవేశించడానికి ఈ మూడుదేశాలలోను వ్యక్తికి సంపూర్ణమైన అవకాశాలులేవు; ధనహీనుడు తన కిష్టం వచ్చిన వృత్తిని అభ్యసించలేకపోతున్నాడు. ఇంగ్లాండు, ఫ్రాంసు దేశాలలో ఉన్నతవిద్యాసంస్థలలోను, వృత్తులలోను 'గొప్ప'వారికుండే అవకాశాలు సామాన్యులకు లేవు. ఆ 'గొప్ప'తనం డబ్బువల్ల వచ్చినదే. ఇంగ్లీషు 'పబ్లికు స్కూలులో' చదివే అదృష్టం ధనవంతులకే గాని సామాన్యులకు లేదు. ఇప్పుడిప్పుడు బీదవారు విద్యార్థివేతనాలద్వారా సెకండరీ స్కూళ్లలో విద్యాభ్యాసం చేస్తున్నారు. ఈ విధంగా ఇంగ్లీషు బీదవిద్యార్థులలో నూటికి సుమారు ౫౦ మందికి ఉచితంగా సెకండరీ స్కూలు విద్య లభిస్తోంది. చదువుకొనేవారికి డబ్బు లేకపోవడంవల్లనైతేనేమి, విద్యాధికారులకు బీదవారియెడల వుండే నిరసనభావంవల్లనైతేనేమి ఆక్సుఫర్డు, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాలలో సామాన్యులకు ప్రవేశం దొరకడమే లేదు. అట్టివారికి ఇంగ్లాండులో వున్న తక్కిన యూనివర్సిటీలలో కొంతవరకు ప్రవేశ [illegible] రుకుతోంది.

ఈ ఆటంకాలు మినహాయిస్తే ఇంగ్లాండు, ఫ్రాంసు, అమెరికా సంయుక్తరాష్ట్రాలలో ప్రజలు తమకు ఇష్టం వచ్చిన వృత్తులలో ప్రవేశించవచ్చును. ఇటలీ, జర్మనీ, రష్యా దేశాలలో ఆయాప్రభుత్వాల ఆర్థిక, సాంఘిక, రాజకీయ సిద్ధాంతాలు ప్రజల స్వాతంత్ర్యానికి అడ్డం వస్తున్నాయి. ఇంగ్లాండు, ఫ్రాంసు అమెరికాలలో ఆ విధమైన అవరోధాలు లేవు.

నేటి ఇటలీ, జర్మనీ, రష్యా దేశాలలో చెలరేగుతూవున్న నిరంకుశాధికారుల ఆజ్ఞలకు ప్రజలు ఎదురుచెప్పరాదు. ఆర్థిక, రాజకీయ విషయాలలో ఆప్రభుత్వాలు కఠినమైన నిర్బంధచర్యను అవలంబిస్తున్నాయి. వేలకు వేలు ప్రజలను తమ కిష్టంలేని వృత్తులలో బలవంతంగా ప్రవేశపెడుతున్నాయి. ఆనిర్బంధ విధానం ప్రజల దేశాభిమానాన్ని పురికొల్పడంతో ప్రారంభమై, కఠినశిక్షలతో ముగుస్తోంది. ప్రాచీన హిందూదేశంలో మోస్తరుగానే నేడు ఆదేశాలలో ప్రభుత్వం వృత్తినియమాలను ఏర్పాటుచేసి అమలులో పెడుతోంది. ఆనియమాలకు, నిర్బంధాలకు లోబడి ప్రజలు తమఇష్టం వచ్చిన వృత్తులలో ప్రవేశించవచ్చును. ఇందుకు జర్మనీదేశ వృత్తాంతం ఉదాహరణగా చెప్పవచ్చును. ప్రాచీన హిందూదేశంలో మోస్తరుగా నేటి జర్మనీలోకూడా, కొన్నివిషయాలలో ప్రజలకు కాలూ చెయ్యీ మెదల్పడానికి అవకాశాలు లేకుండా కట్టుదిట్టాలను, నిర్బంధాలను ప్రభుత్వం ఏర్పాటుచేసింది; కాని వ్యక్తుల అభివృద్ధియే, వారి క్షేమమే ఆకట్టుబాట్ల ప్రయోజనం; వారివిద్యావిధానంయొక్క ఆదర్శం. "యుద్ధానికి పూర్వం జర్మనీదేశంలో కులకట్టుబాట్ల ఆటంకాలవల్ల సామాన్యపు పనివాళ్లబిడ్డలకు ఉన్నతవిద్యావృత్తులలో గాని, గవర్నమెంటు ఉన్నతఉద్యోగాలలో గాని ప్రవేశం దొరికేదికాదు. విద్యాధికుల, సైన్యప్రొఫెసర్ల తరగతులలో చేరడానికైనా అర్హత లభించేదికాదు"[1].

నాజీప్రభుత్వం వచ్చినతర్వాత ఈవ్యత్యాసాలు చాలామట్టుకు నశించాయి. ఇప్పుడా

1. 'Vocational guidance through-out the world' by Keller and Viteles, 1937.

దేశంలో అధికారులు సిద్ధాంతంలో మాత్రమే కాకుండా ఆచరణలోకూడా కేవలం డబ్బునూ పుట్టుకనూమాత్రమే గౌరవం చెయ్యటం లేదు. భాగ్యవంతుడు కానీ, బీదవాడుకానీ, యూనివర్సిటీలో చేరడానికి ముందు ప్రతి విద్యార్థి విద్యార్థినీ ఆరునెలలకాలం ఏదో వకవిధమైన చేతిపని చెయ్యాలి. అదిగాక స్కూలు చదువులు ముగిసినతర్వాత ప్రతి విద్యార్థీ, విద్యార్థినీ ఒక యేడాదికాలం గ్రామాలలో పొలంపని చెయ్యాలి. వారు రాష్ట్రానికి చేయవలసిన సేవలు ఇవి. నిరుద్యోగసమస్యను తగ్గించడానికి ఇవి కొంతవరకు సాధనాలు. వాటివల్ల విద్యార్థులకు కూడా కొంతలాభం కలిగినప్పటికీ, వాటిని ఏర్పాటుచేయడంలో ప్రభుత్వంయొక్క ఉద్దేశం రాష్ట్రసేవగాని వ్యక్తుల లాభం కాదు. విచక్షణలేకుండా విద్యార్థులు అందరూ ఉన్నతచదువులకు పోకుండా నాజీ ప్రభుత్వంవారు అనేక ఆటంకాలను ఏర్పాటు చేస్తున్నారు. విద్యార్థుల ఆరోగ్యమూ, జాతి, సాంఘిక, రాజకీయాభిప్రాయాలూ నాజీపక్షానికి అనుకూలంగా వుండాలి; విద్యలోను పరిశ్రమలలోను, రాజకీయ, సాంఘికవిషయాలలోను ముందు ముందు జాతీయనాయకులు కాదగినవారుగా వుండాలి. యూనివర్సిటీలలో చేరగోరే విద్యార్థులమొత్తం సంఖ్యకు ప్రతియేడూ ఒకపరిమితిని ఏర్పాటు చేస్తున్నారు (౧౯౩౪ లో ౨౦,౦౦౦ మంది, ౧౯౩౫ లో ౧౫,౦౦౦ మంది, యీ విధంగా). విద్యార్థుల సంఖ్యలో విద్యార్థినులు పదింటి కొక్కరు చొప్పున మాత్రమే వుండాలి. నాజీపార్టీవారి పరీక్షలకాగ గలిగినవారిలో తెలివితేటలు లేనివారిని ఏరివేసి తెలివితేటలున్నవారికే ఉన్నతవిద్యకు ప్రవేశ మిస్తున్నారు. రష్యాను సోవియటు ఆదర్శాలంటే జర్మనులకు తలనొప్పేగాని క్రియలోమాత్రం ఈ రెండు దేశాలలో నిరంకుశాధికార ప్రభుత్వాలు ఇంచుమించు ఒక్క మోస్తరుగానే నడుస్తున్నాయి. పనివాళ్ల బాగుకోసమే సోవియటు ప్రభుత్వం రష్యాలో ఏర్పడింది. కాని ప్రభుత్వానికి నిరంకుశాధికారం వుంటేనేగాని ఆ ఆదర్శాన్ని ఆచరణలో పెట్టడం సాధ్యం కాలేదు. అక్కడకూడా వ్యక్తుల ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా సంఘక్షేమం కోసం ప్రజలను వివిధ వృత్తులలో నిర్బంధంగా ప్రవేశపెట్టి పనిచేయించవలసిన పరిస్థితులు ఏర్పడ్డాయి. నేడు రష్యాలో నిరుద్యోగ సమస్య లేదు. ప్రతివ్యక్తికి ఏవో పనిపాటులు దొరుకుతున్నాయి. ఎవరైనా తమ కీయబడ్డ పనిని నిరాకరించి, పని దొరకలేదని భిక్షిమెంచుకుని కూచుంటే వారికి సంఘబహిష్కారం తప్పదు. వారు ఖైదీలకన్న తక్కువ స్థితికి వస్తారు. మాస్కోనగరంవద్ద వున్న 'బాల్షివో' అనేఖైదీల సెటిల్మెంటులో ఖైదీలకుండే స్వాతంత్ర్యం చూస్తే ఆశ్చర్యం వేస్తుందని చూసినవారు వ్రాశారు. వాళ్లను ఖైదీలని పిలవడాని కెంతమాత్రం వీలుండదట. వాళ్లు చివర రోజులలో వారాని కొకసారి తమ యిళ్లకు వెళ్లి రావచ్చును; ఇష్టముంటే మాస్కో యూనివర్సిటీలో విద్యార్థులుగా చేరి చదువుకోవచ్చును. వాళ్లు జైలుకుతిరిగి ఎందుకు వస్తున్నారు? ఆదారినే ఎందుకు పారిపోవడం లేదు? జవాబు సులభంగా తెలుస్తూనే వుంది. ప్రభుత్వ మొక్కటే దేశంలో ప్రజలకు పనిచెప్పే సంస్థ. ప్రభుత్వమే యజమాని. ప్రతిరష్యనుకూ తాను రష్యనుపౌరుడనని చూపడానికి వకసర్టుకార్డు వుండాలి. అదిలేకపోతే అతడి కాదేశంలో ఏహక్కులూ వుండవు. రాజకీయంగా అతడు ఛండాలుడితో సమానుడు అవుతాడు ఖైదులోవున్నా బైటవున్నా అతడికి జీవనోపాధిని కల్పించగల సంస్థ ప్రభుత్వ మొక్కటే. ఇక అతడు పారిపోయే దెక్కడకు?

అమెరికా దేశంలో, సెకండరీస్కూళ్ల చదువులు ముగిసేవరకూ విద్య ఉచితం; చాలా చోట్ల అది నిర్బంధంకూడాను. అందువల్ల విద్యార్థుల జనసమ్మర్దం సెకండరీ స్కూళ్లలోనే అధికంగా వుంది. వృత్తినిరూపణ ఉద్యమం చాలామట్టుకు సెకండరీ స్కూళ్లలోనే అభివృద్ధిఅవుతోంది. ఇటలీ, జర్మనీ, ఫ్రాంసు దేశాలలో అల్లా కాదు. అక్కడ సుమారు ౧౪ ఏళ్లవయస్సులో ఎలిమెంటరీ స్కూలు చదువులను ముగించుకొని ఏవో పనులలో ప్రవేశింపగోరే విద్యార్థులకు, వృత్తి స్కూళ్లలో చేరి విద్యాభ్యాసం చేయగోరేవారికి, లేదా ఏవో వృత్తులలో ప్రవేశించి రోజుకు కొన్నిగంటల చొప్పున వాటికి సంబంధించిన వృత్తివిద్యలను అభ్యసింపగోరేవారికి, వృత్తినిరూపణ ఉద్యమం చాలా సహాయం చేస్తోంది. జర్మనీలో నాజీ ప్రభుత్వం ఏర్పాటు చేసిన సాంఘిక జాతీయ పరీక్షలకు ఆగగలిగిన విద్యార్థులకు ఇతర దేశాలలోకన్న ఎక్కువ సమర్థతతో వృత్తినిరూపణసహాయం లభిస్తోంది. కాని ధనంతోటి, పుట్టుకతోటి నిమిత్తం లేకుండా కేవలం తెలివితేటలనుబట్టి యువకు లందరకూ కూడా సమానమైన అవకాశాలు, ఇతర దేశాలలోకంటె స్విట్జర్లాండులో అధికంగా వున్నాయి. జాతి, జన్మ, ఐశ్వర్య వివక్షతలతో నిమిత్తంలేకుండా వృత్తిసమర్థతను సంపాదించిన యువకు లందరకూ ఆ దేశంలో సమాన అవకాశాలు కలవు. సోవియటు రష్యాలో అట్లా కాదు. మనిషి పుట్టడం, జీవించడంకూడా ఏదో వక వృత్తిని అభ్యసించడం కోసం, అందులో పనిచెయ్యడం కోసం అని వారి అభిప్రాయం. అది పనివాళ్ల రాష్ట్రం, పనివాళ్ల దేశం, పనివాళ్ల ప్రభుత్వం, పనివాళ్ల అధికారం. అక్కడ సంఘంలో పనివాళ్లకే గొప్ప, పనివాళ్లకే గౌరవం, పనివాళ్లకే మర్యాద, ఘరానాపదవి. వృత్తివిద్యా, యూనివర్సిటీ చదువులూ, ఉన్నత సాంకేతిక విద్యా, వృత్తినిరూపణ ఉద్యమమూ-అన్నీ పనివాళ్లలాభంకోసమే; వాళ్ల అభివృద్ధి కోసమే. కాని వ్యక్తిస్వాతంత్ర్యానికి, యథేచ్ఛకు, విరగబాటుకు ఆదేశంలో అవకాశాలు చాలా తక్కువ.

యూరపు ఖండంలో ప్రతిదేశంలోను యూనివర్సిటీలలో హెచ్చిపోతూవున్న విద్యార్థుల జనసమ్మర్దాన్ని గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నారు. ఈమధ్య ఈవిషయమై అంతర్జా

## యువజనులు ఎవరు ఏవృత్తికి అర్హులో నిర్ణయించడం ఎట్లా ?

తీయ విద్యార్థిసంఘంవారు రెండు రిపోర్టులను ప్రకటించారు. జర్మనీలో చేస్తూవున్నట్లుగా యూనివర్సిటీలలో చేరగోరే విద్యార్థులసంఖ్యను నిర్బంధంగా తగ్గించడంతోబాటు వృత్తి నిరూపణ ఉద్యమాలు అభివృద్ధిచేయడం కూడా అవసరమని వారు హెచ్చరించారు. ఇప్పటి ఉన్నత విద్యలను అభ్యసించినవారందరికీ ఉదరపోషణ సరిగా జరగటం లేదు. కాబట్టివిద్యార్థులు యూనివర్సిటీ లో ఉన్నత విద్యలకు మూగడం నిష్ప్రయోజనం. సంఘ పరిస్థితులు అతివేగంగా మారిపోతున్నాయి. కాని సెకండరీ స్కూలు చదువులు సంఘంతోపాటు మారటం లేదు. అవి వెనకబడి పోవడమే ఇంతమంది విద్యార్థులు చదువుల కోసం యూనివర్సిటీలలో మూగడానికి కారణం. ఇది ఆ రిపోర్టుల సారాంశం.

"ప్రజల జీవనోపాధికి దారిచూపగల శక్తి ఉన్నతవిద్యకు కలిగేటంతవరకూ, ఉన్నతవిద్యను అభ్యసింపగోరే విద్యార్థుల సంఖ్యను నిర్బంధంగా తగ్గించడం అవసరమే; కాని ఆతగ్గించడం వృత్తులగురించిన ఒకనిర్ణీత పదకాన్ననుసరించి జరగాలిగాని అధికారుల చిత్తవృత్తినిబట్టి కాదు.

"చాలా దేశాలలో, సంఘం సాంకేతికంగా అభివృద్ధి చెందుతూ వున్నంత వేగంగా స్కూలు చదువులు మార్పు చెందటం లేదు. ఉన్నత విద్యా సంస్థలలో విద్యార్థి జనసమ్మర్దం అధికం కావడానికి ఇదేకారణం. సెకండరీ స్కూళ్లు, కాలేజీలు, యూనివర్సిటీలు పాతపడి పోయిన అభిప్రాయాలను పట్టుకుని వేళ్లాడుతున్నాయి. అందువల్ల నిరుద్యోగ సమస్య అధిక మవుతోంది.

నిరుద్యోగ సమస్యను పరిష్కరించాలంటే యూనివర్సిటీలలో విద్యార్థుల జన సమ్మర్దాన్ని తగ్గించాలంటే ప్రతిదేశంలోను విద్యకు నిరుకైన ఒక కార్యక్రమం ఏర్పాటు చెయ్యాలి. విద్యార్థుల సాంకేతిక అభివృద్ధికి తగిన అవకాశా లేర్పడాలి"

వృత్తినిరూపణ ఉద్యమం కడచినవిరోపా యుద్ధంతర్వాత యూరోపుఖండమందంతటా వ్యాపించింది. అందుకు ముఖ్యంగా తోడ్పడ్డవారు మానసికశాస్త్ర వేత్తలు. తమ శాస్త్రంవల్ల లోకానికి చాలా ఉపకారం జరగడానికి అవకాశం వుందనీ, మానవ స్వభావం విషయమై చేయబడ్డ పరిశోధనలు ప్రజల ఆర్థికసమస్యలను పరిష్కరించడానికీ, వృత్తినిరూపణ ఉద్యమాలను ప్రోత్సహించడానికీ ఉపయోగపడుతాయనీ వారు గ్రహించారు. ౧౯౦౩ లోనే కేటల్ అనే మానసిక శాస్త్రవేత్త ఈవిధంగా వ్రాశాడు :

"మానవస్వభావాన్ని 'సైన్సు' గామాత్రమే కాకుండా కళగాకూడా పరిశోధించడం మా కర్తవ్యం ... ఇనుమును తీసుకొని ఉక్కుగా మార్చి, ఆఉక్కుకు పదునుపెట్టి కత్తిని తయారుచేసినట్లే మానసిక ప్రపంచకంలో ప్రతిపనికీ తగినమనిషిని ఏరి, అతడికి తగిన విద్యను నేర్పి, తర్ఫీదు చెయ్యాలి."

"యువకుడికి అనుకూలమైన వృత్తిని నిరూపించడం, ప్రపంచమనేసముద్రంలో జాగ్రత్తగా తన జీవితనౌకను నడుపుకోడానికి సముద్ర పటాన్ని అతడిచేతిలో పెట్టడంవంటిది. నీటిమీద అతడుపోగలదూరం అతడి బలంమీదా, సమర్థతమీదా, ధైర్యంమీదా, ఇతరసాధన సంపత్తిమీదా ఆధారపడి వుంటుంది. ఎక్కువ అనుభవమూ, విజ్ఞానమూగలనావికుడు మిక్కిలి దూరాన ఉన్న రేవును చేరుకోగలడు ; అపాయాలులేనిదారులలో తననౌకను నడుపుకోగలడు.2"

ఆవిధంగానే నేటికాలపు యువకుడికి ఆధునిక మానసికశాస్త్రం చాలా సహాయం చేస్తోంది.

౧౯౧౨ లో అమెరికాలో హార్వార్డు విశ్వవిద్యాలయంలో మన్స్టెరుబర్గు అనేమానసిక శాస్త్రవేత్త, 'మానవ స్వభావాన్ని ఆయావృత్తులకు అలవాటుచేయడం యెల్లాగ?' అన్న విషయాన్నిగురించి పరిశోధనలు చేశాడు. అచ్చటి టెలిఫోను సంఘంవారి కోరికమీద, ఆ వృత్తిలో నౌకరీలకొరకు దరఖాస్తులు పెట్టిన అభ్యర్థులలో అర్హులను ఏరడంకోసం మనస్తత్వానికిచెందిన పరీక్షా విషయాలను కొన్నిటిని నిర్ణయించాడు. పట్నాలలో రోడ్లమీద సామాన్యంగా జరిగే ప్రమాదాలకు మానసిక కారణాలను కనిపెట్టాడు. మోటారు యంత్రాలను నడిపే వారికి వుండవలసిన ప్రత్యేకసామర్థ్యాలను గురించి పరిశోధనలు చేశాడు.

అతడి పరిశోధనలు, అతని తర్వాతి వారికి దారి చూపాయి. ౧౯౧౭ లో ఇటలీదేశంలో గెమెలీ అనేమానసికశాస్త్రవేత్త వాయువిమాన చోదకుల కుండవలసిన మానసికలక్షణాలను నిర్ధారణచేశాడు. ఆపరిశోధనలు వాయువిమానచోదకులను నియమించడంలో చాలా ఉపయోగకరంగా వుండేవి. ౧౯౧౮ లో జినీవాలోవున్న మానసిక పరిశోధనశాల, గడియారాల పరిశ్రమలోను, టెలిఫోనులలోను పనిచేసేవారి కుండవలసిన మనోవృత్తులను గురించి పరిశోధనలు చేసింది. ఫ్రాంసు, బెల్జియం మొదలైన దేశాలలోకూడా వృత్తుల నిరూపణకు మానసికశాస్త్రం ఎంతవరకు తోడ్పడగలదో నిర్ణయించడం కోసం విస్తారంగా ప్రయత్నాలు జరిగాయి

౧౯౧౮ నాటి మహాయుద్ధంతో ఐరోపాఖండంలో మానసికశాస్త్రం చాలా అభివృద్ధి చెందింది. ముఖ్యంగా, యుద్ధంలో ఏ మనుష్యులు ఏ విధమైన పనిపాటులకు మిక్కిలి అర్హులోమానసికశాస్త్రసహాయంవల్ల నిర్ణయించడంకోసం పరిశోధనలు జరిగాయి. సైన్యానికి, నావికాదళాలకు, విమాన దళాలకూ ఎటువంటివారు అర్హులో నిర్ణయించడం అవసరమైంది. "ఇంగ్లాండులో, జర్మనీలో, ఫ్రాంసులో, ఇటలీలో, అమెరికా సంయుక్తరాష్ట్రాలలో వాయువిమాన

---

2. F. M. Earle: Methods of choosing a career, 1931, P, 293.

చోదకులను, గూఢచారులను, గూఢచారము లైన సబ్‌మెరైను పడవలలో పనిచేయదగిన వారిని మానసికశాస్త్రపద్ధతులప్రకారం పరీక్షించి నియమించడం ప్రారంభించారు. ఆచరణలో ఆ ప్రయత్నాలు జయప్రదం కావడం వల్ల యుద్ధం తర్వాతకూడా పరిశ్రమలలో పనివాళ్లను నియమించడంకోసమూ, ఇతరత్రా యువకులకు వృత్తులను నిరూపించడంకోసమూ ఆపద్ధతులను విరివిగా వాడడం ప్రారంభించారు".[3]

పైగా యుద్ధంతర్వాత ప్రతి దేశంలోను వేలకు వేలు వికలాంగులైన నిరుద్యోగులు తయారైనారు. వాళ్లందరికీ ఏవో వృత్తులు కల్పించవలసి వచ్చింది. అందువల్ల మానసిక శాస్త్ర పరిశోధనలకు మరీ ప్రోత్సాహం కలిగింది. ప్రతిదేశంలోను మనుష్యబలాన్ని సాధ్యమైనంతమట్టుకు సార్థకమైన, అర్థోత్పాదకమైన పనిపాటులలో వినియోగించి, ప్రజల ఆర్థిక పరిస్థితులను అభివృద్ధి చేయవలసిన అవసరం ఏర్పడింది. అంతర్జాతీయ వర్తకవ్యాపార సరళిలో జరుగుతూ వున్న పోటీలలో, తన మనుష్యబలాన్నీ, ప్రకృతి సంపదనూ ఎక్కువ సార్థకంగా అర్థోత్పాదకమైన పనిపాటులలో వినియోగించుకొనే దేశానిదే గెలుపు అని ప్రతిదేశమూ గ్రహించింది. అందువల్ల ఇంచుమించు అన్ని దేశాలూ తమ ప్రజలను వృత్తి నిరూపణ కార్యక్రమానికి దింపుతున్నాయి.[4]

వృత్తి నిరూపణ ఉద్యమంలో మానసిక శాస్త్రంవాడుక విరివి అవుతోంది. ఆశాస్త్ర పరిశోధనశాలలు వృత్తినిర్ణయ పద్ధతులను పరిపూర్ణత నొందించడంకోసం పాటుపడుతున్నాయి. ఒక ఉదాహరణ: జర్మను రైళ్ల శాఖలో నౌకరీనిమిత్తం దరఖాస్తుచేసిన వారిని పరీక్షించి వారిలో అర్హులను నిశ్చయించడంకోసం ప్రత్యేకంగా ౩ మానసిక పరిశోధన శాలలు, అందుకు సంబంధించి ౨౫ ఆఫీసులు కలవు. వాటిలో ౪౯ మంది మానసిక శాస్త్రవేత్తలు పనిచేస్తున్నారు (౧౯౩౭). వారు ఏటేటా సుమారు ౧౫,౦౦౦ మంది అభ్యర్థులను పరీక్ష చేస్తున్నారు.

జర్మను పోస్టాఫీసులశాఖకు ఒక్క బెర్లిను నగరంలో మాత్రమే ఒక మానసిక పరిశోధన శాల కలదు. అదిగాక ౬౦ చోట్ల మానసిక పరీక్షలు జరుగుతున్నాయి. ఈవిధంగా వివిధ శాఖలలో ఉద్యోగులను పనివాళ్లను నియమించడంకోసం ఇటలీ, బెల్జియం, పోలండు, రష్యా, అమెరికా సంయుక్త రాష్ట్రాలు మొదలైన దేశా లన్నిటిలోను మనస్తత్వ పరీక్షలు జరుగుతున్నాయి.

వృత్తి నిర్ణయానికీ, నిరూపణకూ స్వల్ప భేదం వుంది. ఒకవృత్తికి ఎవరు అర్హులు అన్నవిషయం నిర్ణయించేది వృత్తినిర్ణయ సంస్థ. అది సమర్థతగల పనివాళ్లను నియమించుకొనేటందుకు ప్రొప్రైటర్లు మేనేజర్లు మొదలైన యజమానుల ఉపయోగంకోసం ఉద్దేశింపబడ్డది. వృత్తినిరూపణ సంస్థ ఉద్దేశం అది కాదు. 'ఒక విధమైన తెలివి తేటలుగల యువకుడు ఏయే వృత్తులకు అర్హుడు?' అన్నది వృత్తి నిరూపణ ఉద్యమం నిర్ణయించవలసిన విషయం. ఆ వుద్యమం వ్యక్తుల అభివృద్ధికోసం, ఉపయోగంకోసం ఉద్దేశింపబడ్డది. ఆ విధంగా ప్రజలను వారివారికి అనుకూలమైన వృత్తులలో ప్రవేశపెట్టడం సంఘానికంతకూ లాభమే.

ఉదాహరణకోసం వృత్తినిరూపణ ఉద్యమం అమెరికాసంయుక్తరాష్ట్రాలలో పనిచేస్తూవున్న విధం వివరిస్తాను.

యిరోపాఖండంలో వృత్తి నిరూపణ ఉద్యమం 'ఎంప్లాయిమెంటు సంస్థల'లోనుంచీ మానసికశాస్త్ర పరిశోధన శాలలలోనుంచీ బైలుదేరి అభివృద్ధి చెందింది. దానికి స్కూలు అధికారులు, వృత్తుల యజమానులు విరివిగా సహాయం చేస్తున్నారు. కాని అమెరికా సంయుక్తరాష్ట్రాలలో ఈవుద్యమాన్ని చాలావరకు స్కూళ్లే నడుపుతున్నాయి; అందులో ముఖ్యంగా సెకండరీ స్కూళ్లలో ఎక్కువ పని జరుగుతోంది. కొన్నిచోట్ల సెకండరీ స్కూళ్లు ఎంప్లాయిమెంటు సంస్థలనుకూడా నడుపుతున్నాయి. వేర్వేరువృత్తులు, పరిశ్రమలు, ప్రభుత్వంవారిచే నడపబడుతూవున్న ఎంప్లాయిమెంటు సంస్థలు వాటికి చాలా తోడ్పడుతున్నాయి. విద్యార్థులు తమకు అనుకూలమైన వృత్తులను ఎన్నుకొని, వాటిలో తర్ఫీదును పొంది, పనులలో ప్రవేశించి, అభివృద్ధి చెందేటట్లు వారికి సహాయం చేయవలసిన పూచీ తమదే అని అమెరికను సెకండరీ స్కూళ్ల ఉద్దేశం.

ఈవుద్యమం యొక్క కార్యక్రమం:

(౧) ఒక్కొక్క విద్యార్థియొక్క జీవితం ఇంట్లో, స్కూలులో, విరామకాలంలో ఆటపాటలలో ఏవిధంగా వుంటుందో సవిస్తరమైన రికార్డును జాగ్రత్తతో తయారుచెయ్యడం.

(౨) అతడి తెలివితేటలను, సమర్థతలను, వృత్తిఅభిరుచులను పరీక్షించి, పరీక్షాఫలితాలను సమన్వయం చెయ్యడం.

(౩) అతడితో స్వయంగా మాట్లాడి, ఆవిధంగా అతణ్ణిగురించి అనేకసంగతులు తెలుసుకోవడం.

(౪) వృత్తులకు సంబంధించిన పనిపాటులలో విద్యార్థులకు ప్రత్యక్షానుభవం కలుగజేసి ఆవిధంగా వారిసమర్థతలను కనిపెట్టడం.

(౫) వృత్తులలో చేర్పించడంలో విద్యార్థులకు తోడ్పడడం.

(౬) విద్యార్థులు ఆయావృత్తులకు సంబంధించిన నౌకరీలనుగురించి తెలుసుకోవలసిన

3. M. S. Viteles; "Psychology in Business in England, France, and Germany," 1923, P. 207–220.

4. Problems and methods of Vocational guidance, Geneva. 1922, p. 16-19.

విషయాలను పుస్తకాలు, పోరాలు, మొదలైన సాధనాలద్వారా వారికి తెలియ చెయ్యడం

(౭) ఇదివరకు వృత్తులలో ప్రవేశించిన పాతవిద్యార్థుల అభివృద్ధిని గురించి అప్పుడప్పుడు తెలుసుకుంటూ వుండడం

ఈ కార్యక్రమాన్ని ఏ లోపాలులేకుండా అమలులో పెడుతూవున్న సంస్థలు బహుస్వల్పంగానే వుండవచ్చును ఒక్కొక్కస్కూలులో ప్రయత్నాలు ఒక్కొక్కవిధంగా వుంటాయి కొన్ని మిక్కిలి సంతృప్తికరమైనవి, కొన్ని కానివి

స్కూలురికార్డు —దీనిలో యీక్రిందివిషయాలు నమోదుచేసిఉంటాయి (౧) విద్యార్థియొక్క ఇష్టాయిష్టాలు, అభిరుచులు, మానసికాభివృద్ధి ఏవిధంగా వున్నవి, (౨) విద్యార్థి స్కూలులో మొదట ప్రవేశించినప్పుడు ఏవిధంగా ఉన్నదీ, తర్వాత ఏవిధంగా అభివృద్ధి చెందినదీ, (౩) ప్రతిటరము చివరా విద్యార్థిధోరణి, వ్యక్తిత్వము, పనిచేసే అలవాట్లు, ఏవిధంగా అభివృద్ధి చెందాయో తెలుపుతూ ఉపాధ్యాయుల రిపోర్టు, (౪) విద్యార్థికి ఏ విషయంలోనైనా ప్రత్యేకంగా సమర్థత, అభిరుచి వున్నయెడల వాటిని గురించి రిపోర్టు, (౫) విద్యార్థిలో కనబడే మార్పులను ఎప్పటికప్పుడు రికార్డుచెయ్యడం, (౬) విద్యార్థినిగురించి డాక్టరు రిపోర్టు

ఇంత వివరంగా విద్యార్థులను గురించి రిపోర్టు తయారుచేయడం అంటే ఉపాధ్యాయులకూ విద్యార్థులకూ కూడా చిరాకులు పరాకులు కలగడం సహజమేగాని విద్యార్థుల భావిఅభివృద్ధికీ వారు అనుకూలమైనవృత్తులలో ప్రవేశించడానికీ ఇవి చాలా తోడ్పడతాయి ఇందులో రెండు చిక్కులు లేకపోలేదు ఒక్కొక్కవిద్యార్థిని గురించి ఒక్కొక్కవిషయం జాగ్రత్తగా తెలివితేటలతో రికార్డుచేయడం వకయెత్తు రికార్డుచేయబడ్డవిషయాలను జాగ్రత్తగా సమన్వయంచేసి వాటికి సానుభూతితో అర్థం చెప్పడం మరోయెత్తు ఎన్నివిషయాలను రికార్డు చేసినప్పటికీ, ఇంకా కొన్ని కావాలనే ఉంటాయి

పరీక్షలు — రికార్డులు తయారుచెయ్యడంతోబాటు పరీక్షలుకూడా అవసరం పరీక్షలంటే మన దేశంలో మోస్తరుగా ప్రత్యేకం ఏడాది కొకసారి ప్రశ్నాపత్రాలను ఇచ్చి చేసేవికాదు మనస్తత్వపరీక్షల ద్వారా విద్యార్థులలో నిగూఢంగా వున్న శక్తిసామర్థ్యాలను బైటపెట్టడం కనిపెట్టడం ఇది మానసికశాస్త్రం అనే భూతఅద్దంతో పరీక్షిస్తేనేగాని సాధ్యంకాదు "విద్య, మానసికశాస్త్రం, — ఈ రెండూ విద్యార్థుల శక్తిసామర్థ్యాలను కొలవడానికి మంచిసాధనాలు విద్యార్థులసంగతి సందర్భాలను పూర్తిగా గ్రహించడానికి ఈ రెండూ చాలా సహాయం చేస్తున్నాయి వీటిసహాయం లేకపోతే వృత్తినిరూపణనుగురించి ఇచ్చే సలహాలు కేవలం పొల్లుఅంచనాలుగా పరిణమిస్తాయి పైగా విద్యార్థులు సాముద్రికం, జ్యోతిషం మొదలైన వంచనలో పడకుండా ఇవి కాపాడుతున్నాయి విద్యార్థులు సరియైన పద్ధతులలో తమ్ముతాము నడుపుకోడానికి చాలా సహాయం చేస్తున్నాయి"[5]

విద్యార్థులతో సంప్రతించి సలహాఇవ్వడం - స్కూలుఅధికారులు, ఉపాధ్యాయులు అప్పుడప్పుడు విద్యార్థికి సంబంధించిన సమస్యలన్నిటిని గురించి అతనితోటీ, తలిదండ్రులతోటీ చర్చించి సలహాఇస్తూ వుంటారు

"మా ఉపాధ్యాయులు అందరూ వృత్తులనుగురించి సలహాచెప్పేవారే" అని అమెరికను స్కూళ్లలో అనుకుంటున్నారట కాని ఆచరణలో స్కూలుమాస్టరు వృత్తిసలహాదారుగా ఉండజాలడు అందుకు కావలసిన తీరికగాని అవకాశాలుగాని అతడికి వుండవు వృత్తినిరూపణకు కావలసిన విషయాలన్నిటినీ అతడు తెలుసుకోలేడు ఉపాధ్యాయుడి పనివేరు, వృత్తినిరూపకుని పని వేరు అందుచేతనే అనేక అమెరికను స్కూళ్లలో ఇప్పుడిప్పుడు ప్రత్యేకంగా వృత్తినిరూపకుణ్ణి నియమిస్తున్నారు

ఈ వృత్తినిరూపకుడు తన సలహా కావలసివున్న విద్యార్థులను స్వయంగా కలుసుకొని ఈ కింది సంగతి సందర్భాలను వారికి తెలియజేసి తనసలహా ఇస్తాడు —

(౧) పగటి స్కూళ్లలోను, సాయంకాలపు స్కూళ్లలోను వృత్తిస్కూళ్లలోను చదువుకోడానికి గల అవకాశాలను గురించి

(౨) విద్యార్థులు ప్రవేశింపగోరే వృత్తులను గురించి

(౩) శాశ్వతంగాను, లేక, తాత్కాలికంగాను, లేక రోజుకు కొన్ని గంటలు చొప్పున నౌకరీలు కావలసినవారికి వాటిని సంపాదించుకొనే పద్ధతులను గురించి

(౪) ఆయావృత్తులలో అభివృద్ధిచెందడం, ప్రమోషను సంపాదించుకోవడం, ఇతర నౌకరీలకు మార్చుకోవడం వగైరా విషయాలను గురించి

(౫) విద్యార్థులు తీరుబడి సమయాలలో చేయదగిన పనిపాటులను గురించి

ఇటువంటి సంగతులను విద్యార్థులకు, తలిదండ్రులకు, స్కూలు ఉపాధ్యాయులకు, వృత్తులవ్యాపారాలయజమానులకు, గ్రంథాలు, రిపోర్టులు, నోటీసులు, ఉపన్యాసాలు, రేడియోలు, సినీమాలు మొదలైన సాధనాల ద్వారా తెలియజేస్తారు

ప్రత్యక్షానుభవం (Practical experience) —

ఏపనినయినా స్వయంగా చేస్తేనేగాని అలవాటుకాదు కాబట్టి విద్యార్థులకు పనిపాటులలో ప్రత్యక్షానభవమూ, తర్ఫీతూ

5 Vocational guidance—Keller & Viteles P 44

అవసరం. ముందు ముందు వారు కేవలం పుస్తకచదువులలో మాత్రమే మునిగి తేలే వారు కాగూడదు. రెక్కలతో కష్టపడి పనిచేయగల అభ్యాసంకూడా వారికి కలగాలి. ఐరోపాఖండంలో ఎలిమెంటరీస్కూళ్లు సహితం ఈ విషయాన్ని బాగా గ్రహించాయి. ఇంకా, అమెరికను స్కూళ్లే కొంచెం వెనకపడి వున్నట్లు తెలుస్తుంది. కాని ఇప్పుడిప్పుడవికూడా ఉత్సాహంతో ఈ కార్యక్రమాన్ని ఆచరణలో పెడుతున్నాయి. వాటివుద్దేశం విద్యార్థులకు చిన్నప్పటినుంచీ ఏదో వృత్తిని నేర్పడం కాదు; ఇక ముందు వారు పొందబోయే వృత్తి తర్ఫీతుకు సెకండరీస్కూలులోనే ప్రవేశం కలుగజేసి వృత్తిఅర్హతకు గట్టి పునాదులు వేయడం.

"(స్కూలు విద్య ముగిసినతర్వాత మనం ఫలానా వృత్తిని అభ్యసించాలి' అన్న) వృత్తి భావం విద్యార్థులకు ఎలిమెంటరీస్కూళ్లలోను, సెకండరీస్కూళ్లలోను ఇప్పటికన్న విరివిగా కలగచెయ్యకపోవడం ఆశ్చర్యకరమైనవిషయమే! అట్లా కలిగించడంవల్ల గొప్ప ఉపయోగం కలుగుతుంది. స్కూలులో మాస్టర్ల సంఖ్య మరీ ఎక్కువయి బిడ్డ చాలా బాధపడుతోంది అని అనుమానంగావుంది; అందులోనూ, తమ బ్రతుకంతా క్లాసుగదులలో గడుపుతూ ప్రపంచానుభవంఅంటే ఏమిటో తెలియని, తెలుసుకోడానికి భయపడే ఆడ మాస్టర్లతోటి."

వివిధవృత్తులలో ప్రవేశింప గోరువారు ఆవృత్తులనుగురించి తెలుకోవలసిన సంగతి సందర్భాలను విద్యార్థులకు తెలియ చేయడంలో ఐరోపాకన్న అమెరికాదే పైచేయిఅని విద్యాశాఖ లంగీకరించారు. ఈ విధమైనసంగతి సందర్భాలను సేకరించడం కోసం ఉపాధ్యాయులూ విద్యార్థులూకూడా కలిసి కృషిచేస్తున్నారు. వృత్తినిరూపణ కార్యక్రమంలో ఇది చాలా ముఖ్యమైన విషయం.

"(అవిధంగా వివిధ వృత్తులనుగురించి సంగతి సందర్భాలను తెలుసుకోవడంలోని) ముఖ్యోద్దేశం ఆవృత్తులమీద, వాటికి సంబంధించిన సమస్యలమీద విద్యార్థులకు అభిరుచి కలిగించడం. అందుకోసం సాధారణమైన్ను మోస్తరుగా యీవిషయాలనుకూడా విడవకుండా ప్రతియేడూ స్కూళ్లలో బోధించాలి. ఏదో వకయేడు బోధించి వదిలివేస్తే చాలదు."

అమెరికాలో జాతీయ వృత్తినిరూపణ సంఘంయొక్క పరిశోధనశాఖ ఈవిషయమై చాలా కృషి చేస్తోంది. ఆయావృత్తులను గురించి విద్యార్థులు తెలుసుకోవలసిన విషయాలను సేకరించి సమన్వయం చేసింది. ఈవిధమైన కృషిచేస్తూవున్న పదకొండు ప్రత్యేక సంస్థలు ఒకటేపద్ధతిని సామాన్య నియమాలతో పనిచేస్తూ, ఒకదానిసలహాను మరొకటి పొందుతూ పరస్పరమూ సహాయం చేసుకుంటున్నాయి. క్రమంగా ఈ కృషి యావత్తూ ఒక్క యాజమాన్యంకింద, ఒకటేపద్ధతిని జరగడానికి అవకాశా లున్నాయి. అప్పుడు ప్రతీసంస్థా సేకరించిన స్థానిక విషయాలు జాతికంతకూ ఉపయోగపడడానికి వీలుంటుంది.

ఈ మధ్య అమెరికాలో ఈవుద్యమాన్ని గురించి అనేక గ్రంథాలు ప్రచురణ అవుతున్నాయి. "ఈ గ్రంథాలు వరదలుగా వచ్చి మార్కెట్టును ముంచెత్తుతున్నాయి" అని వకరు వ్రాశారు. ఈగ్రంథాలజాబితా అచ్చులో ౩౦ పేజీలు అవుతుందిట! ఏడాదికి ఇట్టివి అథమం ౫౦౦ పుస్తకాలకన్న అధికంగానే అచ్చు అవుతూవున్నట్లు అంచనా వేశారు (౧౯౩౬).

తగినవృత్తులలో ప్రవేశపెట్టడం:

ఈకార్యక్రమంలో వున్న భాగాలు:—

(౧) ఒక్కొక్క విద్యార్థిని గురించి తయారుచేసే రికార్డు. ఆరికార్డులో వుండే విషయాలు:— అతనిస్కూలు రికార్డు, ఇంటి పరిస్థితులు, కుటుంబ ఆర్థిక పరిస్థితులు, అతని ఇష్టాయిష్టాలు, వృత్తులలో అభిరుచులు, ఆశయాలు, ఆదర్శాలు, ఉద్దేశాలు వగైరా

(౨) ప్రస్తుతం అందుబాటులో వున్న ఖాళీలు, వాటివృత్తాంతం, ఆవృత్తులలో ఇదివరకు పనిచేసినవారి అనుభవాలూ, వగైరా

(3) ఆయావృత్తుల ధోరణి, వాటిలో చేరగోరే యువకుల కుండవలసిన లక్షణాలూ వగైరా.

'విద్యార్థుల రికార్డుల కేంద్ర సంస్థల'లో పాతవిద్యార్థు లందరిని గురించి సంపూర్ణమైన రికార్డు దొరుకుతుంది. దానిని భద్రంగా జాగ్రత్తపెట్టి కాపాడుతున్నారు వృత్తి సలహాదారుల కారికార్డు చాలా అవసరం

స్కూలు చదువులు ముగిసి వృత్తులలో ప్రవేశించిన విద్యార్థులు ఏయే వృత్తులలో ఏ విధంగా అభివృద్ధి చెందుతున్నారో అప్పుడప్పుడు తెలుసుకోవడం అవసరం అది తెలిస్తేనేగాని వృత్తినిరూపణ ఉద్యమం ఏ విధంగా పనిచేస్తోందో తెలియదు అందువల్ల ఈ వుద్యమం వ్యాపించివున్న అమెరికను స్కూళ్లలో తమ పాతవిద్యార్థుల ప్రస్తుత స్థితిగతులను ఏడాది, మూడోయేడు, ఐదోయేడుతర్వాత కనుక్కుంటున్నారు అల్లా కనుక్కోవడంవల్ల,

(౧) దేశంలో వున్న చదువులు, వృత్తులు యువకులకు ఎంతవరకు ఉపయోగకరంగా వున్నాయో తెలుస్తుంది.

(౨) ఒక్కొక్కవిధమైన తెలివితేటలకు సమర్థతలకు దేశంలో ఎంత అవసరముందో, ఎంతసప్లై వుందో తెలుస్తుంది

6. A.D. Richard - Organisation and Supervision of guidance in Public Education, p. 159.




## నెలనెలకు పెరిగిపోవుచున్న ఖర్చును తగ్గించుటెట్లు అనునదే మిమ్ము బాధించుచున్న ప్రశ్న.

**సమాధానము బహు తేలికగా ఒసంగవచ్చును.**

ఎక్కువ బరువైన ఫానులను మీరు వాడుచున్నారు. క్రొత్తరకము ఇండియా లేక **భారత్** ఫానులకంటె మీరు వాడు ఫానులు రెండింతలు ఎక్కువగా విద్యుచ్ఛక్తిని ఖర్చుపెట్టుచున్నవి. ప్రాత ఫానులను తీసివేసి, వాటిస్థానే ఇండియా లేక భారత్ ఫానులను అమర్చుడు.

ఇది అవివేకమైన సూచనగా ప్రప్రథమమున కన్పించవచ్చును. కాని ఆరీతిగా చేసిన మాసూచన తగిన సలహాయనియు, మితవ్యయముతో కూడినదనియు మీకే స్పష్టమగును. ఇందుమూలమున ఎల్లకాలము వచ్చుచుండు విద్యుచ్ఛక్తి బిల్లులమొత్తము తగ్గుటే కాకుండా, చాల శ్రేష్ఠమైన పంకాలను పొందినవారగుదురు. ఈ ఫానులు తిరుగునప్పుడు నిశ్శబ్దముగానుండును. ఏండ్లతరబడి బాగుగా పనిచేయును.

**THE INDIA ELECTRIC WORKS, LIMITED, 12-A, Lingha Chetty Street, MADRAS.**

(౩) యువకులకు పనిపాటులు దొరికే స్థలాలు, అవకాశాలు, యజమానుల పేర్లూ తెలుస్తాయి.

(౪) పనిపాటులు దొరకకుండా ఎంత మంది యువకులు తిరుగుతున్నారో తెలుస్తుంది.

అమెరికా సంయుక్తరాష్ట్రాలలో ఈ వుద్యమం సెకండరీస్కూళ్లలోను, వృత్తి స్కూళ్లలోను చాలా అభివృద్ధి చెందుతోంది. సాధారణంగా విద్యార్థి జీవితంలో ౧౪-వ ఏటనే, అతడేవృత్తిలో ప్రవేశించాలో నిర్ధారణచేయవలసి వుంటుంది. అల్లా నిర్ధారణ చేయడంలో సమర్థులైనవారిసలహా అతడికి అవసరం. తుదకు ఎన్నోయేట వృత్తిలో ప్రవేశించినా, ఈలోపుగానే, అనగా సెకండరీస్కూలులో చదివేటప్పుడే అతడు సాధ్యమైనంతమట్టుకు ఏవృత్తిలో ప్రవేశింపబోయేదీ తనమనస్సులో నిశ్చయంచేసుకొని వుండాలి. తరువాత అనుభవాలనుబట్టి అతని అభిప్రాయం మారినప్పటికీ, సెకండరీ స్కూలు వయస్సుకే అతడికి 'వృత్తిధోరణి' ఏర్పడాలి.

అమెరికాసంయుక్తరాష్ట్రాలలో నేడు అమలులో వున్న వృత్తినిరూపణ ఉద్యమం యొక్క ముఖ్యలక్షణాలీవిధంగావున్నాయి. స్థానికపరిస్థితులనుబట్టి వివిధరాష్ట్రాలలో కొన్ని వ్యత్యాసాలుండడం సహజం. ఉదా: (౧) న్యూజెర్సీయన్నరాష్ట్రంలో నీగ్రోజాతివారికి అనుకూలమైన వృత్తులను గురించి ప్రత్యేక ప్రయత్నాలు జరుగుతున్నాయి.

(౨) మిన్నెసోటాసురాష్ట్రంలో, అచ్చటి స్థానికవృత్తులనూ, వాటి సాంకేతికపద్ధతులనూ, సమస్యలనూ వివరిస్తూ ఒకమాసపత్రికను ప్రకటిస్తున్నారు.

(౩) న్యూయార్కు రాష్ట్రంలో ౧౩ జిల్లాలు కలిసి ఒక వృత్తినిరూపణ ఉద్యోగిని పోషిస్తున్నాయి.

(౪) ఈ సందర్భంలో, న్యూయార్కు రాష్ట్రంలోవున్న ఫీల్డుస్టను స్కూలు ప్రత్యేకంగా చెప్ప తగ్గది. గాంధీమహాత్ముని విద్యావిధానంప్రకారం విద్యార్థి ఒకప్రధాన వృత్తిని అభ్యసిస్తూ తద్వారా దేశచరిత్ర, భూగోళం మొదలైన ఇతర విషయాలను అభ్యసించవలసినట్లే, ఈ స్కూలులో కూడా, విద్యార్థి తనకు అభిమానంవున్న ఒక విషయాన్ని ప్రధానంగా అభ్యసిస్తూ తద్వారా తాను నేర్చుకోవలసిన ఇతరవిషయాలన్నిటినీ అభ్యసించాలి. ఈవిషయమై ఆస్కూలు ప్రధానోపాధ్యాయుడు ఈవిధంగా వ్రాశాడు.

"బైటప్రపంచకంలో వయస్సువచ్చిన వ్యక్తులకు జీవనాధారంగా వుంటూవున్న వివిధ వృత్తులలో దేనిలో తనకు అభిరుచిగలదో విద్యార్థి తెలుసుకోడానికి ఈ స్కూలు సహాయపడుతోంది. ఆవృత్తులు పరిశ్రమలు, చిత్రకళలు, వర్తకవ్యాపారాలు మొదలైనవాటికి సంబంధించినవి కావచ్చును; లేదా గణితము, దేశచరిత్ర, భూగోళం, ఫ్రెంచి, జర్మను భాషలు మొదలైన సామాన్యవిషయాలకు సంబంధించినవైనా కావచ్చును. ఏవిషయమైనాసరే, విద్యార్థితనకు ముఖ్యంగా అభిరుచివున్న విషయంలో చాలా కృషిచేసి, ఆ సంబంధంలోనే ఇతర విషయాలనుకూడా నేర్చుకోవడానికి అవకాశం ఇస్తున్నాము."

## మనస్తత్వ పరీక్ష.

పరీక్షాసమయంలో విద్యార్థి ప్రవర్తన, దానిఅర్థము — బామ్ గార్టెన్ అను మనస్తత్వ పరిశోధకుని సిద్ధాంతము ననుసరించి:

### I ప్రారంభంలో :

**1.** శ్రద్ధతో వింటాడు : పరీక్ష చేసేవాని వంక నిబ్బరంగా చూస్తాడు అంటే అతని స్వభావం యీ కింది వాటిలో ఏదో ఒకటిగా ఉండాలి :

౧. నిజంగా వింటున్నాడు. ౨. ఒకడు చెప్పేది వినకుండా వాణ్ని చూస్తూ వుండగలడు.

**2.** గదిచుట్టూ చూస్తూవుంటాడు అంటే,
౧. ఏకకాలంలో అనేక విషయాలను గురించి ఆలోచించగలడు. ౨. మనసు నిలకడ లేదు. 3. ఎదుటివాడు చెప్పతూ ఉన్న విషయంలో అతనికి అభిరుచిలేదు.

**3.** ఎదురు ప్రశ్నలడుగుతాడు అంటే,
౧. సరిగ్గా వినలేదు ; కొంచెం చెవుడు. మనసునిలకడ లేదు. ౨. అర్థం చేసుకోలేదు. 3. ఆ విషయంలో అతనికి అభిరుచి లేదు. ౪. వెంటనే జవాబియ్యకుండా, ఆలోచించుకోవడంకోసం కాలం గడుపుతున్నాడు. (అడిగే ప్రశ్నలనుబట్టి యీ సంగతి స్పష్టమవుతుంది.)

**4.** ప్రశ్న లేమీ అడగడు అంటే,
౧. మొద్దు. ౨ అంతా బాగా తెలుసును. 3. పని ముగించాలని తొందరగా వుంది.

**5.** ప్రశ్నలకు జవాబు లివ్వడం తొందర తొందరగా ప్రారంభిస్తాడు అంటే,
౧. చురుకైనవాడు. ౨. ఇచ్చిన ప్రశ్నలలో అభిరుచి వున్నది. 3. వెంటనే గ్రహిస్తాడు. ౪. దూరపాలోచన లేదు.

**6.** నెమ్మదిగా ప్రారంభిస్తాడు అంటే,
౧. పరీక్షావిషయాలలో ఉత్సాహంలేదు. ౨. అభిరుచి లేదు. 3. ఈరెండూ లేవు.

**7.** అనుమానంతో ప్రారంభిస్తాడు అంటే,
౧. పని అర్థం కాలేదు. ౨. జాగ్రత్త అయినవాడు. 3. వెంటనే మనస్సు నిశ్చయం చేసుకోలేడు. ౪. సిగ్గూ భయమూ వున్నాయి. ౫. ఆ విషయంలో ప్రయత్నించడం ఇష్టంలేదు.

**8.** జవాబు లివ్వడం ముగిసినతర్వాత మౌనంగా వున్నాడు అంటే,
౧. మౌనం అతని స్వభావం. ౨. ప్రశ్న విషయం చాలా ముఖ్యమైన విషయమన్న ఆదుర్దా. 3. జవాబులు సరిగా ఇవ్వలేదని విచారం.

**9.** జవాబు లివ్వడం ముగిసిన తర్వాత ఖులాసాగా వున్నాడు అంటే,

౧. అప్పుడూ ఒకే ధోరణిలో వున్నాడు. ౨. పని అంటే ఆట. 3. అనవసరంగా ఆదుర్దాపడే స్వభావం కాదు.

10. జవాబు లివ్వడం ముగిసిన తర్వాత పట్టుదలగా వున్నాడు అంటే,

౧. చాలా ఆదుర్దా. ౨. ఉత్కంఠ.

11. తనశక్తి సామర్థ్యాలను గురించి ముందుగానే తనకు తాను చెప్పుకొంటాడు అంటే,

౧. ఇదంతా బహుతేలిక అని. పరీక్ష తేలికగా వుంది. కష్టాలను గుర్తించక పోలేదు; లేదా, బడాయి: గర్వం. ౨. ఉత్సాహం: నిజంగా, అభిరుచి వుంది. లేదా, అనాలోచితమైన ఉత్సాహం. 3. పరీక్షలో నెగ్గలేదు; తనశక్తి తా నెరుగును; లేదా, ఆత్మవిశ్వాసం లేదు. చేయవలసిన పనిని సరిగా అర్థంచేసుకోడు. అభిరుచి లేకపోవడం కప్పిపుచ్చుతాడు.

12. అందరూ వినేటట్లుగా పరీక్షావిషయాన్ని విమర్శిస్తాడు అంటే,

౧. విషయంతో ఐక్యంకావాలన్న అభిలాష. ౨. తప్పులు పట్టే స్వభావం. 3. అహంభావం.

## II పనిచేసేటప్పుడు:

13. పని ప్రారంభించడం సావధానంగా అంటే,

౧. పరీక్ష కష్టంగా వుంది. జాగరూకత గల స్వభావం. సావధానంగా ఆలోచించడం అతని స్వభావం.

తొందరగా ఆలోచన లేకుండా అంటే,

౧. వెంటనే గ్రహిస్తాడు. (౨) ఆలోచించలేడు. 3. ఆ పని ముగించడానికి ఇష్టంలేదు.

ఎప్పుడూ ఒక్క ధోరణిలోనే పనిచేసాడు అంటే,

(౧) బుద్ధిమాంద్యము. (౨) అదే సరియైన పద్ధతి అన్న నమ్మకం. (3) అనాలోచిత ప్రకృతి.

ప్రతిసారీ మరో కొత్త పద్ధతిని ప్రయత్నిస్తాడు అంటే,

(౧) అనేక మార్గాల ప్రయత్నించగల ఆలోచన లున్నాయి. ఎల్లాగో సాధించాలి అన్న పట్టుదల. 'దీనిని సాధించాలి. ఇది నావిధి' అన్న జ్ఞానం.

14. శ్రద్ధగా చేస్తాడంటే,

పని చేసేటప్పుడెల్లా కార్యసాఫల్యమే అతని మనోదృష్టిలో వుంటుంది. గమ్యస్థానం చేరాలన్న ఆదుర్దా. చేతిలో పనిని త్వరగా ముగించాలన్న ఆదుర్దా. ఖంగారుగా తనచుట్టూ చూస్తూవుంటాడు. అభిరుచి లేదు. గందరగోళం పడుతున్నాడు. మనసు నిలకడ లేదు.

15. పనిచేసేటప్పుడు మనసు నిలకడ (పని చేసినంతసేపూ అతని దృష్టి బల్లనుంచి చలించదు) అంటే,

౧. పనిలో అభిరుచి. ౨. పరీక్షాధికారి దగ్గర వున్నాడన్నభయం. 3. ఓర్పు; పట్టుదల.

16. పనిచేసేటప్పుడు మనసు నిలకడలేదు అంటే,

౧. కొత్తజాగాలో వున్న చిత్రాలు చూదామన్న కుతూహలం. ౨. పనిలో అభిరుచి లేదు. 3. శ్రద్ధ లేదు. ౪. ఉత్సాహం లేదు.

17. పనిచేసేటప్పుడు ఉల్లాసం, అయిష్టత, ఆశ్చర్యం వగైరా భావాలు చూపుతాడు: అవి మొదటినుంచి చివరదాకా వుంటే,

౧. పరీక్షాధికారియెడల నమ్మకం వున్నది. ౨. పరస్పర సహాయం, ఉల్లాసం కల బుద్ధి. 3. గౌరవం లేదు; లేదా శ్రద్ధ తక్కువ.

వాటిని అప్పుడప్పుడు చూపిస్తే,

౧. తన ప్రయత్నం సఫలమవుతూవున్నదన్న సంతోషం. ౨. లేదా, పైనూదు కారణాలు కావచ్చును.

పైకి కనపరచపోతే,

౧. భావోద్రేకాలను ఎన్నడూ అంత దేరగడు. ౨. అన్నీ తెలిసివుండడంవల్ల భావోద్రేకాలు పుట్టలేదు. విద్యాధిక్యతవల్ల అలవాటువల్ల, మనసు నిబ్బరంవల్ల

18. (శరీర) అవయవాల కదలికలు తాను చేస్తూవున్న పనికి అనుకూలంగా వుంటే,

౧. తెలివైనవాడు. ౨. బాగా కసరతు చేసిన వాడు. 3. కార్యసాఫల్యము అవుతుంది అన్న వుత్సాహంతో పనిచేస్తున్నాడు.

అనుకూలంగా లేకపోతే,

౧. అవయవాల కదలికలు అతని స్వాధీనంలో లేవు. ౨. ఆలోచనలు అతని వశ్యంలో లేవు.

19. పనిచేసేటప్పుడు అతనిప్రకృతి చురుకుగా వుంటే,

౧. చురుకుతనం. ౨. పనిభారంలోనుంచి బైటపడదామన్న కోరిక.

మాంద్యంగా వుంటే,

౧. మందస్వభావము. ౨. సోమరి. 3. పనియెడల అశ్రద్ధ.

20. పనిచేసే చేతుల కదలిక — జాగ్రత్తగా, కొలిచినట్టుగా వుంటే,

౧. అనుభవంకలవాడు. ౨. అది అతని స్వభావం.

హడావిడి లేకుండా, నిశ్చలంగా వుంటే,

౧. స్వభావసిద్ధమైన సమర్థత. ౨. మిక్కిలి దృఢసంకల్పం.

అతివేగముగా, అడావిడిగా వుంటే,

౧. స్వభావసిద్ధమైన సమర్థత. ౨. పేరాస 3. ఆలస్యం లేకుండా కార్యసాఫల్యం చేకూర్చుదామన్న ఆదుర్దా.

# సినీమానటులు



సూర్యకుమారి

సారథి ఫిల్మ్సువారి 'రైతుబిడ్డ'లో

# కూలి మనిషి

"కరుణ కుమార"

౧

మాయదారి గాలివాన ఏమని కొట్టిందో- తుడిచిపెట్టి పారేసింది. పచ్చంగా బంగారం పండే పొలాలు, అపరంజివంటి కయ్యలు, రామరామ, ఈ మూడేళ్లుగా మళ్లా అట్లాంటి పంటా లేదు, అట్లాంటి పాడీ లేదు రైతుకు: శిస్తులు ముజరాపోకుండా సర్కారుకు మేలు చేయడానికి, ఏటికి కాసినన్ని నీళ్లు తగలడం, పొలంలో కర్ర గుచ్చామంటే గుచ్చామనుకోవడంతప్ప, మళ్లా అట్లాంటి ఫలితం ఎరగరు జనం. సముద్రంమీదనుండి వస్తుం దంటారు కూడా ఇంతహోలాహలమే ఎత్తుకొనివచ్చిందో ఏమోగాని, నారాయణ! ఆగాలిస్పర్శ తగిలినంత మేరా పైర్లే గాదు, పంటలే గాదు, పొలాలే గాదు, చెట్లే గాదు, చేమలే గాదు; పురుగు నాకినట్టు మాడి చక్కాపోయినై - అదేమి విషపుగాలో! ఆఘడియలగాయతు పశువులకూ, మనుష్యులకూ కూడా సిడి పట్టుకొన్నట్టు పట్టుకొన్నది గదా! పొలంచాయ పోయి కయ్యలో అడుగుపెట్టాలంటే, వొలికల్లో అడుగు పెట్టినట్టు, ఏడుపు వచ్చేది! ఏతట్టు బట్టినా ప్రేతకళే! ఇక్కడ మేత లేక పసరాలను పడమటికి కంచెల్లోకి తోలిపెట్టితే, ఈ శనిగా డక్కడకూడా దాపురించాలనా? ఆ రాజ్యంలో గూడా ఏం దెబ్బ తగిలిందో, తాగను నీళ్లూ, మేయను మేతా లేక, ఇపిరివాపూ, జెబ్బవాపూ, తగిలి ఎక్కడిపసరం అక్కడే తా అని చావడం మొదలెత్తుకొన్నవి. ఇం కెట్లా జనం జీవించేది? కయ్యకి ఎంతలేసి సత్తువలు చేసినా, ఎంతెంత కలుపులు తీసినా, ఏమో మహాపండి బోర్లా పడేటట్లు, మొదట మొదట్లో పచ్చంగా ఎక్కిరావడమూ, తీరా పొట్టపగిలి వెన్ను తీసే అదునుకు మెడవిరుపో, దుంప తెగులో, మిడత పోటో తగిలి వొరి తాలూ బొంగూ మాత్రం నేలమీద పడడమూను. ఎంతలేసి మోతుబరీ కమతా లయినేమట్టుకు, ఇట్లాంటి దెబ్బలు తగిలితే కాలెత్తకుండా ఎన్నాళ్లని నిలదొక్కుకొని ఉండగలవు?

అట్లాంటిది, మూడేళ్లకింద పండినపంట మళ్లా ఈఏడూ పండింది. ఈ ఏడుకూడా పంటలు నాశిగా తేలినట్టయితే, ఇక ఆగడ్డ విడిపించి ఏదేశమైనా లేచిపోవాలని ఉన్నారు ప్రజలు. కాని - ఆభగవంతుడి దయ చల్లగా ఈ ఏడూ నాగేళ్లకూ, గుద్దేళ్లకూ, కత్తవలకూ, కాడిమాన్లకూ, పేడ కుప్పలకూ పసుపూ కుంకుమా పెట్టి, కోడిపిల్లను కోసి దిగదుడిచి పారేసి, ఏ ఘడియని కయ్యలో కాలుపెట్టి ఏరువాక సాగించారో గాని, ఈ మూడేళ్లబొర్రీ ఒక్కసారిగా ఈ ఏడు తీసుకొన్నది. అదీ పంట అంటేను.

మృగశిరాప్రవేశం కావడంతోటే పడమట మబ్బులేవడం, తూర్పునుండి పైరుగాలి తోలడం, రెండు మూడు పదున్లు దిమ్మరించి కాలం చల్లబడడమూను. ఎప్పుడు కురిసిందో, కార్తి తిరిగి కార్తి పెట్టేవరకల్లా వచ్చె, గట్లు తెగ్గోసుకుంటూ, లంకలు ముంచెత్తుకొంటూ, ఎర్రటి ఒండ్రుమట్టితో కూడా వచ్చింది ఏరు. నారు పోసినవాడు నీరు పోయకుండా ఉంటాడా? విత్తనాలు నానబెట్టి నారుకయ్యలు తడిపి చల్లీచల్లడంతోనే, రెపరెపలాడుతూ, మూడోనాటికల్లా మూరెడేసి పొడుగున ఎదిగివచ్చింది మొక్క. అదునంటే అదీ అదును. నారుకయ్యలో మనిషి ఒంగి పైకి చెయ్యెత్తితేనే గాని అసలు అగుపడే వాడు కాడు. అంత మెండుగా పోసిన ఆకుమళ్లయినా వరినాటులందుకొని నారు పెరకబోయేవరకు రొయ్యచేపమూతిమీది మీసాల్లాగా మూరెడేసి లోతున వేళ్లు మూసుకొని మొలక ఊడిరాదే! ఆనారు పెరకలేక చేతులు మంటలెత్తి అల్లాడిపోయాగు ఆ సేద్యగాళ్లు అట్లాంటి సత్తువగల నారు నాటితే, శనిగాడు నెత్తినెక్కి ఏగాలివానో, ఏవరదలో పట్టి కొట్టుకపోతే చెప్పలేం గాని లేకుంటే పైరు చావమంటేమాత్రం చస్తదా?

మఖా, పుబ్బా, ఉత్తరా కార్తులు వచ్చేసరికే సాఫ్‌ఫీదాగా వరినాట్లు పూర్తిఅయిపోయి అప్పుడే కలుపుతీత లందుకొన్నారు జనం. ఆఁ! ఎంత కలుపుల్లే! ఈ మూడేళ్లుగా నీళ్లు ఎద్దడై, పసిగా అందక నాటువేసిన మలిరోజుకే తుంగ బలిసినట్లు మనిషెత్తున పెరిగి, ఆకలుపుతీతకే అయ్యేవి ఎకరాకి నల్తుం, ఏదుం కూలి. అట్లాంటిది ఈఏడు తూమెడూ తూమెణ్ణిరసాతో తొలిమారుమట్టుకు కలుపుతీయించేస్తే, ఇక మళ్లా కయ్యతట్టు కన్నెత్తి చూడవలసిన అగత్యంలేకుండా పోయింది. రెండున్నర నెలలు విడవకుండా పారిందే ఏరు. ఏతట్టుమోటార్లాతట్టే, ఏ తట్టు జనం ఆతట్టే, నిలిచిపోయి అల్లాడిపోయారే ఈయేడు. ఆ కొత్తనీటి వురవడిదెబ్బకు భయపడి, ఆఖరుకు పడవ ఆడడంకూడా నిలిచిపోయి, జనాన్ని ఇద్దరికీ అద్దరికీ రవాణా చేయడానికి రైలువాళ్లొక ప్రత్యేక లోకలు నడిపించి దోచుకొన్నారుగదూ డబ్బులు!

అది పంటంటే పంట గాదు. ఎంత పనికిమాలిన నాదారు చేనయినా, ఎకరా పుట్లు కనీసప్పంట అని చెప్పాలి. ఎక్కడనో చెరువుకింద, కట్టకడాన మాలమాదిగవాళ్లకు

సర్కారువాళ్లిచ్చిన చవరభూములుగూడా ఈ యేడు వెట్టికి పండినట్లు చితకపండినై. ఇక మేలురకం దొంపులు అడిగేరూ! అబ్బ! మేలిమిబంగారం! వెన్ను ముట్టుకుంటే గుప్పెట సరిపోతుందా ఉరువు! ఒక్కొక్కకర్ర చెరుకుగడంతలావున పెరిగి గంటలు కట్టి, అడివి అల్లుకొన్నట్లు అల్లుకొని పోయింది. అంత లావుకర్రా కూడా వెన్ను బరువు భరించలేక నేలమీద పడి పారకాడి పోతోంది. గనిమెమీద నిలబడి పొలంచాయ చూస్తే, ఎర్రంగా కన్ను చెదిరిపోతోంది. వెన్ను చేతికి తీసుకొని దూస్తే ముంతెడు గింజలు రాలినట్లు రాలుతున్నవి. దిష్టి తగలకుండా అడుగడుక్కీ కట్టిన సున్నప్పిడత లేనా, గడ్డిబొమ్మలేనా, దిష్టిబొమ్మలేనా, తాటాకులేనా — ఒక టేమిటి! చూస్తే భయంకూడా అవుతోంది. ఈతట్టూ ఆతట్టూ విరగబడిన పైరుతో గనిమెలు కప్పడిపోయి, ఎవరి దొంపు ఏదో కూడా గుర్తు చిక్కడం లేదు.

అట్లా — ఈ వాగర్త వాగర్త అంతా ఏకటాకీని పండిం దీయేడు.

వచ్చేసింది — సంకురాత్రి కూడా వచ్చేసింది. పెద్దపండగ చేసుకొని పెద్దలకు పెట్టుకోవడం, కనుమూ, ముక్కనుమూ పోనిచ్చి కయ్యాలో వొంగడమూను. అయిపోవాలె! గంటలమీదా మినిట్లమీదా కోత లయిపోయి కుప్పలు పడాలె. అప్పుడుగాని రైతుకు నిద్రపట్టదు. ఈ మూడేళ్లుగా పడమటినుండీ ఉత్తరాదినుండీ పండగనెల పట్టేవరకే కూలీజనం తండాలు తండాలుగా దిగిపోయేవారు. ఈ యేడు వాళ్ల దేశం కూడా పండి, చేతినిండా కూలి చిక్కిందో ఏమో, పండగనెల గడిచిపోయినా, జనం ఆముమ్మరం లేదు ఈ తడవ.

ఈ ఏడు కోత లెట్లాగబ్బా! దిగులుపడి పోతున్నారు రెడ్లు. సిద్ధాన్నం! నోట్లోకిపోయే కూడు! మహాలక్ష్మి పొలంలో ఆడుకొంటోంది; ఈ పల్లెకొంపల్లో పరిస్థితులు ఏమీ బాగుండడం లేదు. ఏతట్టుబట్టినా ఆఁ, ఊఁ, అంటే ఈ కూలీముండాకొడుకులు సమ్మెలూ సభలూ తీర్మానాలూను. నిరుడు సంవత్సరం అసలే పంటలు ఏడూ గాడూ అయి పెట్టుబడిగింజ లయినా వస్తాయో రావో అని రైతు అల్లాడిపోయిన రోజుల్లోనే, ఆవూరిరైతు మూర్తిరెడ్డిని ఈకూలీజనం పెట్టిన తిప్పలు తిప్పలుగావు. ఆయనచేతికింద నీళ్లు త్రాగి ఆయన దగ్గర జీతాలకు కుదిరినసేద్యగాళ్లే ఎదురు తిరిగారే! ఇక ఏడనుంచో వచ్చిన ముంతకూలీ ముండావాళ్ల సంగతి అడగాలెనా? మాట్లాడితే అన్నంపెట్టి శేరు బియ్యం పావలాడబ్బలని ఒకటే దరువుకు మళ్లి కూర్చున్నారు వాళ్లు. ఏనాడూ ఎరగని మామూళ్లన్నీ ఎప్పటికప్పుడు కొత్తవితీసుకొనివచ్చి మెండొడ్డుకొని కూర్చుంటున్నా రీమిడిమేలపు పశువులు! ఈ గడ్డ పుట్టింది మొదలు వాళ్ల అన్నం వాళ్లు తెచ్చుకొనేటట్టూ, ముంతెడు వడ్లూ, బేడ డబ్బులూ ఇచ్చేది అనాది మామూలు. అట్లాంటిది ముంతెడు వడ్లకి తోడు ఆరణా లివ్వవలసిందని ఏడిచారు. సరే నని ఒప్పుకున్నారు. కడుపు నిండడంలేదు. రేపటివేళ చద్దిదాహం పోయించమన్నారు. దానికీ ఒప్పుకొని, ఉదయంపూట అంబలి పోయిస్తూ వచ్చారు రైతులు. నిరుడు సంవత్సరం, ఆ ఏర్పాటూ తోసేసి, శేరుబియ్యం పావలా డబ్బులూ యిచ్చి, పగటన్నం మొలగొలుకులు కూడు పెట్టించవలసిందని - ఇంకో బేరం పెట్టారు. అబ్బబ్బా! వీళ్లతో రణపోరూ, శతపోరూను. వాళ్లకి తెలియదు. ఒకరు చెప్తే వినరు. గొర్రెదాటు.

మూర్తిరెడ్డి అంతటివాడు - వాళ్లు అడిగినంత కూలీ యిచ్చి నిరుడు కోతలు కోయించుకొన్నాడే! సేద్యగాళ్ల పెట్టుబళ్లు చాలడం లేదు, సంవత్సరానికి పందుం గింజలూ, రెండు జతల గుడ్డలూ, వరహారొఖ్ఖం పెట్టుబడి పెట్టి, నెలకు ఇద్దుంగింజలు యిస్తేనే గాని, మేడితోక అట్లా ముట్టుకోమని ఎదురు తిరిగితే, పాపం! అంతలావురెడ్డీ, ముక్కుమీద వేలేసుకొని, 'ఏమిరా కాలం!' అని ఆశ్చర్యపోయాడు. అట్లాంటిది, ఈసంవత్సరం పంటలు చూడొస్తే, బంగారం పండి బలికోరుతున్నాయి. కూలివాళ్లు చూడొస్తే ఆవిధాన్న ముక్కుపట్టని ముత్యాలై వాళ్లు కూర్చున్నారు. ఎక్కడికి పోతారు రెడ్లు? ఏవూరు పోయినా, గిరాకీరోజులు, రద్దీదినాలు! ఇదే పోరుగదూ! పోనీ, అడిగినంత కూలీ ఇస్తామనుకొన్నా, రెండుకాళ్లూ, రెండుచేతులూ ఉన్న మనిషంటూ, ఉరువు ఆగుపడితే ఎట్లానయినా ఊరేగవొచ్చు. ఒంటినిండా గుడ్డా, కడుపునిండా కూడూ లేని జనాన్ని ఇంత చాలీచాలకుండా పుట్టిస్తే, సృష్టి ఎట్లా జరగా లనుకొన్నా డీభగవంతుడు! ఏయెకరమో అరెకరమో అయితే ఒకరోజుపట్టు. రెండురోజులయినా మానె, ఎట్లనో ఏడ్చి అయిం దనిపించుకోవచ్చు. ఏభయ్యేసి ఎకరాలు, నూరేసి ఎకరాలు, రెండువందలేసి ఎకరాలు పెట్టుకొని ఊరేగే కమతా లీగండం గడిచి గట్టెక్కేది ఎట్లా?

గోచీపాతో పెట్టుకొను అర్ధదిగంబరత్వంతో తిరిగేమనిషి ఆడదిగాని, మొగాడుగాని, వయసువాడుగాని, ముసలివాడుగాని, కంటి కగుపడితే సరి, వెంటబడు తున్నారు ఆసాములు. 'కూలివిషయాని కేమిలే, అందరికంటే ఇంకో చిన్నడబ్బ అదనంగానే తీసుకో' అని చెయ్యిపట్టుకొని లాక్కొని పోతున్నారు. కొంతమంది మరీ పెద్దపెద్ద ఆసాములు, ఒకటి రెండు రోజులు ముందుగానే జాగ్రత్తపడి, కుటుంబాల సహితంగా గొర్రెలగుంపులాగా తోలుకొనిపోయి, బందెలదొడ్లో పెట్టినట్లు పశువులకొటాలలో పెట్టి, తలుపులు బిగించి, రాత్రింబగళ్లు కాబ్దారీలు చేసుకొంటున్నారు — కూలీజనాన్ని!

౨

"అబ్బా! అమ్మ! అమ్మ!..."

"........................"

# ఉడిపి శ్రీకృష్ణవిలాస్

# UDIPI SRI KRISHNA VILAS

(ఫలహారము, భోజనము, వసతికి తగిన నిలయము)

వివిధ రకముల తీపి, కారము, పిండివంటలు, చల్లని పానీయములు గలవు. కాఫీ చాల రుచిగా ఉండును.



టీ పార్టీలు చిన్నవి పెద్దవి గూడ యేర్పాటు చేయబడును.

టెలిఫోన్: 8200.

1/4 మౌంటురోడ్డు, మద్రాసు.

**భోజనము సెక్షన్**

98A, వాలాజా రోడ్డు,
మౌంటు రోడ్డు.

సంతృప్తి భోజనము ఏర్పాటు చేయబడును.

**భోజనవసతుల సెక్షన్**

"ఉడ్‌లాండ్స్"
రాయపేట.

నవీనకాలపు సానిటరీ ఏర్పాటులతో కూడిన పరిశుభ్రమైన గదులు, భోగమునకు తగిన వసతి వేడినీరుగూడ సప్లయి చేయుబడును.

ప్రజల అభిరుచులకు తగురీతిగా అన్ని ఏర్పాట్లు చేయుదుము.
మీ ఆదరణ అభిమానములను అపేక్షించుచున్నాము.

కె. కృష్ణారావు, ప్రొప్రైటరు.

"ఇస్సు: ఇస్సు: పరమాత్ముడా! తండ్రీ! పగవాడిక్కూడా వద్దురా!..."

అని ఆ తాటాకుల చుట్టుగుడిసెలో గడ్డి మీద ఈతాకులచదర పరుచుకొని, మూలుగుతోంది — లక్ష్మి.

మినుకుమినుకు మంటోంది — ఓ సన్నని పగడంలాంటి బుడ్డిదీపం. పక్కలో కూర్చొని తల నిమురుతున్నాడు — మామ పెంచెలు గాడు, బుడ్డిదీపం క్రీనీడ కాంతిలో తళతళలాడే కళ్లల్లో కళ్లు పెట్టుకొని, నుదుటిమీద నుదురు చేర్చి.

"అమ్మీ! నువ్విలా ఆయాసపడితే నాకు దిక్కేదో చె"ప్పన్నాడు పెంచెలు.

"పరమాత్ముడా! నారాయణమూర్తీ! ఊఁ! ఊఁ! అబ్బ! నే బతకనయ్యో! మామా!" అని కంట నీరు పెట్టింది లక్ష్మి.

"ఓర్చుకో! ఓర్చుకో! అమ్మీ! ఆ నారాయణమూర్తి పెట్టినగడియ ఇంకా రాలేదు" అని ఓదారుస్తున్నాడు పెంచెలు.

"మామా! దినానికి శేరుబియ్యం, పావలాడబ్బులూ, పైటన్నం పాడయి పోయింది గదే ఈ యేడు! నా కీగండం రాకుంటే, నీచెయ్యికి నాచెయ్యి కలిపి ఇద్దరం తెచ్చుకొనేవాళ్లం గదే!..." అని ఇస్సు మన్నది లక్ష్మి!

"ఎంతదూరం చెప్పినా నువ్వు ఆవూసు విడిచిపెట్టవు గదూ —" అన్నాడు పెంచెలయ్య.

"అయ్యో! ఓ రెండు నెలలపాటు దిగులు లేకుండా పొయ్యేది గదే, మామా —" అని మూలిగింది లక్ష్మి.

"అబ్బా! నా రెక్క లుండంగా నీకడుపు నిండదూ? వోపలేని మనిషివి కదల్లేవు మెదల్లేవు. నీ కెందు కాదిగులు? నాకడుపులో అన్నం తీసి నీకడుపులో పెట్టి బతికించుకొంటాను నిన్ను. ఆవూసు మరిచిపో".

"ఇస్సు: ఇస్సు: నువ్వయినా కూలి చూసుకొన్నావా లేదే! రద్దీదినాలు పోగొట్టుకోవోక" అన్నది లక్ష్మి.

"ఆనారాయణమూర్తి దయపెట్టి, రెండు తలలూ వేరయి పిల్లా తల్లీ సుఖంగా ఉన్నారనుకొంటేగాని నే కూలికే పోను. ఎదవడబ్బులైరి" అన్నాడు పెంచెలు.

"అయ్యో! అబ్బా! అమ్మా! నాప్రాణాలు పోతుండై మామా! కానిరోజులు వచ్చిపడ్డై, ఎట్లా చేస్తావో" అని ఏడిచింది లక్ష్మి.

"నువ్వేడవబోక పిల్లా! మొన్ననే చిన్నరెడ్డి పాదాలు పట్టుకొని తూమెడు గింజలు నాయుకు తెచ్చుకొన్నానుగదా! ఆగింజలతో ఇంకా పదిరోజులదాకా దిగులులేదు. అటుపైని దేవుడే ఉండాడు —"

"మాయదారి కానుపు. ఈపాటికి బయట పడవలసిందే, పడిందిగాదు. ఏం చేయను. పది రోజుల కిందటనే ఈబరువు వొదిలిపోతే, బిడ్డని ఒళ్లోకట్టుకొని అయినా పోయేదాన్ని కూలికి."

"నీ ఇష్టమూ నా ఇష్టమూనా? మన దినాలు మంచివైతే ఆ తొలికాన్పుకు పుట్టిన పిల్లోడే దక్కేవాడు. ఇంకో ఏడాదికి ఏబ్రె గొడ్డుకాడనయినా పెట్టుకొంటే చేతి కక్కరకు వచ్చేవాడు" అని తల నిమిరాడు పెంచెలు.

"నా ముఖాన్ని ఆరాత లేదు మామా!" అని పెనిమిటి మెడ చుట్టవేసుకొన్నది లక్ష్మి.

"ఏడవ్వోకు: నీకోజు మంచిదయి, ఈ కడుపు పండకూడదూ?" అని ఆమె కళ్లు తుడిచాడు పెంచెలు.

"అబ్బా! మామా! ఈ రాత్రి గడిచేది ఎట్లనే? ఇంట్లో రెండో ఆడదిక్కు లేదు. నువ్వొంటరిగాడివి. ఎట్లా చేస్తావే?" అని చాపమీద పొర్లింది లక్ష్మి.

"ఆడదయితే అదనమా? అన్ని పనులూ నేనే చేస్తాను. ఆ కాన్పుకు మా అమ్మ ముసిలిముండ ఉండబట్టి ఆదుకొంది. ఎన్నాళ్లుంటారు ముసిలోళ్లు. నాకు నువ్వూ, నీకు నేనూ, మనిద్దరికీ ఆ భగవంతుడూ దిక్కు. దిగులు పడబోక: బుడ్డితో బుడ్డెడు బ్రాందీ తెచ్చి తయారుగా ఉంచాను" అని ధైర్యం చెప్పుతున్నాడు పెంచెలు.

ముఫయ్యేళ్లు పెంచెలుగాడికి. మాలవాడు. పిడుగు. పిడిరాయిలాంటిదేహం. తండ్రిరుణం కేవలం చిన్నతనంలోనే తీరిపోయింది. ఒక్కగాక ఒక్కపిల్లవాడు కాకిపిల్ల కాకికి ముద్దు గదూ. ప్రాణాలన్నీ ఆ కొడుకుమీద పెట్టుకొని పెంచి పెద్దవాణ్ణి చేసింది తల్లి.

తన తల్లిదండ్రులవల్ల అతగాడికి సంక్రమించిన ఆస్తి ఐశ్వర్యం కండలు మెలిదిరిగిన తనశరీరం తప్ప రెండో ఆధార మేమీ లేదు - ఆఏకాకికి. మేడితోక పట్టుకొని ఎద్దులను ముల్లుకర్రతో తోలి భూమిని చీలికలు చేసే శక్తి అతని బాహువుల్లో ఉన్నది గాని భూమే లేదు అతగాడికి. చేతిలోకి మేడితోకే లేదు - ఆమనిషికి. తా నిప్పుడు తాటాకుల గుడిసే వేసుకొని జీవించే ఆచోటు పెద్దరెడ్డిది. పక్కన ఉన్న మామిడిచెట్లనూ, తోటకయ్యనూ, మిరపచేనూ కాబ్దారీ చేస్తుండే షరత్తు మీద ఆస్థలంలో గుడిసె వేసుకొని స్థావరం ఏర్పాటుచేసుకో నిచ్చాడు పెద్దరెడ్డి. కూలిపని చేసుకొని పొట్ట పోసుకొంటున్నాడు — పెంచెలు. ఎర్రటి ఎండలు కాసినా, కుంభపోతగా వర్షాలు కురిసినా, పిడుగులు పడినా జంఝామారుతం వీచినా వాడి కాచుట్టుగుడిసే పెట్టని కోట, పెద్దరెడ్డి అనుగ్రహం.

భార్యకు ప్రసవదినాలు. తొలికాన్పు నష్టమై పోయినదిలగాయతు ఆ దంపతులు పిల్లలకోసరం అలవటించి పోతున్నారు. భార్యకు పెనిమిటిగాని పెనిమిటికి భార్యగాని క్షణం ఎడమైతే భరించలేని మమకారం వాళ్లిద్దరికిని. అందువల్ల భార్యను ఆస్థితిలో

విడిచి కూలిపనికి పోలేక, ఇంటిపట్టునే నిలిచి పోయాడు పెంచెలు.

ఆరాత్రి తెల్లవార్లూ లక్ష్మి వేదనపడుతూనే ఉన్నది. ప్రసవం కాలేదు. కంటిమీద కునుకెటువంటిదో మరిచిపోయి, మంత్రసానిపని తానొంటరిగా జరిపించడానికి సిద్ధపడి కూర్చున్నాడు - పెంచెలు

ఇంకా వేకువజామే! కోళ్లు కూసే సమయం. తూర్పున చుక్క పొడిచిన వేళ. భార్య బాధ పడిపడి, అలిసే పోయిందో, స్మృతి తప్పేపోయిందో, గంట సేపటినుండి మాటా మంతీ మూలుగూ ముక్కూ లేకుండా అట్లా పడిఉన్నది. పెంచెలయ్యకు భయం వేసింది. బుడ్డిదీపం ఆమె ముఖందగ్గర పెట్టి పరీక్షించి చూచుకొన్నాడు. ముక్కువెంట శ్వాసఆడుతూనే వున్నది. గుండెలు కొట్టుకొంటూనే ఉన్నవి. నాడి ఆడుతూనే ఉన్నది. ఒంటరిగాడు ఏమి చేయగలడు!

బయట ఎవ్వరిదో కిర్రుచెప్పుల చప్పుడు.

"పెంచెలుగా!" అని ఇద్దరు మనుష్యుల కంఠధ్వని ఏకకాలమందే అతని చెవిని పడింది.

ఓ బెబ్బులి కేక వేసి, వెన్ను చరిచినట్టు అదిరిపడి గడగడలాడే గుండెను గుప్పిట్లో పెట్టుకొని బయటికివచ్చాడు పెంచెలుగాడు. చూస్తే పెద్దరెడ్డీ చిన్నరెడ్డీను...

వాడు తనకళ్లు తానే నమ్మలేకపోయాడు. 'ఏమి విచిత్రం, ఎన్నడూ లేదే! అన్నదమ్ములయినా గర్భశత్రువులే. ఒకరిపచ్చ మరొకరు ఓర్వలేని ఏకోదరులే! మొన్న మొన్నటివరకూ కుటుంబాస్తి పంపకంవిషయంలో తగువులు పెట్టుకొని కోర్టు కెక్కి, కత్తులు నూరుకొన్న అన్నదమ్ములు, ఆ సమయమేమిటి? ఏకకాలంలో రావడమేమిటి? ఆ పిలవడమేమిటి?'

నిర్విణ్ణుడై పోయాడు పెంచెలుగాడు.

"కోతకు మనుష్యులు చాల్లేదు. నువ్వూ నీపెళ్లామూ గూడా రావాలి, రండి" అని ఇద్దరూ పాఠం అప్పచెప్పినట్లు ఒక్కసారిగా పిలుస్తున్నారు. పెంచెలుగాడికి ఖంగారుగా ఉన్నది.

"కోత ఎక్కడ సామీ!" అని అడిగాడు.

"వరవల చేలో" అని పెద్దరెడ్డీ,

"అంకమ్మ దొంపుల్లో" అని చిన్నరెడ్డీ తమతమ పొలాలు గుర్తు చెప్పారు.

పలకలేదు పెంచెలుగాడు.

"పలకవేం?" అని యిద్దరూ అడిగారు మళ్లా.

పలకలేదు పెంచెలుగాడు.

"నీళ్లు నమిలితే ప్రయోజనం లేదు. రెండేళ్లుగా నా స్థలంలో గుడిసెవేసుకొని కాపరం ఉంటున్నావు — తెలుసునా" అన్నాడు పెద్దరెడ్డి.

"మొన్ననే గదరా, కూటికి లేవని తూమెడు వడ్లు నాముకు తెచ్చుకొన్నావు నాదగ్గర -" అన్నాడు చిన్నరెడ్డి.

"చిత్తం -" అన్నాడు పెంచెలు.

"మరి నోరులేదూ? ఖండితంగా చెప్పెయ్యి" అన్నాడు చిన్నరెడ్డి.

"ఏం చెప్పేది సామీ? గుడిసెలో ఆడమనిషి కనలేక మాటలేకుండా పడిపోయింది. ఆ మనిషి కుదురుగా ఉంటేనేగాని నేను కూలికి రాలేను నా ఏలినవాడా?—" అన్నాడు పెంచెలు.

"అటయితే నాకాడ వొడ్లు ఎందుకు తెచ్చుకున్నావూ?—"అని అడిగాడు చిన్నరెడ్డి.

"నాముకు తెచ్చుకొన్న గింజలు కదా సామీ అవి. ఉగాదినాటికి నాముతో గూడా మీ గింజలు మీకు కొలిచేస్తాను; బాకీ పెట్టుకోను లే" అన్నాడు పెంచెలు.

"ఆ పప్పు లేమీ ఉడక వోయ్! అబ్బయ్యా! నువ్వూ నీపెళ్లామూ గూడా కోతకి వస్తారని గదా నేను గింజలు కొలిచిపెట్టింది? నాము నాము అంటే ఎవరికోసరం ఇస్తావు నాము? నాము కొలిస్తే కోతపని ఏంగావాలనుకొన్నావు?" అని చిన్నరెడ్డి తొందర చేశాడు.

"ఆడమనిషిని ఆవిధాన్ని విడిపించి నేనెట్లా వచ్చేది సామీ?" అన్నాడు పెంచెలు.

"నువ్వు నడుస్తావా? మెడమీద నాలుగు గలీతాలు పెట్టుమంటావా?" అని చిన్నరెడ్డి చేతికర్ర వాడి మెడమీద బెట్టి ముందుకు నెట్టాడు.

నాలుగడుగులు ముందుకు తూలేడు పెంచెలు.

"నేను రావడానికి లేదు సామీ" అంటున్నాడు పెంచెలు.

"ఎవడి కోసరం వస్తావు? గింజలు తేరగా ఉన్నా యనుకొన్నావూ?" అని మళ్లా నెట్టాడు చిన్నరెడ్డి. ఇంకా నాలుగడుగులు తూలేడు పెంచెలు. ఇదంతా నిదానంగా చూస్తూవున్న పెద్దరెడ్డికి చుర్రుమనింది.

"ఏందోయ్! పెద్దమనిషీ నామనిషి నట్లా నెట్టుకొంటూ పోవడం?" అని అడ్డుతగిలేడు పెద్దరెడ్డి.

"ఏమోయ్ నెట్టితే?" అని ఎదిరించాడు చిన్నరెడ్డి.

"వాడు నామనిషి-" అన్నాడు పెద్దరెడ్డి.

"నీమనిషి! గడించావు. నామనిషి" అన్నాడు చిన్నరెడ్డి.

"నువ్వు పుట్టించావు! ఇప్పటికి రెండేండ్లుగా నా స్థలంలో వాడు గుడిసె వేసుకొని కాపరం ఉంటూంటే నీమనిషెట్లా అయినాడోయ్?" అన్నాడు పెద్దరెడ్డి.

"నిన్నగాక మొన్న నాదగ్గర తూమెడు వడ్లు నాముకు తెచ్చుకొంటే నీమనిషెట్లా అయినాడు—"అన్నాడు చిన్నరెడ్డి.

"అబ్బా! శానా యిచ్చాడోయి గింజలు. తూమెడు వడ్లు ఇచ్చాడంట. తిరిపెం! పదరా

# వేంకటేశ్వర ఆయుర్వేద నిలయము.

## చింతలూరు, ఆలమూరు పోస్టు, తూర్పుగోదావరి జిల్లా.

అనేకవిద్వద్వైద్యసభలయందు స్వర్ణపతకములను, ఉత్తమతరగతి యోగ్యతాపత్రములను, బహుమానములను పొందిన "వైద్యరాజ" ద్విభాష్యం వెంకటేశ్వర్లు అండ్ సన్ వారిచే

శాస్త్రీయముగ సిద్ధపరుపబడిన దివ్యౌషధములు

### వసంతకుసుమాకరము

మధుమేహము, అతిమూత్రము, రాచపుండ్లు. శుక్లనష్టము, తెల్లకుసుమ,సుఖవ్యాధులు జీర్ణించుటచేకలుగు సకలమూత్రనాళ వ్యాధులకు రాజౌషధము. తులం రు 20-0-0

### సిద్ధమకరధ్వజము

ఇందు బంగారుకలదు. పూచీయిచ్చెదము.

జగత్ప్రసిద్ధమగు బలవర్ధకౌషధము. రక్తక్షీణము, వీర్యదోషము, నపుంసకత్వము, క్షయ, బలహీనతమొదలగు దీర్ఘవ్యాధులకు దివ్యౌషధము. తులం రు 24, 60 మా. రు 10.

### ఏకోత్తరవృద్ధి మహాలక్ష్మీవిలాస రసము చ్యవనప్రాశము

క్షయరోగులకు అమృతోపమానములగు దివ్యౌషధములు.

క్షయ, శ్వాసకాసలు, ఉబ్బసము, కఫముతో కలసి రక్తముపడుట, రక్తహీనత, శరీరకృశత్వము, హృదయదౌర్బల్యము, దీర్ఘకాలమునుండి బాధించు మొండిదగ్గులు మొదలగునవి జయించును. రెండు ఔషధములు కలిపి సేవించవలెను. సెట్టు రు 13-12-0

### స్వర్ణక్రవ్యాద రసము

చిరకాలాజీర్ణము, కడుపుబ్బరము, ప్రేగులరచుట, శూల, గుల్మము, యకృత్ ప్లీహవృద్ధులు, మొదలగువానిని జయించును. అజీర్ణజ్వరమును నశింపజేయును. బలవర్ధకము, తులం రు 4-0-0

### రసరాజ రసము

అనేకలక్షణముతోగూడిన హిష్టీరియా అను వ్యాధిని నివర్తింపజేయు ముఖ్యౌషధము. తులం రు 10-0-0

### ప్రదరారిలోహము

స్త్రీల తెల్లకుసుమ వ్యాధులకు దివ్యౌషధము. తెలుపు, ఎరుపు, పసుపు, నలుపు రంగులుగల కుసుమలు నివారించును. కుక్షిశూల, కటిశూల, దేహశూల, సర్వాంగశూలలు నివర్తించును. 40 మాత్రలు రు 3-0-0

### సంపూర్ణకాంచన రసం

సంవత్సరములకొలది శరీరమునజీర్ణించి నానావిధ వికారములను గలిగించు ప్రాతశగలను బాగుచేయు పరమౌషధము. వ్యాధిని పూర్తిగా నిర్మూలింపజేయుటయేగాక కామకుతూహలమును, కాంతిని, పుష్టిని, బలమును కలుగచేయును. 30 మాత్రలు రు 5-0-0

### ఋతుశూల సంహారి

గర్భగతమగువాతముచేతను సుఖవ్యాధులు జీర్ణించుటచేతను మరియే యితర కారణములవలనను గలుగు ఋతుశూలలను నివర్తింపచేసి గర్భోత్పత్తినికూడ గలుగజేయును. 18 మాత్రలు రు 2-0-0

### రత్నపురుష లేహ్యము

దేహపుష్టి, వీర్యవృద్ధి, లేక బలహీనులుగ నుండువారలకును, పథ్యపానములు చేయలేనివారలకును పెద్దటానిక్. హోటలుభోజనము కాలేజీచదువులవలన క్షీణించు విద్యార్థులకు అమృతమువంటిది. శుక్లనష్టమునుకట్టిబలమును ఉత్సాహమును కలిగించును. 40 తులములు రు 2-8-0

### పూర్ణచంద్రోదయ మాత్రలు

శుక్లనష్టము, శీఘ్రస్ఖలనము, స్వప్నస్ఖలనములను తగ్గించి నరములకు బలము, కండపుష్టి, వీర్యవృద్ధి, ఉత్సాహము కలిగించును. 60 మాత్రలు రు 8-0-0

**బ్రాంచీలు:**— కాకినాడ, రాజమండ్రి, పెద్దాపురం, అనకాపల్లి, విశాఖపట్టణం, ఏలూరు, అమలాపురం, తుని, రామచంద్రపురం, గుంటూరు, బెజవాడ, పాలకొల్లు, బందరు, విజయనగరము, తెనాలి, నెల్లూరు, బాపట్ల.

236 ఔషధములు గలవు. కేటలాగు ఉచితము.

మనచేలోకి, పదరా ఏంచేస్తాడో చూతాం''- అని పెద్దరెడ్డి పెంచెలుగాడిచెయ్యి పట్టుకొని లాగేడు.

"ఏడకిరా నీవు పోయేదీ? కాళ్లు విరగ బొడుస్తా చూడు!" అని చిన్నరెడ్డి పెంచెలు గాడి జుట్టు పట్టుకొని తనపక్కకి లాక్కొన్నాడు.

"సాములారా! నే నిద్దరికీగూడా కూలికి రాలేను సామీ! వోపలేనిమనిషి, ఒళ్లు తెలియకుండా గుడిసెలో పడిపోయింది—" అని గోలపెట్టుతున్నాడు పెంచెలు.

"గుడిసెలో మనిషి. చావనీ. పీడ విరగడై పోతుంది" అని పెంచెలుగాడి మెడమీద కర్రపెట్టి నెట్టాడు చిన్నరెడ్డి.

"ఏందోయ్? ఈ దౌర్జన్యం! ఈ పాలి వాడివంటిమీద చెయ్యి వేయి, చెప్తా నీపని." అని పెద్దరెడ్డి చిన్నరెడ్డిమీదికి వచ్చాడు.

"ఏందోయి నువ్వు చేసేది? పక్షి!" అన్నాడు చిన్నరెడ్డి.

"పక్షి ఎవడురా? కుంకా!" అన్నాడు పెద్దరెడ్డి.

"కుంకా గింకా అన్నావంటే, మూతిపళ్లు రాల్తాయి భద్రం—'' అన్నాడు చిన్నరెడ్డి.

"మూతిపళ్లు రాలితే తల చెక్కలుగా పగుల్తుం" దన్నాడు పెద్దరెడ్డి.

"నీ అబ్బ లేచిరావాలిరా ముండమోపి!'' అని పక్కన ఉన్న రాగోలుకర్ర తీసుకొని పెద్దరెడ్డిమీదికి దూకాడు చిన్నరెడ్డి.

"నీ ఆయువు మూడింది రారా! లమ్డీకే'' అని పక్కన ఉన్న రోకలి తీసుకొని చిన్నరెడ్డిమీదికి వచ్చాడు పెద్దరెడ్డి. గడగడ లాడుతున్నాడు పెంచెలు.

''కొట్టుకోబోకండి సామీ!" అని యిద్దరి సందునా దూరాడు పెంచెలు.

అన్నదమ్ముల ఆగ్రహం ఒక్కసారిగా పెంచెలుమీదికి తిరిగి,

''ఛీ! మాలమాదిగకొడకా! ఇద్దరికీ కూలికి వస్తానని చెప్పి మోసం చేస్తావా? చావుగాడిదకొడకా!—"

అని రోకలీ, రాగోలుకర్ర ఏకకాలమందే పెంచెలుగాడినెత్తిన పెట్టారు సోదరులు

"చచ్చాను బాబో!-'' అని నెత్తురు చిమ్ముకొని నేలమీదపడ్డాడు పెంచెలుగాడు.

''నేను ఎందుకు పుట్టాను బాబో!" అన్నట్టుగా నెత్తురు చిమ్ముకొని నేలమీద పడి కేరు కేరుమని ఏడిచింది గుడిసెలో బిడ్డ.



# 'సాంగ్ యాంగ్'



శ్రీరంగారావ్ నిష్పాణి

బహుదూరమున నున్న తూర్పుసముద్రపుదీవులలో "బాలి" యను చిన్నదీవి యందు హిందూమతము అనేక విషమస్థితుల నెదిరించుచు తన స్వశక్తిచే కొనయూపిరి గలిగి ప్రాణావసాన దశయం దున్నది. మనోహరమయిన ఈ దీవియొక్క అపురూప ఆచారములలో దైవికమగు "సాంగ్ యాంగ్" నాట్యకళను మించినది వేరొండు లేదు. సంవత్సరములో అనేక పర్యాయములు శ్రీ మహావిష్ణుప్రీతిగా ఈ నాట్యము ఒనరింపబడుచున్నది. విద్యాపాండిత్యఆచారములకు లోటు గలుగనీయక, వృద్ధిపరచుచు హిందూమతవ్యుత్పన్నతను గ్రహించుటయందు పాలనేశియనులకన్న (Polinecians) వేరొకరు లేరు. ఇంతకును పాలనేశియనులు హిందూమతమును సంపూర్ణముగ ననుకరించలేదు.

అందుచే "సాంగ్ యాంగ్" నాట్యము వారియొక్క మతసంబంధమైన పారవశ్యతాభినేతమేగాక, ఉన్నతసాంప్రదాయకమైన నాట్యకళ. ఇది ఇంపైన జేగంటలు మొదలగు సంగీతసాధనములతో కూడి చిత్రభ్రమచే మైమఱపించును.

సాధారణముగా అంటువ్యాధులు మొదలగు రోగములు సంభవించి దిగులొందజేయుతరి, హిందువులు రామభజన చేయురీతి వారు ఈ నాట్యము చేయుదురు. ఈ సంస్కారమును 'బేలలాంగ్'నందు ఒక్క పర్యాయము చూచుట నాకు తటస్థించినది. సువర్ణచ్ఛాయ గలిగి విలువైన దుస్తుల ధరించిన ఇరువురు చిన్న బాలికలను దేవాలయపు పూజారి తోడ్కొనివచ్చి వారిని దైవపీఠమున కెదురుగ భక్తితో మోకరింపజేసెను. వారియెదుట ధూపపాత్ర ముంచబడెను. ప్రమిదదీపములచే చుట్టును అలంకరింపబడెను. (పతంద) పురోహితుని మంత్రోచ్చారణము వినుచు ప్రేక్షకులు నిశ్శబ్దముగా నుండిరి. అత్తరి నబ్బాలికలు మైమరపింపజేయునట్టి యాధూప ఆఘ్రాణమువలన మత్తెక్కి నిద్రచెందిరి. తోడనే వారు శిరస్సులు త్రిప్పదొడంగిరి. తక్షణమే జేగంటలు మ్రోయింపబడెను. బాలికలు ద్రుతసంగీతమునకు సరిగా, తలలు త్రిప్పుచు కొంతవడికి స్మృతి దప్పి క్రింద బడిపోయిరి. అచ్చటగల స్త్రీలందరును వారి నొసటియందలి స్వేదమును దుడుచుచు వారి శిరస్సులపై సువర్ణకిరీటముల నుంచిరి. కొంతవడికి మెల్లగా నిద్రావస్థనుండి లేచెడిరీతి ఆబాలికలు మేల్కాంచి లేచిరి. వారాసమయమున బహు చక్కదనము గల్గి, శాస్త్రోక్తముగా, శిరః, పాద, హస్త భావనాభినయములచే నాట్య మభినయింప నారంభించిరి. తన్నాట్యసంబంధమైన కీర్తనలను స్త్రీలతో గలసి, పురుషులుసహా పాడదొడంగిరి. దానిచే సంతసమేగాకఉద్రేకమునసహాగల్గెను. దైవసంబంధ మగు "సాంగ్ యాంగ్" నాట్యము ఆశ్చర్యమును గొల్పి నా మనసును కరగించినది. ఇయ్యది నా గ్రామమందు కొన్ని సంవత్సరములకు మునుపు జరిగిన పరిస్థితిని జ్ఞప్తికి తెచ్చినది. అచట ఒకనది యొడ్డున నున్న గొప్ప వటవృక్షచ్ఛాయలో (పరివ్రాజక) సన్న్యాసులు విడిదిచేసియుండిరి. పిల్లవాయువులతోగూడిన ఆనాటిరాత్రి వెన్నెలలో నిశ్శబ్దముగా నుండుతరి, అచట నుండువారందరును నిద్రజెందిరి. నాకు సహా నిద్రవచ్చెను. కాని అంతలో అచటి సన్న్యాసుల "హరిబోల్" అను ఉచ్చారణము సమస్వరమున వినబడెను. అయితే ఒకమాట. నే చెప్పజాలను. అది యేమి మాయయో! సమాధానచిహ్నము ఎరుకపరచు రీతి గోచరించెను. హృదయశమనముగ

# 'బాలి' హిందూదేవాలయ దేవదాసీలు





వీరు 'బాలి' హిందూదేవాలయంలోని దేవదాసీలు; నర్తకులు. ప్రాచీన హిందూపౌరాణిక గాథలను పాడి అభినయిస్తారు. ఇందునిమిత్తం వీరిని చిన్నప్పటినుంచి తర్ఫీదు చేస్తారు; కాని రజస్వలలయిన తరువాత వీరి నిట్టి కార్యములలో ప్రవర్తింప నీయరు. వీరు ధరించినవి కమలాలంకృతములయిన సువర్ణ కిరీటములు.

నిట్టూర్పు వదల కుతూహలము గల్గెను. దుఃఖదౌర్భాగ్యము మరుగయ్యె. నిశ్చలత్వము నన్నావరించెను. 'సాంగ్ యాంగ్' నాట్యము గాంచినపుడు గూడా నాకిట్టి యనుభవమే గలిగెను. హిందువులమైన మన జాతి ఔన్నత్యమును సూచించు సంస్థలన్నిటికంటె నే చూచిన వేడుక బహువింతదైనది. ఆనాట్యము, సంగీతము విష్ణుదేవునికి మనభక్తి పారవశ్యతను ఆరాధనను సూచించును.

నాట్యము కాగానే అబ్బాలికలను బంగారుకుర్చీలపై కూర్చుండజేసిరి. పిమ్మట అచటి వ్యాధిగ్రస్తులు తమ రోగనివారణార్థమై ఆబాలికల దుస్తులను తాకిరి.

'బాలి' ప్రాచీన హిందూదేశపు కుమార్తె. ఆమె పుట్టినింటినుండి వేర్పడినది. ఆమెతల్లి ఆమెను మరచిపోయియెన్నో యుగములైనది. అయిననుబాలీపిలుపు తిరుగు లేనిదయ్యెను. పునరుద్ధరణమునకై ఆమె పడువేదన తీవ్రమైన దని 'సాంగ్ యాంగ్' నాట్యము సూచించుచున్నది. బాలినీయులమతము నశింపక మున్నే, హిందూమతము పాశ్చాత్యనాగరికతలో మునుగుటకు మున్నే, ప్రతి హిందువును, బాలినీయ జాతిమతము హిందూమతముతో ఐక్యమగునట్లు యత్నింపవలెను.



# పంచాయతీలరాజ్యమే కావలెను

**గాడిచర్ల హరిసర్వోత్తమరావు**

మతములో దేవుడు, నీతిలో సత్యము, ప్రవర్తనలో ధర్మము ఏవిధంగా మనదేశములో మనకు సర్వసమాదరణీయము లయిన పదాలో, సంస్థలలో 'పంచాయతీ' కూడ అంత సర్వసమాదరణీయమయిన పదంగా కనిపిస్తుంది. ఏగ్రామానికి పోయి ఏజాతిలో బుట్టినవారినైనా, ఏ అంతస్తువారినైనా, స్త్రీనైనా- పురుషునైనా, ఎవ్వరినైనా పలకరించడములో 'పంచాయతీ' అనేమాట యెత్తినామా ఆ వ్యక్తి అది యేదో తనకు చాల దగ్గరివస్తు వయినట్టు వెంటనే గురుతించుననడానికి సందేహము లేదు.

## 'పంచాయతీ' మన కాస్తము

ఇంత ఆప్తత్వం మన కీపదము నెడల కలుగడానికి కారణ మేమి? గాలి, నీరు, ఆహారము మానవులయి పుట్టిన మనకు ఎట్లు ప్రతినిమిషము ఆవశ్యకము లయిన వస్తువులుగా ఏర్పడినవో ఈపంచాయతీ అనే సంస్థకూడ మానవ సంఘానికి మన దేశములో అంత అవసరమయినదిగా ఉంటూవచ్చినది. నిజానికి పంచాయతీ భావము మనరక్తంలో భాగ మయిపోయింది. 'ఏం పంచాయతీ పెట్టుకొన్నారయ్యా!' 'వాడు నీకు పంచాయతీ చెప్పేవాడో?' అనే వాక్యాలు మన ప్రజల జీవితములో దినమూ వినవస్తూనే ఉంటాయి. పంచాయతీ అనేసంస్థలు లేనిచోటకూడ ఇట్టి వ్యవహార మేర్పడిందంటే మన కీ వస్తువు ఎంత విడువ రానిదో అర్థ మయిపోతుంది.

## స్థానికజీవితానికి పరమసాధనము

నిజంగా స్థానికజీవితానికి పంచాయితీ పరమ సాధనముగా ఉండేది. ఇంట గెలిచి రచ్చ గెలవమన్నాడు. ఊరు బాగుపడితే ఉర్వి బాగుపడుతుంది. పల్లె పట్టణము గావలె, కాదు, పల్లే ప్రాంతం గావాలె. ప్రాంతమే రాజ్యం కావాలె, తద్వారా ప్రపంచం



గావాలె. ఇదే సహజపరిమాణం. దీన్ని మన పెద్దలు కనిపెట్టినంత చక్కగా ఇతర దేశాలలో, ఇప్పుడు కనిపెట్టినా, ఇదివరలో కనిపెట్టినవారు గారు.

## పంచాయతీ జనసభ, ప్రతినిధిసభ

ఒక్కనిమిషము ఆలోచిద్దాము. కాలపరిణామంలో పంచాయతీల ప్రాబల్యం చచ్చిన తరువాత "ఏం పంచాయతీ పెట్టుకొన్నారయ్యా?" అంటే మూకగా చేరి ఏ మల్లరిగా మాట్లాడుకొంటున్నారయ్యా అనే యేవగింపు టర్థము ద్యోతక మవుతున్నా, ఇందులోని పరమార్థంమాత్రము ఎవ్వరికైనా గోచరిస్తుంది. స్థానికులైనవా రంతా ఒకచోట చేరడము, గట్టిగా విషయా లాలోచించడం, మన కాచారముగాఉండి ఉండవలెననుటస్పష్టము. 'వా డేమి నీకు పంచాయతీ చెప్పేవాడా?' అనేది వెక్కిరింపుమాటగా తోచినా దీని పరమార్థంకూడా సులభంగానే ద్యోతక మవుతూంది. ప్రాతినిధ్యం నెత్తినవేసుకొని వాడు నీకు న్యాయం చెప్పేవాడా అనే యెత్తిపొడుపుగాదా యిది? కాబట్టి మన దేశములో పంచాయతీఅంటే తామే సమూహంగా చేరి ప్రజలందరూ మాట్లాడుకొనేదీ కలదనీ, ప్రాతినిధ్య మిచ్చి పనిచేయించడమూ కలదనీ స్పష్టీకరిస్తున్నాయి ఈవాక్యాలు. మానవుడు సంఘంగా చేరడానికీ, పరస్పరబాంధవ్యం నడుపుకోడానికీ సహజసాధనం భాష. కాబట్టి మన భాషలోనే! పంచాయతీ ప్రాశస్త్యము కనిపిస్తుందని ఇంతవరకు వివరించడమయినది.

## పంచాయతీల ప్రాచీనచరిత్ర

పంచాయతీలను గురించిన ప్రాతచరిత్ర వివరంగా ఇచ్చట వ్రాయవలసినపని లేదు. గ్రామాలలో పంచాయతీ లేర్పడి సర్వసమష్టి ఆస్తిమీద అధికారం పెట్టుకొని సర్వవ్యవహారాలూ చూచుకుంటూ పన్నువసూళ్లతోకూడా చేసి యిస్తూ రావడముచేత మనప్రజలు రాము డేలినా - రావణు డేలినా మాకు చలనము లేదు, పొమ్మనే నైతికధైర్యాన్ని సంపాదించి యుండినారని అందరు చరిత్రకారులును నేటిదనుక వ్రాస్తూనే ఉన్నారు. బ్రిటిషువారు మనదేశా న్నాక్రమించుకొని గ్రామజీవితాన్ని విచ్ఛిన్నముచేసి కకావికాలు పరచేవరకూ పంచాయతీలు సజీవంగానే ఉండినవని అందరూ ఒప్పుకొంటూనే ఉన్నారు. ఇటీవలి పరిశోధనలనుబట్టి గ్రామపరిపాలనకు పంచాయతీ ఒకటి ఉండేదనీ, సాధారణముగా గ్రామములో పరస్పర సహకారము చేసుకొని జీవించే అన్నివర్గాల పెద్దలును అందులో ఉండడముచేత న్యాయవిచారణకు సంబంధించిన చిల్లరవిషయాలు, గూఢ సాక్ష్యము, వ్రాతలు, కోర్టేర్పడి విచారించడము లేకుండా ఇట్టి సశాస్త్ర సక్రమ చర్చస్థితికి రాకుండానే – ఆ పెద్ద లెవరో పిలిచి చెప్పడముతో పరిష్కార మగుచుండినవనీ, అట్లా పరిష్కారము కానివాటికి అప్పటి కప్పుడు పార్టీలసమ్మతితోను, ఆవశ్యకమయినప్పుడు చీట్లువేయడముమూలకముగాను న్యాయవిచారణ పంచాయతీ యేర్పరచేవారనీ, ఒకపంచాయతీ తీర్పువిషయములో వివాద కలిగితే రెండవపంచాయతీ యేర్పరచి

దానితీర్మానమే సాధారణంగా తుదితీర్మానముగా నిర్ణయించేవా రనీ తేలినది. పరిపాలన చేసే పంచాయతీల నిర్మాణవిషయమునందు గూడ అనేకవివరములు తెలియవచ్చినవి. కొన్ని కొన్నిచోట్ల పెద్దపల్లెలలో నేటి యూనియనులలోను మునిసిపాలిటీలలోను వలెనే వార్డు లేర్పరచడ ముండినదనీ, ఒక్కొక్క శాఖలో పనిచేయడాని కొక్కొక్క కమిటీ ఏర్పడుతుండేదనీకూడ నిర్ణయ మయినది. ఈదినం వేసినవిధంగా ప్రజలు వోట్లు వేస్తుండినారా అనేవిషయములో మాత్రము ఏవిధమయిన సాక్ష్యమూ కన్పించడములేదు. ఒండొరులయెడల గౌరవంతో సహనంతో శాంతంతో గ్రామ కార్యనిర్వహణములో ఒక్కొక్క పని కొక్కొక్కరుగా నడుము బిగించి ఏర్పడిన వర్గాలపెద్దలు (వీరినే కులాలన్నారు) పంచాయతీలో ఆపెత్తనంచేతనే సభ్యులుగా ఉన్నట్లు తోస్తుంది. అట్లాంటి పెత్తనము తనవర్గం తననడవడివిషయమునందు తృప్తిపడి ఆక్షేపించనియప్పుడే కలుగుతుందిగాని ఇతరత్ర కలుగదు. కాబట్టి అదీ ఒక విధమైన వోటే అనవచ్చును. ఇప్పుడు మనిషి నివసించే గ్రామభాగాన్ని పట్టి వోటు చీటీమూలకంగా ఏర్పడితే అప్పుడు మనిషి చేసేవృత్తినిబట్టి అందులో అతనికిగల గౌరవాన్నిబట్టి అతడుగా స్థానభ్రష్టత్వం తన నడవడిచేత పొందేవరకు ప్రజల మనోగతమైన సమ్మతిచేత వోటు ఏర్పడుతూఉండే దన్నమాట. నేటిపరిస్థితులలో ఆర్థికసమస్యలే బలవత్తమ మగుచుండడము మనము చూస్తున్నాము. కర్మకరులు స్థలమాహాత్మ్యంచేత వచ్చేవోట్లు, ధనికులు పెట్టుబడిదారులు కొట్టుకుపోతున్నారు; కాబట్టి, మా మా వర్గాలవారిగా మాకు వోట్లియ్యండి అనేసందర్భాలు లేర్పడినవి. కాబట్టి ప్రాతనాటి పంచాయతీ ప్రాతినిధ్యవిధానంలోని మూలసూత్రమునకు మనకు అర్థము కొంత గోచరించడానికి వీలుంది. అంత మాత్రంచేత ఆనాటి స్వరూపములోనే మన పంచాయతీలను నిర్మించగలమని ఎవ్వరును భ్రమపడవలదు.

## గ్రామానికి గ్రామసంస్థ

బ్రిటిషుప్రభుత్వపు చేతిలో నలిగి పంచాయతీలు నశించిపోయిననాటినుండి గ్రామసీమలసౌభాగ్యముకోసరము, గ్రామములోనే పరిపాలనక్షేమి, న్యాయవిచారణక్షేమి, ఇతర కార్యాలక్షేమి సంస్థ లేర్పడి పని చేయవలెనను ఆందోళన జరుగుచునే వచ్చినది. ఎచ్చటో కూర్చున్న ప్రభుత్వం, ఎచ్చటో యేర్పడిన కోర్టు, ఎంతమంది నౌకరుల నేర్పరచుకొన్నా, గ్రామసీమలసౌభాగ్యం పెంచలేరనువాదము నిరంతరము వినిపించుచునేవచ్చినది. 'డిసెంట్రలైజేషన్' అనేమాట చాలాకాలము మన దేశములోని రాజకీయవేత్తలు తారకమంత్రముగా పెట్టుకొంటూవచ్చినారు ఆ పేరితే స్థానికస్వపరిపాలనశాఖ యని మునిసిపాలిటీలు జిల్లాబోర్డులు వగైరా లేర్పడెను. ఇర్రిగేషన్ పంచాయతీ లేర్పడినవి. తరువాత గ్రామాల ఆర్థిక అవసరాల కోసరమని ౧౯౦౪లో కోఆపరేటివు సొసైటీ లేర్పరచి వానినిర్వహణకు పంచాయతీ లేర్పడినవి. ౧౯౦౫-౦౬ సంవత్సరాలలో వందేమాతరం ఉద్యమ మారంభమయ్యేటప్పటికి ప్రజలహక్కులు సాధించవలెననే దృష్టి అంతటా వ్యాపించినది. ౧౯౧౩-వ సంవత్సరములో ఫారెస్టుపంచాయతీ లారంభమయినవి. ఈవిధంగా ప్రజల సంస్థలయెడల దృష్టి పారడంచేత ప్రాతపంచాయతీలస్మరణ బలవత్తరము కాజొచ్చినది.

## ప్రత్యక్ష పంచాయతీ శాసనము

౧౯౨౦-వ సంవత్సరమునుండి ప్రత్యక్ష పంచాయతీయుగము మరల ఆరంభమయినది. అప్పటికి జిల్లాబోర్డులు, తాలూకాబోర్డులు విరివిగా వ్యాప్తమయి యుండినగూడా గ్రామాలమీది శ్రద్ధ వీరి కెక్కువగా లేదనడము స్పష్టమవుతూ ఉండినందున, స్థానికంగా ఊళ్లు శుభ్రముచేసుకోడానికి, రోడ్లు వేసుకోడానికి, దీపాలు పెట్టుకోడానికి, విద్యాలయాలు పెట్టుకొని నడుపుకోడానికి, వగైరాపనులన్నిటిని చేసుకోడానికి గ్రామాలవారి కోరికమీద పంచాయతీలు పెట్టుకోవచ్చుననీ, ఆపంచాయతీలు గవర్నమెంటువా రేర్పరచేపంచాయతీల రిజిస్ట్రారుజనరలు అధీనములో నుండవలసినదనీ ౧౫-వ నంబరుశాసనము ౧౯౨౦ లో చేసిరి. గ్రామాల కవసరమగు పను లన్నిటిని జాబితా చేసి—నాగజముడు కొట్టివేయడముతోకూడ— అంతట్లలో అన్ని పనులుగాని, కొన్నిపనులుగాని, ఒకేపనిగాని నిర్వహించడానికి పంచాయతీ లేర్పడవచ్చునని నిర్ణయించిరి. ఈపంచాయతీ నిర్మాణమును నిర్వహించడానికి గౌరవ అర్గనైజరు లని పేరు పెట్టి గౌరవోద్యోగులను రిజిస్ట్రారుజనరలు నియమించెను. దివాన్ బహద్దూరు ఎన్. గోపాలస్వామి అయ్యంగారు మొదటి రిజిస్ట్రారుజనరలుగా ఏర్పడిరి. శ్రీ టి. జి. రుధరుఫర్డుగారు రెండవ వారు. కోఆపరేటివు సొసైటీలు ఆరంభించినప్పుడు గ్రామగ్రామానికి సొసైటీలు పెట్టవలెనని ఎంత ఉత్సాహముతో పని జరిగెనో అంతకంటె ఎక్కువ ఉత్సాహముతో పంచాయతీల నిర్మాణము జరిగెను. వేలకు వేలు పంచాయతీ లేర్పడెను.

అదే ౧౯౨౦-వ సంవత్సరములోనే గ్రామ పంచాయతీకోర్టుల ఆక్టుకూడ నిర్మించిరి. ఈ కోర్టు లిప్పుడనేక గ్రామాలలో ఏర్పడి పని చేయుచున్నవి. కాని వీనివిషయ మిప్పట్టున ఎక్కువవిస్తారముగా వివరింప నక్కరలేదు.

## ౧౯౨౦-వ సంవత్సరపు ౧౫-వ శాసనము.

౧౯౨౦-లో ఆరంభమయిన గ్రామపంచాయతీలకు నియమితమైన ఆదాయమార్గా లేర్పరచలేదు. సర్కారువా రిచ్చేగ్రాంటులు, గ్రామపు ఉమ్మడి ఆదాయాలుతప్ప ఇతరము లేమీ కన్పించలేదు. శాసనములో కొన్ని కొన్ని పన్నులు వేసుకోవచ్చునని వ్రాయనేమో వ్రాసిరి. కాని పన్నుబరువు మోయలేని రైతుపై మళ్లీ పన్ను వేయడం సాధ్యము కానిపనిగా ఉండినది. ఉమ్మడి ఆదాయాలు పల్లెటూళ్లలో తమస్వత్వము చేసుకొన్న పెద్దమనుష్యు లనేకప్రాంతాలలో నున్నారు. వానిని పంచాయతీల ఉపయోగముకొరకు మార్చుకోవడముకూడ కష్టమయినది. అందు

చేత పంచాయతీలు విరివిగా ఏర్పడినా, కార్యసాధన చేయవలెననే దీక్షకూడా ఉండినా, కొన్నికొన్ని ప్రాంతాలలో తప్ప అంతటా పనిజరగడము కష్టమయినది. అట్లుండియుగూడ ఆనాటి యీ యైచ్ఛిక గ్రామపంచాయతీలు చేసినపని అద్భుతముగానే కన్పించినది.

ఆయాక్టుక్రింద గ్రామ పంచాయతీలు, గుంటూరు, సేలము, పడమటి గోదావరి ఉత్తరార్కాటు, అనంతపురములవంటి జిల్లాలలో చాల విస్తారముగా స్థాపితమయినవి. ఆరువేలపంచాయతీలు మొత్తముమీద నిర్మితమయినవి. నేడేడువేలకు పైబడియున్నవి.

ఈ గ్రామపంచాయతీలు బహుశ్రద్ధగా చేసినపని విద్యాలయముల నిర్వహణ. క్రొత్త విద్యాలయాలు పెట్టడము, విద్యాలయాలకు భవనాలు కట్టించడము, గ్రామాలలో చదువులయెడల అభిమానము పుట్టించడము, ఈ పంచాయతీలు చక్కగా జరిపినవి. ౧౯౨౮-౨౯-వ సంవత్సరములో గ్రామపంచాయతీలు తమస్కూళ్లు నడుపుకోడమేగాక (ఒకప్పుడు వీనిసంఖ్య ౨౦౦౦ వరకుండినది), ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూళ్లను కొన్నిచోట్ల చూచుకొనుచుండినవి, కొన్నిచోట్ల తాలూకాబోర్డు స్కూళ్లను వాని ఏజంట్లుగా నిర్వహించినవి. కొన్నిచోట్ల నిర్బంధవిద్యావిధానమును నిర్వహించినవి.

పంచాయతీలు విద్యావిధానము విషయములో నడిపిన కార్యక్రమువిషయమయి మొదటిసంవత్సరపు అనుభవముతోనే అప్పటి రిజిస్ట్రారుజనరలుగారీక్రిందివిధముగా వ్రాసిరి.

"ఇప్పటి విధానముక్రింద విద్యాలయాలనుపక్రమించియుండు పంచాయతీ లన్నీకూడ వానియభివృద్ధియం దెక్కువశ్రద్ధ చూపినవి. వీనికి భవనాలు సంపాదించడములోను, ఉదారముగా ఇతరానుకూలాలేర్పరచడములోను ఎక్కువ ఆత్మతృప్తితో పనిచేసినవి. మొదటి సంవత్సరపుటనుభవము చాల ఉత్సాహజనకంగా ఉంది. ప్రాథమికపాఠశాలలను నిర్వహించడమును గ్రామపంచాయతీల వశము చేసినయెడల వానిక్రమాభివృద్ధికలుగునని అందుకయ్యే వ్యయపుబరువు న్యాయరీతిగా పంపకము కావడానికి అవకాశ ముండవచ్చునని ఎదురు చూచినవారి యాశలు కొంత పూర్తి కావడము సంభవించినది."

ప్రాథమిక పాఠశాలల విషయమందేగాక గ్రంథాలయముల నిర్వహణమునందును గ్రామ పంచాయతీలు అభినివేశము కనుపరచినవి. అందుకని సంవత్సరము సంవత్సరమును రు. ౫,౦౦౦, అథవా రు. ౧౦,౦౦౦ ప్రత్యేక విరాళములు గవర్నమెంటు ఇచ్చినా రనడమే దీనికి తార్కాణము.

దొడ్లు, దీపాలు, గ్రామపారిశుద్ధ్యము విషయాలలో గొప్పశ్రద్ధతో పనిచేసిన పంచాయితీలును ఎన్నియో ఉండినవి.

కాని పైని వివరించినరీతిగా వీనికి నియమితమైన ఆదాయము లేకపోవడముచేత గవర్నమెంటువారి గ్రాంటుల మీదనే ఆధారపడడము ముఖ్యమయినందున ఇట్టి ఇట్టిపనులు తప్పక గ్రామపంచాయతీలు చేయవలెనను నిర్బంధము లేకపోయినందున బీదలూ, విజ్ఞాన వికాసాలు తక్కువైనవారూ నివసించే ప్రాంతాలలో ఎక్కువపని చేయడముకు వీలుగాక వీనిపని పొడుగుచేతి పన్నెరంక్రింద ఏర్పడింది. అందువల్ల లెక్కకు ౬౦౦౦ వేల పంచాయతీ లున్నా కార్యసాధన ఏకాంచెమైనా చేయగల పంచాయతీలు చాలా తక్కువయని కన్పించినది. నాటికి ఏపదో పదునైదో కళాపూర్ణముగా నున్నట్లు కన్పించినవి.

## లోకల్ బోర్డులలో పంచాయతీలు

౧౯౨౦-వ సంవత్సరపు ఆక్టులోని ఈ లోపములు స్పష్టముగా కన్పించడమే కాకుండా గ్రామాలలో వేరువేరుపేళ్లతో ఏర్పడిన ఇతరసంస్థలు-ఫారెస్టు పంచాయతీ, ఇర్రిగేషన్ పంచాయతీ, పంచాయతీకోర్టు, ధర్మాదాయములకమిటీ-ఇత్యాదు లన్నిటికిని ఎన్నికలు పెట్టడముమూలకముగాను ఒకటితో నొకటి సంబంధములేని స్థితిలో పనిచేయడము చేతను ఈయన్నింటి కార్యక్రమాన్ని కేంద్రీకరించే సంస్థ గ్రామ పంచాయతీ పేరట గ్రామములో ఉండడము ప్రజల కనుకూలముగా నుండుననీ, క్రమముగా ప్రాతకాలపు పంచాయతీల స్వరూపమును మరల ప్రత్యక్షము చేయడానికి వీలవుతుందనీ ౧౯౨౬లో శాసనసభలు ప్రవేశించిన కాంగ్రెసుసభ్యులకు కొందరికి తోచినది. ఇతరపార్టీలలోనివారికిని గ్రామపంచాయతీల కొక నవీనస్థానము కల్పింపదగియున్నదనడము అర్థమయియుండినది.

౧౯౩౦-వ సంవత్సరములో ౧౯౨౦-వ సంవత్సరపు గ్రామపంచాయతీల ఆక్టును రద్దుచేసి పంచాయతీలను లోకలుబోర్డుల ఆక్టులో జిల్లాబోర్డు తాలూకాబోర్డులతోసహా స్థానికపరిపాలనలోని మూడవ యంగముగా అంగీకరించుచూ లోకలుబోర్డు శాసనమును సవరించిరి. అప్పటి శాసనసభలో కాంగ్రెసు వారు అధికారము వహింపలేదు. జిల్లాబోర్డు ప్రెసిడెంట్లు తాలూకాబోర్డు ప్రెసిడెంట్లు ఎక్కువమంది సభ్యులుగా నున్నారు. కాబట్టి గ్రామప్రజలను సర్వవిషయాలలోను వారిప్రదేశములలో స్వతంత్రాధికారులను జేయవలసిన దనే ఉద్దేశముతో తెచ్చిన సవరణలు అంగీకృతములు కాలేదు. వేయిజనాభాగల ప్రతిగ్రామమునకును పంచాయతీలు నిర్బంధముగా పెట్టవలెననీ, ఈపంచాయతీల ప్రాతినిధ్యముతోనే తాలూకాసంఘాలు జిల్లాసంఘాలు ఏర్పడవలెననీ, జిల్లాబోర్డు తాలూకాబోర్డులకు గ్రామపంచాయతీలమీద అధికారము లుండరాదనీ, లోకలుబోర్డుల ఆదాయములో ఎక్కువభాగము ఎక్సైజు ఆదాయములో కొంతభాగము పంచాయతీలకు చెందవలెననీ, ఫారెస్టు, ఇర్రిగేషన్ ఇత్యాదులకు వేరే వేరే పంచాయతీలు పెట్టకుండా అన్నిటికిని గ్రామపంచాయతీనే ఆధారము చేసి రివిన్యూవారిచేతులలోను ఫారెస్టు

డిపార్టుమెంటు చేతులలోను ఇతర డిపార్టుమెంటు చేతులలోను ఉన్న గ్రామవిషయకాధికారాలు, పొరంబోకులు, గ్రామనత్తాలు, డొంకలు, కాలువలు, చెరువులు, కుంటలు, అడవులు, వగైరా సమష్టిఆస్తి గ్రామపంచాయతీలకు చెందిపోవలె ననీ ఆసించినవారి యాశలు ఆచట్టములో ఫలించలేదు. కాని లోకల్ బోర్డుల సెస్సు ౦-౧-౬లో అర్ధణా పంచాయతీకి చెందవలసిన దనియు, కొన్ని కొన్ని పన్నులు వేసి పంచాయతీలకు ద్రవ్యోపపత్తి కలిగింపవచ్చు ననియు ప్రభుత్వమువారి ఉత్తరువు ననుసరించి ఎచ్చటనైనను పంచాయతీలేర్పరచవచ్చు ననియు ఈసంస్థలకు సంబంధించి జాయింటు కమిటీలని సమష్టిసంఘాలేర్పడవచ్చు ననియు, అదివరకు జిల్లాబోర్డులు మునిసిపాలిటీలు చేస్తూఉండిన పనులేగాక గవర్నమెంటువారు పంచాయతీలకు గ్రామాటవులు, ఇర్రిగేషనులు, గవర్నమెంటు ధర్మములు వేనినైనను నిర్వహించుట కిచ్చివేయవచ్చు ననియు, ఇతరస్థానికసంస్థలు ప్రజాసంస్థలు తాము చేసేపనులు పంచాయతీలద్వారా చేయవచ్చు ననియు, గ్రామానికి అనుకూలమైన పన్ను అని ఏది తోచినా గవర్నమెంటువారు అనుమతిస్తే గ్రామావసరాలకుగాను విధింపవచ్చు ననియు ఇన్ని ఏర్పాటులును ఆచట్టములో నేర్పడెను. కాని ఇన్నీ ప్రభుత్వమువారు తలచుకుంటే యేర్పడేపనులు; లేకపోతే కానివి. వారు తలచుకోలేదు. ఇవి కాలేదు.

## ౧౯౩౦-వ సం. పు ఆక్టేల పనిచేయలేదు ?

వారు తలచుకోకుండా ఉండడానికి కొన్ని కారణాలు కలిగినవి. ప్రజలసంస్థలు ఎక్కిరావడము బలవంతులకు బ్రిటిషునిరంకుశాధికారులకు గిట్టకపోవడమని సహజంగా చెప్పే మొదటి కారణము. అది నిజమని నమ్మదగినది కూడాను. రెండవది పంచాయతీ రిజస్ట్రారు జనరలుపదవిని తీసివేసి లోకలుబోర్డులు మునిసిపాలిటీలు అన్నిటికీ లోకలుబోర్డుల ఇనస్పెక్టరును అధికారిని జేయడము. పంచాయతీలను లోకలుబోర్డులలో చేర్చడముచేత ఈపని చేయవలసివచ్చిన దనడము సత్యమే. గవర్నమెంటుకు శ్రద్ధ ఉంటే ఈకారణం ఆటంకమయి యుండనక్కరలేదు. అయితే లోకలుబోర్డుల ఇనస్పెక్టరులక్రింద పనిచేయవలసిన పంచాయతీఆఫీసరులను తాము డబ్బిచ్చి నియమింప తలపెట్టిన గవర్నమెంటు తుదకు వీరిని జిల్లాబోర్డుక్రింది నౌకరులను జేసివేసిరి. అదీగాక చట్టములోనే, తాలూకా బోర్డు లున్నంతకాలము పంచాయతులను వానికిని జిల్లాబోర్డులకును, అవి పోయిన తరువాత జిల్లాబోర్డులకును అంకితముచేసిరి. ఈయన్నిటిద్వారా పంచాయతీలకు జరిగిన ఉపకారము సున్న, నిరోధముమాత్రము మిన్న. సర్కారువారి రూల్సు చేసే అధికారము లోకలుబోర్డుల ఇనస్పెక్టరుకు సంక్రమించడము, అతనికి ఆతనిడిపార్టుమెంటుకు జిల్లాబోర్డులకు దగ్గరినుట్టరిక ముండడము, జిల్లాబోర్డులలోని పార్టీలమూలకంగా పంచాయతీఆఫీసర్లు అధికారంలో ఉండే పార్టీ అండగల జిల్లాబోర్డు ప్రెసిడెంటుల తరువాత తామే హోదా చలాయించేదొర లనుకొని గ్రామపంచాయతీలకు మిత్రులు, సచివులు, బాంధవులుగా నుండడము మానుకొని యాజమాన్యము వహించడము జరిగెను. పంచాయతీల యభివృద్ధితో జిల్లాబోర్డుల ప్రాముఖ్యము నశించుననే సహజమైన భయముచేత జిల్లాబోర్డులకు పంచాయతీల ప్రత్యేకాభివృద్ధి దీక్ష లేకపోవడము కలిగినది. అందులో ఆశ్చర్య మేమియు లేదుగాని ఒక్క ఫలము మాత్రము తప్పలేదు తాలూకాబోర్డు జిల్లాబోర్డు పంచాయతీల ఆఫీసర్లు లోకలుబోర్డు ఇనస్పెక్టరు గవర్నమెంటు అను పంచతిక్త పరంపరలో దిన మొకగవర్నమెంటు ఉత్తరువు గంట కొకరీతిగా పడి పంచాయతీలకు గల కొద్దిస్వాతంత్ర్యాలు కట్టువడిపోయి అవి కదలుటకు మెదలుటకులేని పరిస్థితులు కల్పితమయిపోయినవి. తుద కొకపత్రికకు చందా యిచ్చుకొనుటకుగూడ వానికి స్వాతంత్ర్యము లేకపోయినది. ఆ యుత్తరువుమాత్ర మిటీవలనే రద్దయినది. ఉత్తరువులవలన కలిగిన నిరోధ మొకటే నిరోధ మనుకొనవలదు. పంచాయతీలకు ప్రభుత్వమువా రిచ్చుచుండిన గ్రాంటులు బిరబిగుసుకొనిపోయినవి. రోడ్డునిర్మాణము వగైరాలమాట యెట్లున్నా తుదకు గ్రంథాలయాల కిచ్చుచున్న గ్రాంటుకూడ అదృశ్యమయినది మరియింకొకసంగతి. లోకలుబోర్డుల ఆక్టుక్రిందికి పంచాయతీలను తేవడానికిపూర్వమే అచ్చటచ్చట పది పదిగ ఇరువది యిరువదిగ పంచాయతీలు చేరి జాయింటుకమిటీ లేర్పరచుకొని వానిమూలకముగా మంచిమంచి మేధావు లయిన స్థానికులకు గ్రామములసేవ కవకాశము కలిగి చక్కనిపని ఆరంభమయి యుండినది. ౧౯౩౦-వ సంవత్సరము శాసనములో జాయింటుకమిటీ లేర్పడడానికి అవకాశ మున్నందున తరువాతకూడ ఆపని బాగా చురుకుగా జరిగినది. సేలంజిల్లాలో నామకల్లు, తూర్పుగోదావరిజిల్లాలో ఆలమూరు, ఉత్తర ఆర్కాటులో సెయ్యారు మొదలగు జాయింటుకమిటీలు అద్భుతముగా పని జరిపినవి. ౦ గుంటూరుజిల్లా అంతటా జాయింటుకమిటీ లేర్పడడముకొరకు గొప్ప ప్రచారము సాగినది. కాని జాయింటుకమిటీ పెత్తనము జిల్లాబోర్డులపెత్తనానికి పంచాయతీఆఫీసర్ల దొరతనానికి ఆటంకములు కాబట్టో మరి యేకారణముచేతనో శ్రీ బొబ్బిలి రాజాగారి ముఖ్యమంత్రిత్వకాలములో జాయింటుకమిటీలు ఏర్పడడము శాసనవిరోధమని సర్కారువారు జాయింటుకమిటీల ఉద్యమమును చంపివేసిరి. ఎన్ని విశ్వప్రయత్నములు చేసినను జాయింటుకమిటీ లేర్పరచడము శాసనవిరోధము కాదని ఇప్పటికిని కాంగ్రెసుప్రభుత్వమువారుకూడ ప్రకటించి యుండలేదు.

## పంచాయతీల ఆందోళన ; వారు కోరే చట్టము

దేశములో కలిగియుండు ప్రజలవికాసము కారణముగా పంచాయతీలవా రందరును ఏకమై తమఅభిప్రాయములను వ్యక్తపరచే ఉపాయములను వెదకుకొనుచునే యున్నారు.

౧౯౩౭-వ సంవత్సరము ప్రాంతమునుంచే మద్రాసు రాష్ట్రీయపంచాయతీల యూనియను స్థాపితమయి పనిచేయుచున్నది. ఇది స్థాపితము కావడానికి కొద్దిగా పూర్వమే 'గ్రామపంచాయతీ'యను పత్రికను మద్రాసు ప్రావిన్షియల్ కో ఆపరేటివు యూనియన్ వారు, అన్ని పంచాయతీలపరముగా, సంవత్సరమునకు పైబడి, ఇంగ్లీషు, తెలుగు, అరవములలో చక్కగా నడిపి పనిచేసిరి. పంచాయతీల సంఘ మేర్పడినపిదప వీరికృషి మూలకముగా ౧౯౩౭లో జాయింటుకమిటీలకు పునర్జన్మము కల్గించుటకయి మద్రాసు శాసనసభలో శాసనమున కొకరీతి సవరణ జరిగెను. దానివలనను ప్రయోజనము లేకపోయినది. తాలూకాబోర్డులు రద్దయినపుడు సెస్సులలో వానికి చెందవలసినభాగము జిల్లాబోర్డుకివ్వనుండగా దానిని పంచాయతీల కిచ్చునట్లుగా ఈ పంచాయతీ యూనియనువారే పరిశ్రమచేసిరి.

౧౯౩౭లో కాంగ్రెసుప్రభుత్వము ఏర్పడడముతో మనకిక పంచాయతీరాజ్యము త్వరలో ఏర్పడుతుందనే విశ్వాసము ప్రజలకు, నాబోటి పంచాయతీరాజ్యాభిమానులకు కలిగినది. ౧౯౩౮-వ సంవత్సరారంభమున చెన్ననగరములో మనకోస్తాలోని పంచాయతీల ప్రతినిధులసమావేశమును జరుపునట్లుగా ప్రావిన్షియల్ యూనియనువారు నిశ్చయించిరి. కాంగ్రెసు రాజ్యారంభములోని మొదటిశుభసూచన యిదియనేటట్లుగా సమావేశానికి వచ్చే ప్రతినిధులకర్చులు పంచాయతీలవారు పెట్టుకోవచ్చునని అప్పటి లోకలుబోర్డుల ఇనస్పెక్టరు శ్రీ శాస్త్రిగారు ఉత్తరు విచ్చిరి.

౧౯౩౮-వ సంవత్సరము మొదటిమాసముననే, అంటే జనవరిలోనే, మహాసమావేశము జరిగినది. ౩౦౦౦లకు పైబడి ప్రతినిధులు హాజరైనారు. వీరు ఏకకంఠముగా జిల్లాబోర్డులు రద్దుకావలె నన్నారు. జిల్లా కార్యనిర్వహణకు పంచాయతీలే ఆధారభూతమగునట్టి శాసన మేర్పడవలెనను నుద్దేశముతో ప్రభుత్వమువారు చేయేవివరములతో బిల్లు పెట్టవలెనో ఆయావివరము లన్నిటిని అన్నితీర్మానములుగా నాలోచించి విమర్శించి నిర్ణయించినారు. ఆసమావేశము జరిగినవెంటనే ఈరాష్ట్రీయసంఘమువారు 'గ్రామ పంచాయతీపత్రిక' యనునొక మాసపత్రిక ప్రకటింప నారంభించిరి.

మహాసభవారు పంచాయతీ బిల్లుకోసరము చేసిన తీర్మానముల ననుసరించి తమపరముగా ఒకబిల్లునే సిద్ధముచేసి ౧౯౩౮వ సంవత్సరము ఆగస్టుమాసపు సంచికగా వెలువరచిరి. వారీబిల్లును తొమ్మిదధ్యాయముల క్రింద విభాగించిరి. మొదటి అధ్యాయమున బిల్లులో ఉపయోగించుపదముల నిర్వచనము వగైరా లున్నవి. రెండవ అధ్యాయమున పంచాయతుల నిర్మాణమునకు ఏర్పాటులు గలవు. అందులో ముఖ్యము: పంచాయతీ పరిపాలన అంతటను ఏర్పడవలెను, వయోజనవోటుమీద ఎన్నికలు జరుగవలెను. సభ్యులందరు ఎన్నుకోబడినవారే ఉండవలెను, అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు ఎన్నుకోబడినవా రుండవలెను. పంచాయతీ అధికారములు ధర్మములు మూడవ అధ్యాయమునందు చెప్పినారు. ఇదివరలో లోకలుబోర్డుల ఆక్టులో చెప్పిన నిర్బంధ ఐచ్ఛిక ధర్మములుగాక అడవుల పరిపాలన ఇరిగేషన్ పరిపాలన చేర్చినారు. గ్రామనౌకరులమీద శిస్తువసూళ్లు వగైరాలమీద తనిఖీ — ఇవన్నియు చేర్చినారు; అంటే ఇకమీద ఫారెస్టు పంచాయతీలని ఇరిగేషన్ పంచాయతీ లని ఈ వగైరా వేరువేరు పంచాయతీ లుండడానికి వీలులేదు. తొమ్మిదవ అధ్యాయము సివిల్ క్రిమినలు న్యాయవిచారణ గ్రామ పంచాయతీల స్వాధీనము చేయవలసినదని కోరడము చేత పంచాయతీ కోర్టులు గ్రామమునసబు కోర్టులు రద్దగును. ప్రాతశాసనములో ఉన్న స్టేటు గవర్నమెంటువారుగాని ఇతర స్థానిక సంస్థలుగాని వేరే వ్యక్తులు, సంఘములుగాని ఏపనినైనను పంచాయతీలద్వారా చేయించవచ్చును. ధర్మాదాయములతో కూడ చేర్చియుండడము చేత పంచాయతీరాజ్యము గ్రామములలో పూర్ణముగా ఉండడానికి అవకాశమున్నది. నాలుగవ అధ్యాయములో జాయింటుకమిటీలు నిర్బంధముగా ఏర్పరచితీరవలె నన్నారు. కాబట్టి జిల్లా అంతటికి పంచాయతీరాజ్యము వ్యాపించవలెనని సూచించినారు. అయిదు, ఆరవఅధ్యాయాలలో పంచాయతీ ఆస్తిఫండుల విమర్శచేసినారు. గ్రామములోని సమిష్టిఆస్తి అంతా భూమి, చెట్లు, చేపు, అడవి, కొండ, గని, కుంట, వగైరాలు పంచాయతీవి. ఒక్క కోస్తా ప్రభుత్వము తాను పెట్టుకొనే పంచాయతీశాఖ అధికారులమూలకముగా తప్పితే ఇతరులెవ్వరును ఈ ఆస్తివిషయములో జోక్యము కలుగజేసికోరాదు. తాము వేసుకొనే పన్నులు పంచాయతీ వేసుకోడానికి అధికారముండగా సర్కారు, జమీందారుల భూమిశిస్తువసూళ్లలో రెండణాలు, సెస్సు అంతా ౦-౧-౬ పంచాయతీకి చెందవలెను. వేలంపాటలు వగైరాల ఫలము, అపరాధాలు వగైరాలు, గ్రామములో జరిగేపనులకు — చదువులసెస్సు ఇతరసెస్సులతో కూడ — గవర్నమెంటువారిచ్చే గ్రాంటులు ఇన్నీ గ్రామపంచాయతీ ఫండులో చేరవలెను. ఏడవ అధ్యాయములో పంచాయతీల కుండదగిన పరిపాలనాధికారములు వివరించినారు.

ఎనిమిదవ అధ్యాయమున పంచాయతీలపై తనిఖీవివరణ మున్నది. పూర్వమునందువలె పంచాయతీల రిజిస్ట్రారుజనరలు ఏర్పడవలెను. జిల్లాపంచాయతీ ఉద్యోగియులు వగైరాలను ప్రభుత్వము నియమించవలెను. వారు రిజిస్ట్రారుజనరల క్రింద పని చేయవలెను. వీరిద్వారా తప్ప ఇంకొకవిధముగా నెవ్వరును పంచాయతీలపై అధికారులు కాకూడదు. పదకొండవ అధ్యాయములో వ్యాజ్యెములు, ప్రాసిక్యూషనులు వగైరాలవిషయము చెప్పినారు.

## గ్రామ పునర్నిర్మాణము

గ్రామపునర్నిర్మాణ మనుపేరిట అనేక రీతుల అనేకపేళ్లతో, వయోజనవిద్యతో కూడ పనిచేయడము సంభవించుచున్నది. కేంద్రీకృత ప్రయత్నము లేకపోవడముచేత ఇది యెక్కువ ఫలప్రదము కావడములేదు. తుదకు గవర్నమెంటువారి వ్యవసాయ, సహకార, వైద్య, ఆరోగ్య, పశుచికిత్సాశాఖలే యేకముఖముగా ఆలోచించి పనిచేయడములేదని గొప్పపుకారా చాలకాలముగా నున్నది. ద్వంద్వప్రభుత్వమున్నప్పుడెట్లు జరిగినా కాంగ్రెసుప్రభుత్వమేర్పడినతరువాత వ్యర్థప్రయత్నముండరాదు. గ్రామమునకును ఈమాటయే యన్వయించును. గ్రామపంచాయతీని కేంద్రముచేసి పనిచేయవలసిన ఆవశ్యకత కలిగినదనడము అర్థముకాగలదు.

## గాంధీజీ చూపిన దోవ

(అవంతిఔంధు) సంస్థానములో ప్రజాప్రభుత్వప్రకటన చేయించు ఆసంస్థానాధీశ్వరుడు గాంధీజీనాయకత్వమున వేసిన పంచాయతీప్రణాళిక మనకు తారకము కాదగియున్నది. పంచాయతీలే అచట స్వరాజ్యసంస్థలు. అందులోనుండే తాలూకాసంస్థలు. వానిలోనుండే రాజ్యశాసనసభ. అందులోనుండే కార్యనిర్వాహకమంత్రులు.- రాజ్యాదాయమునందు సగము పంచాయతీలది. దీనితోకూడ ప్రజలందరిని ఆరుమాసములలో అక్షరజ్ఞులను చేసేదీక్ష.

ఈ కోస్తాలో మద్రాసురాష్ట్రీయ పంచాయతీల యూనియన్‌వారు తమ బిల్లులో కోరినది ఇంతకంటె ఎక్కువేమున్నది? వారు కోరినది నిజముగా ఇంతకంటె చాల తక్కువ. కాంగ్రెసుమంత్రులింకా యీ విషయమున ఆలసింపరాదు. ఆలసించుటకు వీలులేదు.

## పనివన్ను

యూనియన్‌వారి బిల్లును ప్రభుత్వమువారాలోచించేటప్పుడు కొద్దిపాటి సవరణలు పొందవలసిఉండును. కాని పన్నులవిషయములో మాత్ర మొకమాట చెప్పదగును. డబ్బు పన్నులికముందు పెంచడానికి వీలులేదు. పెంచరాదు. ప్రజలిప్పడే క్రుంగిపోతున్నారు. కాని ప్రాచీనాచారముగా మనదేశములో గ్రామ సమష్టికార్యాలకు గ్రామమువారందరును దేహపరిశ్రమచేయడము కలదు. 'సోమవారదకెలస' అని పేరుపెట్టి ప్రతికుటుంబమువారును ఒక్కమనిషికూలి వారమున కరదినము చేయవలెనని నిర్బంధము పెట్టి, లేకపోతే సంవత్సరమునకు ౧౨ త్తి రూపాయలపన్ను వేస్తామని నిర్ణయించి, మైసూరు ప్రభుత్వమువారు అచ్చటి గ్రామాలంతటా పంచాయతీలు పెట్టి యేర్పరచి గ్రామములకు కోర్టులు వేయించినారు. గ్రామముఖములు సుందరపరచినారు. గ్రామములోని మురుగుడుకుంటలు పల్లములు పూడ్చినారు. తక్కినలోపము లచ్చట నేమియున్నను నుండుగాక! మనము ఈవిషయము వారివద్దనుండి గ్రహింపదగినది మన ప్రభుత్వమువారు త్వరగా పంచాయతీబిల్లు పెట్టుదురుగాకయనియు, అందులో ఈసూత్ర మిముడ్తురుగాక యనియు నాప్రత్యేకముకోరిక.

## వెంటనే పని పూనవలెను

క్రొత్తబిల్లు పెట్టకుండగనే ప్రాతచట్టము క్రిందనే గవర్నమెంటువారు తలచుకొంటే అన్నిపనులును పంచాయతీలచేత చేయించడానికి వీలున్నదని పైననే వ్రాసితిని. వారు అన్నిచోట్లను పంచాయతీ లేర్పరచుటకును వీలున్నది. కాబట్టి క్రొత్తచట్ట మేర్పరచేవరకు ప్రాతచట్టములో ఎంతెంత పంచాయతీల మూలకముగా పరిశ్రమ చేయించవలెనో మంత్రులు కూర్చొని ఆలోచించితే కావలసినంతపని చేయవచ్చును. జాయింటుకమిటీ లేర్పరచడానికి వెంటనే ఉత్తరువులు వేస్తే వానిమూలకంగాను చాలాపని సాగడానికి అవకాశమున్నది. ఈపనికి మంత్రిసత్తములను మేల్కొల్పుట పంచాయతీ అభిమానుల విధి.



# కాశ్మీర సంస్థానము

సురవరం ప్రతాపరెడ్డి

అందమైనపూలు—మురికిజనులు

ప్రభువుహిందువు—ప్రజలు ముసల్మానులు

ప్రదేశము ఆరోగ్యప్రదము—ప్రజలు రోగగ్రస్తులు

ముసల్మానులకు బాధ్యతాయుత ప్రభుత్వముకావలెను—

హిందువులకు అవసరములేదు

కాశ్మీరము—హైదరాబాదు—రెండును పరస్పరగుణపాఠము నేర్పునట్టివి



ఇప్పటి కాశ్మీర సంస్థానాధిపతులు

మొత్తము ౫౬౨ దేశీయసంస్థానములలో హైద్రాబాదురాష్ట్రము అన్నిటికన్న పెద్దదని అందరును అనుకుందురు. వైశాల్యమునుబట్టి చూచినట్లైన అంతకన్న మించిన సంస్థాన మింకొకటి కలదు. అది కాశ్మీరసంస్థానము. హైద్రాబాదు సంస్థానవైశాల్యము౮౨, ౬౯౮ చదరపుమైళ్లు. కాశ్మీరసంస్థానవైశాల్యము ౮౫,౮౮౫ చదరపుమైళ్లు; అనగా హైద్రాబాదుసంస్థానముకన్న 3,౧౮౭ చదరపుమైళ్ల వైశాల్యము ఎక్కువగా కాశ్మీరములో ఉన్నది. ఇట్లు వైశాల్యములో పెద్దదైనను కాశ్మీరసంస్థాన జనసంఖ్యమాత్రము చాల కొద్దిగా ఉన్నది. కారణ మేమనగా కాశ్మీరము హిమాలయ పర్వతములో నున్నది. అంతయు పర్వతమయమే. సంవత్సరములో ఆరునెలలు నిరంతరము చలి, మంచు ఉండును ఆసంస్థానపు హద్దులు అటు అఫ్ఘనిస్తానమువరకు, ఇటు పంజాబువరకును వ్యాపించినవి. జనులు చాల బీదవారు. పన్నులభారము భరింపరానిదై యున్నది. జనులలో చాల మురికితనము గలదు. అనేకులు కొత్తబట్టలు కట్టుకొనిన ఇంచుమించు అవి చినిగిపోవువరకును ఉతుకరు. స్నానముచేయుటకూడ చాల తక్కువ. అనేకులు ఇంచుమించు నెల కొకమారు స్నానము చేయుదురు. జనుల భోజనము విశేషముగా మాంసము చేపలు రొట్టెలు. అక్కడి హిందువులలో కాయస్థులవంటి పై జాతులుకూడ చేపలు తిందురని ప్ర

తీతి. హిందూముసల్మానుహోటలులు కొన్ని తావులలో ఒకటిప్రక్కన నొకటిగా నుండును. ఒకప్రక్క మాంసపాకము జరుగుచుండును. దానిప్రక్కననే హిందువుల శాకాహారముకూడ సిద్ధమగుచుండును. కాశ్మీరమునకు ముఖ్యపట్టణము "శ్రీనగరము". ఇది పర్వతములలో నున్నది. పూర్వమునుండియు ఇదియే ముఖ్యపట్టణము.

సంస్కృతమందు నూత్నాభిరుచిగలవారు కల్హణుని రాజతరంగిణియను గ్రంథమును చదివియుందురు. అందు కాశ్మీర దేశచరిత్ర మహాభారతకాలమునుండి క్రీ. శ. ౧౧౨౦ వరకు వ్రాయబడినది. అది ఉత్తమ కవితాగ్రంథమేకాక సత్యమైన చారిత్రకగ్రంథ మనియు పాశ్చాత్యుల చేతను ప్రశంసింపబడినది. క్రీ. శ. ౧౨౫౦ తర్వాత కాశ్మీరచరిత్ర మారుచు వచ్చినది. ముసల్మానుల దండయాత్రలు ప్రారంభ మయ్యెను. వారితాకుడు సంపూర్ణముగా ఆభాగముమీదనే బలముగా తగులుచు వచ్చెను. తద్ద్వారా అచ్చటి హిందువులు క్రమముగా ముసల్మానులైరి. రాజ్యచరిత్ర అనేకవిధాల మారుచు వచ్చెను. ఆచరిత్ర ప్రకృతపరిస్థితులకు సంబంధము లేనందున దానినిప్పుడు వ్రాయ నవసరములేదు.

కాశ్మీరము చాల సుందరప్రదేశము. పర్వతాలు, నదులు, అరణ్యాలు, సరస్సులు, సుందరప్రకృతి, నవ్వేపువ్వులు, సమృద్ధిగా పండు అడవిపండ్లు, మంచిచలువ, ఇవన్నియు పాశ్చాత్యులను విశేషముగా ఆకర్షించుచున్నవి. ఎండకాలములో ధనికు లనేకులు కాశ్మీరములో నివాసమునకై వెళ్లుచుందురు.

కాశ్మీరవిషయము వ్రాయుటకు ముందు దానికిని మన హైద్రాబాదునకునుగల తారతమ్యము కొన్ని అంకెలతో చూపింతును.

| | కాశ్మీరము | హైద్రాబాదు |
|---|---|---|
| వైశాల్యము | ౮౫,౮౮౫ చ.మైళ్లు | ౮౨,౬౯౮ చ.మైళ్లు |
| జనసంఖ్య | ౩౬,౪౬,౨౪౩ | ౧కోటి ౪౪లక్షలచిల్లర |
| ప్రతిచదరపుమైలుకు | ౪౩మంది | ౧౭౩మంది |
| నగరములు | ౩౯ | ౯౮ |
| పల్లెలు | ౮౯౦౩ | ౨౧,౭౫౦ |
| ముసల్మానులు | ౨౮,౧౭,౬౯౬ | ౧౫,౩౫,౦౦౦ |
| హిందువులు | ౭,౩౮,౨౨౨ | ౧,౨౨,౦౦,౦౦౦ |
| సిక్కులు | ౫౦,౬౬౨ | ౫౧౭౮ |
| బౌద్ధులు | ౩౮,౨౨౪ | ౫౨ |
| క్రైస్తవులు | ౨౨౬౩ | ౧,౫౧,౦౦౦ |
| జైనులు | ౫౯౭ | ౨౧,౫౪౩ |
| ముసల్మానులు నూటికి సుమారు | ౭౫ | ౧౧ |
| హిందువులు నూటికి సుమారు | ౨౦ | ౮౮ |
| విద్యావంతులు నూటికి | ౪ | ౫ |
| సంస్థానాదాయము | ౨,౪౭,౦౦,౦౦౦ | ౮,౦౦,౦౦,౦౦౦ |

ఇవి ఉభయసంస్థానములలోని తారతమ్యములు. ఒక్కవిషయము: ముఖ్యముగా గమనింపవలసిన దేమనగా, కాశ్మీరులో అల్పసంఖ్యాకులైనవారు హిందువులు. హైద్రాబాదులోని అల్పసంఖ్యాకులు ముసల్మానులు. కాశ్మీరులో హిందువులకే విశేషముగా ప్రభుత్వోద్యోగములు లభించినవి. హైద్రాబాదులో విశేషముగా ముసల్మానులకే ప్రభుత్వోద్యోగము లియ్యబడినవి. కాశ్మీరులో అధికసంఖ్యాకులైన ముసల్మానులు బహుకాలమునుండి ప్రజాస్వత్వములకై ఆందోళనము చేయుచున్నారు. హిందువులు దానిని ప్రతిఘటించుచున్నారు. హైద్రాబాదులో బహుకాలమునుండి అధికసంఖ్యాకులైన హిందువులు ప్రజాస్వత్వములకై ఆందోళనము చేయుచున్నారు. ముసల్మానులు ప్రతిఘటించుచున్నారు. కాశ్మీరములోను సత్యాగ్రహము గతసంవత్సరమె ప్రారంభమైనది. అందు ఎక్కువగా ముసల్మానులే పాల్గొనినారు. అయితే హిందువులుకూడ కొందరు దానిలో

దర్శించండి! ధన్యులు కండి!

వాహినీ పిక్చర్సు వారి

తెలుగు సామాజిక చిత్రమ్

# వందే : : : మాతరమ్



ఆంధ్ర యశోరేఖలకు ఆలవాలము
శృంగారవిలాసములకు శృంగాటకము
మాతృదేవతాపూజకు మార్గదర్శకము
దీనసేవానిరతికి దివ్యదీపము

ఆణిముత్యాలవంటి నటులు
తేనెతేటలవంటి పాటలు
రాతిగుండెలు కరిగించే సన్నివేశాలు

అందమైన ఫొటోగ్రఫీ సహజమైన శబ్దం

ముఖ్య పాత్రధారులు:—
**కాంచనమాల, నాగయ్య మొదలైన నటులు నటించినారు**

★ దర్శకుడు :
బి. యన్. రెడ్డి

★ సాంకేతికపర్యవేక్షకులు :
రామనాథన్, శేఖర్

★ రచయిత :
రాఘవాచార్య

★ సంగీతము :
చిత్తూరు నాగయ్య

*BOOKINGS WITH :*

**VAUHINI PICTURES LTD.**

43, ACHARAPPAN STREET, **MADRAS.**

పాల్గొని జైలుకుపోయినారు. హైద్రాబాదులోను సత్యాగ్రహము గతసంవత్సరమే ప్రారంభమైనది. హిందువులే దానిలో పాల్గొని జైలుకు పోయినారు. ముసల్మానులు పాల్గొనలేదు. కాశ్మీరసత్యాగ్రహము రాజకీయమైనను అది మతవర్గసంబంధమైనది (కమ్యూనల్) అని అచ్చటి ప్రభుత్వమువారును హిందువులు నిర్ణయించినారు. హైద్రాబాదు సంస్థాన కాంగ్రెసు సత్యాగ్రహము నిస్సందేహముగా రాజకీయమైన దైనను దానిని ప్రభుత్వమువారును, ముసల్మానులును మతవర్గముక్రింద కట్టివేసినారు. ఉభయసంస్థానములలో ప్రాథమికస్వత్వములను క్రొత్తశాసనములచేతను, ప్రాతశాసనముల చేతను అణచివేసియున్నారు.

దేశీయసంస్థానములం దంతటను ౧౯౩౮-వ సంవత్సరాదినుండి ప్రజోద్యమములు తీవ్రరూపము దాల్చుచు వచ్చినవి. తిరువాన్కూరులోను, మైసూరులోను, ఒరిస్సాసంస్థానములలోను, మిలటరీవారు ఉద్యమములందు పాల్గొన్నవారిని కాల్చినారు. రాజకోటలోను, మీవారులోను ఉద్యమములు తీవ్రరూపము దాల్చినవి. అదేసందర్భములో కాశ్మీరులోను ప్రజోద్యమము తలయెత్తినది.

క్రీ. శ. ౧౯౩౮-వ సంవత్సరము వరకు కాశ్మీరులో ముస్లింమహాసభ యొకటి స్థాపింపబడి పనిచేయుచుండెను. పేరునుబట్టియే అది ప్రత్యేకమతవర్గమునకు చేరినదగుటచేత దానిలో హిందూ సిక్కు బౌద్ధులు చేరినవారు కారు. ఆసంస్థానములో ప్రజానాయకుడైన షేఖు మహమ్మద్ అబ్దుల్లా యనువారు ముసల్మానులలోను, తర్వాత హిందువులలోను, సిక్కులలోను మంచి పలుకుబడి సంపాదించుకొనినారు. వారియుత్తమ వర్తనమును జూచి వారికి కాశ్మీరు గాంధీ అనుబిరుదుకూడ అచ్చటిప్రజలిచ్చినారు. వారు "హమ్దర్దు" అను ఉర్దూపత్రికద్వారా అచటిజనులలో మంచి ప్రభోధము కలిగించినారు. అయినను వారియుద్యమమునకు బలము కలుగలేదు. గతసంవత్సరము వారు జవహర్లాలు నెహ్రూగారిని కలసి వారిసలహాను కోరినారు. నెహ్రూగా రంతయు విని సంగతులు తెలిసికొని ముస్లింమహాసభాస్వరూపమును మార్చి జాతీయమహాసభగా జేసి ప్రచారము చేయుమనియు, హిందువులనుగూడ తమ యుద్యమములోనికి తీసుకొనవలెననియు సెలవిచ్చినారు. అదేవిధముగా జూ౯ ౧౯౩౮-వ సంవత్సరములో అధిక సంఖ్యాకులైన ముసల్మానుల అభిప్రాయముతో ముస్లింమహాసభ జాతీయ మహాసభగా మారెను. హిందూ సిక్కులలోని ముఖ్యనాయకులు చాల ఉదారభావమును దూరదృష్టిని ప్రకటించినారు. వారును ప్రజల యుద్యమములలో పాల్గొనినారు.

"ప్రభువు మాహిందువేకదా,
హిందువులము మేము ప్రభు
వర్గమువారమేకదా కావున
ప్రభువుగాని ప్రభుత్వముగాని
ఏమిదౌర్జన్యము చేసినను మేము
వారికి సహాయము చేయ
వలెను వారిపక్షముగానే.

"అబద్ధం వా సుబద్ధం వా
కుంతీపుత్రో వినాయకః"

అనుసామెతనే దృష్టిలో
నుంచుకొని ప్రచారము
చేయవలెను. బహుళసం
ఖ్యాకులైన ముసల్మాను
ప్రజల కోరికలు, మంచి
వైనను, న్యాయబద్ధమైనను,
అందరకును సమానముగా
వర్తించునవైనను, అవి
ముసల్మానులచే ప్రతిపా
దింపబడిన వగుటచేత
వంకరటింకరతర్కముతో
ప్రతిఘటించవలెను"

అను తత్త్వములో కాశ్మీరహిందూనాయకులు దిగినవారు కారు. వారి యీహృదయ వైశాల్యము, దూరదృష్టి సత్యాభిమానము ప్రశంసనీయగుణము లైయున్నవి.

ఇట్లు హిందూ ముసల్మాను లుభయులును ఏకీభవించి జాతీయోద్యమ స్థాపనకు కారకులైరి. అట్లుండినను హిందువులు విశేషముగా ఈయుద్యమములో చేరలేదు. కారణ మేమన వారి కిప్పు డుండు సౌకర్యములు, ముఖ్యముగా నుద్యోగసౌకర్యములు, ముం దుండవేమో యనుభయమే వారిని బాధించుచున్నది. అదేవిధముగా హైద్రాబాదులోను ముసల్మానులు హైద్రాబాదుసంస్థాన కాంగ్రెసులో చేరుట కొప్పుకొనరు. హైద్రాబాదునగరములో ముసల్మానులచే నడుపబడునట్టి ఉర్దూపత్రికలలో ప్రతిదినమును హైద్రాబాదు సంస్థాన కాంగ్రెసును దూషించుట

పరిపాటియైపోయినది. మరియు ఉద్యోగములపై ముసల్మానునాయకులకు ఎక్కడలేని పట్టింపు కలదు. "మాకిదొక్కటే జీవనాధారముగ మిగిలినట్టి వ్యవహారము" అని వారు పలుమారు ప్రకటించియున్నారు. ఇంతే కాక కాశ్మీరులోను, హైద్రాబాదు రాజ్యములోను అధికసంఖ్యాకులపై అల్పసంఖ్యాకులకు విశ్వాసము తక్కువగా నున్నది. అది సహజమే.

కాశ్మీరు ప్రజల యుద్యమమును గురించి చర్చించుటకుముందు ఆసంస్థానములోని సుమారు రెండున్నర కోట్ల రూపాయీల సంవత్సరాదాయమును ప్రభుత్వమువా రేవిధముగా వ్యయము చేయుచున్నారో తెలిసికొనుట యవసరము. ఆవ్యయము ఈక్రిందవిధముగా నున్నది.

| | | |
|---|---|---|
| న్యాయస్థానము | | |
| లకుగాను | రు | ౮,౬౦,౦౦౦ |
| పోలీసు | " | ౧౨,౭౧,౦౦౦ |
| సైన్యము | " | ౮౭,౮౦,౦౦౦ |
| విద్య | " | ౨౧,౯౮,౦౦౦ |
| వైద్యము | " | ౯,౩౮,౦౦౦ |
| వ్యవసాయము | " | ౨,౬౧,౦౦౦ |
| నిర్మాణశాఖ | " | ౧౭,౩౬,౦౦౦ |
| ఇతరములు | " | ౨౭,౦౦,౦౦౦ |

ఇందు ముఖ్యముగా గమనింప వలసిన విషయములు రెండు. ప్రభువుగారి సొంతవ్యయము నూటికి ౧౬ పాళ్లు. మొత్తము రాష్ట్రములోని ప్రజలవిద్యకు ఖర్చు నూటికి ౧౦ పాళ్లు. కాశ్మీరరాష్ట్రములోని ప్రజలు అతిదరిద్రులు. వారికి విద్యయు ఇంచుమించు శూన్యము. వైద్యసౌకర్యములు అంతకన్నను తక్కువ. మొత్తము రాష్ట్రములో ౭౫ వైద్యాలయములే యున్నవి. ప్రాథమిక స్వత్వముల జాడయే లేదు. ఇట్టిదుస్థితిని తొలగించుటకే అచ్చట జాతీయోద్యమము ప్రారంభమయ్యెను. ౧౯౩౮-వ సంవత్సరము ఆగస్టు ౫-వ తేదీనాడు కాశ్మీర మంతటను "బాధ్యతాయుత ప్రభుత్వదినము"ను వేడుకతో చేయుటకై అచ్చటినాయకులు నిర్ణయించిరి. ఊరూర ప్రచారము చేయించిరి. ఆదినమునాడు సుమారు ౫౦౦ స్థలములలో పెద్ద పెద్ద సభలు చేసి ఈ క్రింది తీర్మానమును అంగీకరించిరి...

"ఈమహాజనసభ ప్రస్తుత ముండు నట్టి నిరంకుశ ప్రభుత్వమును సంపూర్ణముగా ఖండించుచున్నది. ప్రజలబాధలను తొలగించుటకు బాధ్యతాయుత ప్రభుత్వస్థాపన యొక్కటియే తగినట్టిదని అభిప్రాయ మిచ్చుచున్నది. కావున ప్రజ లందరును రానున్న పోరాటమునకు సిద్ధపడవలెను. అందు జయమందిననే కాని ప్రజల ఆర్థిక, రాజకీయ, సాంఘిక, విముక్తి సిద్ధించ నేరదు."

ప్రజ లోకప్రక్క సిద్ధమగుచుండ, కాశ్మీరప్రభుత్వమువారు చేతులు జోడించుకొని ఊరక కూర్చున్నవారు కారు. వారును సంసిద్ధులైనారు. శిక్షాస్మృతిలోని సూత్రాలను విరివిగా ప్రయోగించినారు. అవి చాలవని "19-L' ఆర్డినెన్సు" అనుపేరుగల విచిత్రమగు ఫర్మానును బయటికి తీసినారు. దాని నెన్నడో ఏమూలనో ఏప్రత్యేక పరిస్థితిలో ౧౯౩౩లో ఉపయోగించియుండిరట. దాని త్రుప్పు దులిపి సానబెట్టి మెరుగునిచ్చి వాడిగా నున్నదని నిబ్బరపడినతర్వాతనే ప్రయోగములోనికి తెచ్చినారు. పత్రికలపై దెబ్బతీసినారు. వారియ్యజాలనంత ధనము ధరావతు కోరినారు. అంతటితో చాలపత్రికలు ఆగిపోయినవి. ఇం కేమున్నది. అంతయు అంధకారమే. సుమారు వెయ్యి (౧౦౦౦)మందిని అచిరకాలములోనే జైళ్లలో మూసివేసినారు. కాశ్మీరగాంధీని మొదలే పట్టినారు. వారితో సాహచర్యము గలిగి సమ్మతిని కనబరచిన హిందువులను జెయిళ్లలో వేసినారు. ఇట్లు త్యాగము చేసిన హిందూనాయకులలో ముఖ్యులైనవారు కశ్యపబంధు, జయలాల్, ప్రేమనాథబజాజ్, శ్యామలాల్ సర్రాఫు, అనువారు. నల్గురుశాసనసభా సభ్యులైన ముసల్మానులు, ౨౦ మంది వకీళ్ళును, అనేకులు విద్యార్థులును నీయుద్యమములో పాలుగొనినారు. కాశ్మీర ప్రభుత్వము వారు చాల ఘోరములను గావించినారు. అనేకుల యిండ్లను శోధించినారు. వంటకుండలతోసహా వేలము వేసినారు. బజారులలో పందలకొలది జనులను వీపులపై ఇతర ప్రదేశములపై వాతలు పడ కొట్టినారు (హైద్రాబాదులోను ప్రజాసంరక్షక శాసన మను అష్టదిగ్బంధక శాసనములో కొరడాలతో కొట్టుఅధికారము న్యాయాధికారుల కిచ్చుసూత్రమును హెచ్చుచేసి శాసనము గావింప నున్నట్లువదంతి,

# కాశ్మీర చిత్రములు



౧-వ చిత్రము: శ్రీనగరదృశ్యము — కాశ్మీరము



౨-వ చిత్రము: నాగీమ్‌బాగ్ — కాశ్మీరము



3-వ చిత్రము : 'వూలర్ సరస్సు' — కాశ్మీరము



౪-వ చిత్రము : అమరనాథగుహ : హిమలింగము — కాశ్మీరము

ఇట్టి ఘోరముల ఫలితముగా కాశ్మీరులోని సత్యాగ్రహోద్యమము రహస్యముగా పనిచేయుటకు మొదలుపెట్టెను. అయినను ప్రస్తుత పరిస్థితులనుబట్టి కొంతకాలమువరకు దానిని ఆపివేయుటయే మంచిదని నిర్ణయించి అచ్చటి నాయకులు సత్యాగ్రహమును ౧౯౩౮-వ నవంబరు నెలలో ఆపుదలచేసిరి.

ఈ కాశ్మీరోద్యమమును గమనించుచుండువారలకు అడుగడుగునకు హైద్రాబాదు రాష్ట్రపరిస్థితులే జ్ఞాపకమునకు వచ్చును. కాశ్మీరులోవలె హైద్రాబాదులోను సత్యాగ్రహోద్యమము ఆపుదల చేయబడినది. కాశ్మీరులోని రాజకీయఖైదీలను విడువలేదు. ఇచ్చటను లేదు. ఈ రెండుసంస్థానముల సమస్యలును కేవలము స్థానిక సమస్యలు కావు. కాశ్మీరు ముసల్మానులకొరకై రెండుమూడేండ్లక్రిందట బ్రిటిషిండియా ముసల్మానులు తండోపతండములుగా వెళ్లి జెయిళ్లలో పడిరి. హైద్రాబాదు హిందువులకొరకై బ్రిటిషిండియా హిందువులు అసంఖ్యాకముగా వచ్చి జైళ్లలో పడుచున్నారు. ఇట్లు చూచిన ఈ రెండు సంస్థానముల సమస్యను అఖిలభారతసమస్యగా భావించి పరిష్కరింపవలసి యుండును.



# స్వరాజ్యోద్యమము: ప్రపంచపరిస్థితులు

**మామిడిపూడి వెంకటరంగయ్య**

ప్రస్తుతకాలమున మన స్థితిగతులను బాగుచేసుకొనుటకై మన మనేక ప్రయత్నములను చేయుచున్నాము. వీటి అన్నిటిలో స్వరాజ్య సంపాదనమునకై మనము చేయుచుండు ప్రయత్నము చాల ముఖ్యమైనది. ఇందు జయము లభించిన యెడల తక్కిన వన్నియు సులభసాధ్యము లగును; లేనియెడల తక్కిన ప్రయత్నము లన్నియు విఫలము లగుట తప్పదు.

స్వరాజ్య మనగా నేమి? గడచిన నూటఏబది సంవత్సరములనుండి బ్రిటిషువారు మన దేశమునకు పాలకులుగ నున్నారు. రాజ్యాధికారమంతయు వారి చేతులలో నున్నది. వారేలాగు ఆడించిన ఆలాగు మన మాడవలసిన స్థితిలో నున్నాము. ఈ అధికారమునుండి వారిని తొలగించి, మన దేశముపై రాజ్యాధికారము మనమే వహించుట స్వరాజ్యము. స్వరాజ్యోద్యమము పూర్తిగ కొనసాగుటలో మనము మెట్లను దాటవలసియున్నది. బ్రిటిషువారిని అధికారమునుండి తొలగించుట మొదటిమెట్టు; ఆ అధికారమును మనచేతిలో పడవేసికొనుట రెండవ మెట్టు; మన చేతిలో పడిన అధికారమును నిలబెట్టుకొనుట మూడవ మెట్టు. బ్రిటిషువారి అధికారమును తొలగించి మొదటిమెట్టును దాటినంతమాత్రమున మనకు స్వరాజ్యము వచ్చునని అనుకొనుట గొప్ప పొరపాటు. తక్కిన రెండు మెట్లను దాటుటకు శక్తి యున్నగాని స్వరాజ్యము ప్రాప్తించదు. మన గమ్యస్థానము స్వరాజ్యముగాని బ్రిటిషువారి అధికారమును తొలగించుట మాత్రము కాదు. ఇది మన మెన్నటికిని మరవగూడని విషయము. మన దేశ చరిత్రనుండి మనము నేర్చుకొనవలసిన విశేషములలో ఇది చాల ప్రధానమైనది.

స్వరాజ్య సంపాదనమునకై మన మిప్పుడు చేయుచుండు ప్రయత్నము మన చరిత్రలో మొదటిది కాదు. ఇంతకుపూర్వ మిట్టి ప్రయత్నములు రెండు జరిగియున్నవి. కాని ఆ రెండింటియందును మొదటిమెట్టును మాత్రమే మనము దాట కలిగితిమి. రెండవ మెట్టు ఎక్కుటకు పూర్వమే ప్రతికూలపరిస్థితులు సంభవించుట వలన మన హస్తగతము కావలసియుండిన అధికారము పరాయివారి చేత చిక్కెను. అందుచేత రెండు ప్రయత్నములు విఫలము లయ్యెను. వీటిలో మొదటిది రాజపుత్ర నాయకుడగు రాణా సంగ్రామసింహుడు పదునారవ శతాబ్దములో చేసెను. అంతకుముందు నాలుగు శతాబ్దములుగ మన దేశముపైన రాజ్యాధికారము ఆఫగన్‌వంశపు రాజుల చేతులలో నుండెను. వారిలో ఆఖరువారగు లోడీరాజులు బలహీనులుగ నుండుటయు, వారిది యగు ఢిల్లీ సామ్రాజ్యము విచ్ఛిన్నమగుచుండుటయు చూచి, రాజపుత్రమహావీరుడగు సంగ్రామసింహుడు స్వరాజ్యమును సంపాదింప ప్రయత్నించెను. అందుకై తక్కినరాజపుత్ర రాజ్యముల నేకముల వశపరచుకొనెను; చిన్న చిన్న మహమ్మదీయరాజ్యములలో కొన్నిటిని స్వాధీనము చేసుకొనెను. అటుతర్వాత ఢిల్లీసుల్తానగు ఇబ్రహీం లోడీతో యుద్ధము చేసి అతని నోడించుటకు తగిన సమయము నిరీక్షించుచుండెను. కొద్దికాలములో అట్టి సమయము దొరకు ననియు, అందు ఆఫగన్ రాజులు ఓడిపోయెద రనియు, ఢిల్లీ పట్టణము హిందూ సామ్రాజ్యమునకు ప్రధాన నగర మగు ననియు సంగ్రామసింహుడు నమ్మియుండెను. కాని, ఉన్నట్లుండి, మన దేశమునకావలనుండి విదేశరాజగు బాబరు మన దేశముపై దండెత్తివచ్చి ఇబ్రహీంలోడీని ఓడించి ఢిల్లీని, వశపరచుకొని తర్వాత సంగ్రామసింహుని ఓడించి మొగలాయిసామ్రాజ్యమును స్థాపించెను. అదివరకు దేశమును పాలించుచుండిన ఆఫగనుల అధికారము తొలగి

పోయెనే గాని, దాని స్థానమున స్వరాజ్యము స్థాపితము కాక మరియొక పరరాజ్యము — మొగలాయీ రాజ్యము స్థాపిత మయ్యెను.

స్వరాజ్యమునకై మనము రెండవపర్యాయము పదునెనిమిదవ శతాబ్దమున ప్రయత్నము చేసియుంటిమి. అప్పటికి మహారాష్ట్రులు స్వరాజ్యోద్యమమునకు నాయకులైరి. వారి రాజ్యమును స్థాపించిన శివాజీ యొక్కయు, శివాజీకి తర్వాత, వారికి మంత్రులైన బాలాజీ విశ్వనాథుడు బాజీరావు మొదలగువారియొక్కయు శక్తిసామర్థ్యముల మూలమున వారి యుద్యమము కొనసాగుటయు స్వరాజ్యస్థాపనములో మొదటి మెట్టగు మొగలాయీల అధికారము తొలగుటయు జరిగెను. కాని రెండవ మెట్టును వారు పూర్తిగ దాటుటకు ముందే ఐరోపాఖండవాసులగు బ్రిటిషువారు నౌకాబల సహాయమున మన దేశమునకు వచ్చి, కోటలు కట్టుకొని, కొద్దికొద్దిగ రాజ్యాధికారమును సంపాదించి, తుదకు మహారాష్ట్రుల నోడించి, తమ సామ్రాజ్యమును వ్యాపింపజేసిరి. మొగలాయీల అధికారము తొలగిపోయెను; కాని దానివలన స్వరాజ్యఫలము లభించుటకు బదులు మరియొక పరాయివారి అధికారము దేశమందు నాటుకొనెను.

బ్రిటిషువారి అధికారమును తొలగించి స్వాతంత్ర్యమును స్థాపించుకొనుటకై మన మిప్పుడు చేయుచుండు ప్రయత్నము మన స్వరాజ్య ప్రయత్నములలో మూడవది యని చెప్పవలసియున్నది. తక్కిన రెండు ప్రయత్నములకును పట్టిన గతియే దీనికి పట్టకుండ మన మీ యుద్యమమును మిక్కిలి జాగ్రత్తతో నడిపించుకొనుట అత్యావశ్యకము. మన దేశముపై ప్రస్తుతము బ్రిటిషువారు చెలాయించుచుండు అధికారము తగ్గిపోవచ్చును ; అంతమాత్రము చేత స్వరాజ్యము మనకు నిస్సంశయముగ లభించునని చెప్పుటకు వీలులేని పరిస్థితులలో మన మున్నాము. ఆ పరిస్థితు లేవియో కొంచెము విమర్శించుకొనుట మంచిది.

ఈ సందర్భమున దేశచరిత్ర నుండి గ్రహించవలసిన సత్యము మరియొకటి యున్నది. పదునెనిమిదవశతాబ్దమందును పందొమ్మిదవ శతాబ్ద ప్రారంభమునను బ్రిటిషువారు మన దేశమును జయించి పాలింపగలుగుటకు ప్రధాన కారణము వారు మన దేశములో మనవారితో చేసిన యుద్ధములు కాదు. వారి వ్యాపారమునకును సామ్రాజ్యమునకును అడ్డు తగిలిన తక్కిన ఐరోపా జాతివారిని ఓడించుటబట్టియే వారికి మన దేశము లభించెను. వారు మనలను ఖండాంతరములందు జరిగిన యుద్ధములలో జయించిరి. వారికిని ఫ్రెంచివారికిని ఇందువిషయమై అనేక యుద్ధములు జరిగెను. అందు తుదకు ఫ్రెంచివా రపజయము గాంచిరి. అందుచేత ఫ్రెంచివారికి బదులు బ్రిటిషువారు మనకు పాలకు లగుట సంభవించెను. అట్లుగాక ఆ యుద్ధములలో ఫ్రెంచివారే జయము గాంచి యుండినయెడల వారే మనకు పరిపాలకులై యుండెడివారు; అనగా, మన దేశముపై ఎవరు అధికారము వహించవలెనను విషయము ప్రపంచ పరిస్థితులవలన నిర్ణయింపబడినదే గాని, కేవలము మన దేశపు పరిస్థితులవలన మాత్రమే నిర్ణయింపబడలేదు.

ఇప్పుడుగూడ ప్రపంచ పరిస్థితులకును మన దేశపు రాజకీయ పరిణామమునకును ఎంతో దగ్గిరసంబంధమున్నది. బ్రిటిషువారి అధికారమును తొలగించుటకు మన మనేక ప్రయత్నములను చేయుచున్నాము. ఈప్రయత్నములను అడ్డుకొనుటకు కావలసినంత శక్తి వారికి లేకపోవుటచేత వారు రాష్ట్రములపై అధికారమును కొంత వదలుకొని ప్రజలచే ఎన్నుకొనబడిన మంత్రుల అధీనము చేసిరి. రాష్ట్రములందు కొంతవరకు మనకు స్వరాజ్యము వచ్చినది. కాని ఇది అసంపూర్ణమగు స్వరాజ్యము బ్రిటిషువారి ప్రతినిధియగు గవర్నరుకు ఇప్పటికికూడ ఎంతో అధికారమున్నది; అతనిని కాదని మంత్రులు తమ ఇష్టానుసారము ప్రవర్తించుటకింకను వీలు లేదు. కేంద్రప్రభుత్వమం దిప్పటికికూడ మనకు కొంచెమైనను స్వరాజ్యము లభించలేదు. రాజ్యాధికారమున కంతకును మూలసాధనమగు సేనయు నౌకాబలమును విమానబలమును బ్రిటిషువారి యధీనమందే యున్నది. ఇది గాక స్వదేశ సంస్థానములందలి అధికారమంతయు బ్రిటిషువారి చేతుల లోనే యున్నది. వివిధము లగు ఈ అధికారముల నన్నిటిని మనము

సంపాదించుటకై చేయుచుండు ప్రయత్నములు సఫలము లగుటకు ప్రపంచపరిస్థితులు అనుకూలించియున్నవా ? ప్రతికూలించియున్నవా ?

స్థూలదృష్టితో చూచినయెడల ప్రపంచ పరిస్థితులు అనుకూలించియుండునట్లే అగుపడును. పందొమ్మిదవ శతాబ్ద ప్రారంభమున ఫ్రెంచివారి నాయకు డగు నెపోలియన్ చక్రవర్తిని ఓడించిన తర్వాత ఇటీవలివరకు బ్రిటిషువారితో సమానముగ యుద్ధముచేసి వారిని ఓడించగల సమర్థు లెవ్వరును ఐరోపాఖండమందు బయలుదేరరైరి. బ్రిటిషువారి నౌకాబలము అద్వితీయమైయుండెను. మహాసముద్రములును, వానిలోని రాదారులును, ఆమార్గములలోని ముఖ్య ప్రదేశములును వారి అధీనమం దుండెను. వారి నౌకాబలముతో తులతూగగల నౌకాబలము మరెవ్వరికిని లేకుండెను. అట్టి బలములను సంపాదించుటకు ప్రయత్నించిన జర్మనీవారిని ౧౯౧౪ మొదలు, ౧౯౧౮ వరకు జరిగిన మహాసంగ్రామమందు బ్రిటిషువారు ఓడించి, వారి నౌకాబలమును నాశము చేసిరి. గనుక బ్రిటిషువారిని కాదని వారి వశమం దున్న రాజ్యమును హరించుటకు కావలసిన శక్తి సామర్థ్యములు ప్రపంచములో ఎవ్వరికిని లేకుండెను. కాని ఇటీవల ఇదంతయు మార్పు గాంచుచున్నది. దీని కనేక కారణములు కలవు. వీటిలో మొదటిది ఆకాశవిమానముల ప్రాధాన్యము. యుద్ధమందు శత్రువులను సంహరించుటలో పూర్వకాలమందు సైన్యములకును నౌకలకును ఎంతటి ప్రాధాన్య ముండెనో అంతకంటె ఎక్కువ ప్రాధాన్యము ఈ కాలమున ఆకాశవిమానములకున్నది. ఆకాశబలమందు బ్రిటిషువారికంటె జర్మనీవారును, వారి మిత్రు లగు ఇటలీవారును, జపాన్ వారును అధికులుగ నున్నారు. రెండవది ఇదివరకు బ్రిటిషువారి అధీనమందుండిన సముద్రమార్గములను ఇటలీవారును జర్మనీవారును జపానువారును చాలవరకు అడ్డగలిగియుండుట. సముద్రమార్గము లన్నిటిలో మధ్యధరా సముద్రమార్గము బ్రిటిషువారికి మిక్కిలి ముఖ్యమైనది. ఇది వారిసామ్రాజ్యమున కంతకును హృదయమువంటిది. స్పెయిన్ దేశము ఫ్రాంకో వశ మగుటచేతను, జర్మను ఇటాలియన్ సైనికు లనేకు లా దేశమం దుండుటచేతను, మధ్యధరాసముద్రమునకు మధ్యన ఇటలీ దేశ ముండుటచేతను, పాలెస్టయిన్‌లోని అరబ్బులు కలహమును విడనాడకుండుటచేతను బ్రిటిషువారి మధ్యధరాసముద్రపు మార్గము అపాయకర మైన స్థితిలోనికి వచ్చియున్నది. ఇట్లే ఇటలీవారు అబిసీనియాను జయించినందున ఎఱ్ఱసముద్రపు మార్గమును అడ్డగించుటకు వారి కవకాశ మేర్పడియున్నది. చీనాదేశమందు జపాన్ వారు గాంచుచున్న విజయముల మూలమున పసిఫికుమహాసముద్రమందు వారిబలమధికమై అచటనుండి వారు సింగపూరు బర్మా ఇండియాలకు ప్రమాదము కలిగించుట కవకాశ మేర్పడియున్నది. బ్రిటిషువారి ఆధిక్యము తగ్గుసూచన లున్నవని అనుకొనుటకు మరియొక కారణము కూడ కలదు. బ్రిటిషువారి జనసంఖ్య నాలుగు కోట్లున్నర; జర్మనీవారి ప్రస్తుతపు జనసంఖ్య ఎనిమిదికోట్లు. వారికిని ఇటలీవారికిని గాఢమైన మైత్రి కుదిరినది. ఏషియాఖండమందంతట సామ్రాజ్యాధికారమును స్థాపించుటకు పూనియుండు జపాన్ వారు వీరితో కలిసియున్నారు. ఈ మూడుజాతులవారికిని సామ్రాజ్యకాంక్ష విపరీతముగ నున్నది. ఈ కాంక్షను తీర్చుకొనుటలో న్యాయాన్యాయములను, ధర్మాధర్మములను విమర్శించుట అనావశ్యకమని వారితత్వము. ఇందుకై వా రెట్టిక్రూరమార్గమునైనను అనుసరించుటకు సిద్ధపడియున్నారు. శౌర్య మొక్కటియే ఉత్తమగుణ మనియు, దేశములోని వా రందరును క్షత్రియధర్మము ననుసరించి, యోధులై, సామ్రాజ్యవ్యాప్తికి పోరాడవలసిన దనియు వారిమతము. వారి నెదుర్కొనుట అనిన రాక్షసుల నెదుర్కొనినట్లే. ఇట్టివారితో యుద్ధము చేయుటకు అందరును జంకుచుండుటలో ఆశ్చర్యమేమి యున్నది ? ప్రపంచసామ్రాజ్యమునకై పదునెనిమిదవ శతాబ్దమందు ఫ్రెంచివారును, ఇంగ్లీషువారును పోరినట్లు ఈశతాబ్దమందు ఒక పక్షమున జర్మనులు ఇటాలియనులు జపానువారును, రెండవ పక్షమున ఇంగ్లీషువారును ఫ్రెంచివారును ఎదుర్కొని పోరుపరిస్థితులు ఏర్పడియున్నవి ; అనగా బ్రిటిషువారిని ధిక్కరించగల మనుధైర్యము గల

వారు కొందరు ఇప్పుడు ముందుకు వచ్చు చుండుటచేత బ్రిటిషువారు మనతో రాజీకి వచ్చి మన దేశముపై వా రిదివరకు చెలాయించుచున్న అధికారములో చాలభాగమును వదలుకొనెదరేమో అను ఆశ మనము పెట్టుకొనుట కవకాశ మేర్పడు చున్నది. మనయొక్క సహాయము మైత్రి వారికి చాల అవసరమగు సమయము సంప్రాప్తించు చున్నది. అందుచేత స్వరాజ్యమును సంపాదించుటలో ప్రస్తుతపు ప్రపంచపరిస్థితులు మన కనుకూలించున ట్లున్నవని చెప్పుటకు కారణము లగపడు చున్నవి.

కాని, ప్రపంచ పరిస్థితులు నిజముగ మన కనుకూలించి యున్నవా? స్వరాజ్య సంపాదనమందు మనము దాటవలసిన రెండవ మూడవ మెట్లను దాటుటలో మన కనుకూలించు నట్లుగ నున్నవా అనువిషయమును మన మాలోచింపవలెను. బ్రిటిషువారు గత మహాసంగ్రామానంతరము కనడా, ఆస్ట్రేలియా, దక్షిణ ఆఫ్రికా, న్యూజీలండు మొదలగు రాష్ట్రములపై అదివరకు వారి కుండిన అధికారము నంతయు వదలుకొనిరి. ఇవన్నియు ఇప్పుడు స్వతంత్ర రాష్ట్రములుగ నున్నవి. కాని ఎంతవరకు ఈరాష్ట్రములవారు బ్రిటిషువారి సహాయము లేక వారి స్వరాజ్యమును రక్షించుకొనగలవా రను విషయమును గురించి వారికే ఇప్పుడు సంశయము కలుగుచున్నది. సామ్రాజ్యకాంక్షలేని బలవంతులు ప్రపంచమందు లేనంత వరకు వీరిస్వాతంత్ర్యమున కెట్టి భంగము కలుగజాలదు. కాని జపాను జర్మనీ మొదలగు దేశములలోనివారు ఏలాగైన సామ్రాజ్యములను జయింపవలె నని బయలుదేరిన తర్వాత ఈరాష్ట్రములవా రందరును భయపడ మొదలుపెట్టుచున్నారు. బ్రిటిషువారితో సంబంధము పెట్టుకొనుట మంచిదా ? ఆసంబంధమును పూర్తిగ త్రెంచుకొనుట మంచిదా ? అనే సంశయము వారి కిప్పుడు కలుగుతున్నది. ఇట్లే బ్రిటిషువారికి మనపై ఇప్పు డుండు అధికారము తగ్గినంతనే నిజమైన స్వరాజ్యము మనకు లభించునా లభించదా? అనే విషయమున జర్మనీవారు, ఇటాలియనులు, జపాను వారు — వీరిమూలమున మన కేమైన ప్రమాదము కలుగనున్నదా లేదా అను అంశము విచారించుట మిక్కిలి ముఖ్యముగ నున్నది. బ్రిటిషువారి అధికారము తొలగునాటికిని సామ్రాజ్యకాంక్ష గల జపాన్, జర్మనీ, ఇటలీ మొదలగు దేశములవారినుండి ప్రమాదము కలుగు నాటికిని విస్తార అవకాశ ముండుటయు, అట్టి అవకాశములో వారి నెదిరించుటకు కావలసినంత నౌకాబలము సైనికబలము ఆకాశబలము మనము సంపాదించుటయు సంభవించినయెడల స్వరాజ్యము మనకు దక్కును ; లేనియెడల పదునారవ శతాబ్ద మందలి సంగ్రామసింహుని ప్రయత్నమున్ను, పదునెనిమిదవ శతాబ్దమందలి మహారాష్ట్రుల ప్రయత్నమున్ను ఏవిధముగ పరిణమించెనో ప్రస్తుతకాలపు మన స్వరాజ్యోద్యమముకూడ అదేవిధముగ పరిణమించునేమో అను సంశయము కలుగుచున్నది.

ప్రాచీనకాలమందు మహావైభవోపేతమగు రోమ్‌సామ్రాజ్య మొకటి యుండెను. ఐరోపాఖండములోని దేశము లనేకములు అందులో చేరి యుండెను. బ్రిటిషువారి దేశము కూడ అందులోనిదే. కాని ఎంతకాలమువరకు ఆసామ్రాజ్య ముండెనో అంతకాలమువరకు బ్రిటిషుదేశమును సామ్రాజ్యాధికారులే రక్షించుచుండిరి. అందుకై వారిసైన్యము లనేకము లాదేశమం దుంచబడెను. ఆదేశములో పుట్టి పెరిగినవారు నిరాయుధులై యుండిరి. యుద్ధము చేయవలసిన అవసరము లేకుండుటచేత యుద్ధ మన నేమియో మరచిపోయిరి. ఇట్లు కొన్ని వందల సంవత్సరములు గడచెను. తర్వాత కొంతకాలమునకు భీకరులగు శత్రువులు రోమ్‌నగరముపై బడిరి. అప్పుడు ప్రధానపట్టణమును రక్షించుకొనుటకై సామ్రాజ్యములో మూలమూలల నున్న సైన్యముల నన్నిటిని రోము పట్టణమునకు వచ్చునట్లు రోము చక్రవర్తు లేర్పాటుచేసిరి. బ్రిటిషు దేశములోని రోమ్‌సైన్యములుకూడ వెళ్లిపోయెను. అటుపిమ్మట కొంతకాలమునకు బ్రిటిషు దేశముపై శత్రువులు దండెత్తి వచ్చిరి. వారి నెదిరించుటకు రోమ్‌సైన్యములు లేకపోయెను; దేశములో పుట్టి పెరిగినవారికి యుద్ధము చేయ నేర్పు లేకపోయెను. అందుచేత దేశము శత్రువశమయ్యెను. రోమనుల అధికారము తొలగి

పోయెను గాని బ్రిటన్లకు స్వరాజ్యము మాత్రము రాలేదు.

ప్రస్తుతము మనము ఇట్టి అవస్థలో ఉన్నాము. బ్రిటిషువారి అధికారము పూర్వమువలె మహోన్నతదశయందు లేదు. వారి నెదుర్కొనగల శత్రువులు ముందుకు వచ్చుచున్నారు. పట్టుదలతో మనము పోరినయెడల వారు వారి అధికారమును వదలుకొని ఆస్ట్రేలియా మొదలగు రాష్ట్రములకిచ్చినటువంటి స్వతంత్రమును మనకిచ్చినను ఇయ్యవచ్చును. కాని ప్రపంచ మండలి పరిస్థితులు మిక్కిలి ప్రమాదకరములుగ నున్నవి. మన దేశముపై సామ్రాజ్య కాంక్షగల బలవంతులనేకులు కన్నువేసియున్నారు. ఎంతవరకు మనము స్వరాజ్యమును నిలబెట్టుకొనగలవారమో చెప్పుటకు వీలులేనట్లున్నది. స్వరాజ్యసమరమును జరుపుటలో ఏక్రమము ననుసరించి వెళ్లుట మంచిదో మననాయకు లాలోచించవలసియున్నది. బ్రిటీషువారి అధికారము తొలగినంత మాత్రముననే మనకు స్వరాజ్యము వచ్చినదని అనుకొనుటకు వీలులేదని చెప్పుటలో గల సత్య మిదియే. స్వరాజ్యోద్యమమునకు మూడుమెట్లున్నవనుమాట మనము మరవగూడదు.



# సత్యస్వరూపం

కొడవటిగంటి కుటుంబరావు

అందరికీ సత్యం కావాలి. దానితో ప్రతి ప్రాణికీ ప్రయోజనం ఉంది. అప్రయత్నంగానో ప్రయత్నపూర్వకంగానో ప్రతిజీవీ సత్యాన్వేషణ చేస్తున్నది. సత్యం చలనం లేనిది, మార్పు చెందనిది. క్షణక్షణమూ మార్పు చెందే ఈ ప్రపంచంలో మనం ఆధారపడ దగినది సత్యమే. అదే చలించినట్టయితే మనకు విశ్వాసాలుండటం అసంభవం, మనకు జ్ఞానాన్వేషణ అసాధ్యం.

మనదృష్టిలో కొందరు సత్యాన్ని ఎదుర్కో లేనివాళ్లుగానూ, సత్యం అవసరం లేని వాళ్లుగానూ కనిపించటం కద్దు. అంతమాత్రానికే వారికి సత్యంతో ప్రయోజనం లేదనీ వారికి విశ్వాసాలు లేవనీ భావించటం పొరపాటు. ఒకరు త్యాగంలో నమ్మకం గలవారు కావచ్చును. మరొకరికి స్వార్థంలో విశ్వాసం ఉండవచ్చును. ఇద్దరూ చెరొక సత్యాన్నీ నమ్ముతున్నారు. అట్లా చెయ్యటం వల్ల ఇద్దరికీ రెండు రకాల ప్రయోజనం ఉంటున్నది. "సత్యం ఇంత విరుద్ధంగా ఉంటుందా? ఇన్ని రకాల సత్యాలున్నాయా?" అన్న ప్రశ్నలకి ముందు ముందు సమాధానం స్పష్టంగా చెబుతాను. ప్రస్తుతానికిమటుకు సత్యం ఒకటేనని నమ్మేవారు ఒకే సత్యాన్ని అనేక వైపులనించి చూడటానికీ ఆరాధించటానికీ అవకాశం ఉందని సమాధానపడవచ్చును.

ఏవో కొన్ని విశ్వాసాలు లేకుండా జీవించటం ఎవరితరమూ కాదు, కాని మనం విశ్వసించేవి అసత్యాలయినప్పటికీ సగం సత్యాలయినప్పటికీ మనకు పని గడిచిపోతున్నది. కనకనే నిన్న ఏవిశ్వాసంకోసం కొందరు ఆత్మార్పణ చేసుకున్నారో ఈనాడు దానికి విరుద్ధమైన విశ్వాసంకోసం మరికొందరు ఆత్మార్పణ చేసుకుంటున్నారు. పరస్పర వైరుధ్యంగల మతాలను అవలంబించి మానవులు ఒకేవిధమైన ఆధ్యాత్మికసంతుష్టి పొందగలుగుతున్నారు. దీన్నిబట్టి చూస్తే మనకు సత్యంకంటెకూడా సత్యమందు మనకుగల విశ్వాసంతోనే విశేషంగా ప్రయోజనం ఉన్నట్టు కనిపిస్తుంది.



ఇంతేకాక ఒకసత్యమందు మనకుగల విశ్వాసంవల్ల మనకెంత ప్రయోజనం ఉందో దాన్నిపట్టే ఆ సత్యమందు మనకుండే విశ్వాసంయొక్క గాఢత్వంకూడా నిర్ణయమవుతున్నట్టు కనిపిస్తుంది. భగవంతుడున్నాడని నమ్మినవాడికీ లేనివాడికీ జీవితం ఇంచుమించు ఒకేవిధంగా వెళ్లిపోవచ్చును. కాని ఎక్కాలపుస్తకం అబద్ధమని అనుమానించినవాడికీ నిజమని నమ్మినవాడికీ జీవితం ఒకవిధంగా వెళ్లటం అసంభవం. అందుకనే మనలో ఎవరంకూడా ఎక్కాలపుస్తకంలో ఉండే విశ్వాసం భగవంతుడిలో ఉంచలేం. ఎక్కాలపుస్తకంలోకంటె భగవంతుడియందు ఎక్కువ విశ్వాసం ఉన్నట్టు ఎవరైనా నటించినట్టయితే వారు మూఢులో వంచకులో అయి ఉండాలి అటువంటివారి ప్రవర్తనను జాగ్రత్తగా పరిశీలించినట్టయితే వారికి భగవంతుడియందున్న విశ్వాసంలో ఎక్కువవిశ్వాసం లేదని బయటపడటమే కాకుండా ఏదుకాణదారైనా వారికి తక్కువచిల్లర ఇచ్చినట్టయితే ఎక్కాలయందు వారికున్న విశ్వాసంలో ఎంతవిశ్వాస ముండేదీ బయటపడి తీరుతుంది.

ఒకఅభిప్రాయం సత్యం కాకపోయినప్పటికీ అది మనదృష్టికి సత్యంగా కనిపించినంత కాలమూ — అది సత్యమని మనం విశ్వసించ దగినంతకాలమూ — మనం దాన్ని ఆధారం చేసుకోగల మని పైన తెలుసుకున్నాం. కాని మనఅభిప్రాయాలు స్థావరంగా ఉండటంలేదు. అవి పరివర్తన చెందుతూ ఉండటమూ, సంస్కారం పొందుతూ ఉండటమూ, అంతరించి పోతూ ఉండటమూ మనం చూస్తూనే ఉన్నాం. మనవిశ్వాసాలు ఇట్లా మార్పుచెందకపోయినట్టయితే మన సంస్కారమూ నాగరికతా నిలిచిపోయ్యేటందు కవకాశం ఉంది. కొంతకాలంక్రితం సంపూర్ణమైన సత్యాలుగా భావించబడి ఈనాడు అసత్యాలుగా పరిణమించిన కొన్ని అభిప్రాయాలు తీసుకుని అవి శాశ్వత సత్యాలుగా గణించబడితే జీవితంఎట్లా అధోగతికి పొయ్యేవో మనం కొంతవరకు ఊహించవచ్చును. సహగమనాచారంలో మన పూర్వుల కుండిన విశ్వాసం ఈ విధమైన విశ్వాసాలలో ఒకటి. మనం సహగమనాన్ని ఏ దృష్టితో చూస్తున్నామో మన ముందువాళ్లు అస్పృశ్యతనూ, విడకులులేని వివాహాలనూ ఆ దృష్టితోనే చూస్తారని భావించవలసి ఉంది. దీన్నిబట్టి మనంనేర్చుకోదగిన దేమంటే మనం ఏ విశ్వాసాలవల్ల ప్రస్తుతం కొంత ప్రయోజనాన్ని సాధిస్తున్నామో అవి సంపూర్ణమైన సత్యాలని భావించుతూ కూడా

వాటిని ప్రళయపర్యంతమూ అందరూ సంపూర్ణమైన సత్యాలక్రింద పరిగణించాలనే భ్రమకు లోబడకుండా ఉండటం.

బొత్తిగా సంస్కారం అవసరం లేని శాశ్వతసత్యాలు కూడా ఉన్నవని నేను స్మరిస్తాను. ఎక్కాలు ఆ జాతివే. కాని వాటినిగురించి ఉద్రేకం తెచ్చుకోవాలని ఎవరికీ తట్టదు. దురదృష్టవశాత్తూ కాలవశాన మార్పు చెందేవి, చెందివలసినవీ అయిన సత్యాలను సమర్థించటానికే మనం ఉద్రేకం తెచ్చుకుంటాం.

సత్యాన్వేషణపరుడికి పరమవిరోధి ఈ ఉద్రేకమే. ఉద్రేకం మెదడును చంపేస్తుంది. తను సమర్థించే సత్యంయొక్క బలాన్ని ఆహరిస్తుంది; లేదా, తను అన్వేషించే సత్యాన్ని దూరం చేసుకుంటుంది. సత్యాన్వేషణపరుడికి ఉద్రేకమే కాక మంచీ చెడూ విచక్షణకూడా లేదు. విజ్ఞానంతో కూడుకున్నవి శాస్త్రగ్రంథాలు. వాటిలో మంచీ చెడూ అనే రెండు మాటలకూ ఎక్కడా అవకాశం ఉండదని నేను వేరే చెప్పనక్కర్లేదు. మంచి చెడ్డలు ఆదిలో ఉండినవికావు, అంతంలో ఉండబోయేవీకావు; మధ్యలో మనవీలుకోసం మానవులం కల్పించుకున్నవే.

ఉద్రేకాన్నీ ద్వంద్వాన్నీ విసర్జించినవాడే మనవిశ్వాసాలను సంస్కరించగలడు. (ఎవరూ సంస్కరించకుండానూ మార్చకుండానూ మనవిశ్వాసాలు వాటి కవి మారవు.) వాడు శాస్త్రీయమైన దృష్టికలవాడు.

శాస్త్రీయమైనదృష్టి ఏ సంఘంలో తక్కువగా ఉంటుందో ఆ సంఘం తప్పనిసరిగా వెనకపడి ఉంటుంది. అందుకు కారణాలు క్లుప్తంగా వివరిస్తాను.

శాస్త్రీయమైనదృష్టి కలవాడిబుద్ధి అనుక్షణమూ "ఏమిటి ? ఎందుకు ?" అని ప్రశ్నిస్తూ ఉంటుంది. అటువంటి జిజ్ఞాసలేనిదే సత్యం బయటికి రాదు. శాస్త్రీయమైనదృష్టికీ, జిజ్ఞాసకూ ఆదరణలేని మనసంఘంలో విజ్ఞానవ్యాప్తీ దాన్ని అనుసరించి విశ్వాసాలు సంస్కారం కావటమూ జరగదు. అనేక శతాబ్దాలపాటు విశ్వాసాలు చెక్కుచెదరకుండా ఉండటమేకాక వాటిని సమర్థించేవారు వాటివిషయమై చాలా ఉద్రేకాన్ని ప్రకటిస్తారు. మనకు అనాదిగా వస్తున్న సత్యాలు శాశ్వతసత్యాలే అనుకుందాం అవి చలనంలేని సత్యాలని నిరూపించటానికి సహాయపడేది ఉద్రేకంకాదు — విజ్ఞానమూ, శాస్త్రీయమైనదృష్టీనీ. సంప్రదాయంగా వస్తూ విజ్ఞానంచేత సంస్కారం పొందని అభిప్రాయాలు మనం చాలా అమలులో ఉంచాం. చిన్నతనంలోనే భర్తపోయిన పిల్ల యావజ్జీవమూ ఏకాంతజీవనం చెయ్యాలనీ, అట్లా చెయ్యటం ఎట్లాగో ఆ పిల్లకూ తత్సంబంధీకులకూ చాలామంచిదనీ మనం విశ్వసిస్తున్నాం. మనిషికీ మనిషికీ పుటకలోనే కులంవల్ల ఒక తారతమ్యం ఏర్పడుతున్నదనీ, అది అలవాట్లవల్లా పెంపకంవల్లా పోదనీ మనం విశ్వసిస్తున్నాం. ఇటువంటి విశ్వాసాలు అసంఖ్యాకంగా ఉన్నై. వాటి యాథార్థ్యం గురించి ఒకనాడు మానవులకు ఎటువంటి సంశయమూ ఉండి ఉండక పోవచ్చును. కాని ఈనాడు ఆ యాథార్థ్యాన్ని కొంతవరకైనా పరీక్షించేటందుకు తగిన విజ్ఞానం ప్రపంచంమీద ప్రబలిఉంది శాస్త్రీయమైనదృష్టిలేని కారణంచేత మనం అసత్యాలని సులభంగానిరూపణ అయేవాటిని విశ్వసించటం జరుగుతున్నది

మూఢవిశ్వాసాలకుకూడా శాస్త్రీయమైన దృష్టి లేకపోవటమే కారణం. నిజానికి విశ్వాసాలన్నీ ఒక జాతివే. ఏ విశ్వాసాన్నీ సాంతంగా నిరూపణచేసి న్యాయం(Logic)చేత నిర్ధారణ చెయ్యలేం. అందుకని ఎంత మూర్ఖుడుకూడా ప్రతి అభిప్రాయాన్నీ విశ్వసించడు. మన విశ్వాసాలవల్ల ఏదో ప్రయోజనం మనకుండాలి. మన విశ్వాసాలవల్ల మనకు ప్రయోజనము లేకపోగా పైపెచ్చు నష్టం ఉన్నప్పుడు కూడా వాటిని మనం పట్టుకు వేళ్లాడుతుంటే మన విశ్వాసాలు మూఢవిశ్వాసా లవుతై నిజానికి ఎవరి విశ్వాసంవల్ల ఎవరికేవిధమైన లాభం కలుగుతున్నదో మరొకరు కనుక్కోవటం చాలా కష్టం. ఎవరి మూఢవిశ్వాసాలను వారు కనుక్కోవాలి. దానికి శాస్త్రీయమైన దృష్టీ విజ్ఞానమూ అత్యవసరం.

ఒకటిమాత్రం ఒప్పుకోవాలి — విజ్ఞానమూ శాస్త్రీయమైనదృష్టీ అభివృద్ధి అయినకొద్దీ విశ్వాసాలయందు గాఢమైన అభిమానం తగ్గుతుంది. కాని ఇట్లా జరగటం తప్పుకాదు. అటువంటి పరిస్థితి కలిగినప్పుడే మనకు మన విశ్వాసాలవల్ల అధికమైన ప్రయోజనమూ అల్పమైన అపకారమూ జరిగేది.

శాస్త్రీయమైనదృష్టి అలవడటంవల్ల మనకు కలిగే మరొకలాభం ఏమంటే మనకు విశ్వసించగలదాన్నిగురించి ఎంత బాగా తెలిసి ఉంటుందో విశ్వసించరానిదాన్నిగురించి కూడా అంత బాగా తెలిసి ఉంటుంది. ప్రస్తుతం మనసంఘంలో మన విశ్వాసాలనే మనం సరిగా అర్థం చేసుకోం; మన విశ్వాసాలకు విరుద్ధంగా ఉన్న విశ్వాసాలను ఎట్లా అర్థం చేసుకోగలం? భగవంతుడియందు విశ్వాసం ఉంచగలిగినవాడు తన విశ్వాసాన్ని కొంతవరకు సమర్థించగలగటమేకాక నాస్తికుడి వాదనను సాంతం అర్థం చేసుకుని దానిలో లోపాలుకూడా చూపించ గలిగి ఉండటం శాస్త్రసమ్మతమైనపని. కాని మనం మన విశ్వాసాలను ఉద్రేకంతో సమర్థించినంతకాలమూ మనకు విరుద్ధంగా ఉన్న విశ్వాసాలనుగురించీ, వాటివల్ల మనకు ఉండదగిన ప్రయోజనం గురించీ నిష్పాక్షికంగా ఆలోచించలేం. ఇటువంటప్పుడు మనకు రెండువిధాల హానికలుగుతూ ఉండవచ్చును. మన విశ్వాసాలు మనకు అపకారం చేస్తూ ఉండవచ్చును ; మనం ఆమోదించలేని విశ్వాసాలవల్ల మనకు కలగదగిన ప్రయోజనం దూరం అవుతూ ఉండవచ్చును... ప్రస్తుతంలో మన కీ రెండువిధాలా హాని జరుగుతూ ఉండటం నిర్వివాదాంశం.

# సత్యస్వరూపం

ఇక విశ్వాసాల సంగతి కట్టిపెట్టి సత్యం సంగతివిచారింతాం. అరెంటికీ ఉన్న సంబంధం అందరికీ సులభంగా అర్థమయేదే. మనం ఏ విషయాన్ని కానివ్వండి యథార్థ మని నమ్మకుండా విశ్వసించలేం. దేన్నీ విశ్వసించలేని పరమ నాస్తికుడు కూడా తన కళ్లనూ చెవులనూ నమ్మకుండా ఉండలేడు. మనకళ్లూ చెవులూ ఏవిధంగా మననివంచిస్తవో తెలుసుకోగలిగిన శాస్త్రజ్ఞుడు ఆ వంచనను గురించి సత్యం తెలుసుకొని తనజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకుంటున్నాడో, ఏశాస్త్రజ్ఞుడైనా తన జ్ఞానేంద్రియాలను నమ్మకపోవటానికి తోడు అవి చేసేవంచనయొక్క విధానాన్ని కూడా నమ్మలేక పోయినాడో అతనికి జ్ఞానం అసంభవం.

ఈసత్యంయొక్క స్వరూపం ఏది? ఇది మనకు ఎప్పుడూ అందుబాటులోనే ఉన్నట్టుంటుంది; ఎప్పుడూ అందదు. పైగా సత్యం అనేకస్వరూపాలలో ఉన్నట్టు కనిపిస్తుంది. ఒక ప్రయోజనం సాధించటానికి మనం సత్యంకింద స్వీకరించేది మరొక ప్రయోజనం సాధించటానికివట్టిఅబద్ధంగా కనిపిస్తుంది. ప్రాణులంతా ఒకటేనని నమ్మవలసిన ఆవశ్యకత ఉన్నట్టే, ఏఇద్దరు ప్రాణులూ ఒకటికాదని గుర్తించవలసిన ఆవశ్యకతకూడా ఉంది.

సత్యాలలో తారతమ్యం ఉందని జ్ఞానాన్వేషణ చేసేవారికి సులభంగా తెలుస్తుంది. వెలుతురు సమరేఖలలో ప్రసరిస్తుం దనేది ఒకసత్యం. దాన్ని అనేక విధాల రుజువు చెయ్యవచ్చును. అద్దంలో చూసి పాపడ తీసుకునే ప్రతిఆడదీ ఆవిషయం రుజువు చేస్తూనేఉంది. కాని విజ్ఞానికి పైన చెప్పినది స్థూలంగానే సత్యం. వెలుతురు సమరేఖల్లోనే పోదనీ, అదికూడా పక్కదార్లు తొక్కుతుందనీ శాస్త్రజ్ఞుడు రుజువుచెయ్యగలడు. ఇంకా సూక్ష్మంగా వెళ్లినకొద్దీ వెలుతురు యొక్క ప్రసారాన్ని గురించిన సత్యం సామాన్యమానవులకు దుర్గ్రాహ్యమై పోతుంది.

ఈ విధంగా సూక్ష్మంగా పోగా పోగా పరిపూర్ణమైన అసలుసత్యం మానవుడికి గ్రాహ్యమవుతుందా? ఆ ఆదర్శస్థితిలో వివిధసత్యాలకు ఏకత్వం సిద్ధించుతుందా? ఈ ప్రశ్నలకు వేదాంతులు అదివరకే ఏదో విధంగా సమాధానం చెప్పి ఉంటారు. కేవలమూ వేదాంత దృష్టిలో కాక భౌతికశాస్త్ర దృష్టిలో ఈ ప్రశ్నలకు ఏ సమాధానం లభిస్తుందో చూతాం.

భగవంతుడు మానవుడికి అనేకరకాల మానసిక శక్తులు ప్రసాదించాడు. అందులో న్యాయశక్తి ఒకటి. జ్ఞానం ఆధారం చేసుకుని సిద్ధాంతం చెయ్యగలశక్తి న్యాయశక్తి. జ్ఞానం పంచేంద్రియాలద్వారా సంపాదించినది. పంచ జ్ఞానేంద్రియాల సహాయం లేకుండానే సత్యాన్ని చూడగల అసామాన్యశక్తి కొందరు మహాత్ములకున్నదని మరి కొందరు నమ్మగలుగు తున్నారు. ఉండవచ్చును. కాని ఆ మహాత్ములజ్ఞానం వారికే తప్ప ఇతరులకు వినియోగపడటం అసంభవం. వారు కనిపెట్టిన సత్యాన్ని ఇతరులు అర్థం చేసుకోగలగటం కాని, ఆ సత్యమందు నిజమైన విశ్వాసం ఉంచగలగటం కాని ఇతరులకు అసాధ్యం. అటువంటి మహాత్ములుకూడా చాలా సకృత్తుగా ఉన్నారని భావించాలి. వారిని తప్పించి తదితరులు సత్యాన్ని అవగాహన చేసుకోవటానికి న్యాయశక్తి (logicalfaculty) తప్ప మరొకటి లేదు. జన్మతహా మూఢులైన కొందరు (congenital imbeciles) న్యాయశక్తినికూడా వినియోగపరచలేనిమాట వాస్తవమే. కాని వారిసంఖ్య జాస్తిగా ఉండదు. పాశ్చాత్యదేశాలలో ఇటువంటి మూఢులు రెండువందలమందికి ఒకరు చొప్పున ఉన్నారని వింటున్నాం; మనదేశంలో అంతకంటె కొంచెం ఎక్కువగా ఉన్నట్టు కనిపిస్తారు. అయినప్పటికీ జనబాహుళ్యానికి విశ్వాసాలు కల్పించేదీ, సత్యస్వరూపం ప్రకటించేదీ న్యాయశక్తే.

న్యాయశక్తి సంపూర్ణంగా మన జ్ఞానేంద్రియాలమీద ఆధారపడి ఉందనుకున్నాం. పంచేంద్రియాలద్వారా మనం అనేకవిషయాలు గమనించగలం, వాటి అనుభవంమీద అనేకవిషయాలు ఊహించగలం, కొన్ని కొన్ని విషయాలకుగల అవినాభావసంబంధం గమనించి సిద్ధాంతాలుకూడా చెయ్యగలం. నీటిని నిప్పుమీద పెడితే అది వేడెక్కుతుంది. దాని పరిమాణం జాస్తి అవుతుంది. ఆఖరుకు అది ఆవిరి అవుతుంది. వేడికి వస్తువులపరిమాణం జాస్తికావటమే కాక ఆ జాస్తికావటం ఎప్పుడూ ఒకేవిధంగా ఉష్ణస్థితినిబట్టి ఉంటుందని గమనించి వస్తువులవేడిని కొలవటానికి మనం ఉష్ణమానమనే సాధనాన్ని చేసుకోగలిగాం. దాని సహాయంవల్ల నీరు ఆవిరికావటం ఎప్పుడూ ఒకే ఉష్ణస్థితిలో జరుగుతుందని గమనించి నూరుడిగ్రీలు (సెంటిగ్రేడ్) దాటితే నీరు ఆవిరిరూపంలోనే ఉంటుందని సిద్ధాంతంచేశాం. కాని సూక్ష్మంగా గమనిస్తే నీరు ఆవిరికావటం ఎప్పుడూ సరిగా నూరు డిగ్రీలకే కాదని గమనించగలిగాం. ఈ తభావతుకూ గాలిఒత్తిడికీ నీటిలో కరిగిఉన్న పదార్థాలకూ సంబంధం ఉందని గ్రహించగలిగాం.

మన జ్ఞానాన్వేషణ ఎంతదూరం పోయినా పై పద్ధతినే పోతూఉంది. ఎంతదూరం పోయినా మనం పంచేంద్రియాలూ వాటిని శాసించే బుద్ధీ — వీటికి అతీతంగా వెళ్లం; వెళ్లలేం; వెళ్లితే మనం న్యాయాన్ని అతిక్రమించి వెళ్లినవాళ్ల మవుతాం. ఈ విధంగా మనం చెయ్యగల సిద్ధాంతాలను, ఆర్జించిన సత్యాలను, నిరూపించటంకూడా ఇంద్రియాల ద్వారానే.

ఇంద్రియాలను ఎంతమాత్రమూ నమ్మరాదనే సంగతి తెలుసుకోవటానికి వేదాంతి కానవసరం లేదు రోజూ మనం ఇంద్రియాల వంచననే కాక దాన్నించి తప్పించుకోవటం కూడా తెలుసుకుంటున్నాం. కంటిని తీసుకున్నట్టయితే దూరానఉన్న వస్తువును కన్ను చిన్నదిచేసిచూపిస్తుంది. కాని దూరాన ఉన్న వస్తువులు చిన్నవని మనం భ్రమపడం. ఆకుపచ్చఅద్దాలు పెట్టుకుని నీలాకాశం చూస్తే ఆకు

పచ్చరంగుగా కనిపిస్తుంది - పచ్చగాగాని నీలగాగాని కనిపించదు అట్లాగే చెవులుకూడా వంచిస్తున్నై మనను సమీపిస్తున్న రైలు ఇంజనుకూతయొక్క శ్రుతి హెచ్చుతున్నట్టు వినిపిస్తుంది — ఒకే శ్రుతిలో ఉన్నప్పటికీ. ఆ విధంగానే మన చర్మానికి కొన్ని వస్తువులు చల్లగానూ మరికొన్ని వేడిగానూ తగులుతై. ఏవి చల్లని వస్తువులో ఏవి వేడివస్తువులో నిర్ణయించటానికి శాస్త్రీయమైనపద్ధతి ఏమీ లేదు. ప్రతి వస్తువులోనూ కొంత వేడి ఉంది. మనచర్మం ఇతరవస్తువులనించి వేడి గ్రహించుతున్నప్పుడు ఆ వస్తువులలో వేడి ఉన్నదనీ, ఇతరవస్తువులకు వేడి నిస్తున్నప్పుడు అవి చల్లగా ఉన్నవనీ భ్రమపడుతుంది.

మనకు ద్వంద్వాలన్నీ ఇంద్రియాలద్వారానే కలుగుతున్నవనటానికి మన స్పర్శజ్ఞానమే తార్కాణం. ప్రకృతిలో చీకటీ వెలుతురూ అంటూ లేదు; శక్తిప్రసారం మాత్రమే ఉంది, ఆ ప్రసారంలో కొంతభాగంమాత్రమే కన్ను స్వీకరించగలదు. దాన్నే మనం వెలుతురు కింద గుర్తించి మిగతా ప్రసారాన్ని చీకటిగా గణించుతున్నాం. మనం కన్ను పొడుచుకున్నా కనిపించని చీకట్లో కొన్ని జీవరాసులు సులభంగా చూడగలవనేది నిర్వివాదాంశం. మనం హాయిగా చూడగల వెలుతురులో చూడలేని జీవులుకూడా ఉన్నై. మనం చూడలేని శక్తిప్రసారాన్ని ఫొటోగ్రఫిక్ ప్లేటు రికార్డు చెయ్యగలదు. మనం వినలేనంత హెచ్చుశ్రుతి శబ్దాలను కుక్కలు వినగలవని చెబుతారు.

ఇదంతా తెలుసుకుంటే మన ఇంద్రియాలు ఏమంత ఆదర్శప్రాయంగా పనిచెయ్యటం లేదని తెలుస్తుంది. మాటవరసకు మనకు ఆదర్శప్రాయంగా పనిచేసే ఇంద్రియాలే ఉన్నవనుకుంటే మనం పరమసత్యాన్ని గ్రహించగలుగుతామేమో ఆలోచించటం ఇక్కడ అప్రస్తుతం కాదు.

ఆదర్శప్రాయంగా పనిచేసే కంటిని తీసుకుందాం. వెలుతురుయొక్క ప్రకృతి తెలియకుండా ఆదర్శప్రాయంగా పనిచేసే కంటిని నిర్వచించటం అసంభవం. వెలుతురును గురించిన విజ్ఞానం యావత్తూ ఇక్కడ వివరించలేను కనక ఆదర్శప్రాయమైన కంటియొక్క పాట్లు రెండు రకాలుగా ఇక్కడ చెబుతాను. అన్ని రకాల శక్తిప్రసారాన్నీ హెచ్చు తగ్గులు లేకుండా సమంగా చూడగల కంటికి ఏవస్తువూ కనిపించటానికి అవకాశంలేదు. ఒకే రంగుగల వస్తువును మనం చూడగలుగుతున్నామంటే దానికి ఆ వస్తువుతాలూకు వెలుతురే కాక నీడకూడా సహాయభూత మవుతున్నది. అనేకరంగులతో కూడుకున్న దృశ్యాన్ని చూసేటప్పుడు వెలుతురు నీడలే కాక రంగులు కూడా మనకు ఆధారభూత మవుతున్నై. ఆదర్శప్రాయమైన కన్ను వెలుతురు నీడలనూ రంగురంగులనూ తేడా కనిపెట్టగూడదు. అస్థితిలో దానికి చూసేశక్తే ఉండదు. మన ఆదర్శప్రాయమైన కంటికీ గుడ్డికంటికీ ఏవ్యత్యాసమూ లేదు. ఆదర్శప్రాయమైన చూపును మరొక విధంగా చిత్రించవచ్చును. కన్ను రంగులను చూడగలగటంకూడా స్థూలంగా చూడటమే అవుతుంది. ఆదర్శప్రాయమైన కన్ను కాంతిప్రసారంయొక్క పరమాణువులను (quanta) చూడాలి. ఆపరమాణువులకు మనం గుర్తించే కాంతికుండే భౌతిక విలక్షణా లేవీ ఉండవు. కాంతిసహాయంవల్ల మనం చూసేవస్తువుల తాలూకు పరమాణువులైనా అంతే.

కొందరు శాస్త్రజ్ఞులు Law of Emergence అనేదాన్ని గుర్తిస్తున్నారు. దాని ప్రకారం అణువులకు లేనిలక్షణాలు అణుసముదాయాలకు అపాదించుతై. ఇందులో అబద్ధం ఏమీలేదు. నీటియొక్క గుణాలేవీ నీటి అణువులకు ఉండవు. నీటిఅణువు 40° డిగ్రీల వేడికి ఘనీభవించదు. 100° డిగ్రీల వేడికి ఆవిరిగా మారదు. అటువంటి లక్షణాలన్నీ నీటి అణువుల సముదాయానికిమాత్రమే వర్తించుతై. అవిధంగానే, బొగ్గుయొక్క అణువులు నల్లగా ఉంటవని గాని మైలతుత్తపు అణువులు నీలంగా ఉంటవనిగాని అనుకోవటం తప్పు అవుతుంది.

మన మెదడుకూడా Law of Emergenceకు లోబడి పనిచేస్తున్నదే. మనం న్యాయశక్తి అన్నా, జ్ఞాపకశక్తి అన్నా, భావనాశక్తి అన్నా అవి మెదడుతాలూకు వివిధభాగాల్లోఉండే జీవకణాల సముదాయంయొక్క ఉమ్మడి లక్షణాలు. విడివిడిగా ఆ జీవకణాలకు ఇటువంటిశక్తు లుంటటం అసాధ్యం.

కొన్ని పరమాణువుల సముదాయమైన కన్ను, తనలో ఉన్న పరమాణువుల ఉమ్మడి లక్షణాల(emerged qualities) తో పనిచేస్తూ ఇతరవస్తువుల తాలూకు పరమాణువుల లక్షణాలను కనిపెట్టటం అసంభవం.

అవిధంగానే మనన్యాయశక్తి కూడా కొంతవరకే సూక్ష్మంగా వెళ్లగలదు కాని అంతకు మించి వెళ్లగలగటం అసంభవం. న్యాయశక్తిని మించిన శక్తులున్న మహాత్ములుండిఉంటారని ఇంతకుపూర్వం ఒప్పుకున్నాం. కాని ఆ శక్తులుకూడా ఉమ్మడిలక్షణాలు (emerged factors) అయిఉండాలి కనక వాటిద్వారాకూడా పరమసత్యం (ultimate truth) తెలియటం అసంభవం. ఆపరమసత్యం పరమాణువులకే సంబంధించి ఉంది. దాన్నిగురించి తెలుసుకోవటాని కవకాశం ఉంటే అది మరొకపరమాణువుకే ఉండాలి. కాని పరమాణువు గుణాతీతమైనది. తెలుసుకోవటమనేది ఒకసముదాయానికి సంబంధించినది కాని ప్రత్యేకాణువులకు సంబంధించినది కాదు.

ఇంతకూ అసలు పరమాణువులే లేవేమో! మనం పరమాణువుగా భ్రమిస్తున్నదాన్లో ఇంకా సముదాయాలున్నవేమో!

మోటారులకు

కావలసిన సామానులకును

చిల్లరసామానులకును

# మోటో ట్రేడ్స్

గొప్పతావు

★

అమెరికన్, ఇంగ్లీషు, కాంటినెంటల్, మున్నగు నన్ని మాడలులు, మేక్ కార్లకును, బస్సులకును, ట్రక్కులకును, మోటారుసైకిళ్లకును కావలసిన చిల్లరసామానులు, టయర్లు ఆయిల్‌లు, మున్నగునవి మాయొద్ద నెల్లప్పుడు దొరకును.

— వివరములకు —

టెలిఫోన్‌మూలముగనో, ఉత్తరముద్వారానో తెలుపుడు

## ది మదరాసు మోటార్ ట్రేడ్సు లిమిటెడ్,

జనరల్ పీటర్సు రోడ్డు,

మౌంట్ రోడ్డు, .. .. మద్రాసు.

ఫోన్ 3595. .. .. తంతి : మోటోట్రేడ్సు.

## యన్. వి. రామానుజం శెట్టి

అండు కంపెనీ

(Estd. 1863)

12, బ్రాడ్వే, మదరాసు



ఒంటినాళము తోటాతుపాకి

హెచ్. & ఆర్. ర్సూ. 45/-. ర్సూ. 50/-.

రెండునాళము తోటా తుపాకి ర్సూ. 65/-.

రెండునాళము కేపు తుపాకి ర్సూ. 35/-.

ఇంగ్లీషు తోటాలు నూరు ర్సూ. 10-0-0.

క్యాటలాగు ఉచితము.

మంచి గ్యారంటీతో రిపేర్లుచేయుదుము

పి. వి. రాజన్

## మద్రాసు

## ముక్కు పొడి,

## R. S. సుగంధ

## ముక్కుపొడి.

44 గోవిందప్పనాయకన్ వీధి,

మద్రాసు.



# గంగాధరుని శిలాశాసనము

శ్రీ శేషాద్రిరమణకవులు

హనుమకొండ కాకతీయరాజులకు ఓరుగంటికంటె ముందు రాజధానిగ నుండెను. ఇచటఁగల శిలాశాసనములలోఁ బద్మాక్షిగుడి శాసనము, ప్రోలరాజుశాసనము, రుద్రదేవుని శాసనము ప్రకటితములు. ఈ ప్రాచీన నగరములో శిలాశాసనములను వెదకుతటి బాలసముద్రములో మొదలు చివరలేని శాసన ఖండము దొరికినది. అది దాదాపుగ నిరుపయోగస్థితిలో నుండెను. దీనికి సంబంధించిన శకలములకొఱకు వెదుకఁగా వెదుకఁగా రెండు సంవత్సరముల ప్రయత్న ఫలితముగ సిద్ధసాగరమను తటాకములో పలుపుఱాళ్లలోఁ బ్రకృత శాసనము గోచరించినది. ప్రాఁకుఁబట్టియున్న ఈ శిలను శాసనమని గుర్తించుటలోను దీనిని గొనివచ్చి గ్రంథాలయావరణమున భద్రము సేయుటకును స్థానికప్రముఖులును న్యాయవాదులునగు అస్మన్మిత్రులు తూము వరదరాజులుగారు మిగులఁ దోడ్పడిరి. శాసనప్రకటన మునకు ముందువారి శ్రమకుఁ గృతజ్ఞత దెలుపుట మా ప్రధాన కర్తవ్యము.

ఈ శాసనశిలకును బాలసముద్రములోని శాసనశిలాఖండమునకును జత కుదిరినది. ఇంకఁ గొంతభాగము లభింపవలసియున్నది. ఇంతలో హనుమకొండనుండి ఈ విలేఖకునకు దూరస్థలమునకుఁ బరివర్తన మగుటచే మిగిలినశాసన భాగములు వెదకుటకు వీలు గలుగలేదు. అచ్చు దీసితిమిగాని శాసనశిలలు అరిగియుంటచేఁ బ్రతులు చక్కఁగా రాలేదు. శిలపయి సీము సున్నము పూసి మిగుల శ్రమపడి శాసనస్థములగు శ్లోకములను వ్రాసికొంటిమి. కాకతీయ చరిత్రమునకు సంబంధించిన అపూర్వ చరిత్రాంశము లుంటచేఁ పరిశోధకులకు ఉపకరించునని దీనిని ప్రకటించుచున్నారము. ఈ శాసన మింతవఱకుఁ బ్రచురింపఁబడలేదు.

లిపి హనుమకొండ రుద్రదేవుని శాసనలిపిని బోలియున్నది. అక్షరము లంతగా లోతుగాఁ జెక్కనందునఁ దటాక జలపాతముచే రెండువైపుల అక్షరములు అరిగిపోయినవి. ఒకవైపు ధర్మరక్షణమునుగూర్చిన శ్లోకములును, ఇంకొకవైపు దేతివప్రష్ఠాదికములను గూర్చిన వివరము లుంటచే విడిచి, చరిత్రమునకు సంబంధించినంతవఱకు మాత్రమె రెండు వైపుల నుండి పూర్తిగా వ్రాసితిమి. ఈ శిలకు సంబంధించిన శకలమున రుద్రదేవుని విజయములును ప్రసన్నకేశవాలయప్రశంసయు మేడరాజును జయించిన యంశములును గలవు దాదాపుగఁ బ్రకటితభాగమున కది పునరుక్తప్రాయము. ఇందలి చరిత్రాంశముల గమనింపుదము.

ఇంతకుమున్ను ప్రకృతశాసనకర్త యగు గంగాధరుని శిలాశాసనము నగునూరులో నుండఁగా రాజకీయోద్యోగులు దానిని కరీము నగరమునకుఁ గొనివచ్చి మండలాధికారి గృహమునఁ బ్రాతివేసిరి. మేము కనిపెట్టినయాది తెలంగాణా శాసన సంపుటములోఁ గాకతీయ శాసనములలో ౭ – వదిగా కరీమునగరము శాసన మను పేరఁ బ్రకటింపఁబడినది. ఆంధ్రుల చరిత్రములో ఐదవ సంపుటములో నీశాసనము కొంతవఱకు విమర్శింపఁబడినది. కరీము నగర శాసనము పద్యమయము. ప్రకృత శాసనము శ్లోకమయము. శ్లోకకవిత మిగుల రమణీయముగా నున్నది.

వంశక్రమము:— విష్ణునాభి కమలమునుండి బ్రహ్మ జనించెను. బ్రహ్మకు అత్రియు నతనికి దత్తాత్రేయుఁడు జనించెను. తద్వంశమున వేంగివిషయవర్తనుఁడగు కొమ్మన జన్మించెను. కొమ్మన కుమారుఁడు నారాయణుఁడు. నారాయణుని పుత్రుఁడు గోవిందుఁడు. గోవిందుఁడు తుర్కమాంబల కుమారుఁడె గంగాధరమంత్రి. గంగాధరుని పేరుగల భాగము పోవుటచే కరీము నగరు శాసనమునుండి నామమును దీసికొంటిమి.

రెండవవైపునఁగల శాసనశ్లోకముల వలనఁ గొన్ని క్రొత్త చరిత్రాంశములు తెలియుచున్నవి. మేడక్షితిపాలునినుండి చక్రకూట ప్రభువు మానకఖేటకారమును హరించెను. ఆ చక్రకూటప్రభువును రుద్రదేవుఁడు గజసంఘయుక్తముగా జయించెను. మేడభూపాలుఁడు రాజ్యమును గోల్పోయి మాల్యవత్పర్వ

తము నాశ్రయించెను. రుద్రదేవుఁడు మేడరాజును రణరంగమున జయించి, యతనినగరము దహించి సేతువును ఖండించి తాలోపవనము పెరికివేసినాఁడు. మేడరాజు తన పూర్వులార్జించిన కీర్తిని అభిమానమును ఐశ్వర్యముసేగాక అడుగకున్నను రుద్రదేవునకు కాంధాతు నగరము నొసంగెను. రుద్రదేవుఁడు మేడరాజుయొక్క మదపుటేనుఁగులను రెంటిని గైకొనెను. తరువాత పులస్త్యనామ నగరమును రుద్రదేవుఁడు కాల్చుటయు నపుడు వెలువడిన పొగ మేఘమువలెనుండి నెమిళ్లకు అకాల వర్షాబ్దదర్శన వినోదము కల్పించుటయు వర్ణింపఁబడినది. పులస్త్య నామనగరము పోలవాస. ఇది జగిత్యాల తాలూకాలో నున్నది. మేడరాజు మేడవరము పాలించురాజు. ఇది ఒరంగల్లుచెంత పాకాలతాలూకాకుఁ జేరువలోని కురువపట్టెలో నున్నది. రెండవ శిలాఖండములో "దాసీవ మేడక్షితపాలలక్ష్మీః యస్యాంగణం సించతి నిర్వ్యళీకా" అను శ్లోకభాగముగూడ మేడరాజును రుద్రదేవుఁడు జయించుట బలపఱుచుచున్నది. ఇందుఁ జేర్కొనఁబడిన చక్రకూటవిషయాధీశ్వరుఁడు కన్నరదేవరాజునకు జగదేకభూషణ వీర సోమేశ్వరునకు మధ్యనున్న ఒకానొక రాజు కానోపు! మొదటి ప్రోలరాజు చక్రకూటము జయించినట్లు ఖాజిపేటదగ్గ శాసనమునఁ గలదు. రుద్రదేవుఁడును చక్రకూటము జయించెననుసంగతి ప్రకృతశాసన మెఱింగించుచున్నది.

కరీరము నగరశాసనమువలన గంగాధరుని చరిత్రము గ్రహింప వీలగుచున్నది. ఈతఁడు విద్యాబుద్ధులు నేర్చి పరిణయానంతరము వేఁగి దేశములోని వెల్లఁకినుండి హనుమకొండకుఁ జేరినాఁడు. ఘోరతరాజిలోలుఁడు అకుటిలచిత్తుఁడునగు కాకతి ప్రోలరాజు ఇతనిని నగరపాలకునిగా నియోగించెను. ప్రోలరాజు పరోక్షమున అన్మకుండాపుర నాథుండగు రుద్రభూపతిచేత అమాత్యసంపద, నియోగవృత్తి, దళము, సితాతపత్రము భూషణాదికములు బడసెను. డొండండు అను నగ్రహారము బ్రాహ్మణుల కొసంగి అందు త్రికూటశివాలయము చెఱువు ప్రతిష్ఠించెను. ఇది జనగాము తాలూకాలోని తొండ అనుగ్రామము కావచ్చును. హనుమకొండలోఁ బ్రసన్న చెన్నకేశవస్వామిని రుద్రేశ్వరముచెంతఁ బ్రతిష్ఠించెను. ఈ ప్రసన్న కేశవాలయము పురమధ్యమునఁ గలదని చెప్పఁబడెను. ఇపు డా యాలయము లేదు. ప్రకృత శాసనము ప్రసన్న చెన్నకేశవ ప్రతిష్ఠ తెలుపునదె. హనుమకొండలో పున్నేశ్వరాలయము చెంగట శివాలయము నెలకొల్పి త్రిమూర్తులఁ బ్రతిష్ఠించెను. గంగాచెయు చెఱువుకడ కేశవుని బ్రతిష్ఠించెను. ఇపు డీ యాలయములు నశించినవి. హిడింబ తీర్థమునఁ బెక్కు దేవళము లంతకుముందె గలవు. గంగాధరుఁ డచట విష్ణుని ప్రతిష్ఠచేసెను. హిడింబ తీర్థమన ఓరుగల్లు చెంతగల మెట్టు రామప్పగుట్ట. హిడింబ క్షేత్రప్రశంస ప్రతాపరుద్రీయ నాటక ప్రకరణమునను ప్రతాపచరిత్రమునను గలదు. పట్టశాలలలో జినోహారి అను ధర్మముచే జైనాలయము కట్టించెను. సంవర్తకేశ్వరమున శివాలయములు తటాకములు, హనుమకొండలో రుద్రేశ్వరముచెంత శివ విష్ణు దేవాగారములు, మంత్రకూటమున శివాలయము, నగునూరిలో చతుర్వింశతిమూర్తులు గల జైనాలయము విష్ణుదేవాలయము నెలకొల్పెను. ఇంతియగాక గంగాధరుఁడు సప్తసంతానములు బడసెను. నగునూరులోని దేవాలయములు మనోహరములగు శిల్పములతో నీతని మహోన్నతిస్థితికి దార్కాణగా నున్నవి. హనుమకొండలో రుద్రదేవునికాలమున గంగాధరుఁడు "తటాకసేతౌ గిరిమస్తకేచ సమ్యక్ప్రతిష్ఠాప్య శివస్య లింగం" అను సూక్తులచేఁ జెఱువు కట్టపయినను శైలశిఖరమునను శివాలయములఁ బ్రతిష్ఠించినట్లు కలదు. తటాకముపయి గల శివాలయము అంతరించినది. గిరిమస్తకమున శివాలయపు గుర్తులు సైతము లేకున్నవి.

కాకతీయసామ్రాజ్యము పాలించిన రుద్రదేవునకుఁ బ్రధానమంత్రియై జినధర్మములకుఁ బ్రాణభిక్ష నొసంగుచు శివాలయములు విష్ణ్వాలయములు నెలకొల్పి సప్తసంతానములఁ బడసి విజయలక్ష్మిని రాజేంద్రునికి గైవశము చేసిన గంగాధరమంత్రిచరిత్రమును గ్రహించుటకు శిథిలదేవాలయములు రెండు శాసనములుమాత్రము మిగిలినవి. ఆతఁ డొందినకృతి యేనాఁడో అంతరించినది. ఈతని యభిమానస్థలమగు నగునూరు కరీంనగరమునకు నాల్గు క్రోశముల దూరములో నున్నది. అచటఁ గల మహాలయములు సందర్శించినచో నితని మహోన్నతస్థితి కొంతవఱకేని గోచరింపఁ గలదు. మ. ఘ. నిజాముదొరతనమువారి నివేదికలయందును కాకతీయసంచికయందును గంగాధర నిర్మితాలయ ప్రతిబింబము గలదు. ఇతరత్ర పేర్కొనఁబడని రుద్రదేవుని విజయములు, మేడరాజు వృత్తాంతము, సందిగ్ధముగా నున్న పోలవాసవిజయము, చక్రకూటాక్రమణము ప్రకృతశాసనమువలనఁ దెలియుటచే నీ శాసనము మిగుల విలువగలది. ౧౯౩౭ సం॥ మే నెలలో ఈ శాసనము గుర్తింపఁబడినది.

## మొదటి వైపు

౧. స్వస్తి(శ్రీ) జయశ్చాభ్యుదయశ్చ॥ జయతి ము
౨. రరిపుః సయస్యదంష్ట్రాంకుర...మధీశయు
౩. వరాహరూపభాజః విభాఖిలముకుళ్యాగ్రసం
౪. గినీవ భ్రమరీవ ద్యోరధికం రరాజ పృథ్వీ॥
౫. నాభీసర స్యుదభ స్మధుకైటభారే రంభోరుహో
౬. (న్వి)తధృతిఃసమభూచ్చతత్ర।సామన్వనైర్ముఖ
౭. చతుష్టయనిర్గతైర్యైఃపద్మాదిభిః భ్రమరవన్నిత
౮. రాం విభాతి॥ నిశ్శేషవేదనివహైక నివాసభూమి స్త
౯. త్రాత్మజః సమభవ న్ముని రత్రినామా। ఉజ్జీవయన్న
౧౦. (యన) మీశవిలోచనాధిదగ్ధం యదీయనయనాత్స
౧౧, మజాయతేందుః॥ యస్య ప్రసాదాత్ క తవీ
౧౨. ర్యార్జునూను బ్బుజాసహస్రేణ శశాస పృథ్వీం
౧౩. మురారిమూర్తిః కిల సాపి దత్తాత్రేయాభిధో
౧౪. యస్య బభూవ సూనుః॥ యత్కోపశాపాతురమా
౧౫. త్రకేణ నిశ్శ్రీకమాసీత్సురరాజరాజ్యం। దుర్వాస
౧౬. సస్తస్యపురత్రయారిమూర్తిః పితా యశ్చ జగత్ప్రి
౧౭. సిద్ధః॥ పతివ్రతాశాపనిరుద్ధచండ భానూదయా
౧౮. ర్థం సముపాసితాసి। విరించినారాయణచంద్రచూ
౧౯. డై ర్యాస్యానసూయాకిల ధర్మపత్నీ॥ వెల్ల
[క్యాఖ్యా
౨౦. గ్రహారస్య వేంగివిషయవర్తిని। వంశః ప్రేమవ్ర
[తో భూ
౨౧. ర్యాః శ్రుతిశీలసమన్వితః॥ సమభవదథవంశేతత్రని
౨౨. స్సీమసత్వః సకలవిబుధవర్గః సమ్మతః కొమ్మరా
౨౩. జః। చిరతరమధితస్థు బ్బాంధవా యస్యగేహే క
౨౪. మలవనమివోచ్చైహంసవర్గాసుఖేన॥ నారాయ
౨౫. ణ స్తస్య సుతో బభూవ పారాయణ స్సజ్జనమండ
౨౬. లస్య। సౌజన్యపీయూషరసేన యస్య సంవర్ధితో
౨౭. మానతరుబ్బుధానాం॥ నిఖిల జగదమందానంద
[బృందో
౨౮. పకారీ సమజని చ తనూజ స్తస్య గోవిందరాజః।
౨౯. రజతగిరిహిమాంశుస్పర్ధినీ యస్య కీర్తి స్త్రిజగతి
౩౦. నిజబంధూన్వ్రతాసాధితోచ్చైః॥సాధ్వీతురుకమా
౩౧. భిఖ్యా గృహిణీ తస్య చాభవత్ । యానసూయా
[భర్తరి

## రెండవ వైపు

౧. యస్య ప్రతాపహుతభుక్శిఖయావలీ
౨. ఢా। ముంచంతి నైవ జగతాం మహితక్షితీ
౩. శాః॥ జహార యో మాన్యకఖేటకారనా
౪. మాపి మేడక్షితిపా ద్బలేన। తచ్చక్రకూ
౫. టక్షితిపాల ముచ్చై ర్జగాయ యత్ర
౬. ద్వీపసంఘు యుక్తం॥ నిత్యోదయః ప్ర
౭. తిదిశః ప్రసరత్ప్రతాప శ్రీరుద్రదేవనృప
౮. తిః సవితాచ నిత్యం। నీచాంగతిం దినకరో
౯. భజతే కదాచిత్ కాకత్యవంశతిలకస్తు
౧౦. సదోచ్చవృత్తిః॥ దహతు దహతు రు
౧౧. ద్రో రాజధానీ మమాసౌ ప్రలయము
౧౨. పగతాః కిం మాల్యవచ్ఛైలవృక్షాః ఇతి హ
౧౩. సతి గిరిష్ఠో నిర్జితో యేన మేడ
౧౪. క్షితిపతి రతిమాత్రం కటువాద్యం వితన్వ
[బిభేదసే
౧౫. తుం నగరం దదాహ జహార హస్తిద్వితయం
౧౬. మదాంధం। లులావ తాలోపవనం హఠేన
౧౭. యో మేడరాజం సమరే విజిత్య॥ అని
౧౮. చ్ఛన్నపి కాంధాతుం యస్మై మేడనృపో ద
౧౯. దౌ। విభూతిం చాభిమానంచ కీర్తిం చ కులసం
౨౦. చితాం॥ క్రుద్ధో యత్ర పులస్త్యవాసనగరీ
౨౧. ప్రోద్దామధూమావలీ శ్యామవ్యోమ వి
౨౨. లోక్య చండపటహధ్వానం సమాకర్ణ్య చ సం
౨౩. చింత్యాంబుధరాగమం పునరపి వ్యాకీర్ణబ
౨౪. హిర్వ్రజః సానందం ననృతు ర్మయూరనివహా
౨౫. శ్శైలాగ్రరంధ్రస్థితాః॥ యో శ్యామాక తుషో
౨౬. పవాపవిధినా తత్రాసు విద్యా సదా య
౨౭. ద్దౌర్గత్య విషణ్ణవల్లభజనైర్గాఢం సమాలింగితః॥

తా. క. మొదటివైపు రెండవవైపు శాసనశిలలోఁ జివరభాగములు లేవు.

# మిశ్రమమంత్రివర్గములు

పంద్రంగి రాజేశ్వరరావు



నూతన రాజ్యాంగ ప్రణాళిక ననుసరించి రాష్ట్రీయ స్వపరిపాలన మములులోనికి వచ్చినది. మొదటి సంవత్సరము పూర్తి అగుటయే కాక రెండవసంవత్సరమందుకూడ సగమునకు పైగా గడచినది. ప్రజాపరిపాలనము బాధ్యతాయుతమగు మంత్రివర్గము, పార్టీపద్ధతి ననుసరించి నడచును. పార్టీపద్ధతి సాధారణముగ రెండు విధములుగ నుండును. ఒక్క పార్టీగాని లేక అంతకన్న ఎక్కువ పార్టీలుగాని ప్రభుత్వబాధ్యత వహించును. ప్రస్తుతము కాంగ్రెసు మంత్రివర్గములున్న రాష్ట్రములందు కాంగ్రెసుపార్టీ ప్రభుత్వబాధ్యత వహించినది. కాని పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రమందు, అస్సామునందుగల కాంగ్రెసు మంత్రివర్గములను గురించి కొంచెము చెప్పవలసియున్నది. పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రమందున్న పార్టీ లన్నిటిలోను కాంగ్రెసు అధికసంఖ్య కలదైనను, శాసన సభయందు మాత్రము మెజారిటీ లేదు. అట్లు మెజారిటీ సంపాదించుటకు హిందూ సిక్కు జాతీయవాదుల సాయము కోరవలసి వచ్చినది. కాని వారందరకును కాంగ్రెసుసంస్థయందు మిక్కుటమగు గౌరవము అభిమానము ఉండుటచేత పైకి పూర్తిగ కాంగ్రెసుమంత్రివర్గమువలెనే పని జరిగిపోవుచున్నది.

అస్సామునం దిటీవలివరకు బెంగాలు, పంజాబు, సింధురాష్ట్రములందువలె మిశ్రమ మంత్రివర్గ ముండెను. ఇటీవల కాంగ్రెసు మంత్రివర్గ మేర్పడుటకుపూర్వము రెండుసార్లు మంత్రివర్గమందు మార్పులు జరిగెను. గవర్నమెంటు దరిదాపు పదిసార్లు శాసనసభయందు ఓడిపోయెను. చివరకు విశ్వాసరాహిత్యతీర్మానము పెట్టు ప్రయత్నముమీద ఉండగా అప్పటి ప్రధానియగు సర్. సాదుల్లాగారు తమమంత్రివర్గమును రాజీనామా నిచ్చిరి. ఉన్నపార్టీలో కాంగ్రెసుపార్టీ సంఖ్య ఎక్కువగా నుండుటచేత కాంగ్రెసు మంత్రివర్గ మేర్పడెను. కాని కాంగ్రెసుపార్టీకి మెజారిటీ లేదు. మొదట కొన్నిరోజులవరకు ముస్లిముమంత్రి దొరకలేదు. చివర కిద్దరు ముసల్మానుమంత్రులను సంపాదించిరి. చిక్కు లంతటితో వదలలేదు. తేయాకుతోటల యజమానులైన యూరపియనులు ప్రతికూల పక్షమందు జేరిరి. కాని మిగతరాష్ట్రములందు యూరపియనుప్రతినిధులు అధికారమందున్న పార్టీకే సహాయము చేయుచున్నారు. అస్సామునం దిట్లు తారుమారగుటకు కారణము లేకపోలేదు. తేయాకుతోటలందు కార్మికులపరిస్థితులు బాగులేదు. కాంగ్రెసు అధికారమునకు వచ్చినచో తమనిరంకుశత్వము అడుగంటు నని స్వలాభాపేక్షులై యిట్లు చేయుచున్నారు. ప్రస్తుతము ప్రతికూల పక్షమువా రందరును కలసి శాసనసభయందు మెజారిటీ కలిగియున్నారని తెలియుచున్నది. ఇట్టిపరిస్థితులందు కాంగ్రెసుమంత్రివర్గ మెంత కాలము చిరస్థాయిగ నుండునో చెప్పుట కష్టము. మిగతపార్టీసభ్యులను చీలదీసి ఎప్పటి కప్పుడు జాగ్రత్తగ కాలము గడపవలసి యున్నది. ఇట్టిపరిస్థితులలో మంత్రివర్గము నిశ్చలమగుబుద్ధితో • నికరమగుపని చేయుట కష్టము. •

బెంగాలునందు ఏఒక్కపార్టీకి మెజారిటీ లేకపోవుటచేత మిశ్రమమంత్రివర్గ మేర్పడినది. మంత్రులలో జమీందారులు, కర్షకులు, వర్తకులు ఆదిగాగల వివిధతరగతుల ప్రతినిధు లున్నారు. వీ రేవిషయమందును యేకగ్రీవముగ నుండుట అసంభవము. అభిప్రాయభేదములు తీవ్రమైనపుడు నషురాలీగారిచేత రాజీనామా నిప్పించవలసివచ్చెను. విశ్వాసరాహిత్యతీర్మానము తెచ్చినపుడు యూరపియను లడ్డుపడి మంత్రివర్గమును రక్షించిరి. కాని యిది శోచనీయము. ఇంతటితో రాష్ట్రీయస్వపరిపాలన మడుగంటినదని చెప్పవచ్చును. యూరపియనులు తలచుకున్నచో మంత్రివర్గమును కీలుబొమ్మవలె త్రిప్పగలరు. నిజముగ అధికారము వారిచేతియందే కలదు.

సింధునందు మొదటినుండియు పరిస్థితు లధ్వాన్నముగ నున్నవి. సర్. గులాము

హుసేన్ను హిదయతుల్లాగారి మంత్రివర్గము మెజారిటీ లేక రాజీనామా నిచ్చినపిమ్మట కాంగ్రెసుపార్టీ సహాయముతో ఖానుబహదూరు అల్లాబక్సుగారు మంత్రివర్గము నేర్పరిచిరి. కాంగ్రెసుసహాయమును పొందుటకై జీతములను తగ్గించుకొనుట, మూడవతరగతి రైలుప్రయాణముచేయుట, ఖద్దరు కట్టుట మొదలగుపనులను చేయుచువచ్చిరి. కాని పరిస్థితు లింతటితో చక్కబడలేదు. సుక్కూరు ఆనకట్టు పరిసరమందుగల భూములపై సిస్తును హెచ్చించుటకు మంత్రివర్గము సమకట్టినది. ఇట్లు చేయవలెనని గవర్నరుయొక్క కోరికయూడను. కాని యీ పని కాంగ్రెసున కెంతమాత్రమును యిష్టము లేదు. ఈసందర్భమున మంత్రివర్గమును ప్రతిఘటించుటకు వెనుదీయరు. ఈసందర్భమున పూర్తిగా కాంగ్రెసుమంత్రివర్గము నేర్పరుపవలెనని కొందరు కోరిరి. కాంగ్రెసు ప్రమాణపత్రమును అంగీకరించుటకు మంత్రివర్గమువారనుమతించిరి. కాని పరిపూర్ణవిశ్వాసము లేనివారు పదవులకై కాంగ్రెసులో చేరినచో చివరకు కాంగ్రెసుసంస్థయొక్క అంతస్తు చెడిపోవును. దూరదృష్టిగల అజదు, పటేలు ఆదిగాగలవా రిందుల కొప్పుకోలేదు. సిస్తు హెచ్చింపును ప్రస్తుత మొకసంవత్సరము వరకును ఆపుదలచేసి రాజీపడిరి. ఇటీవల కరాచీయందు ముస్లిములీగుసభ జరిగినపుడు ముసల్మానుసభ్యుల నందరను ఏకముచేసి లీగుమంత్రివర్గము నేర్పరుచుటకై జిన్నాగారు విశ్వప్రయత్నములు చేసిరి. కాని కార్యసాఫల్యము కాలేదు. అచటనున్న పార్టీలన్నియు వ్యక్తులకు సంబంధించినవిమాత్రమే. ఇట్టిపరిస్థితులందు భవిష్యత్తునుగురించి యేమి చెప్పుటకును వీలులేదు.

పంజాబురాష్ట్రమందు మంత్రివర్గ మొకింత స్థిరముగా నున్న దని చెప్పవలెను. అచటి ప్రధానామాత్యులగు సర్ సికందరు హయతుగారి వివేకము, పరిపాలనాపటిమ చాలవరకు కలసివచ్చినవి. కాని యూనియనిస్టుపార్టీలో నున్న ముస్లిముసభ్యులు ముస్లిములీగుసభ్యులు కూడను. మంత్రివర్గమునకు సహాయముచేయు హిందువు లేదో యొకహిందూసంస్థకు చెందినవారే. ఇట్టికలయిక అస్వాభావిక మగుటచే చిరస్థాయిగ నుండజాల దని వేరుగ చెప్పనవసరములేదు. ఇటీవల శాసనసభయందు ప్రధానిగారు వర్తకులకు, వడ్డీవ్యాపారులకు నష్టముగల్గు బిల్లులు ప్రవేశపెట్టినపుడు విషమపరిస్థితు లేర్పడినవి. ఇంతవరకు మంత్రివర్గమునకు సహాయముచేయుచుండిన హిందువులే వ్యతిరేకులైరి. కాని ముస్లిముసభ్యు లధికసంఖ్యాకు లగుటచే ఇబ్బంది కలుగలేదు. అయినను ఎప్పుడైనను పరిస్థితులు తారుమారైన ఆశ్చర్యపడనక్కరలేదు.

ప్రస్తుతపరిస్థితులను రాజకీయ దృష్టితో జాగ్రత్తగ పరిశీలింపవలసియున్నది. ఇంగ్లండునందు మిశ్రమమంత్రివర్గములు అరుదు, కాని ప్రస్తుతమున్న జాతీయప్రభుత్వ మొకవిధముగ మిశ్రమమంత్రివర్గ మని చెప్పవలసియున్నది. అందువల్ల ప్రతివిషయమందును రాజీపడవలెను. ఇంగ్లీషువారు స్వతహా రాజీ నభిలషించెదరు. అస్తమానము రాజీ అగుటవల్ల పరిపాలన మొకకత్తుగ జరుగదు. ఇట్లు జరుగుట ప్రభుత్వమునకు ప్రతికూలపక్షమునకుకూడ నష్టమే. ఇట్టిమైనారిటీమంత్రివర్గము రాజకీయముగ సక్రమమూ అనుసందేహము కలుగవచ్చును. సర్ తేజబహదూరు సప్రూగారి అభిప్రాయప్రకారము ఎట్టి ఆక్షేపణయు లేదు. ఇంగ్లండునందు ౧౯౩౧-వ సంవత్సరమందును దరిమిలాను ౧౯౪౦-వ సంవత్సరమందును ఇట్టిమంత్రివర్గము లుండెను. కాని యిందువల్ల సమష్టిబాధ్యత (Joint Responsibility)కు ముప్పువచ్చును. మంత్రులు వివిధపార్టీలకు చెందినప్పుడు యేకగ్రీవ మనునది యుండదు. ప్రతిమంత్రియు తనపదవిని పలుకుబడిని తనపక్షమునకు లేక సంఘమునకు బలముచేకూర్చుట కుపయోగించును. చివరకు స్వలాభాపేక్ష విపరీతముగ పెరుగును. పోటీకి, వంతులకు అంతుండదు. ప్రతికూలపక్షమందున్న వివిధపార్టీలు మంత్రివర్గమందున్న కొన్నిపార్టీలతో కుట్రలు పన్ని ప్రభుత్వమును హస్తగతము చేసుకొనుటకు ప్రయత్నించును. ఆఖరికి మంత్రివర్గము కప్పలతక్కెడవలె తయారగును. ఇందువల్ల కలిగెడునష్టములను వివరింపనక్కరలేదు.

కాని యిట్టి మిశ్రమమంత్రివర్గమువల్ల ఒక్కలాభము కలదు. ఒకపార్టీకి పూర్తి మెజారిటీ యున్నపుడు ఆపార్టీ మిగతవారి అభిప్రాయములను లెక్కచేయక తనయిష్టానుసారము ప్రవర్తించుట సహజము. మిశ్రమమంత్రివర్గమం దట్టిపని సాధ్యముకాదు. ఒకరిపై ఒకరు సదా ఆధారపడియుండవలెను. అయినను చివరకు నష్టమే ఎక్కువని చెప్పవలెను. రాజకీయపరిజ్ఞానము, ప్రజాభిప్రాయము పెంపొందించినయెడల వున్నతాదర్శములుగల రాజకీయసంస్థలు ప్రాముఖ్యములోకి వచ్చును. అపుడు సాంఘికవిభేదములతో నిమిత్తము లేక ప్రజాప్రభుత్వము సక్రమముగ పార్టీపద్ధతులమీద జరుగును. ఇట్లు జరుగుటయే సకలవిధముల శ్రేయోదాయకము.



# నాగేశ్వరమనీషి జీవిత తత్త్వము

జొన్నలగడ్డ సత్యనారాయణరావు

"ఈతనిస్థానము నెవ్వ రాక్రమింపగలరు" అని విశ్వదాత దివంగతు డైనంతన మిగుల వాపోవుచు మహాత్ముడు వాకొనెను.

నాడు దశదిశలనుండి కన్నీటికాల్వలు జాల్వారినవి.

తీవ్రమైన ఆక్రందనము ఆంధ్రహృదయమును చీల్చుకొని వెడలినది. ఆంధ్రజనయిత్రి రక్తమందు రక్తమై, ఆయువులోని ఆయువై, ఈతల్లిజీవితమున గలసియున్నశక్తి అంతర్హితమైనది.

దేశోద్ధారకుడు ౧౮౬౭ లో నుదయించి ౧౯౩౮ లో నస్తమించెను. ఉదయాస్తమయములనడుమ దక్షిణాకాశమున తేజరిల్లిన ఈజీవిత మెట్టిదో అసంఖ్యాకు లవలోకించిరి.

పుంఖానుపుంఖముగ వస్తువును పరిశీలించి, దానిప్రాణమై, అందు నిహితమైన నియమసూత్ర మెద్దియో భౌతికశాస్త్రవేత్త కన్గొనును. పూర్ణపర్యాలోచనమునకు పని గల్పించు పూర్ణపదార్థము పరిశీలనము పూర్ణమగువఱకు కట్టెదుటనుండుట ముఖ్యము. విశ్వదాత సంపూర్ణజీవితమును పరీక్షించినపుడే హృదయస్థప్రాణసూత్ర—మట్లందు చలించిన భావనిచయ మెట్టిదో కన్గొనగలము. ఈతని జీవితచరిత్రమందలి బహుళాంశములను పూసగ్రుచ్చినట్లు తెలుపుట నా ప్రస్తుతాశయము కాదు. మానసికయవనికపై నీచరిత్రమందలి అద్భుతదృశ్యములను విలోకించి,వీని నిహితార్థమును, వీనిని ప్రాణప్రదీప్తము లొనరించిన ఉజ్జ్వలభావశబలతను, వీనిని మహోత్కృష్టములు కావించిన గంభీరతత్త్వమును కనుగొనుటే నా ప్రస్తుతోద్దేశము.

ఆంతరంగిక నయనముమ్రోల నీయుద్దేశమును నిలిపియే ఏతాదృశరచనమునకు గడంగితిని. మహాపురుష జీవితచరిత్రను నాకొలంది కొలది మథించి, నే బడసిన మీగడతరకల (వీని గుణపరిశీలన మొనరించుచు) పాఠకలోకమున కొసగుచున్నాను. తత్త్వార్థప్రకాశికను పురికొలిపిన వివిధజీవితాంశములను హృత్పీఠమునిచి, భావపంథయందు పఠితలకు చేయూతలగు విషయముల నిందు నిలుపుచుంటిని.

ప్రధానాశయమున కుపశాఖలై యుండు భావపరంపరలకు (ఔచిత్యమునకు భంగము రాని తెఱగున, రసమునకు చెఱుపురాని తీఱున) తా వొసగినగాని తత్త్వార్థమందలి లోతు మానసగోచరము కాదు. చిత్తమున కాయాసము గొలుపక సామాన్యపాఠకుల దృష్టి నాకర్షించుటకును, జటిలభావార్థము నవలీలగ హృద్గతము గావించుటకును సముచితదృష్టాంతములను విషయతత్త్వమున స్వయంభువులై యుదయించు అలంకారములను రచనమున ప్రవేశపెట్టుట గ్రంథకర్త కర్తవ్యము. ఈసాహితీ సూత్రముల నెఱుంగుటొకటి. వీనిని స్వీయరచనమున ప్రయోగింప నేరిమినందుటొకటి. కలము చేబూని హృదయపూర్వకమైన ప్రయత్నము చేయుచు పరితోషమందుచుంటి నంతియే! కాని ఈనేరిమి నందితినో లేదో విజ్ఞానదృష్టిగల పాఠకులే నిర్ణయింతురు గాక!

భూగోళమున పెద్దంజలువేసిన ప్రజ్ఞాధురీణులు ఈగోళమును ధిక్కరించు గోపురశిఖరాగ్రములపై పుట్టలేదు. భూగోళపటమున వెతకి వెతకి వేసారినను, వీరిజన్మస్థలము లందు కానరావు. ఉత్కృష్టజీవులకు పురిటిల్లయినవి నూఱుమూల లనుటకు ప్రపంచచరిత్రల నుండి బహుళదృష్టాంతములను పేర్కొనవచ్చును. మహాపురుషులను, మహానదులను, దేవతలను కనినచోటు లిట్టివియనికదా మహాభారతము వచించుచున్నది! సూర్యభగవానునే చూడుడు. ఇతడు మింటికొనపై నుదయించునా? ఆదర్శకర్మవీరుడై, తనకర్మక్షేత్రమున నీత డెంతో శ్రమించిన యనంతరమే విహాయసాగ్రమున మహోజ్జ్వలుడై తోచును!

దేశోద్ధారకునికీర్తివల్లరి దేశము నెల్లకడలందు ప్రాకినయనంతరమే ఈతీవ పుట్టినచోటెద్ది యని జిజ్ఞాసువు లరసిరి. అంతకుమున్ను ఎలకుఱ్ఱు ఎందున్నదో యెందఱెఱిగిరి?

ఎవ్వరు నెఱుగనియూరిలో మిఱ్ఱుపల్లములందు, ముండ్లతోట్టియలో పెరిగినశిసు వేడ? ఆంధ్రమాత హృదయమున నద్భుతశక్తినై నిడిసి, మహాజ్యోతియై, పరంజ్యోతి గలయు చేడ? నిష్ఠురమైన నిష్పచ్చరమున నిభృతప్రాణియై పొగిలినబాలకు డేడ? అవిరళకనకవృష్టి గురియించిన ఘనహృదయుడై, అసంఖ్యాకుల అశ్రుధారల నభిషిక్తుడై, సుమవిమానారూఢుడై అమరపురికరిగిన విశ్వదాత యేడ? డిడ్డిగంతలో నిబిడ్డ యేడ? వేల్పుగిడ్డికి వదాన్యత దెలుపనేగినదొడ్డజీవి యేడ? మోసులందు తప్పటడుగు లిడిన బడుగుబాలకు డేడ? కల్పకమై నందనమున నేడు నెలకొను చేడ? దారుణజీవిత ప్రవిదారుణమున దారి గానక తారాడిన నిర్భాగ్యుడింభకు డేడ? బహుళసుగుణోన్మేష ప్రభాజాలము వెలారించిన వీరవతంసుడై, వీరస్వర్గమును జూరగొనిన త్యాగి యేడ?

జయా ఫిల్మ్స్‌వారి

# మహానంద



కళాసృష్టికి పరిపుష్టి నొసంగి
కావ్యశిల్పానికి వన్నెలుదిద్దే
కళాప్రపూర్ణులు
మా సాంకేతిక శాస్త్రజ్ఞులు

భారత భాగ్యోదయానికి
ప్రబలకంటకంగా ఉండే పడుపు
వృత్తిని నిర్మూలించి స్త్రీ సంఘాని
కంతా జీవం ప్రసాదించే
శీలప్రభావం

**మా కథా వస్తువు**

అభినయచాతుర్యంలో ఆంధ్రా
వనినంతా ఆనందవార్ని
ధినోలలాడించి ఆంధ్రుల అభి
మానాన్ని. చూరగొన్న
ఆణి ముత్యాలు

**మా నటీనటులు**

ఆధునిక పరికరాలలో
అమర్చబడి ఆంధ్రేతరులకు
సయితము అబ్బురపాటు
గల్గించిన ఆంధ్రకళా
లక్ష్మీకాటపట్టు మా స్టూడియో

ఆదరించడం మీ వంతు

ఆనందింపజేయడం మా వంతు

తారాగణం

కృష్ణవేణి - అద్దంకి - పారుపల్లి - బాలసరస్వతి మొదలగువారు.

వివరాలకు:— జయ అండ్ కో., మీర్జపూర్ హౌస్, మైలాపూర్, మదరాసు.

# నాగేశ్వరమనీషి జీవితతత్త్వము

అణుమాత్రపు మనుజులందు మందరగిరి యను బెట్టిదో, మొండిగోడలందు మొదట మసలి, ఒక వంక గులాచలముతోడను, వేఱొకవంక హిమాద్రితోడను, మఱొకదిశ మేరుమహీధ్రముతోడను, ఇంకొకదెస హేమవసుధాధరముతోడను నెకసక్కెములు సలుపు జీవితోన్నతి నందు బెట్టిదో, ధూళిలో పుట్టి ధ్రువతారకాజాలు బెట్టిదో, గుడిసెలో తొలియడుగిడి, అజాండమున నిండు తుదియడుగిడజాలు బెట్టిదో యూహింపుడు. అనిర్వచనీయమైన ఏతాదృశ మహోన్నతి నందజాలు మహోద్భుతశక్తి మనుష్యహృదయమున కలదని గుర్తించినవారు మనుష్యులం దెందఱుందురు? గుండెలోనికి చూడ్కి నిగిడించి, అందలి ప్రదీపమునకు మహోద్వేగమున జేజేలు పాడగలవారు మానవులలో నెందఱుందురు? ఇట్టివారు యుగయుగములందు కడుంగడు నల్పసంఖ్యాకులై జనింతురు. అసాధ్యములు పెరటి కుక్కలై, వీరిచుట్టును దిరుగును. దిక్పాలకులు వందిమాగధులై, వీరివెన్క నిలిచి గుణసంకీర్తన మొనరింతురు. శ్రీశ్రీచరణోపాంతములందు తపోదీక్షనంద సురపురవాసులు పందెపుపరుగున భూతలమున నవతరింతురు. వీరి గుణమణిద్యుతుల నోజ్జబంతు లొనరించుకొన గ్రహతారకౌఘంబు మిక్కిలి మక్కువపడును. హరి హర పద్మజాదులు వీరిజీవితాంగణములందు నిలిచి, ఐక్యకంఠమున నానందగీతిక లాలపింతురు.

మహాపురుషులందు వీరు తలమానికములు. అనేకకాలపథమున పాంథులై యుగములను, మన్వంతరయుగములను కడచుచుండ నే ముహూర్తమందో (కృష్ణపక్షాంతమున నెన్నిగడియలనో దాటనిచ్చి నింగి నొకవంక దోచు శుక్లచంద్రవంక చందమున) వీ రుదయింతురు. సహజయుక్తములైన చిన్ని వెలుగులు మహాజ్యోతిర్ద్యుతి తేజశ్చిల్లులీల, బహు భవ తపః ఫలముల కలయికకతన వీరిజీవితములు సృష్టియై ప్రకాశించుచుండును

నాగేశ్వరరావు తపస్వి. ఈతనియాత్మ నిర్ణయించుకొనిన తపోభూమి మిగుల విశాలమైనది. ఇందది మజిలీలు సలుపుచున్నది. పెక్కుమజిలీలు కడచినవి. తరువాతి మజిలీ సాధారణముగ మఱింత మహిమోపేతమై యుండును. దేశ మింకను సంపూర్ణసముద్ధరణము నందలేదుకదా! పరహితార్థమై కడపటి మజిలీ కడపుటకై దేశోద్ధారకుడు తపోభూమియం దింకొకమా ఱవతరించును.

తన యంగీయందలి ప్రత్యంగుళమునుండియు పైకి వెడలించి అస్థిజముల కప్పన మనిన విశ్వదాత, తన శరీరమునుండి కండలు కోసి యిచ్చుటకై మనమన్నలో మరల బుట్టును. ఎముక లేనిచేతితో ఆశ్రితులకు కాసు లొసగిన మహాపురుషుడు, అసంఖ్యాకుల రక్షణమునకై తనవెన్నెముక నూడబెఱుకు మహాత్ముడై యుదయించును. ఈశ్వర ప్రసన్నత నంది మహితాశయములకు విజయము చేకూర్చుటకై పరార్థజీవులు తమ ప్రాణములను నివాళిగా నర్పింతురు. ప్రస్తుత ప్రపంచపరిస్థితులను పరిశీలించుతఱి, ఇట్టి నివాళి ఎంతేని అక్కఱయైయున్నదని, నేమును భావికాలమందును ఎన్నెని దీపకళికలు తేజరిల్లవలెనని గ్రహింతుము. జగతినుండి పంకిలము గలింపనంతదనుక మహాపురుషులు తమభద్రప్రాప్తికై ప్రాకులాడరు. తమదృష్టిలోని శాంతిపరిసరమున విజయకేతనము తలయెత్తనంతకాలము స్వర్గవీధులందు హరిభజన మొనరించుటకై వీరు సమ్మతింపరు.

ఎలకుఱ్ఱులో పుట్టిననేమి, ఎడారిలో పుట్టిననేమి, గతకాలమునుండి తపసాచరించుచు నుదయించిన జిజ్ఞాసువు అలసభావము నాశ్రయించి, అడగిమడగి యుండ నేరడు. కదలమెదలక బొగ్గు పడియుండును గాని నిప్పునెరసు పడియుండునా? నన్నడిగితిరా, నెరసులోని ప్రత్యణువు ఉజ్జ్వలదీప్తిగల క్షేత్రమందును. నెరసుహృదయమందు ప్రజ్వలించు పరార్థకాంక్షయే బహుళములైన దానిమాడ్కు లందు తేజరిల్లుచున్నదని వచింతును. తన దీప్తికతన నెరసు తనజీవితాశయసిద్ధి నందును. తపస్వి తేజస్వియై తన యుత్కృష్టాదర్శముల నందుచు ధన్యజీవి యగును.

కన్నవగల మినుకులు హృదయకుండమందలి జిజ్ఞాసానలమునుండి వెడలునెరసులే! ఉజ్జ్వలప్రాణమును, చలనమును వెలుగునకు స్వతస్సిద్ధములైన గుణములు. తేజఃపూరిత నేత్రుండైన జిజ్ఞాసువు—హృదయమున యజ్ఞకుండము నిడికొనిన జిజ్ఞాసువు ఎందుపొడసూపిననేమి, ఏయబ్బకడుపున పుట్టిననేమి, ఏయమ్మపొత్తిళ్లయందు పెరిగిననేమి, ఉదాత్తమైన తనజీవితోద్దేశమునకు చూడ్కి నలగించి యుంచి, ఏయంకిలిని లెక్కసేయక, ఏయడలును గుండెతలుపుపై తట్టనీయక దాని దెస నడచిపోవును.

తండ్రి బుచ్చయ్యగారు నాగేశ్వరరావు పుట్టినచోటులోనే యుండవలెనని వాంఛించిరి. కాని బాలకునిప్రకృతి సుఖకరమైన గృహజీవితమున కట్టువడియుండుట కంగీకరింపలేదు. నాగేశ్వరరావు రెక్కలు కట్టికొని భారతవియత్తలమున నెగసినాడు.

నెరసు ప్రజ్వరిల్లుటకు వాతూలము తోడగునవడువున జిజ్ఞాసను తేజఃపూరిత మొనరించుటకు సహృదయుల ప్రోత్సాహము సహకారి యగును. నాగేశ్వరరావున కిట్టిప్రోత్సాహము నొసగూర్చినవ్యక్తులు నలుగు రుండిరి. జగద్ధాత్రిని దలపించు జనయిత్రియే తొలుత నీతనిని బందరున కంపెను. ఈయమకతన తా నాంగ్లవిద్య నందుటచే, కాలక్రమమున తన సొంతయూరున నెలకొలిపిన పాఠశాల కీత డామెపేరు పెట్టినాడు. శ్యామలాంబ జగద్ధాత్రికి రూపాంతరమేకదా! నాడే నాగేశ్వరరావు యాత్ర ఆరంభమైనది. మలి ఘట్టమైన మదరాసున నీతడు కొంతదనుక రెంటాల వేంకట సుబ్బారావు కేలూత నందినాడు. మన మహాపురుషులలో

1. సుబ్బారావుశక్తి అద్భుతమైనది; ప్రత్యేకమైనది. ఒకరు నడచిపోవు పుంతయందు కాలిడుట ఈతని ప్రకృతికి ప్రతికూలము. ఒరుల మనసులకు తట్టనితలపు లీతని చిత్తమునుండి బిలబిల నుదయించుచుండెడివి. సహజశక్తిసంపన్నులైన సమకాలికులలో దక్షిణావనియం

వనేరులకు శిక్షణాసంస్థయైయుండిన క్రైస్తవ చే అచటి ప్రధానాచార్యుడై యుండిన మహా నాగేశ్వరరావునకున కావశ్యకమైన వెలు
కళాశాలయం దీతడు విద్యార్థియై యుండుట నీయుడు, డాక్టర్ మిల్లర్ ఆదర్శజీవితము గొసగెనని నా యభిప్రాయము. నాలవ

దీత డద్వితీయు డని చెప్పనొప్పును. ఈతని పాండితి సర్వతోముఖమైనది. సాహిత్యమును, తత్త్వశాస్త్రము నొకే కంటజూచి రెండింటిని చక్కగ జీర్ణించుకొనిన ఆధునిక విద్యాధికులలో వింధ్యపర్వతముల కివల నీతడే మొదటివాడేమో! ఆంధ్రమందును, ఆంగ్లమందును, సంస్కృతమందును సమానమైన పాండితి నందిన దిట్ట ఈతడు. ఆంగ్లమందును గూడ చక్కని కైత చెప్పగలనేర్పరి వేంకటసుబ్బారావు. కథలను, వ్యాసములను పద్యములను వ్రాయుటయం దీతడు సిద్ధహస్తుడైనాడు. శృంగారముతో తుందిలమైయున్న ఈతని "సురాభాండేశ్వరము" పెక్కండ్రు కవుల దృష్టి నాకర్షించినది. ఇందలికథ నైతికవిధుల ననుసరించి నడువలేదు. అట్లనిన పచ్చిశృంగారముపరమాశయమై ఇందు ప్రవేశించెనని తలపరాదు. ఉచితమైన పట్టున మనసు నలరించు తాత్త్వికభావమును వేంకటసుబ్బారావు తళుక్కుమనిపించువాడు. వాడి కోరలతో విజృంభించు సంఘదురాచారముల నవలోకించినపు డీతనిగుండెచప్పుడు మిక్కుటమయ్యెడిది. తన హృదయావేదనమును తీవ్రవచనమున ప్రతిధ్వనింపజేయువా డీతడు. నిరంతర మీతని చెవిబడిన వితంతు విలాపము లీతని "కమలాలేఖ"లందు అక్షరస్థములై అసంఖ్యాకుల మనసులను కదలించివేసినవి. ఈ గ్రంథప్రతు లిరువదియైదువేలు అవలీలగ చెల్లిపోయినవి. కాళిదాసుపై పూలుచల్లును ప్రతిదిన మీతడు నిజాంతరంగమున షేక్స్పియరునకు ప్రణమిల్లువాడు. శృంగారకవిత్వమున కాళిదాసందిన మహోన్నతస్థానమును గుర్తించి సర్వతోముఖమైన షేక్స్పియరుప్రజ్ఞను-మహోజ్జ్వలమైన షేక్స్పియరుప్రతిభను అనవరత మీతడు ప్రస్తుతించుచుండు వాడు. అంతటితో మిన్నకొనియుండక సహజపరిశీలనాశక్తిని, స్వతంత్రపర్యాలోచనాప్రజ్ఞను పురస్కరించుకొని ఆంగ్ల మహాకవి నాటకములకు చేవగల వ్యాఖ్యానములు వ్రాయుచుండువాడు. "ఒథెల్లో" నాటకము నెడల నాకుగల గాఢానురక్తిని గమనించి, వేంకటసుబ్బారావునకును ఆమహానాటకము నెడల నట్టిప్రీతియే యుండెడిదని పండితకవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నాతో చెప్పిరి. తన సంస్కృతపరిజ్ఞానము కతన ప్రాచీన భారత భావస్రవంతి ఎట్లు ప్రవహించెనో ఈత డెఱుగువాడు. తన యాంగ్లభాషాపరిజ్ఞానమువలన ప్రతీచీ వసుంధరలో క్రొత్తపోకడలతో స్రవించు భావనిర్ఝరిణి నీతడు కన్గొనువాడు. ఈ వెల్లువకును, ఆ వెల్లువకును తనహృదయమును సంగమక్షేత్ర మొనరించువాడు. ఇందుండి అపూర్వమైన భావపూరమును గ్రహించి, తన రచనలందును క్రియలందును బోయువాడు. ఈతని భావశబలతయందు ప్రకటితమైన సహజశక్తి ఈతని క్రియాసఫలతలో గూడ ప్రకాశమగుచుండెడిది. ఈతని నిఘంటువులో "దైన్యము"నకు, "నిట్టూర్పు"నకు చోటుండెడిదికాదు. ఈతని యూహకు పరిమితిలేదు. కావున నిముసములో చక్కని యుపాయమరసి, కష్టమెదుట పెక్కరించుచు నిలిచిన ఇక్కట్టునే త్రుటిలో పల్టీకొట్టించువాడు. సాహిత్యమేడ? వైద్యశాస్త్రమేడ? న్యాయశాస్త్రమేడ? మూడింటికిని పొందుగూర్చి తన బొందిలో నిలుపుకొనిన అద్భుతశక్తి సంపన్నుడు సుబ్బారావు! పాండితిని, ప్రతిభను, క్రియాకౌశలమును తన పట్టపురాణులు కావించుకొనిన ఆంధ్రదశరథు డీతడు. న్యాయవాదియై విజయుడైనను, పుంతలోని మేకయగుట కిచ్చగింపని మనుష్యు డగుటచే, నల్లగౌనును బుట్టదాఖలా చేసి సొంతమందుల నేర్చికూర్చి నవ్యవాణిజ్య మార్గములగుండా జగతిమీదికి వానిని పుత్తెంచువాడు. నాలుగుద్వారములనుండి గజ్జెలందియలు ఘల్లుఘల్లుమన రమాసతి ఈతని నట్టింట బ్రవేశించినది. లక్ష్మీదేవి నీతడు తన యినుపపెట్టెలో కట్టియుంచలేదు. ఆర్తులు ద్వార సమ్ముఖమున నిలిచినపు డామెను నట్టింటినుండి వారిగోడు దీర్ప బంపువాడు. నిరుపేదలైన విద్యార్థులకు పెంపుడుతండ్రియై ఉచితసాహాయ్య మొనరించుచుండువాడు. చదువరులకై ఈత డొక వసతిగృహమును నెలకొలిపినాడు. తంబుచెట్టివీథిలో ఇపు డాంధ్రపత్రిక యున్న నెలవున వసించుచుండిన నాగేశ్వరరావు, (తా నొకప్పుడు పేదవిద్యార్థియై యున్న చోటునందే పదంపడి తన విజయధ్వజమును ప్రతిష్ఠింప జాలినందులకును, పల్వురకు నెలవు నీయజాలినందులకును విశ్వదాత ఎంతో యానందించుచుండువాడు) కొండా వేంకటప్పయ్య, ఎక్. ఎస్. సుబ్బారావు(ఇత డిపుడు మైసూరులో విద్యాశాఖయందు డైరక్టరుగా నున్నాడు)లు వేంకటసుబ్బారావుదృష్టి నాకర్షించిరి. నాగేశ్వరరావు గుండెలో రగులుచుండిన నెరసును తొలుత గుర్తించిన మహాపురుషు డీతడే! గుర్తించి, సహృదయుడగుటచే, ఈయువకునకు తన మేనకోడలి నర్ధాంగలక్ష్మిజేసి, ఈతనిని తన సన్నిహితుని గావించుకొనినాడు. మానసికముగ నాగేశ్వరరావునకును, వేంకటసుబ్బారావునకును పూర్వభవమునుండి దగ్గఱిచుట్టఱికముండెనని నాదృఢనిశ్వాసము. ఈశ్వరేచ్ఛ ఈచుట్టములను ప్రస్తుతభవమున గూడ గలిపినది. జిజ్ఞాసువైన నాగేశ్వరరావు రెప్పవాల్పక వేంకటసుబ్బారావు సర్వతోముఖప్రజ్ఞ నవలోకించువాడు. అతని ప్రబోధములకు చెవులొగ్గి, దృష్టాంతములకు కను లప్పగించి అక్కఱగు రీతి తన హృదయము నుద్రేకించుకొని నాగేశ్వరరావు రెక్కలను పెద్దవి గావించుకొనినాడు. స్థూలదృష్టితో పరికించితిమేని, నాగేశ్వరరావు యత్నములకు వేంకటసుబ్బారావుపూనికలు మేలుబంతు లాయెనని చెప్పవచ్చును. తనభావ్యున్నతికి నక్కఱైన నపునాదిని వేయునవసరమున కొన్ని యిటుకలను వేంకటసుబ్బారావుపద్ధతినుండి కైకొనినను, నాగేశ్వరరావు సంపూర్ణభవన నిర్మాణమును స్వీయయత్నములచేతనే చేయించెనని సూక్ష్మదృష్టివలన గ్రహింపగలము. "Victoria Depot"నుండి కొండొకభావమును కైకొని, "William & Co"మూలబంధమున నీతడు

యాతడు గాంధీమహాత్ముడే! ఈతని సఖ్యము కతన, ప్రోత్సాహమువలన నాగేశ్వరమనీషి ప్రతనిష్ఠ కడుంగడు తీవ్రమైనది. తన సుఖశాంతులకును, ఆహార నిద్రలకును నీరువదలి దరిద్రనారాయణసేవను ప్రధానాశయము గావించుకొని ౬౩-వ యేట దోలిమాఋనా, పదంపడి రెండు పర్యాయములును కారాగారమున ప్రవేశించి, భయదమైన క్షయను దెచ్చుకొని, రక్తమాంసముల నాపెనుభూతమును తిననిచ్చి, సన్నిహితములైన తన యుత్కృష్టాశయములు కోటివత్తులట్లు తన చుట్టు దేజరిల్ల నీమహాపురుషుడు దివిదేసబయనమైనాడు.

అనురాగ పూరిత హృదయుడై, భక్తి భరిత స్వాంతుడై, కళాప్రపూర్ణ డీ నలువురు వ్యక్తులపూతనామముల నుచ్చరించుచు, వీరి గుణగణముల నుగ్గడించువాడుకదా!

కేవల జ్ఞానసంపాదనమే జిజ్ఞాసువు కర్తవ్యము కాదు. ఉత్తుంగశిఖరముమీదికి తా జనుతఱి (ఈశ్వరప్రేరణమును పురస్కరించుకొని యే యనుడు) గేలూత నొసగువారిని, మార్గదర్శకులను భజించి వారి భవ్యగుణములను తనవి గావించుకొని ఘనతరశక్తిసంపన్నుడగుటయు నీతనికర్తవ్యమే! జిజ్ఞాసువైన నాగేశ్వరరా వీకర్తవ్యములను తోడ్తోడన నిర్వహించుచు, తన యాంతరంగిక శక్తిని, హృదయమహత్త్వమును ప్రకటించుచుండువాడు.

తన్నుబోలు జిజ్ఞాసువుల వైజ్ఞానికసాహచర్యము నపేక్షించినాడు. నూతన విజ్ఞానవృద్ధికై ఈ విజ్ఞాని విశేషధనమును వెచ్చించినాడు. ప్రజ్ఞాధురీణుడైన లక్ష్మణరావు మనీషి అస్తమించిన అనంతరము ఆంధ్రవిజ్ఞాన సర్వస్వమునకై ఈత డెంతేని కృషి సలిపినాడు; సుప్రసిద్ధ పరిశోధకుడైన సోమశేఖరుని దాపున జేర్చుకొనినాడు. కళోపాసన దేశసేవలకై సర్వశక్తులను వినియోగించు యోధులే ఈతని ఛత్రముక్రింద నిలిచిరి. ఈతడు నెలకొలిపిన పవిత్రసంప్రదాయమునకు జోహారని, ఈతని పూతకర్తవ్యమును తనది గావించుకొని ఈతనిజామాత ఆంధ్రమాత కానందము గొలుపుట కల్యాణాత్మకమైన విషయముకాదా?

తాము తప్పటడుగు లిడిన దినములలో తమకు చేయూత నొసగినవారిని తాము పెద్దంజలు వేయువేళ విస్మరించుట తమవిధియని విశ్వసించువారును, వారిపే ళ్లెత్తినంతన తమ ధవళకీర్తిపై మసిరాలునని యడలువారును నేడు గోచరించుచున్నారు కదా! వీరిని విలోకించి నాగేశ్వరరావు చరిత్రను పరిశీలింపుడు. అదెంత యుత్కృష్టమైనదో, అతనిహృదయ మెంత యున్నతమైనదో గ్రహింపజాలుదురు. గుణసామ్యమువలె గుణవ్యత్యాసము విమర్శనమునకు మిగుల నావశ్యకమైన అంశమే కదా!

జిజ్ఞాసువు మనస్తత్త్వము మహాద్భుతమైనది! పలుతెఱగుల దీనిని పరిశీలింప వచ్చునుగదా!

భూగర్భమును త్రవ్వినపుడు జలము నవలోకింతుము. ఈనీరమున కెరటము లుండవు. జిజ్ఞాసువు గుండెలోని తొలి యోచన మిట్లే యుండును. అది యవిచలితమై, ప్రశాంతమై యుండును. మనన సమయమున తపస్వి మనస్సు పాతాళగంగవలె నున్ననేమి, ఉద్దేశసిద్ధి నందిచరితార్థతగన నిశ్చయించినంతన, నది విశేషముగ చలించి కైలాసశిఖరాగ్రమున విడియబోవును. కొండకొనపై నిలిచి, కదలమెదలక నక్షత్రపుంజమును విలోకించు టొకటి; దృష్టిబడిన తారకల జేరుటకై అవిరామముగ వియత్తలమున రెక్కల నాడించు టొకటి! ఎందో మినుకు మినుకుమను తలపులు వెలయుచున్నవని, ఇవి తనకేల యని జిజ్ఞాసువు మిన్నకొని యుండడు; ఒక్కటొక్కటిగ చుక్కలను తనయొక్క జేర్చుకొనవలెనని నిశ్చయించి మానసికముగ నీత డూర్ధ్వగమనికకు గడంగును. దీర్ఘయోచనమున బుడుంగున మునింగియుండక బహుళశక్తుల నంది, వెన్నముద్దవలె బ్రహ్మాండము నరచేత నిడికొని కులుకదలచు అద్భుతప్రాణి ఈతడు! యోచనసమయమున వీని మానసము పూజామందిరమందలి కృష్ణవిగ్ర

---

ప్రవేశపెట్టియుండును. ఇదియే క్రమక్రమముగా పెరిగి "Amrutanjan Depot" యాయెనని తెలుపవచ్చును. కాని ఇది యేడ? అది యేడ? నేడిది గగనమును చుంబించుచు, బహుదేశముల దృష్టుల నాకర్షించుటలేదా? పెద్దంజలు వేయుచు మదరాసును, వేంకటసుబ్బారావును విడిచి పోయినను నాగేశ్వరరావు ఈమతిమంతునెడల గాఢానురాగము గలిగి యుండువాడు. సుబ్బారావు దివంగతుడైన యనంతరమాతని పవిత్రస్మృతిపై ఈత డనవరతము పూలుచల్లువాడు. ఎవ్వరైన తన జీవితచరిత్రను వ్రాయ నుంకించినపుడు "వేంకటసుబ్బారావుగారి చరిత్రను వ్రాయుడు. ఆతడు మహానుభావు" డని దేశోద్ధారకు డనుచుండువాడు. దినమణి కరణి వెలింగిన విశ్వదాత జీవితమునకుమున్ను వేంకటసుబ్బారావుజీవిత మరుణోదయమై యుండె నని చెప్పకతప్పదు. రెండింటిపై రెండుకన్ను లుంచినగాని ఈయుజ్జ్వల జీవితములందలి సంపూర్ణ సౌందర్యము నెఱుగజాలము. దివంగతుడైన దేశోద్ధారకుని జీవితచరిత్రను వ్రాయుభాగ్య మెవ్వరికి లభించునో తెలుపజాలను. ఎవరికి లభించినను ఈ ప్రధానాంశమును దృష్టియందు నిడికొని, ఈ మహాపురుషుల జీవితములందు వెలసినసంబంధ బాంధవ్యము నుచితరీతి నుల్లేఖింతురుగాక! అట్లొనరించినపుడే విశాలహృదయుడైన నాగేశ్వరమనీషి అమృతాత్మ ఆనందించును. నిక్కమైన అంశములపై నాధారపడిన జీవితచరిత్రలును, విమర్శనగ్రంథములును మనలో కొఱవడి యుండుటచే వేంకటసుబ్బారావు జీవితమహత్త్వమునుగాని ప్రతిభాతత్త్వమునుగాని ఎఱిగినవా రెందఱో నేడు కానంబడుటలేదు. "ఆంధ్రమహాపురుషుల"లో గాలక్రమమున నీవిరున కుచితపీఠస్థలి నీయ నాశపడుచున్నాను. నాయుద్దేశమును పాఠకలోకము ప్రసన్న దృష్టితో వీక్షింపదా?

హామువలె జలింపకున్నను, స్వీయకురుక్షేత్రమున నీతడు తన యరదమును నడుపగడంగినంతననది పార్థసారథిలీల జరచర గమ్యస్థానముదెస సాగిపోవును...

తపసు తీవ్రమైనకొలది జిజ్ఞాసువు హృదయమునుండి వహ్ని వెడలును. తపోవహ్నియం దెట్టి తేజ ముండదు? ఎట్టియద్భుతశక్తి ప్రజ్వలింపదు? ప్రశాంతాశ్రమములందే తపోవహ్ని జ్వలించుచుండునని పురాణములను పరిశీలించినపు డేల కన్గొందుమో గ్రహించితిరా?

ఈతనిహృదయము ప్రభాతసమయ శిశిరబిందువును పోలున దనికూడ దెలుపవచ్చును. మంచుతుంపురు సన్నని గరికమొన నిలుచును. కాని దీనిచూడ్కి సూర్యభగవానునిపై నిబద్ధమైయుండును. తాను అణుమాత్రమైనదాననని, భాస్కరుడు తనకంటె కోటికోటిమడుంగులు పెద్దయని ఎఱింగియు రవిగుణముల నలవఱచుకొనవలె ననియే ఇది కాంక్షించును. దీని ఏకాగ్రదృష్టియం దీకాంక్ష కేంద్రీకరింపబడి యుండును.

వేడికిరణము తేజఃపూరితమైన సూర్యగోళమునుండి ప్రసరించునట్లు, ధూమరేఖ ధగధగమండు నిప్పుగుండమునుండి వెడలువడువున నేకాగ్రదృష్టి నుడువుల కందని మహోజ్జ్వలజిజ్ఞాసనుండి వెడలును. సమిధ లధికమైనకొలది కీలికీలలు వేగవంతములై యెగయును. తప స్సధికమైన కొలది దృష్టిలోని తేజస్సు ఘనతరమగుచుండును. సమిధలు జ్వలించుచు వేడిమిని హెచ్చించుచొప్పున, తపస్సమయమున నాంతరంగికశక్తులు హృదయకుండమున నుజ్జ్వలములై విజృంభించుచు, సెనలేని వెలుంగును బుట్టించును, దానిని చూడ్కిలోనికి పుత్తెంచును.

ఏకాగ్రదృష్టి కొకవంక బరమాశయమును రెండవవంక బూర్వోక్త హృదయశక్తులును ఉండును. చేతివండము మూలమున పరశురాముని శక్తినంతను శ్రీరాముడు తన వశమొనరించుకొనినట్లు, తపఃప్రభావమున ఘనతరశక్తులనందిన మనుష్య హృదయము ఏకాగ్రదృష్టివలన పరమాశయమును తన సొమ్ముగావించుకొనును. అద్భుతమైన ఈనిమిత్తము వలననే ఇది వైకుంఠధామమునుండి శ్రీవిష్ణువును దనలోని కాకర్షించుకొనును.

ఇట్టి చూడ్కికతన ప్రాతఃకాల శిశిరకణము సూర్యమండలమును తన గుండెయందు జేర్చుకొనును. రెప్పవాల్పక మంచుతుంపురును పరికింపుడు. బిందుసుందరి హృదంతరాళమున వివిధ రాగములతో తళ్కొత్తు వేయికిరణములు మీకనులకు విందొనరించును.

జిజ్ఞాసకాలవాలమైనగుండె అణువుకంటె పెద్దది కాకున్నను, తనక్షుద్రత్వమును త్రవ్వి పోసికొనదు. దైన్యమునుగాని, దుఃఖమునుగాని దరిజేరనీయదు. మార్తాండునిమాడ్కి మహదాశయమును తన తపఃఫలముకతన తనయది గావించుకొనును! జిజ్ఞాసువులు అతికాయులు కారు. మహాకాయులు కారు. వీరి తపసు అత్యద్భుత మగుడు బ్రహ్మాండము కోహినూరుమణివలె వీరిగుండెలందు జేరుకొనును. మంచుగుబ్బలిలోని గుహలందు తపోధనులు మనియుండువా రని విందుము. నన్నడిగితిరా వీరి గుండెలను గుహలందే వీరి తపసుచే నాకర్షింపబడి, గగనచుంబి హిమాద్రి కాపుర ముండెడిదని వక్కాణింతును.

ఆత్మ విశ్వాసమునకును, ఏకాగ్రదృష్టికిని అవినాభావసంబంధము కలదు. గుండెలోని విశ్వాసము చలించినపుడే దృష్టినుండి పరమాశయము చెదరిపోవును. ఆత్మవిశ్వాసము, జిజ్ఞాస, తపసు, చిత్తైకాగ్రత సాహసము ఎడబాటు నెఱుగక, పాండవులట్లుండి తమ ధర్మక్షేత్రమును మహాపురుషహృదయముల గాంచి, దానిని తమ నెలవు గావించుకొని, శంఖములు పూరించునదనుకై తడసి యుండును. వీని కీశ్వరసాహాయ్య మనివార్యమనుట స్పష్టాంశమేకదా! నేబేర్కొను మహాపురుషు లీశ్వరునిపై మనసులు నిలిపి ఈశ్వరాలోకమున వెలుంగువారే!

మనుజుని భావ్యున్నతిని ముందే యెఱిగి అక్కఱైన తెన్నున (ఇది కష్టభూయిష్ఠమై యుండవచ్చును) వానిని నిలిపి, వాని కురుక్షేత్రమును తానే నిర్ణయించి, ఈశ్వరు డాతని నందు నిలుపును.

“నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్” అని కదా భగవంతుడు పలికినాడు. ఒక్కొక ఉత్కృష్ట కృత్యమును నిర్వహించుటకు జగదీశుడు భవపరంపరల తపసుకతన నర్హతనందిన నరునొక్కరునిదననిమిత్తముగా బేర్కొనును. సంపూర్ణ భావమున నీబాధ్యత నివ్వటిల్లుటకై వలసిన వ్యవస్థల నీశ్వరుడే కావించును. ఈనరుని తలపులందు తానే తేజరిల్లి, ఈతని క్రియలయందు తానే అధ్యక్షుడై నిలుచును. కావున నీపూరుషుని భావములును, క్రియలును, వాక్కులును, నడకలును ఈశ్వరప్రేరితము లేకదా!

సర్వతోముఖమైన ఆంధ్ర సముద్ధరణమునకక్కఱైనవ్యక్తి నాగేశ్వరరావని జగదీశుడాతని నెన్నుకొనెను.

తాను నిర్దేశించిన ధనువును చేబూనవలయు వీరుని చెవులందు, ఆత డుదయించిన ముహూర్తమున జగదీశుడు తనయుద్దేశమును తియ్యని గుసగుసలలో జొనిపి జారవిడువడు. శిశువుహృదయము చలింప మొదలిడినపుడే ఈయుద్దేశ మాచలనమున ప్రవేశించును. ఈ డింభకుని గుండెకడ చెవియొగ్గి వినుడు. ఎడందచప్పుడున దివ్యశక్తి కలదని గ్రహింతురు. హృదయమునుండియే రుధిరధార లంగప్రత్యంగములలోనికి ప్రవహించును. ఉత్కృష్టభావ మిందేయుదయించి, Pineal gland ను కదలించి మెదడును తట్టునని మనశ్శాస్త్రవేత్తలు నే డనుచున్నారు. హృదయస్థ ఈశ్వరోద్దేశము, ఆయువుపట్టున తొలుతజేగంట మ్రోగించి అంతరంగమును ప్రతిధ్వనింపజేయును. ఈవీరుని రక్తనాళములందును, ధమనిస్నాయువులందును, మేధయందును ఈశ్వరోద్దేశము వెలసియుండును కావున నీతని భావగమనమును. జీవిత గమన

# ముందంజవేయుచున్న భారతదేశపుఫిలిమ్!

## శత్రువు నిన్ను కనిపెట్టియున్నాడు!

న్యూఢిల్లీలో మొదటిసారి ప్రదర్శింపబడినప్పుడు
21—2—39 తేదిన
గౌ॥ రాజప్రతినిధి దంపతులచే
ఆదరింపబడి, ప్రశంసింపబడినది.

న్యూథియేటర్స్ లిమిటెడ్
(కలకత్తా)
వారిచే ప్రదర్శింపబడనున్న
జాతీయఆవశ్యకతకు తగిన

# "శత్రువు"

అని పిలువబడే

# DUSHMAN

డైరెక్టుచేసినది:—
నితిన్ బోస్
భారతదేశపు సినిమాపరిశ్రమకు ఖ్యాతి తెచ్చిన ప్రముఖుడు.

నటీనటవర్గము
సైగాల్, లీలా దేశాయ్, నసీం, పృథ్వీరాజ్, దిమో బాల, నేమో

ఇప్పుడు ప్రదర్శింపబడుచున్న స్థలములు,
బొంబాయి, ఢిల్లీ, కరాచీ, జబల్‌పూర్, పూనా -
మద్రాసునకు త్వరలో రానున్నది.



విడుదల చేయువారు :—
కలకత్తా ఫిలిం ఎక్స్చేంజి,
50, ఆర్మీనియన్ వీధి, మద్రాసు.

"DUSHMAN" అను ఈ చిత్రమును
చూచిన పిమ్మట చెప్పునది
టి. బి! నీవేరే 'దుష్మన్'

మును ప్రత్యేక ప్రాముఖ్యము గలిగియుండును. కన్నుగల చూపరులు వీనిని వీక్షించినంతన, నీతని గుర్తింతురు. బాలకుడైయుండగనే ఈతడు సామాన్యమానవుడు కాడని వీరు చెప్పివేయగలరు. ఇట్టివారిలో రెంటాల వేంకటసుబ్బారావొక్కండని చెప్పనేచెప్పితిని. బాలకుడైన నాగేశ్వరరావు గుండెలోని ఘంటారవము నీతని చెవులు వినగలిగెను.

ఇట్టివీరు లందఱును తమ్ముఁలను తొలుత తమంత దామే గుర్తించుకొందు రని తెలుపజాలము. పదపడియైన వీరిట్లు గుర్తించుకొనుట అనివార్యము కావున వీరి నందులకు పురికొలుపు పరిస్థితులను జగదీశుడు సృష్టించును. "ఈశ్వరాదేశము నాదల గొని ఉత్కృష్టసాహిత్యసేవకై యవతరించితి"నని మిల్టనుకవీంద్రుడు ఇరువదిమూడేండ్ల యువకుడైయుండగనే గుర్తించినవాడు. అప్పటి కుచిత రీతి దన కర్తవ్యమును తాను నిర్వహింపలేదని ఆతడు మిగుల వాపోయినాడు. మహావీరులైనను స్పష్టవాక్కులందు తమ భావిజీవితమును గుఱించి జోస్యము చెప్పజాలరు. కాని వీరికిని దుర్నిర్వాహ్యమగు వేదన మొండు వీరి యంతరంగములందు పనిచేయుచుండును. వీరి నది సరిగ నిద్దురపోనీయదు. విశ్రాంతి గొననీయదు. వీరిచే ముందంజ వేయించియే కొంతదనుక వీరి మనసులను కుదుట బఱచును. పదంపడి హృదయకుహరమున తనఖననము సాగించి, తరువాతియుఱుకునకు వీరిని పురికొలుపును. మనుష్యాంతరంగము స్థరస్థరములు కలది. లోనుండి పనిచేయుశక్తులు వీనిలో వేర్వేఱు స్థానముల నాక్రమించుకొనును. స్మృతికి నెగువను, నడుమను, దిగువనుగూడ నివి యుండును. సర్వాంశములను సావకాశముగ స్మృతిలోనికి నాకర్షించుకొని విశేషముగా మననము సలిపి క్రియకు గడంగవలె ననిన, మానవుడెన్నో చేతల జేయలేడు. విపదవస్థలందు త్రుటిలో క్రియకు గడంగి ఆత్మరక్షణముసంద జాలడు. నలకపడునపుడు చివాలున రెప్పలు తమంత దాము (పూర్వాలోచనమును, సన్నాహమును సలుపక) మూతలు పడునడువున ధ్యాన సముకూడ ఒక్కొకపుడు విశేషముగ తీవ్రసందర్భములందు త్రుటిలో శరీరమును కార్యమున కుత్సహించును. పూర్వాపరపర్యాలోచనము ప్రశంసనీయ మైనదయ్యు, దీని కవకాశ మీయని దుర్దాంత సంఘటనములు మనుష్య జీవితమును పలుమాఱు మార్కొని తీరును. పుంఖానుపుంఖమైన ఆంతరంగికపరిశీలనమును, సంపూర్ణమైన హృదయపఠనమును ధ్యానసమయమునకును, ప్రార్థనాకాలమునకును స్థగిత మొనరింపవలెను. ప్రత్యుత్పన్నమతి నలవఱుచుకొనువాడే సర్వతోముఖమైన మేధాశక్తి నందగలడు. మనతత్త్వ మెద్దియో ఎఱిగి, చిత్తమునకు స్వతస్సిద్ధమైన గమనికను గమనించి, దాని ప్రకృతికి ప్రతికూలమైన పంథయందు గాక అనుకూలమైన గతియందు దానిని గదల నిచ్చి తన గమ్యస్థానముదెస నద్దానిని పుత్తెంచునాతడే మహామేధావి కాగలడు. మనస్సు విద్యుత్తుకంటె వేగవంతమైనది. చేగట్టి దానికిచ్చి కుంటుమని నిర్బంధించిన నట్టినడక కదికడంగగలుగునా? లేడిచే నెవ్వరైన దుక్కిదున్నించగలరా? తటిల్లతనెవ్వడైన నిలాయికొనపై బంధించి పెండ్లి పందిరిలో నిలుపగలడా? గూనివానివలెగాని, కుంటివానివలెగాని నడచునది మనసు కాదు బ్రహ్మాండమును నిముసములో చుట్టిరాగల దానికి కమతంపుగమనిక నెవ్వ రాపాదింపజాలుదురు? సంకెళ్లలో మనసు నుంచి, అడుగడుగున దాని గమనమును నిరోధించి, అన్యాయముగ దాని నెత్తికి బానిసతనమునుగట్టి దానిక తనసెవ్వండుగాని పడయగల విభూతియెంత? మనసును చరచర నడువనిచ్చి మహామేధావులు విశ్వమందలి అద్భుతదృశ్యముల నవలోకించి, అతుల భావవిభూతిని కైబట్టుచుందురు. సురపురమున ప్రవేశించి, నిత్యసౌందర్యోపాసనము నుపలక్షించి, "హా హా" "హూ హూ"ల వీణాగానామృతమును తనివార గర్ణాంజలుల బట్టి కవితల్లజులు తన్మయభావమున మునిగితేలుచుందురు. చదువునపుడును, వ్రాయునపుడును, ఉపన్యసించునపుడును జిజ్ఞాసువు మనోగతిని నిరోధింపక తన కర్జమునకు కడంగవలెను. అపుడే ఈతనిశైలి సెలయేరువలె ప్రవహించును. అపుడే ఒక శాఖనుండి వేఱొక శాఖమీదికి నెగయుపక్షివలె వీనిమనసు గ్రంథస్థపంక్తులపై దుముకుచు, తోడన భావసామగ్రిని గైకొనుచు ముందుల కఱుగును. తా జెప్పదలచు విషయముల నన్నిటిని ముందే సిద్ధముగా నుంచుకొని ఉపన్యసించువాడు సరుకు కడతేఱినంతన జతికిలపడవలెను. శ్రోతలం దెవ్వండైన నేయంశమును గుఱించియైన ప్రశ్నించిన యెడల తత్పూర్వము దీనిని మనన మొనరించుకొనినవాడు కాడుకావున నే యుత్తరమును నీయజాలక, ఈతడు తొట్రుపడును. మతిమంతుడు తనప్రతిభపై, తన యాంతరంగిక శక్తిపై నెంతేని విశ్వాసముంచి, విశేషసాహసముతో నీ విశ్వాసమును సహకరించును. పఠనాగారమందును, ధ్యానసమాధియందును, ప్రార్థనాలయమందును, హృదయమందిరమందును నీతడు సలుపు దైనికవ్రతమునకు భంగము రానీయక, ఆత్మవిశ్వాససాహసములను పురస్కరించుకొని ఈతడు తన రచనమునకు, వచనమునకు గడంగినచో, తొలుత నీత డూహింపజాలని ఉదాత్తభావములు తమంత దాము వీని రచనమున భువనవితానమువలె దొరలి దాని కపూర్వసౌందర్య మొసగి, ఈతని మనసు నద్భుతానందములతో నింపివేయును. తా నెఱుగని, తాను గుర్తింపజాలని మహాశక్తి యొండు తనయందుండి తనచే నుత్కృష్టమైన సృష్టిగావించుచున్నదని, తన్ను మహోత్కృష్టక్రియలకు పురికొలుపుచున్నదని ఈత డపుడు గ్రహించును. తిణుకుచు, గొణుగుచు చదువువాడును, మూల్గుచు, నీల్గుచు వ్రాయువాడును సగముదనుక తమ మనసులను గోనెలో గట్టి ముల్లుగఱ్ఱతో వెనుక నుండి పొడుచువారే! డేకుచు, గుంజీలు దీయుచు ఏ యొకవరిగాని, ఏరచయితగాని చేయజాలుపని యెంత? యోజించుచు, యోజించుచు పంక్తిని చదువు వాడు రెండవ పంక్తిని మొదలిడకమున్నే, 'పరగంగలు' షోలు పరభావములు చివాలున వాని మనసుపై

వాలి దృష్టినున్న విషయమునుండి దానిని దూరముగా నెట్టివేయును. ఇట్టి పతనాగమనిక విషయగ్రహణమునకు తోడుపడక, విషయమునుండి చూడ్కిని తలిమి, దూరముగ నెపుంతలోనో గిరవాటు వేయును. కావున సహజరీతిని మనసును నడువనిచ్చి చదువువాడే, అవలీలగ విషయమును హృద్గతము గావించుకొనును. కేవలము చదువునకే కాదు మనసునకు సంబంధించిన ప్రతి క్రియపట్ల నీసత్యము చెల్లును. కఠినంగను క్లిష్టమైన విషయము ప్రత్యక్షమైనపుడు (నల్లరాతిని బ్రద్దలు కొట్టుటకు వాడిసునపము అక్కఱగునట్లు) వాడియైన చూడ్కనే పతిత ప్రయోగింపవలెను. కింగ్ కాంగ్ నుగాని జిబి స్కోనుగాని గామా డీకొనునపుడు సమయము చరచర నడువకున్నను అది దుర్వ్యయము కాదు. ఈతనిశక్తికి అక్కఱైనపని దొరకును గావున నది ఘనతరమే యగును. విషయము బలిష్ఠమైనపుడు సర్వశక్తులను తనలో కేంద్రీకరించుకొని మనసు దానిని మార్కొనుచో దానిదృష్టి చెదరిపోదు; దాని క్రియ వ్యర్థవిజృంభణము కానేరదు. కైబరు కనుమలోని కరిగి చూడుము. కొండసారంగమున జొచ్చుతటి ధూమశకటము మల్లనల్లన నడచునుగాని దూదిపింజవలె నెగిరిపోదని గుర్తింతురు. రెండుతీఱుల శక్తులు మార్కొనునపుడు వానిగమనపంథ మఱొక తెఱగున నుండు నని భౌతికశాస్త్ర విద్యార్థు లెఱుగుదురు. క్లిష్ట విషయములోని శక్తి చలనసహితముగ గాక చలనరహితముగనే పని చేసినను (The force in it is not Kinetic but potential) పతితదృష్టి కెదురైనపుడు పతనాగమనమున నది కొంత మార్పు కలిగించితీరును. ఈయంశములు వీరుని నడకపట్లగూడ వర్తించును. ఈతనిశక్తి అసామాన్యమైనదని ఈతనియుద్దేశ ముత్కృష్టమైన దని తెలిపితినిగదా! పైన దెలుపబడిన చదువరి యాంతరంగిక శక్తికంటె ఈతని యాంతరంగిక శక్తి దొడ్డది. అసాధారణ ప్రతిభాసమన్వితుడైన రచయితయును, వక్తయును, ఈవీరుడును నైదోడులు. తానెఱుగని మహత్తరశక్తి యొండు తన హృదయస్యందనమున సారథియై యధివసించుచున్నదని విశ్వసించి, ముందుగల దీర్ఘమార్గమందలి అంగుళమంగుళమును ముందే పరీక్షింప గమకింపక ఈ తెరువుతుదగల ఫలము నెఱుగుటకై అంకెలను పేర్చుకొని తొడవ "Rule of three" లెక్కకు గడంగక, మహత్తరశక్తికిని, ఈశక్తితో తులదూగు నాత్మవిశ్వాసమునకును, వానికీడైన సాహసమునకును సరిపడు గమనము నవలంబించి ఈతడు సాగిపోవును. పోవుచు, పోవుచు, తొలుత దానూహింపజాలని అద్భుతదృశ్యముల నెన్నిటినో కని ముగ్ధుడై, వీనిని తనకు గావించిన ఆంతరంగిక దివ్యశక్తి నీతడు వేయివిధముల బ్రస్తుతించి, తాను దానిక్రియకు నిమిత్తమైనందులకు తనలో నెంతయో కులుకును; కాని కనులు మూసికొని ఈతడు నడువడు. చేనిలో పడిన గ్రుడ్డెద్దువలె పురోభాగమందలి జీవితాంగణమున నీతడు చొరబడడు. కట్టెదుటి క్లిష్టపరిస్థితుల ననిమేషలోచనుడై యవలోకించి, వానిని మార్కొను నవసరమున దనగమనమున నక్కఱైన మార్పు నీత డవలంబించును. ఎదుటి శక్తి తన మహితశక్తికి సంపూర్ణమైనపని కల్పించును; కావున సముచితమై, తాత్కాలికమైన దీని చలన పరివర్తనము ఈశక్తిని తగ్గించుటకు మాఱు హెచ్చించును. వ్యర్థవిజృంభణము కదా ఈశక్తికి భంగపాటును, చిత్తైకాగ్రతకు చెఱుపును, ధ్యానగతి కవాంతరమును, దృష్టికి విచ్చలవిడినడకను దెచ్చి పెట్టును.

ఈశ్వరోద్దేశము నొండు గుండెయందిడికొని నాగేశ్వరరావు జనించెనని తెలిపితిని. అవ్వాలి యవనిలో నాత్మప్రకాశము గావించుకొనదలపడు గిరిగర్భస్థజలధారవలె నీతని హృదయస్థగభీరాభిప్రాయము స్వప్రకాశమునకై బహుధా ప్రయత్నింప గడంగినది. ఇది నాగేశ్వరరావును నిద్దురపోనిచ్చినదికాదు. తలిదండ్రులొసగెడి గుజ్జుబువ్వను తిననిచ్చెడిదికాదు. నట్టింటి సంతృప్తినుండి ఈతని గదలించినది ఈ యాంతరంగికచలనమును, ఆత్మవిశ్వాసమును, సహజసాహసమును, నైసర్గిక ధృతిని పురస్కరించుకొని తరువాతి యాటపందిళ్ల దెస నీతడు సాగిపోయినాడు. ముందుగతిని గుఱించి గభీర పర్యాలోచనమున కీతడు గడంగలేదు. నాగేశ్వరరావు రాహుకాలమును చూచి పయనము కాలేదు. మీనమేషములను లెక్కించుచు దీర్ఘయోజనమును గావించినచో, నీతడు హేమ్లెట్ వలె నూగిసలాడువాడు. అపూర్వ భావనివహప్రవేశమునకై హృదయద్వారమును తెఱచి, కలమూని, సాహితీజగతిలో చరచరబోవు ప్రతిభాసమన్విత మహారచయితవలె వీరుడు కదలిపోయినాడు. భావిపంథ యంతయు యవనికమీది సినిమాబొమ్మవలె నీతని పురోభాగమున గోచరింపలేదు. కనువిం దొనరించు కోటివత్తు లెదుట గాంతిలలేదు. తనకై బందరు కలకత్తాలలో పచ్చతోరణమును, బొంబాయి మదరాసులలో నిత్యకల్యాణమును తడసి యుండెనని కేరశపక్షి ఈతని వీనులందు నూదలేదు. శుభాశుతల్లను చేబూనిన గ్రహరాశి నీతడు వీక్షింపలేదు.

తొలియంజలోనే విజయకేతన మెదురగుచో, మలియంజ చచ్చినదే యగును గదా! సుమవృష్టిని గురియించు సురవర్గము ముందే దృగ్గోచరమగుచో, పథాగ్రముందే దేవదుందుభులు సెవులబడుచో, మొదటి యడుగునందే ప్రయత్నవల్లి పుష్పభూషిత యగునేని, కేలహాలమును బూనకమున్నే మంగళగీతిక లాలపించు కిన్నెరకాంత లెదురయ్యెదరేని, కాలు కదల్చుటకు ముందే గులాబిసెజ్జ కనులపండువొనరించునేని, పెద్దంజలు వేయుచు మానవులందఱును పెద్దపనులకు పూనుకొందురు. కల్యాణతిలకమును నొసట దిద్దుకొని పెండ్లికొమరితవలె కర్తవ్యము కట్టెదుట దోచునేని, అసంఖ్యాకులు పెండ్లికొమరులై జగతిని అత్యద్భుతమైన కల్యాణవేదికను గావించివైతురు. పసపు కుంకుములపై చూడ్కినిలిపి, ముత్తెపునేసలకై శిరము లొగ్గి, కల్యాణగీతి

కను వీను లొడ్డి, కట్నములకై కానకలకై దోసిళ్లొగ్గి మహావీరులు ముందంజ వేయరు. పదనైన కోరలను, వాడియైన గోళ్లను కలిగినదయ్యు, కర్తవ్యమునకు వీరు విడాకులు సమర్పింపరు. కాలక్రమమున నిది గంధర్వ భామిని యగునని గ్యారంటీ యొసగువారుగాని పత్రము వ్రాసి రిజిస్టరుచేసి చేతబెట్టు వియ్యాలవారుగాని వీరి కెదురురారు. సన్నిహితవిజయము యజ్ఞపాత్ర చేబూని ప్రత్యక్షము కాకపోయినను, తెరువుతుదనైన, కొండకొననైన పాయసము నందించు విజయము తడసియుండునని యెవ్వరును తెలుపజాలరు. పథమునకిర్వంకల మల్లెలును మొల్లలును నిలుచుచో, పథికులు విలాసపురుషులే యగుదురు కాని వీరవరులు కారు. లోనిసత్తువను కొల్చునవి నిష్ఠురకష్టములు కాని పూలచెండులు కావు. దృఢనిశ్చయమునకు పని కల్పించునది రాళ్లవానగాని పూలవానకాదు. గుండెనిబ్బరము నరయజాలునవి వేడితుంపురులు గాని పన్నీటి బిందువులు కావు. ఇచ్ఛాశక్తికి పేరుదెచ్చునది అగ్నిపరీక్ష గాని సమ్ముఖ విజయము కాదు. వజ్రసంకల్పమునకు వన్నెదెచ్చునవి అగచాట్లుగాని అచ్చట్లును ముచ్చట్లును గావు, ముప్పతిప్పలుగాని ముద్దులును మురిపెములును గావు. కాని, ఏప్రతికూల ముహూర్తమందైన నిరాశ హృదయముపై దాడి వెడలకుండుటకై వీరపురుషులు తమ గుండెలందు సదాశను నిలుపుదురు. ఇది దివ్యప్రదీపము వంటిది. గుండెయను కుప్పెలో నిది వెలుగునంతకాలము చీకటిలోనే వర్ధిల్లు దైన్యమును, భయమును, సంశయమును అంతరంగమున ప్రవేశింపజాలవు. కావలసిన కారణాంతర మెట్లున్నను, మహాపురుషులు దుష్టపరిస్థితులతో పోరుసమయమందైనను కాంతియుతస్వప్నము లల్లుచు ఆనంద గీతిక లాలపించుచునేయుందురు. కావున వీరివాక్కులుత్సాహపూరితము లైయుండును. అష్టదిక్కులనుండి అష్టకష్టములు మార్కొనువేళ నెపోలియన్ "నేను యూరపును; నాకర్తవ్యము పెద్ద" దని కొండకొననుండి లంఘించి, తనదృష్టాంతమును చేయూతజేసి, అనుచరులచే లంఘింపజేసినాడు ఈవీరవతంసుని తీక్ష్ణదృష్టిజూచి అడలుచే చుక్కలు వడకె ననినాడు బైరన్ మహాకవి! అసాధ్యము లీతని జూచి, కాలుకొలది పరుగెత్తినవి! భయదమైన పర్వతాగ్రమున పండ్లతట్టను చూచి ఈతడు మీది కురుకక లేదు. ఈతని సదాశయును, ఆత్మవిశ్వాసమును ఇట్టి తట్టలో పుట్టలేదు; ఇవి వానిసహజహృదయగ్రంథనమున నుదయించినవే! ప్రవంచనము తరువాత నెంతపని చేసినను, ఆవీరవరుని దీర్ఘశోచనమందుగాని దురంత దుఃఖమందుగాని ముంచియుంచక, ఇవియే అతని యంతరంగమందలి అద్భుతశక్తిని విజృంభింపజేసి, దానిగళమున నుజ్జ్వలమైన కీర్తిమణిని గట్టినవి.

డిగ్రీలలో భేద ముండవచ్చును; కాని, వీరులగుణము లాంతరంగికముగ వ్యత్యాసము నెఱుగవు.

తన కర్తవ్యకంఠరసీమయందు కల్యాణమాల్యమును విలోకింపకున్నను, నాగేశ్వరరావు నా డుత్సాహముతో, నానందముతో సహజవిధమున తన గమనమును సాగించినాడు. వాడికొమ్ములుగల అరిష్టములను డీకొనినపుడు అక్కఱగురీతిని గతిని నిరోధించి, దృష్టిని చెదరనీయక, చిత్తైకాగ్రతకు బన్నము రానీయక, ధృతి సాహసములను చలింపనీయక, హృదయస్థశక్తిపై సంపూర్ణ విశ్వాసముంచి ఈశ్వరభక్తుండుకావున నీశ్వర సాహాయ్యమును దివ్వె గావించుకొని, ఇక్కట్టులను నెట్టివేసి, యాత్రను విశేషముగ సాగించినయనంతరము తొలుత దానూహింపని ప్రజ్ఞాప్రకటనమును తన చెయువున నవలోకించి, ఆంతరంగికముగ నాగేశ్వరరావు మిక్కిలి యక్కజంపడి యుండును. తనకర్తవ్య మీశ్వరప్రేరిత మని మది నెంచి, ఈశక్తివ్యక్తీకరణమున కీశ్వర మహిమయే యుత్తరవాది యని నమ్మి, తా నందినఫల మీశ్వర ప్రీత్యర్థము ప్రజాళి చేతులందు బెట్టి, దేశోద్ధారకుడు ధన్యజీవి యైనాడు.

మహాపురుషులు అదృష్టవంతులని ఎందఱో అపోహపడెదరు. కాని అదృష్టమునకుగాక దురదృష్టమునకు వీరు మిగుల సన్నిహితులని ఋజువు చేయవచ్చును. వీరిని మార్కొను శత్రువులు మఱెవ్వరిని మార్కొనవు. వీరి సుఖశాంతులపై రక్తవర్షము గురియించు మారీచసుబాహులు పల్వురు కలరు. వీరి యగ్నిపరీక్ష ఒక్కనాటితో కడముట్టునది కాదు. చితిమంటలో వీరితో సహగమన మొనరించునంతదనుక నవి నిలిచియుండును. వీ రెంటున్నను(నిభృతమందు మసలుచున్నను) సహస్రదృక్కులు వీరిని వెన్నాడుచునే యుండును. వీరి హృదయమహత్త్వ మెఱిగిన సహృదయులకంటె, గభీరమైన వీరి గుండెలందు మునుగీతనీదలేని మూర్ఖులసంఖ్య, —ముష్కరులైన మూర్ఖులసంఖ్య మిన్న. కావున పూవులకంటె ముండ్లే వీరిపై మిక్కుటముగ పడును. వీరియఖండ మనవరతము వెలుంగుచుండవలెనని వీరిసమ్ముఖమందలి దీక్షాగ్ని నిరంతరము జ్వలించుచుండవలెను. తమ వ్రతమండపమునుండి వీరు కదలుచో నిజాంతరంగములం దొకకన్ను నిలిపియుంచుట వీరు విస్మరించుచో, వీరిని అక్కన నొక్కిపట్ట గనిపెట్టుకొనియున్న ప్రలోభములు గజ్జెలందియలతో చివాలున వీరిముందు విజృంభించును. మనోహరముగ మ్రోల నాట్యమాడి మోహంపు దృగ్జాలమున వీరి మానసముల నాకర్షించు నగుమోము మేనకలు పూర్వోక్తదైత్యులకంటె బలసంపన్నలు. కొండొక ప్రలోభమునకు తమ బుద్ధిని కుదువబెట్టి, "వలదు! వల" దని అంతరంగమునుండి ఆత్మ యఱచుచున్నను, తమ యగ్నిహోత్రమున నీరు పోసి, చివాలున సవనవాటికనుండి యవ్వలికి లంఘించి, "హే! ప్రాణప్రియా!" యని దానిని కవుంగిలించుకొని, ఈశ్వరచరణ ద్వంద్వమున సమర్పింపవలయు విరిదండచే దాని గళము నలంకరించి, అమృతబంధుర మైనదని యాశపడి విషాక్తమైన దానియధర మాని పతితులైన మహాపురుషులు ప్రపంచమున

గలరు. తా మధిష్ఠించిన దివ్యసింహాసనము నుండి (శత్రుప్రహారములచే విఱిగి భూమిపై పడిన కోటబురుజులవలె) నేలగూలిన మునిరాజుల విషాదగాథల నెఱుగమా? స్మృతిపథమునసయితము గురుకులము లదృశ్యములై యున్నతఱి, భావగ్రహణమునకును దైనిక జీవిత విధానమునకు నెట్టి బాంధవ్యము లేని తఱి, యుగవాతూలము కలుష సంకులమై యున్న తఱి, ఉద్దేశములు క్రిమిబంధురములై యున్నను, పేరుప్రతిష్ఠ లలవఱుచుకొనుటకు వలసిన వ్యవస్థలు ప్రచారమం దనుడు, ప్రకటనమం దనుడు, ప్రదర్శనమం దనుడు అవలీలగ దృగ్గోచర మగుతఱి దమతొంటిగద్దెలనుండి స్వస్వ రూపములతో (సత్య మెన్నటికిని మఱుగున దాగి యుండదు. కావున) సభాలున గూలిపడు పెద్దలను వీక్షింపజాలుట విడ్డూరము కాదుసుడీ. ఒకప్పుడు పూజా పీఠములందు తేజోమూర్తులై యధివసించిన మహనీయులు కొందఱు పడపడి వికృత స్వరూపులై గోచరించి, వీరపూజాధురంధరులు చల్లినపూలకు తలవంపులను, జిజ్ఞాసువుల మనసులకు దుఃఖమును గలిగించి రని ప్రపంచ చరిత్రలు తెలుపుచున్నవి. కార్లైలు ప్రభృతులు వీరపూజ (Hero-worship) నలిపి పలువుర నిందలకు పురికొలిపిరి. వీరపూజ దేశౌన్నత్యమునకు, జాతి మహత్త్వమునకు ఆవశ్యకమైన పవిత్రానుష్ఠానము. ఈ యుత్కృష్టకర్తవ్యమును నిర్వర్తించి కార్లైలాదులు తమ దేశమాతల కానందమును గలిపిరి. తమపూజలందు వీరవరులు పదంపడి వెలికిల బడెదరో, ఘనతరప్రజ్ఞ నంది ఈశ్వరునకు సన్నిహితు లయ్యెదరో వా రెఱుంగజాలరైరి. మ రెవ్వరుకాని యెట్లెఱుంగ జాలుదురు? పవిత్రమైన తమ ధర్మమును నిర్వహించుటే యెఱుగగలరు. ఒరుల భావిప్రవర్తనమును గుఱించి రాయి ప్రద్ది, గ్యారంటీయని కంఠమెత్తి జగదీశుడైన బలుకలేనితఱి వీ రెట్లు పలుకగలరు? నాగేశ్వరరావు బూడిదపులుము కొనినఋషి కాడు కాని, తనయింద్రియ హయములను దశదిశల బరుగిడనీయని మహావీరుడు. సమక్షమునగాని పరోక్షమునగాని ఈతని చరిత్రయం దెట్టిమచ్చను వ్రేలెత్తి చూపగలిగినవా రెవ్వరును లేరు. దైనిక జీవితమున సంయమగుణము ననుష్ఠించిన మహాపురుషు డాతడు. తన యగ్నిహోత్రమున నీటి బిందువులనుకాని, తన నిష్కళంక చరిత్రమునపై మురికితుంపురులనుకాని రాలనీయని మహాత్ము డాతడు. క్రమనిష్ఠకతన, కఠోర తపస్సుకతన, తా నధిష్ఠించిన శిఖరమునుండి జారిపడకుండుటయకాదు యింక్ష్వాకైన వంగక కైలాసములోనికి రహదారి నేర్పఱచికొని, ఈశ్వరపక్షమున స్థానమునందిన మహనీయ గుణగరిష్ఠుడు నాగేశ్వరరావు.





# వాల్‌టాక్సు ఫౌండ్రి

# Wall Tax Foundry



అచ్చుఆఫీసు పనిముట్లను తయారు చేయువారు, ఇంజనీర్లు, కంట్రాక్టర్లు

టెలిఫోన్ నెం. 3158, 157 వాల్‌టాక్సురోడ్డు, కొండితోప్, మదరాసు

ఆర్డరులు అతిశీఘ్రముగాను సంతృప్తికరముగాను తయారుచేయబడును.

పింట్లో చెక్కు (ఆయిల్ మిల్లులు) షూగాకున్ను హద్దును చేయు కొలిమి, డబ్ల్యు. ఇ. పుల్లీలు, (సింగల్ డబుల్ ఆమ్ను) రైస్‌హాల్లర్లు, పెండిమరలు, డిసింటిగ్రేటర్లు, గుండ్రని, సానాకొలిమికి అనుకూలించు ఇనుపఖడ్డీలు, ఎద్దులతోను, పవర్ ఇంజనులతోను వాడుకొనుటకు అనుకూలించు చక్కెరమిల్లులు, వివిధరకముల సి. ఐ. కాలమ్ను, అలంకారముగానుండు దీపస్తంభములు, నీటిగొట్టములు, మునిసిపాలిటీలకు పనికివచ్చు పనిముట్లు సి. పి. రైలింగ్సు, అలంకారముగా నుండు సి. ఐ. షైనల్సు, పానెల్సు, బ్రాకెట్సు, డంబెల్సు, సి. ఐ గేట్సు, తోటలోనిబల్లలు, ఫాన్ సెంటర్సు, షిఫ్టుసెంటర్లు, తేలిక, బరువైన సాకెట్లు, బాల్సుమున్నగునవి వివిధ రకములు తయారుచేయబడి, సప్లయి చేయబడును.



కాస్టింగు వర్కుల్సు, ఇంజనుల రిపేరు అతిశీఘ్రముగా చేయబడును.

# గోలి శిల్ప చిత్రములు



౧-వ చిత్రము : మనుష్య ప్రతిమలు



౨-వ చిత్రము : నలగిరి వశీకరణము



వెస్సంతర జాతకము

3-వ చిత్రము : రాజకుమారుడు తన 'ధర్మసత్రము'నకు బోవుట



వెస్సంతర జాతకము

౪-వ చిత్రము : గజదానము



క చ

వెస్సంతర జాతకము

౫-వ చిత్రము : (క) వృషభ, (చ) శకట దానము



క చ

వెస్సంతర జాతకము

౬-వ చిత్రము : క. రాజకుమారుడు, అతనిభార్య పిల్లలను ఎత్తుకొనివెళ్లుట

చ. పిల్లలను దానమిచ్చుట



క చ ట

వెస్సంతర జాతకము

౭-వ చిత్రము: క. రాజకుమారి తన కుటీరమునకు వచ్చుట

చ. పితామహుడు పిల్లలను విడిపించుట

ట. యక్షిప్రతిమ



౮-వ చిత్రము: ఛద్దంతజాతకము



# గోలీ శిల్పములు

[ఈ గోలీ శిల్పములను గురించి శ్రీ టి. యన్. రామచంద్రన్‌గారు వ్రాసిన పొత్తమును మద్రాస్ ఎగ్మోరు గౌర్నమెంటు మ్యూజియమువారు ఒక 'బుల్లెటిన్'గ ప్రకటించినారు. దాని ననుసరించి వ్రాసినదే కథా వృత్తాంతము. అచ్చటచట ఒకటి రెండు భేదములు కలవు. — **మల్లంపల్లి సోమశేఖరశర్మ.**]

[ఈ సంచికయందలి గోలీ శిల్పచిత్రములు ఎగ్మోరు గౌర్నమెంటు మ్యూజియము సూపరింటెండెంటుగారి అనుమతితో.]

తెలుగు దేశమున నొకప్పుడు బౌద్ధమతము ముమ్మరముగ వ్యాపించి యుండినట్లు చెప్పుట చర్విత చర్వణము. బౌద్ధనిర్మాణావశేషములాంధ్రదేశమున అనేక ప్రాంతముల గానవచ్చుచున్నవి. ఆంధ్రచరిత్ర పాఠకులు అమరావతి, నాగార్జునుని కొండ ప్రదేశములయందు బయలుపడిన బౌద్ధకళా సంపదను గురించి యిదివర కెరిగియేయున్నారు. వాని నెరిగినంత యెక్కువగా గోలీ బౌద్ధ శిల్పములను గురించి యెరుగరనుట సత్యదూరము కానేరదు.

గోలీ యన్నది గుంటూరుజిల్లా, పల్నాడు తాలూకా యందలి గ్రామము. ఈ గ్రామమునకు వాయవ్యదిశ నొకమైలున్నర దూరమున ఒక దిబ్బ యుండగా దానిని పుదుచ్చేరియందుండు ఫ్రాన్సు దేశస్థుడు డాక్టరు జి. జే. డుబ్రాయిదొరగారి ప్రోత్సాహమున త్రవ్వినారు. త్రవ్వగా అందుండి బౌద్ధస్తూపమునకు సంబంధించిన శిల్పచిత్రములతో గూడిన శిలాఫలకములు కొన్ని కానవచ్చినవి. వాటి నన్నిటిని ప్రస్తుతము మద్రాసు, ఎగ్మోరునందలి చిత్రవస్తు ప్రదర్శనశాలలో భద్రపరిచినారు. చెన్నపురి వచ్చువారు ఆ శిల్పచిత్ర ఫలకముల నచ్చట చూడవచ్చును. ఈ సంచికయందు వాటిలో గొన్ని శిల్పచిత్ర ఫలకముల స్వరూపము చూపబడినది.

గోలీయందు దొరకిన యీ శిలాఫలకము లన్నిటి మీదను అమరావతి, నాగార్జునునికొండ స్తూప శిలాఫలకములమీదవలెనే బుద్ధుని జీవితమునకు సంబంధించిన, జాతక కథలకు సంబంధించిన చిత్రములు చెక్కబడినవి. ఒక్కొక్క ఫలకమును పెక్కువిభాగములుగ విభాగించి, అందొక్కొక్క విభాగమున కథకు సంబంధించిన ఒక్కొకదృశ్యమును చెక్కుదురు. కొన్నికొన్ని గాథలు, కథలు అతివిస్తరముగను, కొన్నికొన్ని అతి సంగ్రహముగను చెక్కబడినవి. ఇట్లు కథ చెక్కుట పూర్తియైన పిదప ఒకటి రెండు విభాగములలో మనుష్య, నాగ, యక్షాది చిత్రములను చెక్కుట యాచారము. అటు తరువాతి విభాగమున మరల నొక క్రొత్తగాథ, లేక క్రొత్త కథ యారంభమగును. ఈవిధమున ఆమనుష్యాది విడిచిత్రములు కథ సంపూర్ణమనుటకు గుర్తు. ఒక్కొక్క విభాగమును 'గడి' యని వ్యవహరింతము.

ఈ సంచికయందు ముద్రితములైన గోలీ శిల్ప చిత్రములలోని మొదటి చిత్రఫలకమున మూడు 'గళ్లు' కలవు. మొదటి 'గడి'యందలి ఏనుగు మొదలైన చిత్రములు రెండవ చిత్రమునకు సంబంధించినవి. తరువాతి రెండవ గడిలో స్త్రీపురుష ప్రతిమలును, మూడవ గడియందు నాగరాజ చిత్రము నున్నవి. ఇవి కథకు సంబంధించని విడిచిత్రములు. ఇట్టి చిత్రములను మలచుటలో కథాసమయములుకాని, శిల్ప సమయములుకాని ఏమియు అడ్డురాక శిల్పికి కావలసినంత స్వేచ్ఛయుండును. ఇవి ఇప్పటి ఖండకావ్యముల వంటివి. ఇట్టి విడిచిత్రములను చిత్రింపవలసివచ్చినప్పుడు బౌద్ధ కాలపు శిల్పులు ఆ కాలపు సాంఘిక జీవితమునుండి వృత్తములను గైకొనుట వాడుక. ఇట్టి చిత్రములు చూచువారి మనస్సును రంజింపజేసి కథాఘట్టానుసరణమున నుండి కొంత విశ్రాంతి కలిగించుటకు సాధారణముగ ప్రణయలీలలు చిత్రించుచు వచ్చినారు.

రెండవ చిత్రమువలన దెలియవచ్చునది 'నలగిరి'యను ఏనుగును బుద్ధుడు తన శాంతి ధర్మప్రభావమున వశపఱుచుకొనుటను దెలుపు గాథ. ఇది సాధారణముగ ఆనాటి బౌద్ధ శిల్పులకు చాల ఇష్టమైన వృత్తము. నాగార్జునునికొండ, అమరావతిస్తూప శిలాఫలకములమీదను, ఇతరస్తూపపు శిలాఫలకములమీదను ఈ గాథ పలుమాఱులు చిత్రిత మయినది.

దేవదత్తుడు బుద్ధుని దగ్గరబంధువుల్లలో నొకడు. కాని యతడు కడు దుర్మార్గుడు. బుద్ధునికి పేరు ప్రతిష్ఠలు వచ్చుచున్నందుకు, అతనికి గౌరవ మర్యాద లెక్కువగుచున్నందుకు ఆతనికి అసూయ, ఈర్ష్య జనించి, అతడు బుద్ధుని ఎట్లయినను కడతేర్చుటకు అనేకప్రయత్నములు చేయును. ఈ చిత్రమున సూచిత మయినది అట్టి ప్రయత్నములలో నొకటి.

బుద్ధుడు మహాబోధివిజ్ఞానము నంది, తనమతమును బోధించుచు ఒకప్పుడు శిష్యులతోగలసి మగధ యందలి రాజగృహ నగరమునకు వచ్చును. అచట నొక సంపన్న గృహస్థుడు బుద్ధుని, అతని శిష్యులను దనయింట విందుకు పిలుచును. అది తెలిసి, దేవత్తుడు అజాతశత్రు మహారాజునొద్ద నలగిరి యనునొక భయంకరమైన యేనుగుండగా దానిని బుద్ధుడు తన శిష్యులతో ఆ సంపన్న గృహస్థు నింటికి వెళ్లు మార్గమున వదలిపెట్టవలసినదని ఆ మహారాజు మావటీనిని ప్రోత్సాహ పెట్టును. మావటీడు అందుల కంగీకరించి నలగిరిని వదలివేయును.

చిత్రము కుడివైపు భాగమున స్వేచ్ఛగ వదలివేయబడిన ఆ నలగిరి తన కడ్డువచ్చిన మనుష్యులను కొందరిని కాలితో త్రొక్కి, మరికొందరిని తొండమునకు చుట్టబెట్టి చంపి నానా బీభత్సము చేయుచున్నట్లు చూపబడినది. ఏనుగు ఒక స్త్రీని కాళ్లక్రింద వేసి త్రొక్కుచున్నది. ఆమెకెదురుగ, మీదకు వచ్చు నా యేనుగును చూచుచు భయభ్రాంతుడై ఒక మనుష్యుడు కూర్చున్నాడు. ఉద్ధతితో వచ్చు ఆ యేనుగను చూచి కొందరు-చిత్రమున నలుగురు; వీరిలో ఇద్దరికి చేతిలో కఱ్ఱలున్నవి — వెనుకకు తిరిగి తిరిగి చూచుచు కలయద్రొక్కుకొని ముందుకు పరుగిడుచున్నారు. ఎడమవైపు భాగమున బుద్ధుడు తన మైదుగురు శిష్యులతో బయలుదేరి సంపన్న గృహస్థు నింటికి వెళ్లుచున్నాడు. పరవళ్లు త్రొక్కుచు వచ్చుచున్న ఆ యేనుగును చూచి బుద్ధుడు ఏమాత్రము మిసిమింతుడు కాక, చలింపక మందరాచలమువలె సుస్థిరుడై మూర్తీభవించిన శాంతమువలె నిలుచున్నాడు. క్రోధోద్రేకముతో బీభత్సము కావించుచున్న ఆ నలగిరి వచ్చి వచ్చి ఆపరమ కారుణికమూర్తి, పరమ శాంతమూర్తి బుద్ధునిముందు మోకరించి ఆతని పాదపద్మములకు సమస్కరించుచున్నది. ప్రక్కనున్న జనము ఈ యత్యద్భుత సంఘటనను జూచి విస్మయాద్భుత సూచకముగ చేతు లెత్తి ఆనందము నొందుచున్నారు. బుద్ధుడు తనదివ్య ప్రభావముచేత తన కపకృతి చేయ వచ్చిన 'నలగిరి'ని వశము చేసికొనును. దేవదత్తుని దుష్ప్రయత్నము విఫలమగును. ప్రేమ 'అప్రేమ'ను జయించెను.

తరువాతి ౩, ౪, ౫, ౬, ౭ చిత్రములు ఒకటే జాతకకథకు సంబంధించినవి. దీనికి ప్రాకృతమున 'వెస్సంతర జాతక'మని పేరు. బుద్ధుడు అనేకములుగ నున్న తన పూర్వ జన్మలలో ఒకమారు 'వెస్సంతరు'డను రాజకుమారుడుగ జన్మించెను. అతడు వైశ్యబృందమునడుమ వైశ్య

వీథిలో జన్మించుటచేత అతనికి వెస్సంతరుడని పేరు కలిగినది.

వెస్సంతరుని భార్యపేరు మాద్రి; తండ్రిపేరు సంజయ మహారాజు.

వెస్సంతరునికి అడిగిన వారికి లేదనకుండ నిచ్చుదానగుణము ఒక వ్యసనముగ పరిణమించినది. తానెక్కడనున్న నక్కడ వర్షపన్నది లేకుండజేయు తెల్లయేనుగొకటి వెస్సంతరునియొద్ద నుండెను.

ఇట్లుండ నొకప్పుడు కళింగ దేశమున వానవ్రదులులేక దుర్భిక్షము సంభవించెను. వెస్సంతరుని త్యాగశీలమును, తెల్లయేనుగు వృత్తాంతమును దెలిసికొన్న కళింగదేశ బ్రాహ్మణులు కొందరు అతనియొద్దకు వెళ్లి శ్వేతగజమును యాచించిరి. ఏమాత్రమును సంశయింపక యాతడు వారికా యేనుగును దానమిచ్చెను.

ఈ సంగతి తెలిసి ప్రజలు ఆగ్రహావిష్టులై అమూల్య ధనము — ఆ తెల్లయేనుగును — దాన మిచ్చివేసె నని సంజయ మహారాజుకడ కరిగి మొర పెట్టుకొని, అట్టివానిని రాజ్యమున నుండనిచ్చుట ప్రజలకు క్షేమము కాదని బోధించి వెస్సంతరుని పుత్రకళత్రసమేతముగ రాజ్యమున నుండి వెడల గొట్టింతురు. వెస్సంతరుడు రాజ్యమును వదలిపెట్టి భార్యాపుత్రులతో నడవుల కరుగును. అచటికి కూడ అతనిని వెదకికొనుచు యాచకులైన మరికొందరు బ్రాహ్మణులు రాగా వారికి క్రమముగా తన రథమును, పిదప గుర్రములను, తన యిరువురు పిల్లలనుగూడ నిచ్చివేయును. తుదకు ఇతని దాతృత్వమును పరీక్షింపగోరి మాయాబ్రాహ్మణవేషముతో వచ్చి అతని భార్యనే యడిగిన శక్రునికి (ఇంద్రునికి) వెస్సంతరుడు ఆమెను సైత మిచ్చివేయును. అప్పు డాతని దాతృతాగరిమ కాశ్చర్యము నొంది శక్రుడు నిజరూపము దాల్చి ప్రసన్నుడై యతని భార్య నతని కిచ్చివేయుట యేగాక అతని కనేకవరములనుగూడ ప్రసాదించును. వెస్సంతరుని తండ్రియైన సంజయుడు పిల్లలను దానముగ ప్రతిగ్రహించిన బ్రాహ్మణునికి వలసిన ధన మొసంగి వారిని విడిపించును. పిదప నతడు పిల్లలను దీసికొని, కుమారుని కోడలిని వెదకికొనుచు నరణ్యముల కరిగి వారిని కలసికొని తుదకు తన రాజ్యమునకు దీసికొనిపోవును. ఈ విధముగ కథ సుఖాంతముగ పర్యవసించును.

ఈ కథ ఈ గోలీ శిల్పచిత్రముల యందువలె మరెచ్చటను ఇంత విస్తరముగ చిత్రింపబడలేదు.

ఇక మూడవ చిత్రమును చూతము. వెస్సంతరుడు వాడుకగా దానకార్యములను నిర్వర్తించుచుండు తన 'ధర్మసత్రము' (దానగృహము) నకు పరిచారికా బృందము పరివేష్టించి రా ఏనుగు నెక్కి వెళ్లుచున్నాడు. దానసమయమున కవసరమైన జలకుండికను, దాన మిచ్చునపుడు పోయుజలమును బట్టుటకు ఒకపాత్రమును పరిజనులు నెత్తిని బెట్టుకొని కొనిపోవుటను చిత్రమున కుడివైపు భాగమున చూడగలము. ఈ పరిజనమున కత్తులు కటారులు పుచ్చుకొని పోవు అంగరక్షకులును, రాజసేవకులును గూడ నున్నారు.

నాల్గవచిత్రము ఈ కథలోని మరియొక ఘట్టమును దెలుపుదృశ్యము. ఇచ్చట కుడివైపు భాగమున బండిని తగులుకు నిలువుగా నొక స్తంభము వంటిది కలదు. ఇట్టిదే మరియొకటి చిత్రమున నెడమవైపు చివరి భాగమునను నున్నది. ఈ రెండు స్తంభములకు నడుమ గల దృశ్యము తెలుపు విషయ మిది: కళింగదేశమున గల్గిన మహాక్షామమును దొలగించుకొనునుద్దేశముతో శ్వేతగజమును వెస్సంతరునినుండి యాచింపవచ్చిన కళింగ బ్రాహ్మణులు ఈ చిత్రమున కుడివైపుభాగమున నున్నారు. ప్రధానముగ మనకు ముగ్గురు కనబడుచున్నారు. వారి వెనుకనున్న జనసమూహములో మరి కొందరు కూడ నుండవచ్చును. కథ ననుసరించి ఇట్లు యాచింపవచ్చిన బ్రాహ్మణులు ఎనమండ్రు. వెస్సంతరుడు ఏనుగు తొండమును ముందరి బ్రాహ్మణుని కుడిచేత నుంచి, "తుభ్య మహం సంప్రదదే న మమ" అని తన రెండు చేతులతోను పట్టుకొన్న జలకుండికలోనుంచి నీళ్లు వదలుచున్నాడు. అవసరమయినచో జలకుండికలో మరల నీళ్లుపోయుటకు వెస్సంతర రాజకుమారునికి వెనుక నొక మహాగుజ్జు జలపాత్రను బట్టుకొనియున్నాడు. విడిచిన దానజలము పడుటకై సరిగా తొండమునకు దిగువ నొకపాత్ర మున్నది. దాన

ప్రతిగ్రహము చేయు బ్రాహ్మణులు ముగ్గురు ఎడమచేత సంచులు పట్టుకొనియున్నారు. ఈ సంచులలో ప్రాయికముగ దాన మిచ్చుచుందర రాజకుమారు డిచ్చిన సువర్ణ దక్షిణ యుండవచ్చును. ఈ తెల్లఏనుగును రాకొమరుడు దానమిచ్చుచున్నందులకు విచార హృదయులై ప్రజలు బ్రాహ్మణులకు వెనుక ప్రక్కనుండి ఈ తంతు తిలకించుచున్నారు.

ప్రజలు సంజయ మహారాజు నొద్దకుపోయి ఈ వృత్తాంతమంతయు జెప్పి, రాజకుమారుని అతని 'దానపిచ్చి'కి నిందించి అతనిని రాజ్య బహిష్కృతుని గావింపనాతని (మహారాజును) కుద్బోధించు విషయము ఇందు చిత్రింపబడలేదు.

అయిదవ చిత్రము రాజ్య బహిష్కృతుడైన వెస్సంతర రాజకుమారుడు తనభార్య మాద్రిని, తనయిరువురు పిల్లలను వెంటబెట్టుకొని, హయములు పూన్చిన రథము నెక్కి అడవుల కేగుటను దెలుపును. కథలో వెస్సంతరుడు రథారూఢుడై వెల్లినట్లుండ నీ చిత్రమున శిల్పి యతడు రెండెడ్ల బండిలో వెల్లినట్లు చిత్రించెను. ఈ కథకు బండిలో వెల్లినట్లు తెలుపుపాఠాంతర మేదయిన నాడు ఆంధ్రదేశమున వాడుకయందుండెనో, లేక శిల్పియే స్వతంత్రించి యట్టి మార్పు చేసెనో తెలియదు. కాని రాజ్య వైభవమునెల్ల బోవిడిచి, రాజ్య బహిష్కృతుడయి అడవుల కేగినవాడు రాజకుమారుడైన నేమిగాక, అత్యంతము సామాన్యునివలె •అతడు రెండెడ్ల బండిలో వెల్లెననుటలోనే యెక్కువ ఔచిత్య మున్నది. ఒకవేళ కథకు పైని చెప్పిన యట్టి పాఠాంతరమే లేకపోయిననో ఆనాటి ఆంధ్రశిల్పులు తమ కళా రచనములయందు ఎక్కువ యౌచితిని పాటించుచు వచ్చినారని చెప్పవచ్చును. బండిని తోలుచున్నవాడు వెస్సంతరుడు. బండి గూటిలోనుండి మనకు అతనిభార్య మాద్రియు, అతని ఇరువురు పిల్లలును కనబడుచున్నారు. క్రీస్తుశకము నాలుగవశతాబ్దిని కృష్ణాతీరమున ఆంధ్రదేశమునందు వాడుకలో నుండిన ఎడ్లబండ్లు ఎట్టివో దీనినిబట్టి మనము గ్రహింపవచ్చును. ఈ చిత్రము 'క' భాగమున కుడి ప్రక్క దిగువ నొక పెద్ద పులి, ఒక సింహము, ఒకకోతి, ఒకతేలు చిత్రింపబడుటవల్ల బండి అటవీప్రదేశమున బ్రవేశించుచున్నట్లు సూచనయగుచున్నది.

వెస్సంతరు డడవుల కరిగినపిదప మరల అతనిని యాచించుటకు నలుగురు బ్రాహ్మణులు పట్టణమునకు వెల్లి, జరగిన యావద్వృత్తాంతమును దెలిసికొని అతడు వెల్లిన త్రోవనుబట్టి వెదకికొనుచు పోయి తుద కతనిని గలసికొని దానము వేడుదురు. అప్పుడు వెస్సంతరుడు తనయొద్ద ఇయ్యదగిన దేదియు లేక బండికి కట్టిన వృషభములను వారికి దానమిచ్చును ఇందువలననే 'క భాగమున గనబడు ఎద్దులు 'చ' భాగమున గనబడవు. పిదప తమ పిల్లల నిరువురను బండిలో గూర్చుండబెట్టి వెస్సంతరుడును, అతనిభార్యయు బండిని లాగుదురు. ఈ దృశ్యము ౫-వ చిత్రమున 'చ' భాగమున జూపబడినది. ఈ భాగము నందలి లేడియు, సింహమును అప్రాంతము అరణ్యమని తెలుపును. మరల ఇచ్చటికి కూడ ఇరువురు బ్రాహ్మణులు వచ్చి, వెస్సంతరుని దానమడుగుదురు. ఈ యిరువురిలో ఒకడు గొడుగు వేసుకొని యున్నాడు; మరియొకడు అతని ప్రక్కనే నిలబడినాడు. వీరికి వెస్సంతరుడు బండిని దానమిచ్చి పంపివేయును. పైన ఖేచరులు ఆతని దాతృత్వమును ప్రశంసించి యతనిని కీర్తించుచున్నారు. 'చ' భాగమున కుడివైపు నున్న చెట్టుతో ఈ రంగమాఖరు. ఈ చెట్టు తరువాతి చిత్రములు తరువాతి కథాభాగమును తెలుపునవి. వీటినిమిత్త మిక ఆరవచిత్రమును చూతము.

ఆరవచిత్రము 'క' భాగము శకటదానానంతరము జరిగిన కథ తెలుపును. బండిని దానమిచ్చిన పిదప వెస్సంతరుడును అతని భార్యయు ఒక్కొక రొక్కొక బిడ్డ నెత్తికొని పోవుదురు. ఈ భాగమున పైన సింహములు, క్రింద ఏదుపందులు నుండుటనుబట్టి వారు అరణ్యమున ప్రయాణము చేయుచున్నట్లు స్పష్టమగుచున్నది. వెస్సంతరుడు కుమారుని తనభుజములమీద గుర్రమెక్కించుకొనిపోవుచున్నాడు. మాద్రి తనకూతురిని చంకనెత్తుకొని పోవుచున్నది. 'చ' భాగమున చుట్టు గుడిసెవంటి యొకకుటీర మున్నది. అడవిలోని ఈ కుటీరమున వెస్సంతరుడును, అతని భార్యయు నివసించు



పేటెంట్ చేసిన "స్ట్రాంగై"న సామానులపై నమ్మకముంచుడు!

# 'ఆట్టో-హాట్ నీటిబాయిలర్లు'

(సులభముగ వేడినీరు తయారు చేయుటకు)

## గొప్పకు ప్రసిద్ధమైనవి.

నేలమట్టమున నుండినను సరే, డాబాలో నుండినను సరే,
స్వేచ్ఛగను, విరామము లేకుండను సప్లై చేయ గలిగినది.
బొగ్గు, లేక కట్టెలు, మరి యేదైనను ఉపయోగింపవచ్చును.

ఇది మీ యింటికి అత్యావశ్యకమైనది.

## బాంబే ఇంజినీరింగ్ వర్క్సు,

ఇంజినీయర్సు, ఫౌండర్సు, వెల్డర్సు, క్రోంప్లేటర్సు,

నెం. 8, సుంకురామ చెట్టివీధి, మద్రాసు.



చున్నారు. కుటీరమున కెడమ భాగమున మరల నర్థియై వచ్చిన ఒక బ్రాహ్మణునికి రాజకుమారుడు తన బిడ్డల నిరువురిని దానమిచ్చుట మనము చూడ గలము. అర్థియైన బ్రాహ్మణుడు గొడుగు వేసికొని యున్నాడు. రాజకుమారుడు తన పిల్లలను బ్రాహ్మణునిముందు నిలబెట్టి అతని కుడిచేతిలో దానజలమును విడుచుచున్నాడు. తుదకు నిర్భాగ్యుడయి వనముల నివసించు ఆ రాజకుమారునివలననుండి అతని బిడ్డలను గూడ బ్రాహ్మణుడు దానముగ గ్రహించుట మానవులకే కాదు, జంతువులకు ప్రకృతికికూడ కష్టము కలిగించువిషయము. ఈ భావమును శిల్పి కోతిచిత్రములమూలమున వెల్లడించినాడు. ఒకకోతి బ్రాహ్మణుడు వేసికొన్న గొడుగును లాగుచున్నది. మరియొకకోతి బ్రాహ్మణుని వెనుక నుండి వచ్చి అతనిబట్ట పట్టకొని లాగుచున్నది. ఈ దృశ్యమంతను గుడిసెమీదనుండి పరిశీలించి చూచుచున్న వేరొకకోతి ఈ దానమునకు విఘ్నము కలిగించి దాని నాపుటకో యన్నట్టు కోపముతో బ్రాహ్మణుని మీది కురకబోవుచున్నది.

ఈ 'చ' భాగముననే పైన మరియొక దృశ్యము కలదు. అది దానానంతర కథ. ఎడమచేత గొడుగు పట్టుకొని ఒక బ్రాహ్మణుడు తన కుడిచేతి కర్రతో పిల్లలను కొట్టుచు, వారిని దన యింటికి దీసికొని పోవుచున్నాడు. పిల్ల లిద్దరు ఆదెబ్బలకు భయపడి ఒకరి నొకరు కౌగిలించుకొని, బెదరుచు బెదరుచు మధ్య మధ్య వెనుకకు భీతితో బ్రాహ్మణునివైపు చూచుచు సాగిపోవుచున్నారు.

కుటీరమునకు కుడివైపున చిత్రితమైన కథాభాగమునకు ఏడవచిత్రమును బరిశీలింతము.

ఏడవ చిత్రమున 'క', 'చ', 'ట' లను మూడు విభాగము లున్నవి. 'క' విభాగమున వెస్సంతర రాజకుమారుడు కుటీరప్రాంతమునందలి యొకవృక్షముఛాయను పద్మాసనము వేసికొని, ఒక యరచేతిమీద నొకయరచేతిని బెట్టుకొని ధ్యాననిమగ్నుడయి యున్నాడు. మాద్రి అడవులకరిగి పండ్లు ఫలములు మొదలైన సంభారములను గూర్చుకొని కావడిలో బెట్టుకొని, తన కెదురుగ నుండు సింహమును, పులిని చూచియో, లేక మరల తాను లేనిసమయమున నింటియొద్ద నే యాపదమైన మూడినదనియో భయపడుచు, అలసిపోయి, సొలసిపోయి వెళ్లుచున్నది. కథ ననుసరించి చూచినచో మాద్రి దూరమున నడవిలో నుండినప్పుడే వెస్సంతరుడు బిడ్డలను దానమిచ్చుట జరగినది. దానకాలమున సింహమును, పెద్దపులియు, చిరుతపులియు ఆమె త్రోవ కడ్డు వచ్చునట్లు చేసి యామె సకాలమునకు కుటీరమును జేరకుండ జేసినారట దేవతలు. ఆమెప్రక్కనున్న చెట్టుమీద నొకపక్షికూడ చిత్రింపబడినది. మాద్రి యింటికి వచ్చువేళకు పూర్వమె పక్షులు తమ తమ గూండ్లకు చేరుకొన్నవని, అంతకు పూర్వమె సూర్యాస్తమయమయ్యెనని, ఆమె కుటీరమునకు వచ్చునరికి ప్రొద్దుపోయెనని దీనివలన దెలియుచున్నది. ఆమె కుటీరమునకు వచ్చియు రాగానే బిడ్డలను దానమిచ్చిన విషయమును దెలిపి ఆమెకు ఖేదము కలిగించ కుండుటకును, కుటీరమునందలి నిశ్శబ్దతను గమనించి పిల్లలనుగురించి ఆమె తనపై ప్రశ్నవర్షము కురిపింపకుండ జేయుటకును వెస్సంతరుడు ధ్యానసమాధి నున్నాడు.

ఏడవ చిత్రము 'చ' భాగము ఈకథ యందలి కడపటి భాగమును దెలుపును. పిల్లలను దానముగ గైకొని వారిని దనతో గొనిపోవుచున్న బ్రాహ్మణుడు సంజయమహారాజు రాజధానిగుండ బోవుచు, దైవనియోగమున మహారాజప్రాసాదమును చేరును. మహారాజు పిల్లలు తన మనుమలని, వెస్సంతరుడు వారి నాబ్రాహ్మణునికి దానమిచ్చెనని తెలిసికొని, తాను తన కొడుకునకు, కోడలికి చేసిన యపచారమునకు, అపకృతికి బిట్టువగచును. సింహాసనస్థుడైన యా మహారాజు తన మనుమలను వచ్చి తన తొడమీద గూర్చుండ గోరును; కాని తాము స్వేచ్ఛాజీవులము కామని చెప్పి వారు తమ తాతగారి కోరికను నిరాకరింతురు. అటుపిదప మహారాజు ఆబ్రాహ్మణునికి వలసినధనము నొసంగి తన మనుమలను విడిపించి దగ్గరకు తీసికొనును. ఆమహారాజు కుడితొడమీద నొకరు, ఎడమ తొడమీద నొకరు అతని మనుమలు కూర్చున్నారు. మహారాజు వెనుక ప్రక్కనుండి ఇరువురు పరిచారకులు

వారికి వీచోపులిడుచున్నారు. క్రింద నేలమీద కూర్చున్న యొక మరుగుజ్జు ఏదియో యొక మధుర పానీయముతో నింపిన పాత్రను కాబోలు తన మొగము పైకెత్తి వారికి చూపించుచున్నాడు.

వెస్సంతరజాతకకథచిత్రణ మింతతో పూర్తియయినది. భార్యను శక్రునికి దానమిచ్చుట, వెస్సంతరుడును అతని భార్యయు తిరిగి రాజ్యమునకు వచ్చుట యనునవి చిత్రింపబడలేదు.

ఏడవ చిత్రమునందలి 'ట' భాగమునందలిది యక్షిచిత్రము. యక్షి అత్యద్భుతమయిన భంగిమమున నిలబడి జంత్రవాద్యమేదియో వాయించుచున్నది.

ఎనిమిదవ చిత్రము 'ఛద్దంత' జాతకకథను దెలుపును.

బుద్ధుడు తన పూర్వజన్మ లొకదానిలో 'ఛద్దంతుడు' (షడ్దంతుడు-ఆరు దంతములు గలవాడు) అను రాజగజముగ జన్మించినాడు. అతనికిరువురు భార్యలు. ఛద్దంతునికి చిన్న భార్యయన్న నెక్కువమక్కువ యని ఈసు చెంది పెద్దభార్య అతనిపై కక్షవహించును. ఆమె చనిపోయి స్త్రీగ జన్మించి, కాశీరాజును పరిణయమాడి ఆతని వలపులబరణియైనది. ఆమెకు పూర్వజన్మస్మృతి యుండినకతన తన పూర్వజన్మ వృత్తాంతము తలపునకు వచ్చి, ఛద్దంతునిపై బగదీర్చుకొనెంచి తనకు జబ్బుగానున్నట్లు నటించి, తాను స్వప్నమున ఆరుదంతములు గల నొక యేనుగును చూచితి ననియు, తన కాయేనుగు దంతములను గొని తెచ్చి యిచ్చిన తనవ్యాధి కుదురు ననియు తన భర్తతో చెప్పును. కాశీమహారాజు నాజ్ఞను గైకొని శోణుత్తరుడను సాహసుడైన యొక వేటకాడు రాణికడకు వచ్చి, యామె నియోగమును దెలిసికొనును. అతడామెచెప్పినచొప్పున హిమవత్పర్వతప్రాంతమున కరిగి అచ్చట గజయూథమునడుమ నున్న ఛద్దంతుని బొడగాంచును. ఆ మహాగజమును బట్టుకొనుటకై యత డొక గొయ్యి త్రవ్వును. ఛద్దంతు డా దారిని వెళ్లుచు, తటాలున నాగోతిలో కూలిన వెనుక శోణుత్తరుడు దానిని జంప ప్రయత్నించును. ఛద్దంతుడు ఆమృగయుని రాకకును, అట్టి యతని చెయ్దిమునకును గల కారణము తెలిసికొని తన దంతములను గోసి యొసగుటలో తానుకూడ నాతనికి తోడ్పడును. దంతములను గోసిన పిదప ఛద్దంతుడు చనిపోవును. పిదప వేటకాడు ఆ దంతములను గొని పోయి రాణికి చూపించును. రాణి వాటిని చూచినంతనే ఛద్దంతుడు మృతి నొందినట్లు తెలిసికొని తాను కావించిన యకార్యకరణమునకు బిట్టు వగచి ఆశోకభారమున గుండె బ్రద్దలై మరణించును. ఈ కథయే ఎనిమిదవచిత్రమున చిత్రితమైనది.

ఈ ఎనిమిదవ చిత్రమున రెండు విభాగము లున్నవి. ఈ రెండువిభాగములను విడదీయుచున్నది నిలువుగానున్న ఒక స్తంభమువంటిది. ఎడమవైపు విభాగమున పైన గజయూథమున్నది; ఇంచుక క్రింద పెద్ద దంతములతో ఛద్దంతు డున్నాడు. చిత్రమున ఎడమకొన దిగువను చూపినది తామరకొలను. అందుండి పద్మములను దీసి వేఱొక యేనుగు ఛద్దంతుని కిచ్చుటయో, ఛద్దంతుడు మరొక యేనుగు కిచ్చుటయో జరగుచున్నది. ఈవిభాగమున కుడిప్రక్క, శోణుత్తరుడు ఛద్దంతుని బట్టుకొనుటకై తీసిన గొయ్యి ఉన్నది. ఈగోతిలో కూలినాడు గజేంద్రుడు. వేటకానినుండి సకల వృత్తాంతమును దెలిసికొని, తనదంతములనతడు కోసికొనుట కనుకూలముగ నుండునట్లు ఛద్దంతుడు కాళ్లు వంచి నేలమీద మోకరించినాడు. వేటకాడుకూడ తన మోకాళ్లను నేలమీద నానిచి ఛద్దంతుని దంతములను రంపముతో కోయుచున్నాడు. ఉదారహృదయుడై ఛద్దంతుడు రంపము నొకకొనను తన తొండమునకు చుట్టబెట్టుకొని పట్టుకొని తన దంతములను కోయుటలో తానుకూడ వేటకానికి సహాయపడుచున్నాడు. దంతములను కోయుచుండగా గలిగిన తీవ్రబాధకు ఛద్దంతు డటమటించిపోవుచుండుటచేత కానచ్చును, ఆదుర్భరబాధకు సూచకముగ తోక మెలికెలు తిరుగుచున్నది.

తరువాత ఈ గడియందే పైభాగమున, కోసిన దంతములను తీసికొని ఒక పొడుగాటి కర్రకు వాటిని కట్టివేసి ఆ కర్రను భుజముమీద

# బాంబే మ్యూచుయల్ లైఫ్ అస్యూరన్సు సొసైటీ లిమిటెడ్.

స్థాపితము : 1871 — 68 సం॥ల నాటి పురాతనసంస్థ — హెడ్డాఫీసు : బొంబాయి.

## ప్రస్తుతమున్న హైందవభీమాసంస్థలలో పురాతనపుది.

### ప్రత్యేక విశేషములు

నూటికి నూరు పాళ్లు హైందవసంస్థ. కేవలము పరస్పరసహకారము కలది. దీనిలో వాటాదారులు లేరు. లాభమంతయు పాలిసి హోల్డరకే పంచి యివ్వబడును. ప్రీమియముల రేటు చాల తక్కువ. బోనసులు అధికము. అధికముగా ప్రీమియములు చెల్లింపవలసిన అవసరము లేకుండ శాశ్వత దౌర్బల్యసౌకర్యములు గలవు. ఆకస్మిక ప్రమాదములకు భీమా. పాలీనా ఒకసారి చెల్లించు ప్రీమియములలో నూటికి 2½ వంతున తగ్గింపబడును. క్లెయిములు అతిశీఘ్రకాలములో పరిష్కరింపబడును.

1938 సం॥ తలపెట్టిన వ్యాపారము 2.58 కోట్లు; 1938 సం॥పూర్తిచేసిన వ్యాపారము 2.05 కోట్లు

మొత్తము వ్యాపారము 10 కోట్లు; ఆస్తులు 1.46 కోట్లు మించినవి; ప్రీమియం రాబడి 51 లక్షలు మించినవి.

ఏజంట్లు కావలెను ధారాళమయిన కమిషను వంశపారంపర్యముగా నొసంగబడును.

వివరములకు:— **యస్. ఏ. రామస్వామి అండ్ బ్రదర్సు.,**

మద్రాసు ప్రెసిడెన్సీ, తిరువాన్కూరు, కొచ్చిన్ సంస్థానములకు చీఫ్ యేజంట్లు,

11, లింగచెట్టివీధి, జి. టి. మద్రాసు.

బెట్టుకొని శోణుత్తరుడు మోసికొని పోవుచున్నాడు.

ఈ యెనిమిదవ చిత్రము కుడిగడి యందు సింహాసనముమీద కాశీ రాజును, అతని యొడిలో అతని రాణియు గూర్చుండియుండగా శోణుత్తరుడు తాను తెచ్చిన దంతములను ఒక చిన్నగంపలో పెట్టి వారికి చూపుచున్నాడు. వాటిని చూడగనే రాణి గుండె పగిలి చని పోయినది. ఒడినుండి పడిపోవుచున్న రాణిని రాజు పట్టుకొనుచున్నాడు. రాజు చుట్టునున్న పరిచారికలు రాణిని చూచి తొట్రుపాటునొంది భయ భ్రాంతులయి, విచారవదనములతో నున్నారు.

గోలీ శిల్పములలో పైనివివరించినవి కొన్ని. ఇంకను గలవు కాని శిల్ప చిత్రములు చెడిపోయి, అవి చక్కగ నుండనందున విడిచిపెట్ట బడినవి.

ఈ గోలీ శిల్పములు క్రీస్తుశకము మూడవ శతాబ్దినాటి వని యూహించుచున్నారు.

---

## త్రిపురి కాంగ్రెస్



**వాలంటీరుదళము : పతాకవందనోత్సవము (కడపటిదినము)**

# చిత్రపటముల వివరణము

## నాట్యకళా పితామహ శ్రీహరి ప్రసాదరావుగారు

ఆంధ్రదేశమున శ్రీహరి ప్రసాదరావుగారి నటనాపాండిత్యము తెలియనివా రుండరు. ఆంధ్రదేశమునందు మొట్టమొదట ఏర్పడిన నాటకసమాజములలో గుంటూరు హిందూ నాటకసమాజము (ఫస్టు కంపెనీ) ఒకటి. ఇందు శ్రీహరి ప్రసాదరావుగారు ప్రతి నాటకమున ప్రధాన నాయకపాత్రను, శ్రీ కోపల్లె హనుమంతరావుగారు నాయికా పాత్రను ధరించుచుండువారు. ఆదివరకు ఆ సమాజములో శ్రీ కొండుభట్ల సుబ్రహ్మణ్య శాస్త్రిగారి ఆధిపత్యమున వచన నాటకములు మాత్రమే ప్రదర్శించు చుండువారు. శ్రీ పోలూరి హనుమంతరావుగారి యాజమాన్యము వచ్చిన తరువాత హరి ప్రసాదరావుగారు చిత్రనళీయము, వేణీసంహారము, శాకుంతల, సారంగధర, హరిశ్చంద్ర మొదలగు పద్యములతో గూడిన నాటకములనుగూడ ప్రదర్శించువారు. శ్రీ ప్రసాదరావుగారు నటించిన రెండు నాటకములలోని రెండు దృశ్యములు ఈసంచికయందు చూపబడినవి.

* * *

## శ్రీమతి టి. అన్నపూర్ణగారు

ఈ యాంధ్రమహిళామణి పంజాబు రాష్ట్రమునందలి అఖిల కళాశాలా, పాఠశాలా విద్యార్థులలో జరిగిన గానకళ పోటీ పరీక్షలో సితారు వాద్యమునను, గాత్రపాట యందును కృతార్థురాలై బహుమానములను పొందినది.

* * *

## శ్రీమతి జి. కే. సీతాలక్ష్మిగారు

ఈబాలిక వయస్సు తొమ్మిదిన్నర సంవత్సరములు. తండ్రి జి. కే. రావుగారు. వెలమవారు. స్వగ్రామము, బొబ్బిలి (విశాఖపట్టణము జిల్లా); ప్రస్తుతము రంగములో నున్నారు.

ఈబాలిక ఫిడేలు వాద్యమున కడునేర్పు సంపాదించినది ఈమె శ్రీమహాత్మ గాంధీ జన్మదినోత్సవ సందర్భమున సంగీతపు పోటీపందెములలో పాల్గొని, గెలుపొంది యొక వెండి పతకమును, క్షత్రియమహాసభా సందర్భమున ది ౨౮-౧౨-౩౫-వ తేదీని జరిగిన సంగీతపు పోటీపందెములలో పాల్గొని బర్మాప్రధానియైన డాక్టరు బామోగారిచే మొదటి బహుమానము బంగారు పతకమును, రెండవ మార్వాడీ యువజన మహాసభా సందర్భమున ౮-౧-౩౬-వ తేదీని జరిగిన సంగీతపు పోటీపరీక్షలలో పాల్గొని, మొదటి బహుమానము నంది, రంగూన్ విశ్వవిద్యాలయము వైస్ చాన్సెలరును, బర్మా కార్పొరేషను కమీషనరునైన యు. సేట్‌గారిచే బంగారు పతకమును, ఇతర బహుమతులను, సర్టిఫికెట్లను బడసినది.

* * *

## శ్రీ మండా బుచ్చిరామారావుగారు

వీరు సరిహద్దు పరగణా (North Western Frontier Province)లో మిలిటరీ ఇంజనీరింగ్ సర్వీస్‌లో ఉన్నతోద్యోగమునందున్న ఆంధ్రులు.



**Saraswata Niketanam,**
**VETAPALEM.**





Edited, Printed and Published by S. Sambhu Prasad,
at Andhra Patrika Press, No.7, Thambu Chetty Street., Madras.

# వీర్యస్తంభనరసాయనము

## 5 గంటలు వీర్యము ఆపును

విశేష వీర్యవృద్ధిగల్గించి జవసత్వములనిచ్చి యిచ్ఛవచ్చినప్పటి వఱకు తృప్తిదీరునట్లు కామసౌఖ్యము అనుభవించుటకు 24 సం॥రముల జగద్విఖ్యాతిమందు. ఈ ప్రాటలలో గుణం లేకపోతే సొమ్మువాపసు 1 డబ్బి రు 5-0-0. వి. పి. 0-8-0 లు. జవాబుకు బిళ్లలు పంపవలెను.

## గర్భనిరోధిని

ఇటుమీదట గర్భం అక్కరలేని వారికి గర్భం రాకుండా ఆపుచేయును. విరుగుడు పుచ్చుకుంటె కావలసినపుడు గర్భం కలుగును. 1 సీసా రు 4 లు. జవాబుకు పోష్టు బిళ్ళలు పంపవలెను.

## నపుంసకతైలం

అంగనరములు బలహీనత చెందుటచే స్త్రీలను జూచిన సిగ్గు గలిగి లోలోన గృశించుచు, ఆత్మహత్యకు సంసిద్ధులైన వారి కిది నిశ్చయముగా ప్రాణదాత. 1 సీసా రు 10 లు.

డాక్టరు రత్నం అండు సన్సు మెడికల్ హాల్, 252-బి, మలకపేట—హైద్రాబాదు. (డక్కను)

---

Phone 3732. Codes : "BENTLEY'S."

# Ram Sit & Co.

గొప్పరకము ఫిడేళ్లు, శ్రేష్ఠమైన తీగెలు, యింకా యితరపరికరములకు

**2 బ్రాడ్వే, మద్రాసు.**

ప్రారంభకులకు పనికివచ్చు ఫిడేళ్లు అన్నినైజులలోను మిక్కిలి సరసమైన ధరలకు దొరుకును.

---

# TONSILS

# టాన్సిల్స్

ఆపరేషను అక్కరలేదు. గుణ మగుటకు పూచీ. గొంతులో రెండువైపులను కండరము పెరిగియుండుటను డాక్టరు నాథంస్ "టాన్సిల్ క్యూర్" అతి త్వరితముగ కరగజేయును. వందల కొలది గనిగుణమును బడసియున్నారు. రాజులచేతను, ప్రముఖులచేతను పొగడబడిన మిక్కిలి రుచికరమైన చికిత్స.

**KENT CHEMICALS**

Mowbray's Road

ROYAPETAH MADRAS

టెలిగ్రాములు: "గ్లాసువేర్"

## పోపట్ జమాల్ అండు సన్సు

టెలిఫోన్: 4031
పోస్టు బాక్సు నెం. 1274.

గ్లాసువేర్, పింగాణి అండు ఫర్నిచర్ మర్చంట్సు.



బుట్టమాదిరి ఉయ్యాల రు. 55/-



ఉక్కుతో చేసిన పెరాంబులేటరు రు. 50.



సోఫా స్ప్రింగు మంచములు

| 6½ × 3 | 3½ | 4 | 4½ |
|---|---|---|---|
| రు. 25/- | రు. 35/- | రు. 40/- | రు. 55/- |

సోల్ ఏజంట్లు:— రేడియన్ స్టౌవులు, లాంతర్లు, డిట్‌మారు లాంతర్లు, ఆవుమార్కు బల్బులు వగైరా.

బ్రాడ్వే, **జమాల్ బిల్డింగ్సు** మద్రాసు.

# ది ట్రాపికల్ ఇన్సూరెన్సు కంపెనీ, లిమిటెడ్.

హెడ్ ఆఫీసు: ఢిల్లీ

చైర్మన్: శ్రీయుత సుభాష్‌చంద్రబోస్.
(ఇండియన్ నేషనల్ కాంగ్రెసు అధ్యక్షులు)

స్థాపించిన డైరెక్టరులు:
- పండిత మోతీలాల్ నెహ్రూ.
- డాక్టర్ యం. ఏ. అన్సారి.
- హకీం అజ్మల్ ఖాన్.
- శ్రీయుత యస్. శ్రీనివాస అయ్యంగార్,

1. రెండున్నరకోట్ల రూపాయలకు పైగా పాలిసీలు జారీ చేసియున్నారు.
2. స్థాపించినప్పటి నుండియు బోనసు డిక్లేరు చేసినారు.

ఏజన్సీలకు ఆర్గనైజరు పదవులకు దరఖాస్తులు పంపుకొనుడు.

పి. అఘోరమూర్తి,
ఏజన్సీల సూపరింటెండెంట్,
గాంధినగర్, బెజవాడ.

లేక

కే. యస్. రామమూర్తి, యం.ఏ.
బ్రాంచి సెక్రటరి,
160, మౌంట్‌రోడ్ మద్రాసు.